# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 15 సంచిక : 9 హైదరాబాద్ 194 సెప్టెంబర్ 2017 పేజీలు : 68 రు. 20

- తెలంగాణలో మాదకద్రవ్యాల వ్యాపారం
- భిన్నాభిప్రాయంపై తెలంగాణ ఏలిక కన్నెర్ర
- ఆంధ్రప్రదేశ్‌లో ఏరులై పారుతున్న మద్యం
- యోగి పాలన - చిన్నారుల మరణాలు
- మోడీ కుతంత్రం - నితీశ్ అవకాశవాదం
- భారత - చైనా ఘర్షణపై మూడు వ్యాసాలు
- పాకిస్తాన్ ప్రధాని తొలగింపు




## నిషిధ

ఆగిమ శంబరుడు ఓడిపోలేదు

**నల్లూరి రుక్మిణి**

విరసం ప్రచురణ

పేజీలు: 384 వెల: రు. 180

ప్రతులకు: **నల్లూరి రుక్మిణి**
సి-132, ఎస్.వి.ఎస్. కాలనీ, గుంటూరు - 522 006
ఫోన్ :99891 33401




## తలకిందుల లోకం

తీవ్రవాద వ్యతిరేక పేరుతో రాజ్యహింస

**మనీషా సేఠి**

తెలుగు : ఆర్. శశికళ

మలుపు ప్రచురణ

పేజీలు: 168 వెల: రు. 150

ప్రతులకు: **మలుపు**
2-1-1/5, నల్లకుంట, హైదరాబాద్ - 500 044.
ఫోన్ :9866559868




## జనహృదయం జనార్దన్

**విప్లవ విద్యార్థి ఉద్యమ ప్రారంభకుడు**
**గిరాయిపల్లి అమరవీరుడు సూరపనేని జనార్దన్‌రావు**
**జీవితం - స్ఫూర్తి**

కూర్పు: ఎస్.పి. మోహన్‌రావు
సూరపనేని జనార్దన్ రావు మెమోరియల్ ట్రస్ట్,
జనార్దన్ మిత్రులు

పేజీలు: 160 వెల: రు. 80

ప్రతులకు : **ఎస్.పి. మోహన్‌రావు,**
ఫ్లాట్ నెం. 151, సీతాపురం కాలనీ, పోరంకి,
కృష్ణా జిల్లా - 521137, సెల్: 99086375000




**షాయరె తెలంగాణ**

## మఖ్దూం మొహియుద్దీన్

జీవితం - కవిత్వం

**వాహెద్**

నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్

పేజీలు: 488 వెల: రు. 300

ప్రతులకు : **నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్**
ఎంఎచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్,
ఆర్‌టిసి కళ్యాణ మండపం దగ్గర, హైదరాబాద్ - 500 020
సెల్: 040 - 27665420

194

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సెప్టెంబర్ 2017
సంపుటి : 15
సంచిక : 09







**‘వీక్షణం’ పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
**VEEKSHANAM**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై ‘**VEEKSHANAM**’ అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 జూలై నెలలో వచ్చిన విరాళాలు - సూరి, హైదరాబాద్ - రు. 10,000; డా. కె. లక్ష్మణ్, హైదరాబాద్ - రు. 5,000; శ్రేయోభిలాషి, కరీంనగర్ - రు. 50,000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

ఆగస్టు సంచికలో 'భూస్వామ్య, మతోన్మాద పార్లమెంటరీ ప్రజాస్వామ్యం' సంపాదకీయం వాస్తవికతకు అద్దం పట్టింది. సంఘ్ పరివార్ నానాటికి దూకుడుగా వ్యవహరించడం అంత మంచిది కాదు. అలాగే డోకా-లా-లో వ్యక్తమవుతున్న ఇరు పక్షాల యుద్ధ కాంక్షను ఖండించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. 'దళితుల సాంఘిక బహిష్కరణ' తలదించుకునేదిగా ఉంది.

**– బిక్కునూరు రాజేశ్వర్**
పొన్కల్, నిర్మల్

గత సంచికలో పాపిరెడ్డిగారూ! ఆ లంకేశ్వరుడు కూడా పాపాలు చేయడానికి వెనుకాడాడేమో కానీ మీరు రాసిన, తత్వశాస్త్రం కొంతే, సొంత కవిత్వమే అంతా అంటూ, రంగనాయకమ్మ రాసిన తత్వశాస్త్రం చిన్నపరిచయం పుస్తకం తప్పులతడక అని విమర్శిస్తూ రాశారు. తప్పులెన్నువారు తండోపతండంబు – ఉర్వీజనులకెల్ల నుండుతప్పు– తప్పులెన్నువారు తమ తప్పులెరుగరని, వేమన్న ఆనాడే తమవంటి వారిని దృష్టిలో పెట్టుకునే ఆ పద్యం రాశారు. తత్వశాస్త్ర తర్కాల్ని నేను చేయలేను. కానీ, తప్పుచేయనోడు ఎవడూ ఉండడన్న వేమన్న పద్యం ద్వారా రంగనాయకమ్మ తప్పు చేసి ఉండవచ్చు. అందరూ తప్పులు చేస్తారనీ, నేనుదహరించింది. విమర్శకుల కుహనా తర్కాలపైనే తప్ప, ఆమె తప్పు రాశారని కాదు. మీలాంటి తత్వవేత్తల్నీ తాత్వికుల్నీ తత్వవిమర్శకుల్నీ ఉద్దేశించి, మార్క్స్ ఆనాడే తన కేపిటల్ ప్రవేశంలోనే, తత్వవేత్తలు ప్రపంచాన్ని అనేక విధాల నిర్వచించారు. కాని ఇప్పుడు కావాల్సింది ప్రపంచాన్ని మార్చడం అని. అది చాలు. తత్వవేత్తలకీ, తత్వశాస్త్ర సమర్థకులకీనూ. పాపిరెడ్డిగారూ మీ వ్యాసం హెడ్డింగే వెటకారంతో ప్రారంభమై సంస్కారానికి దహనసంస్కారం చేసే విధంగా, అవమానకరమైన, మాటలూ, తప్పుడు ఆరోపణలూ, మర్యాద పాటించని లేకి మాటలూ, బీటింగ్ చేసిందనీ, వక్రీకరణలనీ, దాడి అనీ, కొన్ని పుస్తకాలు అర్థంకావు అని ఆమె రాస్తే, పుస్తకాలేం ఖర్మ కొందరు మనుషులు కూడా అర్థం కారు అనీ, మీరు వెక్కిరించడాన్ని, లేకి మాటల కంటే ఇంకా అధమమైనవే. ఆ ఒక్కపదం చాలు ఆమెపై మీకున్న ద్వేషాన్నీ, అసహనాన్నీ బట్టబయలు చేస్తుంది. ద్వేషమూ అసహనమూ మీకు, మీలాంటి తత్వవేత్తలకీ, రంగనాయకమ్మపై ఎందుకంటే, అహేతుకమైన అభూతకల్పనలపై, ఆమె రచనలు ధ్వజమెత్తుతాయి గనుక. మహిమలూ మంత్రాలూ తంత్రాల, మీ కల్పిత, తత్వశాస్త్రాలూ, హేతుతత్వానికి నిలవని మీ బూటకపు తత్వశాస్త్రాల్నీ ఆమె రచనలు తుత్తునియలు చేసి పాఠకులకు చైతన్యాన్నందిస్తాయి గనుక. అద్భుతాల్లోనూ, భ్రమల్లోనూ ప్రజల్ని ముంచి వారి అజ్ఞానాన్ని సొమ్ముచేసుకొని పరాన్న భుక్కుల కపటత్వాల్ని బైట పెడతాయి గనుక మీలాంటి 'పాపి' రెడ్డిలు, ఇలా అవాకులూ చెవాకులతో వ్యాసాలు గుప్పిస్తారు. కొన్నిచోట్ల చాలా వెటకారాలు గుప్పించారు. ఉదా: సమానత్వం గొప్పది. ఏ పదార్థం అయినా... మారుతూ ఉంటుంది గానీ స్థిరంగా ఉండదు అన్న వాక్యాలు తన దాడికి అనుకూలంగా వివరించారన్నారు! ఆ రెండు వాక్యాలూ ఆమె తన దాడికి అనుకూలంగా వాడిందా! ఎంత దురారోపణ ఇది! వేలు చూపిస్తే కొండ ఎక్కడం కాకుండా, రంగనాయకమ్మ వేలునే ఎక్కి గోలచేశారనీ వెకిలి వెక్కిరింపులకి దిగజారారు. చివరిగా ఆమె చెప్పిన నిజాయితీ అయిన నిఖార్సైన నిజం, మత గ్రంథాలూ, జ్యోతిష్య శాస్త్రాలూ, వేల సంవత్సరాల నుండి ఉన్నా అవి సోంబేరీ పరాన్న భుక్కులకు తేరగా భుక్తి చిక్కించుకోవడానికీ, మనుషుల్ని కుల, మతాల ద్వారా విడదీసి, వారి పబ్బం గడుపుకోవడానికే తప్ప, మానవుల్లో బీదరికానికీ, అసమానతలకీ, స్త్రీలని అణగదొక్కడానికీ, అమాయకుల శ్రమ దోచుకోవడానికీ తప్ప, వాటిలో ఏ ఉత్తమత్వం ఉందన్న ప్రశ్నే పాపిరెడ్డి ప్రశ్నలన్నిటికీ సమాధానం. మంచి ముహూర్తం చూసి రాముడికి పట్టాభిషేకం చేయమంటే, ఆ ముహూర్తానికే అడివికి పోయాడు! విప్రులెల్ల చేరి వెర్రికూతలు కూసి – సతిపతులను కూర్చి సమ్మతమున మునుముహూర్తముంచ ముండెట్ల మోసెరా అని ఛీకొట్టాడు వేమన్న. ఈ నాటికీ తత్వాలూ, తత్వశాస్త్రాలూ అంటూ గింజుకోవడం పాత దురాచారాలూ గుడ్డి నమ్మకాలూ పోతున్నాయే అని బాధే తప్ప, సమాజానికి ఉపయోగమా కాదా అన్నది పట్టించుకోని, బాపతు విమర్శలివి.!

తెలంగాణ ప్రభుత్వంపై లోపలిపేజీల్లో తెగడ్తలూ, చివరిలో చిత్ర ప్రదర్శనలతో బాటు, ఆ ప్రభుత్వమే సంక్షేమంలో సువర్ణ అధ్యాయాలు సృష్టించి, అభివృద్ధి ఫలాలు ఇంటింటికి చేరే వెలుగు దివ్వెలు సృష్టించి, శాంతియుత పోరాటం ద్వారా తెలంగాణ సాధించిన తొలి ముఖ్యమంత్రి, కెసిఆర్ గారు! తెలంగాణ కెసిఆర్ శాంతియుత పోరాటం ద్వారానే వస్తే, వందలాది మంది విద్యార్థుల బలిదానాలన్నీ హుళక్కేనా? ఇంతవరకూ పెట్టుబడిదారుల పత్రికలైన పత్రికలు కూడా ఈ మాట అనలేదే! విప్లవ పత్రికలే ఇంతగా పాలకవర్గాలపై భట్రాజు పొగడ్తలా! అంతేకాదు, మితవాద పార్టీలని వేలు చూపించే సిపిఐ, సిపిఎంల పత్రికలు కూడా బూర్జువా దోపిడీ పార్టీని కీర్తించలేదే! ఒకవేళ అవి కీర్తించినా ఎవరూ ఆశ్చర్యపోరు, ప్రశ్నించరు. కానీ, విప్లవవీరుల పత్రికలు ఒకపక్క ఇసుక మాఫియా అని వ్యాసాలు, మనుషుల ప్రాణాల కంటే ఇసుక లారీలే ప్రభుత్వాలకి ఎక్కువా అని ప్రశ్నిస్తారు. చివరిలో మాత్రం కెసిఆర్ గారి మందహాసపు చిత్రం, వారి ఆదర్శ పాలనా చిత్రాలు ప్రదర్శనా? కెసిఆర్ గారు పత్రిక లోపల చూడరనా? మరోపక్క మొదటి అట్టపైనే తెలంగాణలో భూ కుంభకోణాలని పెద్ద అక్షరాలా! పొగిడ్తే డబ్బిస్తారంటే ఏమైనా రాసేస్తారా! నయీం లాంటి నరహంతకుడితో అంటకాగినవారి పేర్లయినా బైటికి తెలియనివ్వని వాడు ప్రగతి పథనిర్దేశకుడా కెసిఆర్. తెలంగాణ భూ కుంభకోణంలో పాత్రదారులపై ఈగైనా వాలకుండా కాపాడుతున్న శ్రేయోరాజ్య నాయకుడా కెసిఆర్. అంత ఆదర్శ నాయకుడిపైనే లోపల అభాండాలూ, బయట అమృత భాండాలూనా! మీరు రాసే రాతల్లోనే, మీరు విప్లవకారులనే అభిప్రాయం పాఠకులకు కల్పించి, అదే పత్రికల్లో అదే ప్రభుత్వాన్ని, ఆ నాయకుడ్నే ఆదర్శపాలనగా, శాంతిదూతగా ప్రచారం చేయడం ఏ విలువలకి సూచన? అడ్వర్‌టైజ్‌మెంట్లకి డబ్బిస్తే తితిదే వారి శ్రీవారి మహిమలూ కీర్తిస్తూ, చిత్రిస్తూ రాస్తే మీకు చాలాభారీగానే ముట్టజెప్తుతారే! ఇలాంటివి ప్రచురిస్తే మీ అసలు స్వరూప స్వభావాలు అవేనేమోనని పాఠకులు అనుమానిస్తే ఆ తప్పెవరిది?

**– బి.ఎ. నారాయణరావు**
విశాఖపట్నం

ఆగస్టు సంచికలో సంపాదకీయ వ్యాఖ్యలు 'తెలంగాణ–ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న పరిణామాలపై వెల్లడించిన అంశాలు ఆలోచనలను రేకెత్తిం చాయి. ఇసుక మాఫియా రెండు రాష్ట్రాల్లోనూ పెద్దఎత్తున కొనసాగుతోంది. ఇదంతా పాలకుల అండతోనే సాగుతోంది. దీన్ని వ్యతిరేకించిన దళితులు, యువకులపై రెండు రాష్ట్రాల్లో కేసులు నమోదు చేశారు. గరగపర్రు, దేవరపల్లి తదితర గ్రామాల్లో దళితులపై దాడులు, అరెస్టులు, కేసులు, నిర్బంధం కొనసాగుతున్నది. ఏ

(మిగతా 11వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తనగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎన్. వెంకటేశ్)*

# అరాచక రాజ్యంలో భక్తి ముసుగులో అరాచక మూక

**లో**కాతీత శక్తిని నమ్మేవారికి లోకానికి సంబంధించిన చట్టాలు, పద్ధతులు, ప్రమాణాలు ఏవీ పనికిరావు. లోకాతీత శక్తికి సంబంధించిన అధ్యాత్మిక నమ్మకం వ్యక్తిగత జీవితానికి మాత్రమే పరిమితం కావాలని, సమాజానికి సంబంధించిన విషయాలకు లౌకిక చట్టాలే ఉంటాయని అవగాహనను కల్పించడంలో విఫలమైన రాజ్యం హర్యాణాలో ప్రస్తుతం తన గాయాలను తానే నాక్కుంటున్నది. మత విశ్వాసాల కోసం వందల మందిని, వేలమందిని ఊచకోత సాగించవచ్చునని చూపినవారు దేశాధినేతలుగా ఉండగలిగినప్పుడు ఆ మత విశ్వాసాల కోసమే చట్టాన్ని ధిక్కరించవచ్చునని, సమాజంలో బీభత్సం సృష్టించవచ్చునని భక్తులు అనుకోవడం సహజమే.

పంజాబ్, హర్యాణాల్లో కేంద్ర కార్యాలయాలతో ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన డేరా సచ్చా సౌదా అధిపతి బాబా గుర్మీత్ రామ్ రహీమ్ ఇన్సాన్ మీద పదిహేను సంవత్సరాలుగా సాగుతున్న అత్యాచారం కేసులో పాంచ్‌కూలా కోర్టు ఆగస్టు 25న రామ్ రహీమ్ నేరస్తుడని తేల్చగానే తమను తాము ప్రేమీలుగా పిలుచుకునే రామ్ రహీమ్ భక్తులు న్యాయస్థానం ఆవరణ నుంచి ప్రారంభించి పట్టణంలోనూ, ఇతర ప్రాంతాలలోనూ తమ ద్వేష బీభత్సాన్ని ప్రకటించారు. తమ ఆధ్యాత్మిక గురువు నేరం చేయలేదనే నమ్మకం కొంత, ఆధ్యాత్మిక గురువులకు లౌకిక చట్టాలు వర్తించవనే భావన కొంత, తమ గురువు ప్రమాదంలో ఉన్నప్పుడు ఎంతకైనా తెగించాలనే మూఢభక్తి కొంత కలగలిసి ఈ హింసాకాండ సాగింది. ఇప్పుడు రామ్ రహీమ్ దళితుల, వెనుకబడిన కులాల ఆధ్యాత్మిక గురువు అని, అగ్రవర్ణాల గుత్తసొమ్ముగా మారిపోయిన సిఖ్ మతాధిపత్యాన్ని ఎదిరించిన విప్లవకారుడని, ఆయన మీద అత్యాచారపు కేసు అబద్ధపు కేసు అని, అగ్రవర్ణాల కూట సృష్టి అని అనేక వాదనలు చెలరేగుతున్నాయి.

ఈ వాదనలను పరిశీలించడానికి ముందు రామ్ రహీమ్ నేపథ్యాన్ని, అనుయాయి వర్గపు సామాజిక స్థితిని, జరిగిన నేరాన్ని, దానిపై విచారణను వేరు వేరుగా పరిశీలించవలసి ఉంది. దేశవ్యాప్తంగానే మత ధోరణుల మీద అగ్రవర్ణాల గుత్తాధిపత్యాన్ని నిరసిస్తూ ఎక్కడికక్కడ చిన్న చిన్న విభిన్న మత ఆధ్యాత్మిక కేంద్రాలు పుట్టుకొచ్చాయి. లేదా మత మార్పిడులు జరిగాయి. ఆ క్రమంలోనే పంజాబ్, హర్యాణా ప్రాంతాలలో ఒకప్పుడు ప్రగతిశీల మతంగా పుట్టుకొచ్చిన సిఖ్ మతం క్రమంగా ఆధిపత్య శక్తులకూ, అగ్రవర్ణాలకూ, సంపన్నులకూ ఆశ్రయంగా మారినప్పుడు దాన్ని నిరసిస్తూ ఎన్నో డేరాలు పుట్టుకొచ్చాయి. అలా 1940లలో పుట్టుకొచ్చిన డేరా సచ్చా సౌదా సహజంగానే దళితులను, వెనుకబడిన కులాలను పెద్ద ఎత్తున ఆకర్షించింది. కుల అసమానత లేని ఆధ్యాత్మిక ఏకానుభవాన్ని భక్తులందరికీ పంచింది. కాని, ఈ ప్రగతిశీల, ధిక్కార ధోరణితో పాటుగానే మతం అన్నప్పుడే ఉండే పీఠాధిపత్యం, దాని చుట్టూ ఆస్తి పోగుపడడం, స్వార్థపర శక్తులు ఆ పీఠాన్ని చేజిక్కించుకోవడానికి సామదానభేద దండోపాయాలు అమలు చేయడం జరిగాయి. 1990లలో గుర్మీత్ రామ్ రహీమ్ అధినేతగా స్థానం స్వీకరించేటప్పటికే డేరా సచ్చా సౌదాకు కోట్లాది రూపాయల ఆస్తి, ప్రపంచవ్యాప్తంగా భక్తులు, ఆస్తులు సమకూరాయి. గాయకుడిగా, స్ఫురద్రూపిగా, ఆకర్షణీయమైన ప్రవచనాలు సాగించే గురువుగా రామ్ రహీమ్ ఆధునిక లక్షణాలెన్నిటినో తన ప్రచారంలో భాగం చేసుకున్నాడు. సంగీత కార్యక్రమాలు నిర్వహించడంతో పాటు 'మెసెంజర్ ఆఫ్ గాడ్' అని తనను తాను అభివర్ణించుకుంటూ ఇప్పటికి వరుసగా నాలుగు సినిమాలు కూడా తీశాడు. ఇలా కుప్పలుతెప్పలుగా వచ్చి పడిన డబ్బులో కొంతభాగం సమాజంలో మంచిపేరు తెచ్చుకోవడానికి వినియోగించడం బాబాలకు, దైవ దూతలకు అందరికీ ఉన్న అలవాటే. అలాగే రామ్ రహీమ్ కూడా విద్యాసంస్థలు, ఆస్పత్రులు, చౌకధరలకు సరుకులు సరఫరా చేయడం, అన్నదానాలు వంటి ధార్మిక కార్యక్రమాలు సాగించాడు. అంటే, రాజ్యం అందించవలసిన సదుపాయాలను ప్రజలకు అందించే ఒక దాతగా తన అనుయాయులైన దళిత, వెనుకబడిన కులాల పీడితుల మధ్య రామ్ రహీమ్ అభిమానాన్ని చూరగొన్నాడు. లక్షలాది మంది అభిమానుల మద్దతు ఉన్నందువల్ల ఆయన ఒక మాట చెబితే ప్రాణాలకైనా తెగించగల లక్షలాదిమంది ఉన్నందువల్ల సహజంగానే అన్ని రాజకీయ పార్టీలు రామ్ రహీమ్‌ను దువ్వడానికి ప్రయత్నించాయి. దాదాపు రెండు దశాబ్దాలు కాంగ్రెస్‌కు దగ్గరగా ఉన్న రామ్ రహీమ్ 2014 ఎన్నికలలో స్వయంగా నరేంద్ర మోడీ ప్రశంసలతో భారతీయ జనతా పార్టీ వైపు మొగ్గాడు. ఆస్తి, మితిమీరిన అధికారం ఉన్న చోట సాధారణంగానే పెత్తందారీతనం, ఆర్థిక అరాచకత్వం, లైంగిక అరాచకత్వం కలిసి ఉంటాయి. దేశవ్యాప్తంగా ఆర్థిక, లైంగిక అరాచకత్వపు ఆరోపణలు ఎదుర్కోని దేవదూతలు ఒక్కరు కూడా లేరు. రామ్ రహీమ్ కూడా తనను తాను కృష్ణుడితో పోల్చుకునేవాడని, ప్రతిరోజూ తన ఇష్టం వచ్చిన స్త్రీతో పితాజి మాఫీ పేరుతో గడిపేవాడని కథనాలు వస్తున్నాయి. ఎంత భక్తిపారవశ్యం ఉన్నా ఇటువంటి అక్రమాన్ని అంగీకరించని ఒక యువతి 2002లో నేరుగా అప్పటి ప్రధాని వాజ్‌పేయికి రాసిన లేఖ ప్రస్తుత కేసుకు ఆధారం. ఆ తర్వాత సిబిఐ విచారణ, అందులో వాస్తవం నిగ్గుతేలడం, అది న్యాయస్థానం ముందుకు రావడం, చివరికి న్యాయస్థానం తీర్పు చెప్పడం జరిగాయి.

వ్యవసాయంలో ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టి, అభివృద్ధి పథంలో దూసుకుపోయిందని చెప్తున్న పంజాబ్ – హర్యాణా ప్రాంతంలో సమాజంలో ఎంత అభివృద్ధి నిరోధక ధోరణులు ఉన్నాయో, మనుషులను భ్రమల్లో, మూఢత్వంలో ముంచడం ఎంత సులభమో, కళ్లముందర కనబడుతున్న నేరాన్ని కూడా నేరం కానట్టు ప్రవర్తించడం ఎలా సాధ్యమో ఈ ఘటనలు చూపుతున్నాయి. పీడితులు అనుయాయులుగా ఉన్నారు గనుకనో, నిందితుడే పీడిత వర్గాల నుంచి వచ్చినందు వల్లనో నేరం నేరం కాకుండా పోదు. కింది వర్గాలు చేసిన నేరాన్ని చూసీ చూడనట్టు పోవాలనడం మనుస్మృతిని తిరగేసి చెప్పడమే. అందునా ఒక స్త్రీ మీద అత్యాచారం జరిగినప్పుడు అత్యాచారం చేసినవాడి సామాజిక స్థితి సమర్థనకు కారణం కాకూడదు. మూడు వేల ఏళ్లపాటు కొందరి నేరాలు నేరాలుగా కనిపించని మనుస్మృతిని ఇవాళ తిరగేసి మరికొందరి నేరాలు నేరాలు కాదని అనక్కర లేదు. ఆ వ్యక్తి పుట్టుకును, అనుయాయుల సామాజిక స్వభావాన్ని పరిగణనలోకి తీసుకుంటూనే నేరాన్ని నేరంగా పరిగణించి లౌకిక చట్టాలు అమలు చేయవలసిందే. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# అవే దగుల్బాజీ పొగడ్తలు

తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర రావుకు ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఫుడ్ అండ్ అగ్రికల్చర్ అనే సంస్థ అగ్రికల్చర్ లీడర్‌షిప్ పురస్కారం ఇచ్చిందని, ఇది వ్యవసాయం, గ్రామీణాభివృద్ధి రంగాల్లో విశేష కృషి చేసేవారికి ఇచ్చే ప్రతిష్ఠాత్మకమైన పురస్కారమని తెలంగాణ ప్రభుత్వమూ, ప్రచార సాధనాలూ హోరెత్తుతున్నాయి. ఈ సంస్థ ఒక దళారీ సంస్థ అని, విత్తన కంపెనీల ప్రయోజనాల కోసమే ఈ పురస్కారం ఇస్తున్నారని, మూడు సంవత్సరాలలో రికార్డు స్థాయిలో దేశంలోకెల్లా ఎక్కువగా రైతుల ఆత్మహత్యలు జరిగినందుకే ఈ వ్యవసాయం పురస్కారమా అని ప్రతిపక్ష కాంగ్రెస్ ప్రశ్నించింది. అటు ప్రభుత్వ సమర్థకుల ప్రగల్భాలకు, ఇటు ప్రతిపక్ష విమర్శలకు మధ్య ప్రజలు గుర్తించవలసిన అంశాలు మరుగున పడిపోతున్నాయి. మొట్టమొదటిది ఈ సంస్థ గానీ, ఇటువంటి మరేదైనా సంస్థ గానీ ఇచ్చే పురస్కారాలు, ప్రశంసలు దాన ధర్మాలు కావు. నిజంగా ప్రతిభను గుర్తించి ఇచ్చే బహుమతులు కావు. ఈ సంస్థ పోషకులలో వ్యవసాయ విత్తనాల, ఎరువుల, పురుగుల మందుల బహుళజాతి సంస్థలు ఉన్నాయి. ఈ అవార్డు ద్వారా మంత్రులను, ముఖ్యమంత్రులను, నిర్ణయాధికారం ఉన్న అధికారులను బురిడీ కొట్టించి తమ మార్కెట్ ప్రవేశానికి రంగం సులభం చేసుకోవడమే ఆ సంస్థల పని. ఆమాటకు వస్తే ఈ అవార్డు 2008లో అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డికి కూడా వచ్చింది. ఆయన ఎంత రైతు బాంధవుడో తెలంగాణ ఉద్యమానికి తెలుసు. జలయజ్ఞం పేరుమీద రైతుల పేరు చూపి కాంట్రాక్టర్ల ధనయజ్ఞం చేసిన ఆ ముఖ్యమంత్రికి వచ్చినట్టుగానే ఇప్పుడు కూడా వ్యవసాయం పేరుతో మరొకసారి కాంట్రాక్టర్ల బొక్కసాలు నిండే విధానాలు చేపట్టినందుకు ముఖ్యమంత్రి రైతుమిత్ర అయిపోతున్నాడు. ఇంకా ముందుకు వెళితే చంద్రబాబు నాయుడు ఇటువంటి అవార్డులు దేశ దేశాల నుంచి నెలకొకటి చొప్పున తెచ్చుకొని ప్రచారం చేయించుకున్నాడు. ఆ పొగడ్తలన్నీ దగుల్బాజీ పొగడ్తలని అప్పుడే రుజువైపోయింది. అమాయకులను నమ్మించడానికి, ఏదో ఢిల్లీ సంస్థ, అది కూడా ఎం.ఎస్. స్వామినాథన్ లాంటి నిపుణుల పేరు చెప్పుకునే సంస్థ అవార్డు ఇచ్చిందని చెప్పుకోవచ్చునని వ్యవసాయ సంక్షోభాన్ని తీర్చడానికి, కనీసం ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలను పరామర్శించడానికి ఒక్క అడుగు కదల్చని ముఖ్యమంత్రిని రైతుమిత్ర అనడం ఆమాటకే అవమానం. ప్రచార సాధనాల్లో నిలిచి ఉండడానికీ, మధ్యతరగతిని ఆకర్షించి భ్రమల్లో ముంచడానికీ ఇటువంటి పొగడ్తలు, ప్రశంసలు, పురస్కారాలు ఉపయోగపడతాయి గాని అట్టడుగున సాధారణ జీవితం ఉన్నది కదా. అది గతం వల్ల కొంత, ప్రస్తుత విధానాల వల్ల కొంత నానాటికి దిగజారుతున్నది కదా. రైతులు ఆత్మహత్య చేసుకోక తప్పనిస్థితి, కూలీలు పనిలేక వలస వెళ్లక తప్పనిస్థితి, నీటిపారుదల ఎండమావులు ప్రస్తుతానికైతే కాంట్రాక్టర్ల కడుపునింపే స్థితి కొనసాగుతున్నది కదా. ఎన్ని పొగడ్తలు ఈ స్థితిని మారుస్తాయి? ఎక్కువలో ఎక్కువ ఈ పురస్కారాలు కొత్త దళారీలను తయారు చేస్తాయి గాని జీవితానికి కొత్త దిశ ఇవ్వలేవు. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# దొందూ దొందే అయినప్పుడు ఎవరు గెలిస్తేనేమిటి?

**2014** ఎన్నికల్లో వైఎస్ఆర్‌సిపి టికెట్ మీద గెలిచి తెలుగుదేశంకు మారిన కుటుంబం, ఆ తర్వాత శాసనమండలి ఎన్నికల్లో తెలుగుదేశం టికెట్ మీద గెలిచి ఇప్పుడు వైఎస్ఆర్‌సిపికి మారిన కుటుంబం నంద్యాల ఉప ఎన్నికల్లో పోటీ పడ్డాయి. అంటే, ఓటు ఎవరికి వేసినా ఒకరికి వేసినట్టే. ఎవరు గెలిచినా అంతిమంగా వాళ్లు తమ పార్టీలోనే ఉంటారనే నమ్మకం ఏమీ లేదు. దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక ఎన్నికలు ఇంత హాస్యాస్పద స్థితికి చేరిన తర్వాత నంద్యాల ఉప ఎన్నికల గురించి ప్రత్యేకంగా మాట్లాడవలసింది ఏమీ లేదు. కాని, సాధారణ ఎన్నికలు గడిచి మూడు సంవత్సరాలు అయ్యాక ఒక మధ్యంతర ఉప ఎన్నిక ఎటువంటి ప్రాధాన్యత లేకుండా సాఫీగా జరిగిపోవలసిన ఈ ఎన్నికల ప్రచార సరళి ప్రవహించిన డబ్బు, మద్యం, హింస తప్పనిసరిగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం గురించి ఆలోచించే వాళ్లందరూ పట్టించుకోవలసినవి. ఈ ఎన్నికల సందర్భంగానే స్వయంగా ముఖ్యమంత్రి 'నేను వేసే రోడ్ల మీద నడుస్తూ, నేను పంపిణీ చేసే చౌకధరల సరుకులు తీసుకుంటూ నాకు ఓటు వెయ్యరా' అని కళ్లెర్ర జేశాడు. అంటే, ప్రజాస్వామిక ఎన్నికలను గెలిచిన వారి బాధ్యత, గెలిపించిన వారి ఆకాంక్షలు అనే చర్చ నుంచి కృతజ్ఞతా చర్చలోకి మార్చిన ఘనత ఆయనది. ఇప్పటికే తన పార్టీ నుంచి కొందరిని అధికార పార్టీ లాగివేసుకున్నదన్న ఆగ్రహంతో ఉన్న ప్రతిపక్ష నేత ముఖ్యమంత్రి కిరీటం తనకు చేతికందేంత దూరంలో ఉన్నదనే అపోహతో నోటికి హద్దు లేకుండా పార్లమెంటరీ రాజకీయాల్లోనైనా, సభ్య సమాజంలోనైనా ఆమోదయోగ్యం కాని పద్ధతిలో మాటలు జారాడు. ముఖ్యమంత్రి చేసిన అక్రమాల గురించి చెప్పడం, ఆ అక్రమాలపై విచారణ జరిపిస్తామనడం ఒక ఎత్తు. కాని, నడి వీధిలో ఉరితీస్తామనడం, కాల్చిచంపుతామనడం హింసా రాజకీయాలే తప్ప ప్రజాస్వామ్య రాజకీయాలు కావు. ఈ ఇద్దరు అగ్రనాయకులు ఇలా దారిచూపినపుడు చోటా మోటా నాయకులూ, ప్రచారకర్తలూ ఇక తమ ఇష్టారాజ్యంగా ప్రత్యర్థుల దుస్తుల గురించి, కుటుంబాల గురించి, ఓట్ల కొనుగోలు గురించి అవాకులు చెవాకులు పేలారు. ఈ ప్రచార సరళి అంతా ఒక ఎత్తయితే, అధికార పార్టీ అధికార యంత్రాంగాన్ని పూర్తిగా తన సొంత ఇంటి పనిమనుషుల్లా వాడుకోవడం మరొక ఎత్తు. ఎన్నికల నిబంధనావళికి సంబంధించిన ఏ ఒక్క ఆదేశాన్ని పాటించని, ఉల్లంఘించిన ఎన్నికల ప్రచారకర్తల మీద నామమాత్రపు కేసులు నమోదు చేయడం మినహా మరేమీ జరగలేదు. అత్యధిక సందర్భాలలో ఉల్లంఘనలను చూసీ చూడనట్లు పోవడం జరిగింది. ముఖ్యమంత్రి సమీప బంధువు, శాసనసభ్యుడు, సినిమా నటుడు ప్రచార రథంలో నుంచి బహిరంగంగా నోట్ల కట్ట చేతిలో పట్టుకొని పంచుతూ ఉండగా వీడియో రికార్డ్ అయి ఉన్నప్పటికీ ఎవరి మీదా ఏ చర్యా లేదు. నిజానికి ప్రచారం తొలిరోజుల్లోనే స్వయంగా ముఖ్యమంత్రే రెండు వేలకు ఒక ఓటు కొనుక్కోలేనా నేను అని కూడా బహిరంగంగానే అని ఉన్నాడు. ఇటువంటి ఎన్నికలు ప్రజాభిప్రాయానికి సూచికలని, ఇటువంటి ఎన్నికల ద్వారా అధికారానికి వచ్చిన వారు ప్రజా ప్రతినిధులని అనుకోగలుగుతున్నామంటే ఇది అమాయకత్వమా, ఆత్మవంచనా. ఎవరికి వారు ప్రశ్నించుకోవలసిందే. నంద్యాల ఉప ఎన్నిక మన ఎన్నికల దివాళాకోరు స్వభావానికి అద్దం పడుతున్నది. వీ

# కల్లోల వెనిజులాలో మదురో స్వామ్యం

వెనిజులాలో ఆర్థిక సంక్షోభం నేడు పరాకాష్టకు చేరింది. ప్రపంచ చమురు ధరలు ఘోరంగా పతనం కావడంతో చమురు ఎగుమతుల ఆధారిత వెనిజులా ఆర్థిక వ్యవస్థ బాగా క్షీణించింది. 2016 నుంచి నిత్యావసర వస్తువుల ధరలు ఎన్నో రెట్లు పెరిగాయి. నిరుద్యోగం, ఆకలి చావులు, అవినీతి, నిత్యావసరాల కొరత తారస్థాయికి చేరుకోవడంతో ప్రజా జీవనం అతలాకుతలమైంది. దాంతో మదురో ప్రభుత్వంపై తీవ్ర అసంతృప్తి జ్వాలలు ప్రజ్వరిల్లాయి. మదురోకు ఛావెజ్ ఇచ్చిన సర్టిఫికెట్ తప్ప అంతకు మించిన అర్హతలు ఏమీ లేవు. ఆర్థికంగా సామాజికంగా, పాలన పరంగా ప్రతిపక్షాలు కల్పిస్తున్న ఇబ్బందులను అధిగమించడానికి మదురో వద్ద తగిన శక్తియుక్తులు కొరవడ్డాయి. అమెరికా సామ్రాజ్యవాద కుట్రలను ఎదుర్కోవడంలో, ప్రజల సమస్యలు పరిష్కరించడంలో మదురో విఫలమయ్యాడు. ఫలితంగా ఛావెజ్ మద్దతుదారులు, ప్రతిపక్షాల మధ్య వీధి పోరాటాలు జరుగుతున్నాయి. వెనిజులా ప్రతిపక్షాలతో పాటు సిఐఏ ప్రాపకంలోని కొలంబియా డెత్ స్క్వాడ్‌లు కూడా చావెజ్ మద్దతుదారులపై దాడులు, హత్యలు చేస్తున్నాయి. చావెజ్ ఉన్నప్పుడే వెనిజులాలో ప్రవేశించిన ఈ దళాలు మదురో హయాంలో మరింత విశ్వరూపం ప్రదర్శిస్తున్నాయి. గత నాలుగు మాసాలుగా ప్రభుత్వ ఆస్తులను తగులబెట్టడం, భవనాలను కూల్చి వేయడం ఒక పనిగా పెట్టుకున్నాయి. పసిపిల్లల వైద్యశాలను పసిబిడ్డలు ఉండగానే తగులబెట్టారు. వెనిజులా సుప్రీంకోర్టును సహితం తగులబెట్టే ప్రయత్నం చేశారు. ప్రతిపక్షం లక్ష్యం మదురో ప్రభుత్వాన్ని కూలదోసి చావెజ్ సంస్కరణలను వెనక్కి తిప్పడం, అమెరికా పశ్చిమ దేశాల బహుళజాతి కంపెనీల దోపిడీకి స్వేచ్ఛా ప్రవేశం కల్పించడం.

అమెరికా విధించిన ఆర్థిక ఆంక్షల వలన వెనిజులా ద్రవ్యోల్బణం ఆకాశాన్ని తాకుతోంది. ఈ సంక్షోభాన్ని అధిగమించేందుకు మదురో డిమానెటైజేషన్ చర్య ప్రకటించాడు. ఫలితం ఉండనందున వెంటనే ఉపసంహరించుకున్నాడు. ఎన్ని చర్యలు తీసుకున్నప్పటికీ దేశ ఆర్థిక నాడులు ధనిక వర్గాల చేతుల్లో ఉండడంతో పరిస్థితి అదుపులోకి రావడం లేదు. ప్రతిపక్ష మద్దతుదారులైన వ్యాపారులు అక్రమంగా నిల్వ ఉంచి కృత్రిమ కొరత సృష్టిస్తున్నారు. దానితో అటు అధిక ధరలు, ఇటు సరుకులు అందకపోవడం వల్ల ప్రజలు ఆందోళనకు దిగుతున్నారు. తీవ్ర ఆర్థిక సంక్షోభం, అదుపు తప్పిన ద్రవ్యోల్బణం వల్ల ఏర్పడిన సామాజిక కల్లోలాన్ని అదుపు చేసేందుకు నూతన రాజ్యాంగ నిర్ణాయక సభకు జరిగిన ఎన్నికల్ని ప్రతిపక్షాలు బహిష్కరించాయి. రాజ్యాంగ నిర్ణాయక సభ ఎన్నికల్లో 41.5 శాతం ప్రజలు పాల్గొనలేదు. నూతన రాజ్యాంగ సభలోని 545 స్థానాలకు అధికార పార్టీ, దాని మిత్ర పక్షాలు ఎన్నికయ్యాయి. రాజ్యాంగ నిర్ణాయక సభకు ఎన్నికలు నిర్వహించరాదని కోరుతూ రెఫరెండం పేరుతో నిర్వహించిన సర్వేలో తమకు మెజారిటీ ప్రజలు మద్దతు తెలిపినట్లు ప్రతిపక్షం ప్రకటించింది. ప్రపంచ సంస్థలు, రష్యా సహా 40 దేశాలు ఈ ఎన్నికల్ని తప్పు పట్టాయి. ప్రధానంగా ప్రతిపక్షాలు మెజారిటీగా ఉన్న జాతీయసభను బలహీనం చేసే ఉద్దేశంతో కొత్త రాజ్యాంగ సభను మదురో ఏర్పాటు చేయడం పట్ల అంతర్జాతీయంగా విమర్శలు వెల్లువెత్తాయి. ఉనికిలో ఉన్న ప్రజా ప్రాతినిధ్య సభకు పోటీగా తనకు అనుకూలమైన మరొక సభను చట్టవిరుద్ధంగా రూపొందించిన ఘనత మదురోదే. ప్రజల వాస్తవ ఆకాంక్షల్ని నేరవేర్చని ప్రజాస్వామిక ప్రక్రియలన్నీ అభాసుపాలవుతాయని అనడానికి వెనిజులా నిదర్శనం.

– ఎ. నర్సింహారెడ్డి వీ




పర్యావరణ పక్ష పత్రిక డౌన్ టు ఎర్త్ సౌజన్యంతో....



❖ **ధనక్-ఇంద్రధనుస్సు**-అవార్డు పొందిన నగేష్ కుకునూర్ సినిమా ఆధారంగా-నవలీకరణ: అనుష్కా రవిశంకర్ – మంచి పుస్తకం – 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 70, ప్రతులకు: మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ – 500017, ఫోన్: 9490746614; వెబ్:manchipustakam.in ఈమెయిల్: info@manchipustakam.in



❖ **ఫార్వర్డ్ మార్చ్**–శ్రీశ్రీ–కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణలు – 56 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 45, ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతీనగర్, విజయవాడ – 520004; ఫోన్: 0866 – 6617375 ఈమెయిల్: srisri_sahityanidhi@yahoo.com



❖ **కాంచనపల్లి చినవెంకట రామారావు కథలు** – మన ఊళ్లో కూడానా...?! నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 70 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40



❖ **సింగరాజు లింగమూర్తి రచనలు** – కథలు రెండవ సంపుటం – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 270 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 175



❖ **తెలంగాణ దారిదీపాలు – ఒద్దిరాజు సోదరులు** – సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు – నవచేతన పబ్లిషింగ్‌హౌస్–54 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40 పై మూడు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్ – 500068; ఫోన్: 24224453/54



❖ **వెలుతురు తెర**–కవిత్వం – బొల్లోజు బాబా – 96 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: బొల్లోజు బాబా, 30-7-31, సూర్యనారాయణపురం, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా. ఫోన్: 0884 – 2368189, 9489320443



❖ **పండు వెన్నెల** – నవతరంతో యువతరం – కతలు – కవిత్వాలు – అనుభవాలు – సంస్కృతి పబ్లికేషన్స్ – 90 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సంస్కృతి పబ్లికేషన్స్, పి.ఎస్. బోనంగి, పరవాడ మండలం, విశాఖపట్నం – 531 021



❖ **కుర్చీ** – కవిత్వం – వనపట్ల సుబ్బయ్య – 200 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: ఎం. సుబ్బయ్య (వనపట్ల) భార్గవి హెయిర్ స్టైల్స్, నల్లవెల్లి రోడ్, బస్‌స్టాండ్ దగ్గర, నాగర్‌కర్నూల్ – 509209, మహబూబ్‌నగర్; ఫోన్: 9492765358, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **నది పలికిన వాక్యం**– కవిత్వం – విలాసాగరం రవీందర్ – సాహితీ సోపతి–146 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: బసబతిని రమాదేవి, ఇ.నెం. 8-5-599/3, పోచమ్మవాడా, కోతిరాంపూర్, కరీంనగర్ – 505 001;



❖ **ఒక దేశద్రోహి ప్రేమకథ** – కవిత్వం – సాబిర్ – 104 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సయ్యద్ సాబిర్ హుసేన్, డోర్ నెం. 22-143, కట్టకింద బజారు, వినుకొండ – 522647, గుంటూరు జిల్లా. సెల్: 9493620796, 9154705556



❖ **మందువాలోగిలి** – కవిత్వం – గంగిశెట్టి లక్ష్మీనారాయణ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 132 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్: 040-27678430



❖ **ప్రజాస్వామ్య విద్యకోసం మరో పోరాటం...** – వ్యాసాలు – ప్రొ. జి. హరగోపాల్ – పాలమూరు ప్రచురణలు పాలమూరు అధ్యయన వేదిక – 128 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: ఎం. రాఘవాచారి, ప్లాట్ నెం. 41, శాంతి చంద్రిక, ఇ.నెం.3-148, బాలాజీ నగర్, మహబూబ్‌నగర్, ఫోన్: 9490909792



❖ **జీవించు... మరణంలో కూడా** – డా. పి. విజయలక్ష్మి – పాలపిట్టబుక్స్–100 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 90, ప్రతులకు: పాలపిట్ట బుక్స్ ఫ్లాట్ నెం. 3, బ్లాక్-6, ఎంఐజి-2, ఎపిఎచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ ఫోన్: 040 – 27678430



❖ **నల్లమల ఎర్రమల దారులలో యాత్ర** – పరవస్తు లోకేశ్వర్ – గాంధీ ప్రచురణలు – 156 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150



❖ **హైద్రాబాద్ జనజీవితంలో ఉర్దూ సామెతలు** – పరవస్తు లోకేశ్వర్ – గాంధీ ప్రచురణలు – 68 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80
పై రెండు పుస్తక ప్రతులకు: పి. లోకేశ్వర్, ఇ. నెం. 12-2-709/5/1/సి, నవోదయ కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్ – 500028; ఫోన్: 9160680847, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **మూఢ విశ్వాసాల దాడులు** – సమతా కోటేశ్వరరావు – ఆలోచన ప్రచురణలు – 32 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 25, ప్రతులకు: ఆలోచన, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520 004; ఫోన్: 6617375

# మత్తులో జోగుతున్న మహానగరం

***హైటెక్ నగరమంటూ ఊదరగొడుతూ అడ్డగోలుగా స్టార్‌హోటళ్లకు, పబ్బులకు అనుమతులిచ్చి, వాటిపై నియంత్రణ పెట్టకపోవడంతోనే డ్రగ్స్ వ్యాపారం జోరుగా సాగుతోందనీ, ఇది భావితరాల జీవితాలను ఛిద్రం చేస్తోందనీ అంటున్నారు* గొడిశాల వెంకటేశ్వర్లు**

నాలుగు శతాబ్దాల భాగ్యనగర వైభాతిక భానుడిపై, కమ్ముకున్న మత్తు మేఘాలతో చారిత్రక కీర్తి కిరీటం మసకబారిపోతుంది. అసాంఘిక ముష్కర మూకకు, బరితెగించిన కులీన సంస్కృతికి, జడలు విప్పిన విదేశీ విషగీతికి, నగరకన్య నగ్నంగా నాట్యం చేస్తోంది. ఉక్కు కండరాలు, ఇనుప నరాలు వజ్రతుల్యమైన మనసుతో ఉరకలెత్తాల్సిన యువత మత్తు మంచులో మెత్తగా మునిగి నిలువునా నీరుగారుతోంది.

**అసలు మత్తు సంస్కృతి ఎక్కడిది?**

హైదరాబాద్ భిన్న సంస్కృతుల కూడలి. అది నగరాకృతిని, ఆవాస శోభను సంతరించుకోవడానికి ముందే, దాని తలాపున మెరిసిన సిరికోన గోల్కొండ పట్టణం. గోల్కొండ ప్రభువుల ప్రాభవంలో ప్రాక్పశ్చిమ దేశాల నుండి వజ్ర వైఢూర్య ధన, కనక, వస్తు వాహనాలకు వాణిజ్య కేంద్రంగా విలసిల్లి, విలాసవంతుల కులాసా జీవితానికి నిలయమైంది గోల్కొండ. ఈజిప్టువలె ప్రపంచపు అంగడిగా పేరొందిన ఈ నేలపైన సమాంతర కాలంలో గోల్కొండ కోటకు బంజారా దర్వాజా గుండా ఉప్పు, పొగాకు, గంజాయి మత్తు మందుల వ్యాపారం కూడా సాగినట్లు చారిత్రక కథల ఆధారం ఉంది. ఇటువంటి వాటిపై ప్రభుత్వానికి కూడా రెవెన్యూ అధికంగా వచ్చేదని చారిత్రకుల ఉవాచ. కాలక్రమంలో గోల్కొండ పట్టణంలో పెరిగిన జనాభా ఒత్తిడి, విస్తృత అవసరాలు, సౌకర్యాల దృష్ట్యా అధికారులు, రాజ ప్రముఖులు, సంపన్నులు హైదరాబాద్ నగరానికి తరలిరావడం ప్రారంభమైంది. దాదాపు 250 సంవత్సరాలు సకల వైభవాలతో విరాజిల్లిన గోల్కొండ ప్రభువులు, వర్తకులు, సంపన్న వర్గాలు, ఉమ్రావులు (ఉన్నత వంశీకులైన కళాపోషకులు) ఆట పాటలతో భోగలాలసులై ఉన్నారు. ఈ నేపథ్యంలో ఉమ్రావుల పటాటోపానికి, సంపన్నుల విలాస జీవితాలకు మితిలేకుండా పోయింది. వారి దర్పాన్ని, దర్జాని చాటుకోవడానికి ఉంపుడు కత్తెల వ్యవస్థ, హుక్కా గంజాయి పీల్చడం వంటి దుర్వ్యసనాలను బాహాటంగానే ప్రదర్శించేవారు. ఈ సంస్కృతి క్రీ.శ. 15, 16 శతాబ్దాల్లో కేవలం సంపన్నవర్గాలకే పరిమితమైంది. క్రీ.శ. 1687లో ఔరంగజేబు దాడి తర్వాత గోల్కొండ కోట విధ్వంసంతో దాని రాచఠీవి అందచందాలు వైభవం మట్టిగలిసినా, అనంతరం సాగిన కుతుబ్‌షాహీల, నవాబుల పాలనకు, ఆ తర్వాత సాగిన నిజాం నవాబుల పాలన గోల్కొండ నుండి హైదరాబాద్ నగరం రాజధానిగా మారడంతో పాటు, సంపన్నవర్గాల రాజ ప్రముఖుల వారసత్వ విష సంస్కృతి హైదరాబాద్‌లో కూడా పాదుకొని పోయింది.

దీనికి కొనసాగింపుగా హైదరాబాద్ నిజాం నవాబుల కాలం నాటికి మరిన్ని దురాచారాలు నగరానికి చేరువైనాయి. అందులో భాగంగా దేవదాసీ, ముర్లీ, వేశ్యావృత్తి, ద్రాక్షాసవము మద్యపాన కేంద్రాలు హైదరాబాద్ సమాజంలో వేళ్లూనుకున్నాయి. నెమ్మదిగా సామాన్య జనానికి తాటి, ఈతకల్లు ప్రీతికరమైన పానీయంగా ప్రచార స్థాయికి ఎదిగినాయి. దీంతోపాటు హైదరాబాద్‌లో ఊపిరిపోసుకున్న మరో అనాచార వ్యవస్థ ముజ్రా. అంటే మత్తు పానీయాలు సేవిస్తూ సంపన్నవర్గాల ఆనందం కోసం అర్ధ నగ్నంగా నృత్యాలు చేస్తూ పాటలు పాడేవారు. ఇదే అనంతర కాలంలో రూపం మార్చుకొని క్లబ్బుగా, పబ్బులుగా ప్రచారంలోనికి వచ్చింది.

**వర్తమాన హైదరాబాద్**

హైదరాబాద్ సామాజిక వ్యవస్థలో నెలకొన్న దురాచారాలను రూపుమాపడానికి దేశం గర్వించదగిన సంఘ సంస్కర్త, బహుజనుల పాలిట దీపశిఖ భాగ్యరెడ్డి వర్మ హైదరాబాద్‌లో విశేష కృషి చేశారు. 1931 నాటికి ప్రజా చైతన్యానికి పునాదులు వేశాడు. నిజాం పాలన అంతరించి 1948 సెప్టెంబర్ 17 తర్వాత హైదరాబాద్ స్వాంతత్ర భారతంలో విలీనానంతరం హైదరాబాద్‌లో, ప్రత్యేక రాష్ట్రంగా ప్రజాస్వామ్య పాలనలో కూడా కొనసాగుతున్న ఈ దుర్వ్యవస్థల మీద యుద్ధం చేయడానికి, హైదరాబాద్ సామాజిక రాజకీయోద్యమాలకు నాందీ పలికిన కొర్వి కృష్ణస్వామి ముదిరాజ్, భాగ్యరెడ్డి వర్మతో కలిసి ఈ వ్యవస్థలు రూపుమాపడానికి కృషిచేస్తూ, హైదరాబాద్ నగర మేయర్‌గా నగరాభివృద్ధికి 30 సంవత్సరాల మాస్టర్ ప్లాన్ తయారు చేశాడు.

ఇటువంటి దార్శనికుల ముందు చూపుతో నగరం శరవేగంగా అభివృద్ధి చెందుతూ ఉన్నా, అంతర్లీనంగా ఆ వ్యవస్థలు కూడా రూపం మార్చుకుంటూ కొనసాగుతూనే ఉన్నాయి. 70 సంవత్సరాల స్వతంత్ర పాలనలో నగరం ప్రపంచ దేశాల వాణిజ్య కేంద్రంగా, పర్యాటక కేంద్రంగా, చారిత్రక నగరంగా, వివిధ దేశాల, ప్రాంతాల సంస్కృతీ సమ్మేళనంతో ఊహించనంత స్థాయికి ఎదిగింది. పాలనలో పార్టీలు, పదవులు, వ్యక్తులు మారినా, ఎదుగుతున్న నగర వృక్షాన్నే చూశారు కాని, దాని నీడన తమ సంపాదనా సౌధాలను నిర్మించుకున్నారే గాని పక్కనే పాకుతున్న విష సర్పాలను, చీడ పురుగులను పట్టించుకోలేదు సరికదా, ప్రాణం పోసుకోవడానికి ఊతమిచ్చారు. ఆ ఊతమే, ఒకనాటి ద్రాక్షాసవం కేంద్రాలు మద్యపానం, దేవదాసి, వేశ్యా, హుక్కా, గంజాయి కేంద్రాలు, నేడు దూల్‌పేట గుడుంబా సెంటర్లుగా, హుక్కా కేంద్రాలుగా, వ్యభిచార కేంద్రాలుగా, రీసార్టులుగా, ముజ్రా పార్టీలుగా, రేవ్ పార్టీలుగా, క్లబ్బులుగా, పబ్బులుగా, హైడ్రోజన్ పబ్బులుగా అవతారమెత్తి, ఆధునిక హంగులతో చేస్తున్న విశృంఖలత్వానికి నగరం ఉక్కిరి బిక్కిరి అయ్యేలా చేస్తోంది. దీనికి పెరుగుతున్న సంపద, పోగేసుకున్న అక్రమార్జనతో పాటు విదేశీ సంస్కృతి తోడైంది. ఈ విష కుహరంలోంచి పుట్టిన మరొక ఆధునిక విషగుళికే డ్రగ్స్. ఈ డ్రగ్స్ మాఫియా ప్రపంచంలో

పశ్చిమాసియా, ఆఫ్రికా దేశాల్లో మొదలై నేడు హైదరాబాద్‌ను మత్తు పదార్థాలు, మాదక ద్రవ్యాల మినీ మార్కెట్‌గా మార్చి వేసింది.

**మత్తుకు బానిసలుగా మారుతున్న వైనం**

పిల్లలు యువతీ యువకులు తీవ్రమైన ఒత్తిడి, కుటుంబ కలహాలు, నీలి చిత్రాలు, మీడియాకు ఆకర్షితులై, స్నేహితుల ప్రేరణతో నెమ్మదిగా మత్తులోకి దిగడం ప్రారంభమవుతుంది. ముఖ్యంగా 12-19 ఏళ్ల టీనేజిలోని పిల్లల మానసికావస్థలు తీవ్ర స్థాయిలో ఉంటాయి. ఆ వయస్సులో స్నేహితులతో ఎక్కువగా గడుపుతారు. శరీరంలో వచ్చే మార్పులతో పాటు మానసిక మార్పులు కూడా పిల్లలను అదుపులో ఉండనీయవు. ఈ కారణంతో తమలో కలిగిన కోర్కెలను తీర్చుకోవడానికి త్వరగా ఆకర్షితులవుతారు. మనసులో కలిగే అలజడిని దూరం చేసుకోవడానికి తల్లిదండ్రులకు తెలియనీయకుండా కోక్‌తో మొదలు పెట్టి సిగరెట్లు, మందు, గంజాయి దాకా వెళ్లడం జరుగుతోంది. ఇందుకోసం చాటుగా అవి దొరికే, ఆస్వాదించే చోటుకు వెళ్లడం పరిపాటి. ఇలాంటి వారి కోసం ఎదురు చూసే డ్రగ్ వ్యాపారులు నెమ్మదిగా వారికి వల వేయడం, వారిని మత్తుకు బానిసలుగా మార్చడం జరుగుతుంది. ఇలా సంపన్న వర్గాలే కాక మధ్య, దిగువ తరగతి టీనేజి పిల్లలు కూడా మత్తు ఊబిలో కూరుకుపోతున్నారు. మత్తు పదార్థాలకు, మాదక ద్రవ్యాలకు బానిసలవుతున్న వారు దేశంలో 5-6 శాతం మంది ఉన్నారు. ఈ మత్తు వాడకంలో వయోభేదం, లింగభేదం ఏమీలేదు. మత్తు వాడకంలో మహిళలు-పురుషులు 1:3 నిష్పత్తిలో ఉన్నారు. 12-20 సంవత్సరాల వయస్సు గలవారు 60 నుండి 70 శాతం కాగా, 21-40 సంవత్సరాల వయస్సు గలవారు 20 శాతం, 41 సంవత్సరాల పైబడిన వయస్సువారు 10 శాతం మత్తు పదర్థాలకు, మాదక ద్రవ్యాలకు బానిసలవుతున్నారు.

**వివిధ రకాల మత్తు పదార్థాలు - వినియోగం**

టీనేజి పిలలు ముఖ్యంగా నిర్మానుష్య ప్రాంతాల్లో, ఒంటరి నివాసాల్లో, గల్లీలో, పర్యవేక్షణలేని హాస్టళ్లలో వీటిని సేవించడం జరుగుతోంది. 20 నుండి 40 ఏళ్ల వయస్సు యువకులు, ఒంటరి ఉద్యోగులు రోడ్ల పక్క వాహనాల్లో, పార్కుల్లో, రిసార్ట్‌లలో, శివారు ప్రాంతాల్లో, గెస్ట్ హౌజుల్లో, క్లబ్బుల పబ్బుల్లో మత్తు పదార్థాలకు అలవాటు పడుతున్నారు. స్థాయిని బట్టి, అవకాశం, ఆర్థిక స్థోమతను బట్టి మత్తు మందుల వినియోగం సాగుతోంది. ఇందుకొరకు మధ్యతరగతి, సామాన్యులు తక్కువ ధరలో దొరికే పొగాకు గంజాయి, నిద్రమాత్రలు వంటివి వాడుతుండగా, ఖరీదైన మాదకద్రవ్యాలు ఉన్నత వర్గాల వారు వాడడం జరుగుతోంది. సాధారణంగా గోళ్ల రంగును శుభ్రం చేసే రసాయనం, సిరారంగును తొలగించే వైట్‌నర్, కోరెక్స్ వంటి దగ్గు మందులు ట్రిమిడాల్, మార్ఫిన్, ఫోర్ట్‌వీన్, పెథడీన్, కిటమీన్, గంజాయి, ఆంపిటమైన్, ఎల్ఎస్‌డి, కొకైన్, హెరాయిన్, బ్రౌన్‌షుగర్ వంటి ఖరీదైన డ్రగ్స్ వినియోగం తీవ్రతరమవుతోంది.

**డ్రగ్స్ సరఫరా - పాత్రధారులు - సూత్రధారులు**

ఇటీవల హైదరాబాద్‌తో పాటు రాష్ట్రంలో పలు ప్రాంతాల్లో పోలీసులు ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్ జరిపిన దాడుల్లో పలు ఆందోళనకర విషయాలు వెలుగు చూశాయి. తెలంగాణలోని పలు జిల్లాల నుంచే కాక ఆంధ్ర ప్రాంతం నుండి కూడా గంజాయి వంటి మాదక ద్రవ్యాలు సూర్యాపేట, నల్లగొండ వంటి జిల్లా కేంద్రాలకు, హైదరాబాద్ నగరానికి రవాణ అవుతున్నట్లు తేలింది. అంతేగాక నగరంలో నివసిస్తున్న విదేశీ యువకులు ముఖ్యంగా విద్యాభ్యాసం కొరకు వచ్చిన నైజీరియా, సూడాన్, నెదర్లాండ్స్, జర్మనీ, బెల్జియం వంటి దేశాల నుండి వచ్చిన విద్యార్థులు పర్యటన పేరుతో వచ్చి అక్రమంగా ఇక్కడే ఉంటున్న విదేశీయులు ఈ దందాకు సూత్రదారులుగా, స్థానిక ముఠా నాయకులు పాత్రదారులుగా డ్రగ్స్ వ్యాపారాన్ని యథేచ్చగా కొనసాగిస్తున్నారు. పిల్లల, యువకుల బలహీనతలను సొమ్ము చేసుకోవడానికి ఉన్నత వర్గాల పిల్లలతో ఆర్థిక సొమ్ము లాగడానికి వీరు పబ్బులను, క్లబ్బులను, శివారు ప్రాంతాల్లోని రిసార్టులను కేంద్రాలుగా మలుచుకున్నారు. వీకెండ్ పార్టీలు, రేవ్ పార్టీలు, ముజ్రా పార్టీల పేరుతో యువతను ఆకర్షించే పబ్బులు క్లబ్బుల్లోను, రిసార్ట్ సెంటర్లలోను, వేశ్యా గృహాలు, హుక్కా సెంటర్లకు వచ్చే యువతను డ్రగ్స్ మాఫియా ఊబిలోకి లాగుతుంది. స్థానికంగా ఉన్న ప్రముఖ రెస్టారెంట్లు, హోటళ్లలో మేనేజర్లుగా పనిచేసే కెల్విన్, జీశాన్ లాంటి వాళ్లేగాక, ఉద్యోగం కోల్పోయి మత్తుకు బానిసైన పీయుష్ లాంటి నిరుద్యోగ యువత డార్క్‌నెట్ ద్వారా విదేశాల నుండి డ్రగ్స్ తెప్పించి సరఫరా చేయడమే గాక స్థానికంగా ఉత్పత్తి చేయడం కూడా జరుగుతుంది. అడ్డదారుల్లో అక్రమ సంపాదనకు పాల్పడే ఇలాంటి మాఫియా చేతికి ఇంజనీరింగ్ విద్యార్థులతో పాటు పాఠశాల స్థాయి విద్యార్థులు కూడా బలికావడం అత్యంత విషాదం.

**బయటపడిన దందా - సా...గుతున్న విచారణ**

హైదరాబాద్‌లో అంతకంతకు పెరిగిపోతున్న డ్రగ్స్ వినియోగాన్ని, పబ్బుల్లో సాగుతున్న ఈ దందాను నియంత్రించడానికి జరిపిన ఎక్సైజ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ దాడుల్లో భయంకరమైన వాస్తవాలు వెలుగు చూశాయి. ప్రముఖ రాజకీయ నాయకుల, సంపన్నుల పిల్లలు, సినీరంగ ప్రముఖులు, వర్థమాన తారలు ఎంతోమంది బాధితులుగా పాత్రధారులుగా, సూత్రధారులుగా బయటపడ్డారు. అంతేగాక నగరంలోని పలు ఇంటర్నేషనల్ స్కూల్ పిల్లలు, కార్పొరేట్ కళాశాల పిల్లలు డ్రగ్స్ బారిన పడినట్లు తేలింది. పిల్లలకు చాక్లెట్స్ రూపంలో, శీతల పానీయాలు, ఐస్‌క్రీంల రూపంలో డ్రగ్స్ విక్రయిస్తున్నట్లు, సినీరంగంలోని వారికి ఫేషియల్ ఎట్రాక్షన్ కొరకు ముఖంలో వయసు దాచుకోవడానికి ఎల్ఎస్‌డి వంటి డ్రగ్స్, బ్లాటింగ్ పేపర్‌పై రసాయనాలు వేసి డ్రగ్ స్లిప్స్ పేరుతో సులభంగా ఖరీదైన డ్రగ్స్‌ను విక్రయిస్తున్నట్లు వెలుగు చూసింది. వివిధ ప్రాంతాల నుండి కోడ్ భాషలో ఆర్డర్లు ఇచ్చి, కొరియర్ల ద్వారా తెప్పించి వేల కోట్ల వ్యాపారం సాగుతున్నట్లు తెలుస్తోంది. ఈ నేపథ్యంలో హైదరాబాద్‌లో పబ్బులతో ముడివేసుకున్న డ్రగ్స్ మాఫియా మూలాలను వేళ్లతో సహా పెకిలించాలని 27 మందిని గుర్తించి అందులో 12 మంది సినీరంగంలోని వారికి, 11 బార్లు పబ్బులకు, 40 పాఠశాలలు, 80 కళాశాలలు, 25 ఐటి కంపెనీలకు అడ్వయిజరీ నోట్స్ ఇచ్చారు. తీగ లాగితే డొంక కదులుతుందన్న వాస్తవాన్ని గ్రహించిన బాధిత పెద్దలు, సంబంధిత యాజమాన్యాలు తెచ్చిన ఒత్తిడికి తలొగ్గిన ప్రభుత్వ పెద్దలు విచారణాధికారి అత్యుత్సాహం చూపుతున్నారని బహిరంగంగానే విమర్శించడంతో ఎక్సైజ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టర్ సెలవుపై వెళ్లాడని గుసగుసలు మొదలయ్యాయి. ఈ నేపథ్యంలో మునుపెన్నడూలేని విధంగా హైదరాబాద్ నగరం మత్తులో జోగుతోందని, హైదరాబాద్ బ్రాండ్ ఇమేజ్‌కి మత్తెక్కుతోందని గ్రహించిన ముఖ్యమంత్రి తనదైన శైలిలో స్పందించాడు. 'చట్ట వ్యవతిరేక చర్యలకు ఈ రాష్ట్రంలో చోటు లేదని, ఎంతటి వారైనా సరే పట్టుకోండి, ఎవరైనా వదలొద్దు, రాజకీయ నాయకులున్నా, టిఆర్ఎస్ వారున్నా కేసులు పెట్టి జైలుకు పంపండని,

ఆఖరుకు క్యాబినెట్ మంత్రి ఉన్నా కేసు పెట్టండని, హైదరాబాద్ తెలంగాణకు లైఫ్‌లైన్ లాంటిదని, హైదరాబాద్‌ను డ్రగ్ ఫ్రీ సిటీగా మార్చాలని' పోలీస్, ఎక్సైజ్ మీటింగ్‌లో డ్రగ్ మాఫియాపై ఉక్కుపాదం మోపమని చెప్పారు. ఇదే సమావేశంలో ఈ ఆదేశాలతో పాటు హైదరాబాద్‌లో డ్రగ్స్ ఎప్పటి నుంచో ఉందని, గత పాలకులు అశ్రద్ధ చూపారని, ఆరోపణలు కూడా చేశారు. పైగా కేసు దర్యాప్తులో ఉండగా సెలవుపై వెళ్లొద్దని డైరెక్టర్‌ను కోరినట్లు చెప్పి, 10 రోజులు సెలవు మంజూరు మతలబు ఏమిటో అర్థం కాదు. దీంతో అధికారులు 27 మందిలో 12 మందిని రోజుల తరబడి, గంటల తరబడి సకల సౌకర్యాల నడుమ విచారణ తంతు ముగించి డ్రగ్స్ కేసు కొనసాగేలా చేశారు. అరెస్టులు, విచారణల పేరుతో బడా బాబులున్న కేసులన్నింటి మాదిరిగానే ఈ కేసు కూడా అత్యంత పారదర్శకంగా ముగిసిపోతుందన్నది ప్రజలు అనుకుంటున్న సత్యం. రాజకీయ నాయకుల పిల్లలున్నారన్నప్పుడే ఈ కేసు రంగు వెలిసిపోతుందని తెలంగాణ ప్రజానీకానికి తేటతెల్లం అయింది. పది రోజుల పాటు దిక్కులు పిక్కటిల్లేలా బొబ్బలు పెట్టిన మీడియా యథాలాపంగా నోరూవాయి మూసుకొని నిమ్మళించింది.

**నిపుణులు ఏమంటున్నారు?**

బాహుబలిని సైతం బలహీనున్ని చేయగల ఈ మాదక ద్రవ్యాల మహమ్మారికి అడ్డుకట్ట వేయకపోతే దుష్పరిణామాలు తీవ్రంగా ఉంటాయని హెచ్చరిస్తున్నారు. డ్రగ్స్ వాడకంతో యువత బలహీన మవుతుందని, మెదడు పనిచేయక, మానసికంగా మనిషి కుంగిపోతాడని అంటున్నారు. నిస్సత్తువ ఆవరించిన వీరు ఏపని చేయడానికి సిద్ధపడరని, తేలికగా తమ అలవాటు తీర్చుకోవడానికి దొంగతనాలకు అలవాటు పడతారని చెపుతున్నారు. తీవ్రకోపం, ప్రతీకారంతో ఊగిపోవడం, ఆవేశంలో హత్యలకు వెనుకాడరని, వారికి తెలియకుండానే నరక కూపంలోకి నెట్టివేయబడతారని అభిప్రాయ పడుతున్నారు. వెయ్యి ఏనుగుల బలమున్నా చివరకు మెదడు, కిడ్నీలతో పాటు, లివర్, నరాలు దెబ్బతింటాయని, ఈ మహమ్మారి నుండి కాపాడుకోలేకపోతే యువ సామ్రాజ్యం కుప్పకూలుతుందన్నది వాస్తవం.

**ఏం చేయాలి?**

హైదరాబాద్‌ను కమ్మేసిన మత్తు మేఘాలు తెలంగాణ అంతటా ఆవరించక ముందే పట్టణాల నుండి మత్తు సంస్కృతి గ్రామాలకు ఎగబాకక ముందే అప్రమత్తమవ్వాలి. గ్రామాల్లో గుడుంబాను, పట్టణాల్లో పేకాట క్లబ్బులను తుడిచిపెట్టామని చెప్పుకుంటున్న ప్రభుత్వ పెద్దలు దేశ సంపదైన యువతపై సాగుతున్న ఈ అరాచకాన్ని ఆపాలన్నా, హైదరాబాద్‌నే కాదు, యావత్ తెలంగాణను డ్రగ్ ఫ్రీగా మార్చాలన్నా పోలీస్, ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్‌కు మాటల్లో ఇచ్చిన స్వేచ్ఛను చేతల్లో చూపాలి. అధికారుల ముందరి కాళ్లకు బంధాలు వేసి, ఆశ్రిత పక్షపాతానికో, బంధుప్రీతికో బద్దులు కావద్దు. తెలంగాణ మారుమూల జిల్లాల్లో నదీ పరివాహక ఏజెన్సీ ఏరియాల్లో ఉత్పత్తి అవుతున్న గంజాయి క్షేత్రాలను గుర్తించి వారికి కౌన్సిలింగ్ ఇచ్చి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసి, వారిని ఆదుకొని గంజాయి వంటి మాదక ద్రవ్యాల ఉత్పత్తికి స్వస్తి పలికేలా చూడాలి. గుట్కా వాడకాన్ని నిషేధించినట్లుగానే ఉత్పత్తి, సరఫరాను పూర్తిగా అడ్డుకోవాలి. ఈ విష సంస్కృతికి తక్షణమే చరమగీతం పాడాలి.

హైదరాబాద్‌లో అక్రమంగా నివసిస్తున్న విదేశీయుల కార్యకలాపాలపై నిఘా పెంచాలి. విద్యాభ్యాసం కోసం వస్తున్న యువతపై ఇంటిలిజెన్సీ వ్యవస్థ ఓ కన్నేసి ఉంచాలి. గతంలో ఉన్న పబ్బులతో పాటు తెలంగాణ అవతరణ తర్వాత వచ్చిన పబ్బులు, క్లబ్బులు కూడా ఉన్నాయి కాబట్టి గత కాలపు పాలనపై, నిర్లక్ష్యంపై నిందారోపణలు మాని పబ్బులను నిర్ధ్వందంగా మూసివేయాలి. ఊరి బయటి, స్టార్‌హోటళ్లపై గట్టి నిఘా ఏర్పాటు చేయాలి. తరాలుగా వస్తున్న హుక్కా సంస్కృతిపై ఉక్కుపాదం మోపాలి. తల్లిదండ్రులను, విద్యాలయాలను అవగాహన సదస్సులతో చైతన్యవంతం చేయాలి. దొరికినప్పుడే ఊదరగొట్టకుండా, నిరంతరం ప్రజలను అప్రమత్తం చేయాల్సిన బాధ్యత ప్రధానంగా మీడియాదే. ఐతే హైదరాబాద్‌ను డ్రగ్, వేశ్యా, ముజ్రా వ్యవస్థలకు దూరంగా, తెలంగాణ సంస్కృతీ సంప్రదాయాల లోగిలిగా, విశ్వనగరంగా వికసింపచేయడంలో ప్రభుత్వ చిత్తశుద్ధే ప్రధానం కాగలదు.

*(రచయిత ఉపాధ్యాయులు)*

---

*(... 4వ పేజీ తరువాయి)*

*రూపంలో కూడా నిరసనలను ప్రభుత్వాలు అనుమతించడం లేదు. విశాఖ ఏజెన్సీలో ప్రతిరోజు అరెస్టులు కొనసాగుతూనే ఉన్నాయి.*

**- టి. శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖపట్నం*

*వీక్షణం ఆగస్ట్ 2017 సంచికలో ఎడ్ల పోచయ్య రాసిన 'డెబ్బై ఏళ్ల బూటకపు స్వాతంత్ర్యం' గురించి రాస్తున్నాను. కమ్యూనిస్టు పార్టీల విధానాలు, చర్యల క్రమ పరిణామం గురించి రాస్తూ రచయిత కొన్ని తీవ్రమైన, గణనీయమైన వాస్తవాలను విస్మరించారు. వాటిలో కొన్ని- 1) కమ్యూనిస్టు పార్టీ రెండవ మహాసభ కలకత్తాలో 1948, ఫిబ్రవరి-మార్చ్‌లో జరిగినప్పుడు పార్టీ నెహ్రూ ప్రభుత్వాన్ని ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాద తొత్తుగా అభివర్ణిస్తూ దాన్ని కూలదోయడానికి సాయుధ తిరుగుబాటు జరపాలని నిర్ణయించింది. ప్రధాన కార్యదర్శిగా పి.సి. జోషి స్థానంలో బి.టి. రణదివె వచ్చారు. తెలంగాణ, ఆంధ్ర, కేరళ, బెంగాల్‌లో జరిగిన తిరుగుబాటు చర్యలకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ స్టాలిన్ మార్గనిర్దేశకత్వం, ఆమోదం ఉన్నాయి. కొమిన్ ఫాం ద్వారా రజనీపామీ దత్ ద్వారా ఈ ఆదేశాలు అందాయి. 2) తెలంగాణ కమ్యూనిస్టు పార్టీ నిజాం భారత దేశంతో కలవకూడదని బహిరంగంగా ప్రకటించింది. తాను నిజాంను ఓడించగలనని, తద్వారా చైనాలో ఏనాన్ లాగా తెలంగాణ రిపబ్లిక్‌ను స్థాపించ గలనని, దాని పునాదిగా పెట్టుకుని నెహ్రూ ప్రభుత్వాన్ని ఓడించి భారత దేశంలో కమ్యూనిస్టు పాలన నెలకొల్పగలనని భావించింది. కమ్యూనిస్టు పార్టీ మీద నిషేధం ఎత్తేశారు. భారత ప్రభుత్వం పోలీసు చర్య ద్వారా నిజాం ప్రాంతాలలో నిజాం రజాకార్ పాలన నుంచి విముక్తి కలిగించిన తర్వాత కూడా ఆంధ్ర మహాసభ పేరు మీది కమ్యూనిస్టులు తమ ఆయుధాలు వదలలేదు. 1951 సెప్టెంబర్ దాకా భారత సైన్యంతో పోరాడుతూనే ఉన్నారు. అంతకు కొద్ది ముందు నలుగురు కమ్యూనిస్టుల బృందం (అజయ్ ఘోష్, రాజేశ్వరరావు, బసవ పున్నయ్య, డాంగే) మాస్కోకు వెళ్లి స్టాలిన్‌తో చర్చలు జరిపారు. ఆయుధాలు దించమని, శాంతి కోసం ప్రయత్నించమని, ఒక విశాల ఐక్యసంఘటన ఏర్పరిచి ఎన్నికలలో పాల్గొనమని స్టాలిన్ సలహా ఇచ్చాడు. 3) ఈ ఘటనలు ప్రధానమైనవి. వీటిని ప్రస్తావించ ఉండవలసింది. 4) సుభాష్ చంద్రబోస్‌ను, ఆయన నాయకత్వంలోని భారత జాతీయ సైన్యాన్ని కమ్యూనిస్టు పార్టీ జపాన్ ఫాసిజం కావలి కుక్కలుగా అభివర్ణించింది. కాని పశ్చిమ బెంగాల్‌లో సిపిఎం ప్రభుత్వం మాత్రం దండం విమానాశ్రయానికి ఉత్సాహంగా సుభాష్ చంద్రబోస్ పేరు పెట్టింది. 5) భారత కమ్యూనిస్టు పార్టీలో 1965 నాటి చీలిక, సిపిఎం ఏర్పడడం గురించి వివరించ లేదు. నిజాయితీతో కూడిన పూర్తి వివరణను ఆశించాను.*

**- టి. హనుమాన్ చౌదరి**
*హైదరాబాద్*

# ఉద్యమాల ఊసెత్తొద్దు...

***చట్టబద్ధ పాలన, ప్రజాస్వామిక పాలన అంటూ ఉద్యమకాలంలో ప్రగల్భాలు పలికిన పార్టీ తీరా అధికారం చేపట్టాక ఆ విధానాలకు వ్యతిరేకంగా నియంతృత్వ పాలనను కొనసాగిస్తోందని అంటున్నారు* బైరెడ్డి సతీష్**

**2014** టిఆర్ఎస్ మ్యానిఫెస్టోలో 'చట్టబద్ధ పాలన - పౌరహక్కుల' పేజీ నెం.30, 31లలో ఇలా ఉంది. 'ప్రజాస్వామికమైన కార్యక్రమాలను ఎవరు చేపట్టినా వారికి ఎలాంటి అవరోధంలేని విధంగా, వారి హక్కులు కాపాడే విధంగా పరిపాలన ఉంటుంది'. 'ప్రజలు శాంతియుతంగా, అహింసా మార్గంలో ఉద్యమించే హక్కు అమలయ్యే వాతావరణం నిర్మిస్తుంది'. గడిచిన మూడేళ్ల కాలంలో తెలంగాణ ప్రజా జీవితపు అనుభవాలు పైన పూచీపడిన ప్రజాస్వామిక స్ఫూర్తికి భిన్నంగా ఉన్నాయి. తెలంగాణ రాష్ట్రంలో నిరుద్యోగులు నిరసన ర్యాలీ తీయడానికి వీలులేదు, ధర్నాచౌక్ దరి చేరవద్దు, ఇసుక మాఫియాల ఆగడాలను ప్రశ్నించకూడదు, బలవంతపు భూసేకరణపై పల్లెత్తు మాట అనకూడదు, నేరెళ్ల బాధితులపై థర్డ్‌డిగ్రీ టార్చర్‌ను వేలెత్తిచూపొద్దు, భూదందాలపై పరిశోధనాత్మక కథనాలు ప్రచురించవద్దు, అమరుల స్ఫూర్తి యాత్రలను అనుమతించ వద్దు, అంతా నా ఇష్టం అనే పోలీసు మార్కు పాలనే రాజ్యమేలుతుంది. ప్రశ్నించడం, విమర్శించడం పెద్ద నేరమైంది.

ఉద్యమ ఆకాంక్షలు నెరవేరేలా పాలన సాగాలని ఆశించడం మీద ప్రభుత్వాధినేతలు అసహనాన్ని వెళ్లగక్కుతున్నారు. సబ్బండ వర్ణాల సమిష్టి పోరాటాల ఫలమైన రాష్ట్రంలో భిన్నాభిప్రాయాలను అణచివేసే ఫ్యూడల్ పోకడలు దట్టంగా కమ్ముకున్నాయి. ఆగస్టు 2న రెండు గంటల పాటు తెలంగాణ ముఖ్యమంత్రి నిర్వహించిన మీడియా సమావేశంలో ప్రతిపక్షాలు, ప్రజాసంఘాలు, పత్రికలను లక్ష్యంగా చేసుకొని వ్యంగ్యంగా, వెటకారంగా బెదిరింపు ధోరణితో మాట్లాడారు. ప్రభుత్వం చేపట్టిన ప్రతి అభివృద్ధి కార్యక్రమాన్ని ప్రతిపక్షాలు, ప్రజా సంఘాలు అడ్డుకుంటు న్నాయని, వారు అభివృద్ధి నిరోధకులని తాము మాత్రమే అభివృద్ధి కాముకులమనేలా అసహన పూరితంగా మాట్లాడారు. పాతాలంలోకి పాతరేస్తామన్న పత్రికలను నెత్తినపెట్టుకొని ప్రశ్నించే, ప్రజలవైపు నిలిచే నిజమైన పత్రికలను దుర్భాషలాడుతూ తూలనాడడం జరిగింది.

ప్రగతిదాయకమైన, ప్రజా ప్రయోజకరమైన నిర్ణయాలను కోర్టుల్లో సవాల్‌చేసి నిలిపివేస్తున్నట్టు, ప్రభుత్వ చేతుల్ని కట్టిపడేస్తున్నారని తీవ్రంగానే విరుచుకుపడ్డారు. ప్రభుత్వం తీసుకునే ఏ నిర్ణయాన్నైనా తమ ప్రయోజనా లకు విఘాతం కలుగుతుందని భావించే సాధారణ పౌరులెవరైనా కోర్టు తలుపులు తట్టే హక్కును రాజ్యాంగమే కల్పించింది. అంటే అభివృద్ధిని అడ్డుకుంటున్నారనే మాటల వెనుక పౌరులకుండే రాజ్యాంగ హక్కును కాలరాసే యత్నమే కనిపిస్తుంది తప్ప గొప్ప అభివృద్ధి ఏదో ఆగిపోతుందనేది ఏమీలేదు. ప్రభుత్వం ఏదైనా వ్యక్తుల ఇష్టానుసారం కాకుండా రాజ్యాంగ పరిధికి లోబడి నిర్ణయాలు తీసుకోవాలనే సాధారణ ప్రజాస్వామిక సూత్రాన్ని ఉల్లంఘిస్తే ఎలా? పోనీ తీసుకున్న నిర్ణయాలు సరైనవే అయితే ఏ భయమూ ఉండాల్సిన అవసరమే లేదు కదా! చట్టపరీక్షకు నిలబడి నెగ్గితే మరింత ఉత్సాహంతో పనిచేసే వీలు ఎలాగూ ఉంటుంది. అయినా చట్టపరమైన చిక్కుముడులను అర్థం చేసుకోకుండానే ఎదురయ్యే న్యాయపరమైన సవాళ్లను సమర్థవంతంగా ఎదుర్కొనే కసరత్తు లేకుండానే రాజకీయ ప్రయోజనాల కోసం హడావుడిగా హామీలు, నిర్ణయాలు ప్రకటిస్తే పరిస్థితి ఇలాగే ఉంటుంది మరి.

అసాధ్యమైన హామీలిచ్చి, అవి రాజ్యాంగ పరిధిలో సాధ్యం కావని తెలిసినా వాటి విషయాల్లో కోర్టులు మా చేతుల్ని కట్టివేస్తున్నాయనే నెపాన్ని కోర్టులపైకి నెట్టి మీ చేతగానితనాన్ని దాచిపెడుతూ ప్రజల్ని మోసం చేస్తే ఎలా? కోర్టులు మీ నిర్ణయాల్ని కొట్టివేస్తే అవి రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా ఉన్నట్టే కదా! రాజ్యాంగానికి విరుద్ధమైనవి అభివృద్ధికరమైనవి ఎలా అవుతాయి? అభివృద్ధికరమైనవి రాజ్యాంగానికి విరుద్ధంగా ఎలా ఉంటాయి. మీరు చేయాల్సిన, అమలు పర్చాల్సిన అనేక ఇతర హామీలను కోర్టు కేసులే అడ్డుకుంటున్నాయా? దళితులకు మూడెకరాల భూమిని, కెజి టు పిజి ఉచిత విద్యను, డబుల్ బెడ్‌రూం ఇళ్ల హామీని, ఇస్తామన్న ఇంటికో ఉద్యోగాన్ని సవాల్ చేస్తూ ప్రజలు, ప్రతిపక్షాలు కోర్టుకెలుతున్నాయా? సమగ్ర ప్రాజెక్టు రిపోర్టులు లేకుండా, కేంద్ర పునరావాస చట్టాన్ని పక్కనబెట్టి నిర్వాసిత ప్రజలకు పూర్తి భరోసాను, భద్రతను ఇవ్వకుండానే నిర్బంధంగా భూమిని గుంజుకుంటే కోర్టులకు ఎందుకెల్లరుమరి? చట్టంపేరు చెప్పి ప్రజల్ని నియంత్రించేలా అధికారం చేలాయిస్తే తప్పులేదు కాని తమకు అన్యాయం జరుగుతుందని అదే చట్టాన్ని అనుసరించి కోర్టుల గడపదొక్కే హక్కులను ప్రజలు ఉపయోగించుకోవడం తప్పు ఎలా అవుతుంది?

జిఎస్‌టి ద్వారా రాష్ట్రానికి నష్టం జరుగుతుందని అవసరమైతే కోర్టును ఆశ్రయిస్తామని మీరు చెప్పినపుడు అదే పనిని పౌరులు చేస్తే అది అభివృద్ధి నిరోధకమెలా అవుతుంది? ఆ పౌరులకు ఏ రాజకీయ విశ్వాసాలు, పార్టీ అనుబంధ గుర్తింపు ఏదైనా ఉండొచ్చు. అంత మాత్రాన వారందరిని అభివృద్ధి నిరోధకులని, తెలంగాణ ద్రోహులని నిందిస్తే ఎలా? ద్రోహం చేసిన వారిని నెత్తినపెట్టుకొని పదవులిచ్చి ప్రజల మీద పెత్తనం చేయిస్తే తప్పులేదుగానీ ప్రజలు ప్రభుత్వ నిర్ణయాన్ని తప్పుపడితే, కోర్టుకెలితే అభివృద్ధి వ్యతిరేకులా? ఓ పత్రికను, పార్టీని సంబోధిస్తూ అదో పార్టీ, అదో పత్రికనా అని తన అహంకారపూరితమైన మనస్తత్వాన్ని బయట పెట్టుకున్నారు. పదవి, అధికారం శాశ్వతంగా ప్రజలు తనకేదో కట్టబెట్టినట్టు, చట్టబద్ధ పాలన కాకుండా తన ఇష్టానుసారం, ఓ ప్రైవేటు

సామ్రాజ్యాన్ని పాలించుకునేలా తీర్పునిచ్చినట్టు వ్యవహరించడం పూర్తిగా అప్రజాస్వామికం. విమర్శను సహించకపోతే నిరంకుశత్వమే మిగులుతుంది. అసలైన అభివృద్ధిని ఏ శక్తి అడ్డుకోజాలదు. అడ్డుకుంటే ఆగిపోయేది అభివృద్ధియే కాదు. అభివృద్ధి పేరుతో అన్ని పరిమితులను అతిక్రమించినా, అప్రజా స్వామికంగా వ్యవహరించినా అభ్యంతరం చెప్పే, ప్రశ్నించే హక్కు ఎప్పటికీ ఉంటుంది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం అత్యంత ప్రజాస్వామికమైనది. ఉద్యమం ఉధృతంగా నడుస్తున్న కాలంలో కూడా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలు ఏరోజూ ఉద్యమం అభివృద్ధిని అడ్డుకుంటుందని అనలేదు. ఉద్యమ కాలంలోనే టిఆర్ఎస్‌తో సహా సంఘాలు, పార్టీలు అనేక ప్రభుత్వ నిర్ణయాలను వ్యతిరేకిస్తూ న్యాయస్థానాలను ఆశ్రయించాయనే అంశాన్ని మరువరాదు. ప్రజల కదలికలను కట్టడి చేసినా, నిరసన తెలిపే హక్కును కాలరాసినా గొంతెత్తకుండా ఎలా ఉంటుంది ఏ సమాజమైనా? ఎన్నో చైతన్యవంతమైన సామాజిక, రాజకీయ ఉద్యమాలకు పురిటి గడ్డయిన తెలంగాణలో ప్రజల గొంతునొక్కే ప్రయత్నం ఇవ్వాళ తీవ్రంగా జరుగుతున్నది. జిల్లాల పునర్ వ్యవస్థీకరణ అంటే పాలన ప్రజలకు చేరువవడం, ప్రజల చింత తీర్చడం ఏమో గాని పోలీసు వ్యవస్థ మాత్రం బాగానే 'చేరు'వయింది. అది నేరెళ్లలో నిరూపితమయింది. నయీం గ్యాంగు సభ్యులు దొరకకపోవడం, భూ మాఫియా, ఇసుక మాఫియా దందా గల్లెగరేస్తూ వెయ్యి వాగులు, లక్ష లారీలన్నట్లు సాగిపోతుంది. ఇసుక మాఫియా దుర్మార్గాలను ప్రశ్నిస్తే మాత్రం అర్ధరాత్రి అరెస్టులు చేసి థర్డ్ డిగ్రీ టార్చర్‌కు గురిచేస్తున్నారు. నల్లుల్లా నలిపేస్తామని, భార్య పిల్లలపై వ్యభిచారం కేసు పెడుతామని, దేనికి పనికి రాకుండా చేస్తామని ఖాకీ బాసులు బహిరంగంగానే బెదిరిస్తున్నారు. తెలంగాణ వచ్చాక మొదటి ఫలం అనుభవించింది పోలీసు శాఖనే కదా! పాలకులకు అంత రుణం తీర్చుకోకుండా ఎలా ఉండగలరు!

దళితులు అని వారి మొఖాలమీద రాసి ఉందా, మొదలో బోర్డు ఉందా అని ముఖ్యమంత్రి గారు నిర్లక్ష్యపూరిత ధోరణితో ప్రశ్నిస్తున్నారు. ఎవరి మొహం మీద ఏదీ ఉండదు. అయితే థర్డ్ డిగ్రీ చిత్రహింసలు పెట్టవచ్చునా? ఇలాంటి ఘటనే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో జరిగి ఉంటే ఏం మాట్లాడేవారో మన ముఖ్యమంత్రి గారు? ప్రజల సమిష్టి సంపదైన సహజ వనరులన్నీ పాలక మాఫియా పరమవుతుంటే ప్రశ్నించడానికి వీలు లేదు. ప్రశ్నించిన వారిని హింసిస్తే పరామర్శించే పరిస్థితి కూడా ఉండడం లేదు. ఏదో ఒక మాఫియాలో భాగమైతే ప్రభుత్వం స్వాగతిస్తుంది, సంతోశపడుతుంది. నిరసనగళమో, ఉద్యమ బాటో పట్టి ప్రశ్నించావంటే నోరు నొక్కేస్తుంది, నిర్లజ్జగా థర్డ్ డిగ్రీ ప్రయోగిస్తుంది. బంగారు తెలంగాణ రూపుదిద్దు కోవడమంటే మాఫియా దందాలకు భద్రత కల్పించడమేనా? నిరసన హక్కును చిదిమేయడమేనా?

రాష్ట్ర సాధన ఉద్యమంలో తెలంగాణ జెఏసి పాత్ర ఎంతో గొప్పదని శ్లాఘించిన నోళ్లే ఇవాళ అదే ప్రజలకు చేరువగా వెళితే అది ఎట్లా అభివృద్ధి నిరోధక చర్య అవుతుంది? పాలన జనరంజకంగా ఉన్నప్పుడు జడుసుకోవడం దేనికి? హామీలను అమలు చేయాలని డిమాండ్ చేస్తుంటే ప్రజల హక్కులపై దాడి జరుగుతున్నది. సభ్యతా సంస్కారం గురించి మాట్లాడే ప్రభుత్వ పెద్దలు తమ దగ్గరికి వచ్చేసరికి అన్ని హద్దులు మరిచి అందరిపైనా అభ్యంతరకర భాషనే వాడుతుంటారు. ఎవరిని ఎప్పుడు పొగిడి ఆకాశానికి ఎత్తుతారో, ఎవరిని ఎప్పుడు తెగిడి నేలకేసి కొడుతారో తెలియని పరిస్థితి. పాతరేస్తామన్న పత్రికలు దారికొచ్చాయి. పరస్పర ప్రయోజనాలున్నాయి కాబట్టి మీడియా ప్రకటనల బడ్జెట్ 500 కోట్లు పెంచి కొన్నింటిపై అవ్యాజ ప్రేమను, మరికొన్నింటిపై అక్కసును వెళ్లగక్కుతున్నారు. తనకు అనుకూలంగా రాసేవే అసలైన పత్రికలని, ప్రశ్నించే పత్రికలన్ని పరికిరానివని ప్రెస్‌మీట్‌లో చెప్పకనే చెప్పారు ముఖ్యమంత్రి గారు. మా వైపు మాట్లాడితే అభివృద్ధిని ఆకాంక్షించేవాళ్లు, మమ్మల్ని ప్రశ్నిస్తే అభివృద్ధిని అడ్డుకునే నిరోధకులనే ధోరణి బాగా పెరిగిపోయింది. పౌరసమాజం మాట వినడం అటుంచితే చైతన్యవంతమైన, ప్రజల గొంతుకగా ఎటువంటి స్వప్రయోజనాలు లేకుండా నిజాయితీ, నిబద్ధతతో పనిచేసే శక్తులపైన సహితం బురదజల్లేలా ప్రభుత్వం వ్యవహరిస్తున్నది. ఎవరేమి మాట్లాడినా రాజకీయాలు చేస్తున్నారంటూ దబాయించడం వారి అభద్రతా భావాన్ని తెలుపుతుంది. ఒక శక్తివంతమైన సామూహిక సమూహాన్ని తను పోషిస్తున్న, తన ఆస్థానంలో పీటలమీద కూర్చోబెట్టిన 'మేధో'జీవుల చేత దుమ్మెత్తిపోయాలి. తెల్లారే ఆ సామాజికవర్గాన్ని సంతృప్తి పరిచేలా అట్టహాసంగా కార్యక్రమం నిర్వహించడమే కాకుండా అది ఆడంబరంగా జరుపుతున్నామని అనే అంశాన్ని కోట్ల రూపాయల ప్రజల సొమ్ముతో ప్రకటనలివ్వాలి. మాది మావోయిస్టు ఎజెండా అనే ముఖ్యమంత్రి మాట్లాడనివ్వని, సభలు, ర్యాలీలు పెట్టుకోనివ్వని నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నారు. ఉద్యమ కాలంలో ఏం చేసినా ఆమోదనీయమైనప్పుడు రాజ్యాంగ పరిధికి లోబడే స్వరాష్ట్రంలో చేపట్టే ఏ కార్యక్రమాన్నైనా అడ్డుకోవడం ఎందుకు? హైదరాబాద్‌లో ఇందిరా పార్కు సమీపంలోని ధర్నాచౌక్‌ను పరిరక్షించేందుకు ఢిల్లీ జంతర్‌మంతర్‌లో ధర్నా చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. ధర్నా చౌక్ చేపట్టే ఆందోళ కార్యక్రమాలన్నింటికి ప్రభుత్వం తక్షణమే స్పందించి పరిష్కారాన్ని అందించడమేమోగాని అసలు ఆ ప్రాంతంలో ధర్నాలు చేయకూడదని అంటూ, ఎవరికంటా కనపడకుండా ఎక్కడో కన్నీళ్లు పెట్టుకోండనే ధోరణితో వ్యవహరిస్తున్నారు.

ప్రజాస్వామ్యంలో ప్రజలు అధికారాన్నిచ్చింది ప్రశ్నించే హక్కుల్ని కోల్పోవడం కోసం కాదు. ప్రత్యేక రాష్ట్రం సాధించాక ఉద్యమ ఆకాంక్షల్ని నెరవేర్చుకోవడానికి, అన్ని జీవనరంగాల్లో గుణాత్మకమైన మార్పును సాధించి ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపడాలనుకున్నారు. గతంలో తెలంగాణ సమాజం అనుభవించిన నిర్బంధకాండ నుండి విముక్తి పొందడం కూడా ఒక చారిత్రిక అవసరం. అది మచ్చుకైనా కనపడకపోగా పోలీసు యంత్రాంగాన్ని విచ్చలవిడిగా ప్రయోగించి ఒక భయానక వాతావరణం సృష్టిస్తున్నారు. ప్రజా ప్రయోజనకర విషయాల్లో ప్రదర్శించని ఉత్సాహం, చొరవను పాలకవర్గ అణచివేత విధానం అమలులో మాత్రం పోలీసు వ్యవస్థ రెట్టించిన ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నది. ఇలా వ్యవహరించడంలో కూడా పరస్పర ప్రయోజనాలు ఉన్నాయనుకోండి! ఉద్యమ పార్టీగా చెప్పుకునే వాళ్లు ప్రజల ఉద్యమ ఊసునే సహించలేని స్థితికి ఎందుకెళ్లినట్టు? అయినా అధికారం శాశ్వతంకాదు. అది కోల్పోయినరోజు మీరు కూడా రోడ్డెక్కాల్సిన పరిస్థితి వస్తుందనే విషయాన్ని మరువరాదు.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# నంద్యాల శాసనసభ ఉపఎన్నిక

***నంద్యాల ఉప ఎన్నికలో అధికార, ప్రతిపక్ష పార్టీలు గెలుపే లక్ష్యంగా పెద్దఎత్తున డబ్బు, మద్యంతో కుటిల రాజకీయాలకు పాల్పడుతూ, ప్రజలను మభ్యపెట్టాలని చూస్తున్నాయని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

నంద్యాల శాసనసభ్యుడు భూమా నాగిరెడ్డి మరణంతో ఖాళీ అయిన స్థానానికి జరుగుతున్న ఉపఎన్నికలో అధికార – ప్రతిపక్ష పార్టీల అభ్యర్థుల ప్రచార ఖర్చు, మాటల యుద్ధం, అనవసర భయాందోళనలను ప్రచారం చేస్తున్నారు. అన్ని ఎన్నికల కమిషన్ నియమ నిబంధనావళి, భారత రాజ్యాంగ మౌలిక సాంప్రదాయాలను, ప్రమాణాలను తృణీకరిస్తూ జరుగుతున్నవే. దీనిపై ఒక సామాన్య పౌరుని దృష్టికోణం నుంచి ఆలోచిద్దాం, పరిశీలిద్దాం.

నంద్యాల స్థానానికి తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా మరణించిన భూమా నాగిరెడ్డి సోదరుని కుమారుడు భూమా బ్రహ్మానందరెడ్డి, ప్రతిపక్ష వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా శిల్పా మోహన్‌రెడ్డి బరిలో ఉన్నారు. అయితే 2014 ఎన్నికలలో భూమా నాగిరెడ్డి వైకాపా అభ్యర్థిగా పోటీచేసి గెలుపొంది, ఆ తర్వాత అధికారపార్టీలో చేరారు. అప్పుడు శిల్పామోహన్ రెడ్డి తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా రంగంలోకి దిగి, భూమా నాగిరెడ్డి చేతిలో అతి స్వల్ప మెజారిటీతో ఓడిపోయారు. 2017లో జరుగుతున్న ఈ ఉప ఎన్నిక రెండు పార్టీల మధ్య పోటీ అనేకన్నా రెండు కుటుంబాల మధ్య పోటీగా అని చెప్పుకోవచ్చు. అయినప్పటికీ 2017 ఆగస్టు 9న ఉపసంహరణ తేదీ ముగిసేసరికి మొత్తం 15 మంది అభ్యర్థులు రంగంలో ఉన్నారు. వీరిలో జాతీయ పార్టీ అయిన కాంగ్రెస్, సోషల్ డెమొక్రటిక్ పార్టీ ఆఫ్ ఇండియా (ఎస్‌డిపిఐ), రాయలసీమ పరిరక్షణ సమితి (ఆర్‌పిఎస్), కొద్దో గొప్పో ప్రజలలో ప్రచారంలో ఉన్నవి. ఇందులో కుల, మత సమీకరణలు, ప్రాంత సమీకరణలు (ప్రతిపక్ష పార్టీ అభ్యర్థిది స్వంత జిల్లా కడప జిల్లా పెద్ద ముడియం మండలం కొండసుంకేసుల గ్రామం అధికారపార్టీ అభ్యర్థిది కర్నూలు జిల్లా ఇది కోవెలకుంట్లకు దగ్గరలోని గ్రామం) ఉన్నాయి. ఇది ఎన్నికల నియమ నిబంధనావళికీ, రాజ్యాంగ స్ఫూర్తికీ విరుద్ధం. మొత్తం మీద ఈ శాసన సభ నియోజకవర్గ పరిధిలోని ఓటర్ల సంఖ్య 2,19,108 మంది ఉన్నారు. అందులో పురుషులు 1,07,778, స్త్రీలు 1,10,018, ఇతరులు 62 మంది ఉన్నారు.

అధికార పార్టీ అయిన తెలుగుదేశం పార్టీ ఇంత వరకూ మూడు సంవత్సరాలలో చేసిన అభివృద్ధి, రోడ్ల వెడల్పు, 13 వేల గృహాల నిర్మాణం, కాపుల కళ్యాణ మండపం, ముస్లిం వర్గానికి ఒక జూనియర్ కళాశాల, తదితర పనులను ప్రచారం చేస్తూ ఓట్లను అడుగుతోంది. కానీ వైకాపా మాత్రం ఈ మూడు సంవత్సరాలు నంద్యాలను ఏమీ పట్టించుకోకుండా, ఉప ఎన్నికలు వచ్చాయి కాబట్టి అభివృద్ధి పనులు చేస్తున్నారని, అందులో కూడా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని పోటీ పెట్టిందని, తెలుగుదేశం పార్టీ అభివృద్ధి మంత్రాన్ని జపిస్తోందని ప్రచారం చేస్తున్నారు. అంతే కాకుండా ఇటీవల తెలుగుదేశం పార్టీ నుంచి స్థానిక సంస్థల ప్రతినిధిగా గెలిచిన ఎంఎల్‌సి శిల్పా చక్రపాణిరెడ్డిని వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో చేర్చుకునే సమయంలో రాజీనామ కోరాం, కాబట్టి మీ పార్టీలో చేరిన 21 మంది తమ (వైకాపా) ఎంఎల్ఎలతో రాజీనామా చేయించాలని వైకాపా కోరుతున్నది. అంతే కాకుండా ఈ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీకి బుద్ధి చెప్పి, నంద్యాల అసెంబ్లీ సీటును గెలుచుకొని తద్వారా ఇటీవల టిడిపిలో చేరిన తమ పార్టీకి చెందిన 21 మంది ఎంఎల్ఎలను రాజీనామా ఆమోదించుకొని మళ్లీ ఎన్నికలలో వారిని ఓడించాలని ఒక వ్యూహంగా ఉన్నది. అందుకే ఈ ఉప ఎన్నికలలో దాదాపు ఇరు పార్టీలు కోట్ల రూపాయలలో ఖర్చు పెడుతున్నవి. ఇది పూర్తిగా ఎన్నికల నియమ నిబంధనావళికి విరుద్ధం. వాస్తవానికి అభ్యర్థి ఎన్నికల ఖర్చు, నామినేషన్ వేసిన రోజు నుంచి, ఎన్నికలు (పోలింగ్) ముగిసే వరకూ ఖర్చు 28 లక్షలు మించరాదు. కానీ నేడు ఈ పరిస్థితి లేదు. నామినేషన్‌కు రాక పూర్వమే ఒకే రోజు ఈ మొత్తం ఖర్చు పెట్టే పరిస్థితి నెలకొన్నది. ఇది విచారకరం. ఎన్నికలు – మొత్తంగా ప్రజలను డబ్బు ద్వారా లేదా మద్యం, చీరలు, ఇతర గిఫ్ట్‌ల ద్వారా ఓట్లను కొనుగోలు చేసే పరిస్థితికి వచ్చినవి. ఇది అప్రజాస్వామికం, విచారకరం, ఆందోళనకరం.

భారత రాజ్యాంగం కల్పించిన (18 సంవత్సరాలు నిండిన) ప్రతి ఒక్కరికి 'ఓటు హక్కు' ఈ విధంగా ఒక మార్కెట్ సరుకుగా మారిపోయింది. ఇప్పుడు ఉద్యోగాలు ఇస్తూ కొద్దో, గొప్పో ధనార్జన కలిగినవారు కూడా డబ్బులు తీసుకుని ఓటు వేయడానికి వెనుకాడడం లేదు. సిగ్గుపడడం లేదు. బాధపడడం లేదు. తద్వారా పాలకులను ప్రశ్నించే నైతిక హక్కును పౌరులు కోల్పోతున్నారు. భవిష్యత్తులో కూడా ఏ రకమైన అవినీతికి పాల్పడడానికి, గెలిచిన వారికి అడ్డు – అదుపు లేకుండా పోయింది.

ఈ విధంగా పాలకులు – ప్రశ్నించే ప్రజలను, అన్యాయాన్ని ఎలుగెత్తి చాటే వారిని, అభివృద్ధి నిరోధకులుగా చిత్రించే పరిస్థితి నెలకొంది. ఏ రాష్ట్రంలోనైనా అధికారంలో ఉండే పార్టీలో ఉన్నవారు ఎవరైనా వారే అభివృద్ధి కాముకులు, మిగతా వారంతా అభివృద్ధి నిరోధకులుగా ప్రచారం చేస్తున్నారు. దళితులను సాంఘిక బహిష్కరణ చేసిన సమస్యపై పోరాడే సంఘీభావ సంఘాలను 'ప్రభుత్వం' అణిచివేయాలని చూస్తున్నది. ఇది ఎస్‌సి/ఎస్‌టి చట్టాన్ని, రాజ్యాంగ హక్కులను కాలరాసినట్టే. 2014 ఆగస్టు 15న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కర్నూలులో ఇచ్చిన స్వాతంత్ర దినోత్సవ హామీలు ఇంత వరకూ నెరవేరలేదు. ఆయన ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తర్వాత కేవలం రెండు నెలలకే జరిగిన స్వాతంత్ర దినోత్సవ హామీలను మూడు సంవత్సరాలు గడిచినప్పటికీ ఇంత వరకూ అమలుకు నోచుకోలేదంటే; 2017 ఆగస్టు 15 హామీలు ఎంత మాత్రం ఉంటాయో అర్థం చేసుకోవచ్చు. దీనిని ప్రధాన ప్రతిపక్ష పార్టీ అయిన వైఎస్ఆర్ కాంగ్రెస్ ఈ ఉప ఎన్నికలలో ఒక ఎజెండాగా చెబుతున్నప్పటికీ ఆ పార్టీ 'విశ్వసనీయత' నిన్నటి రాష్ట్రపతి ఎన్నికలలో 'భారతీయ జనతా పార్టీ' అభ్యర్థి, తన అభ్యర్థిత్వాన్ని ప్రకటించక మునుపే మద్దతు ప్రకటించడం జగన్మోహన్ రెడ్డిపై ఉన్న కేసులను తీసివేయించుకోవడానికే ననేది స్పష్టమవుతున్నది. దీనిని కూడా

# యోగి నిర్లక్ష్య పాలనలో చిన్నారుల మరణాలు

***ప్రజల అత్యవసర ఆరోగ్య సేవలకు అవసరమయ్యే ఆక్సిజన్ అందించకుండా చిన్నారుల మరణాలకు కారణమైన ఆదిత్యనాథ్ ప్రభుత్వం ఆవుల కోసం అంబులెన్స్‌లను అందుబాటులో ఉంచడానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నదని అంటున్నారు*** **అరణ్య**

దేశంలోనే అతిగొప్ప ముఖ్యమంత్రి అని బిజెపి, నరేంద్రమోడీ, ఆర్ఎస్ఎస్ గొప్పలు చెప్పుకునే యోగి ఆదిత్యనాథ్ ముఖ్యమంత్రిగా ఉన్న ఉత్తరప్రదేశ్‌లో ఎంత అధ్వాన్న స్థితిలో పరిపాలన కొనసాగుతున్నదో అతని సొంత నియోజకవర్గమైన గోరఖ్‌పూర్‌లో జరిగిన 72 మంది పసిపిల్లల మరణాల సంఘటన తేటతెల్లం చేసింది.

ఆదిత్యనాథ్ ముఖ్యమంత్రి అయిన నాటి నుంచి పౌరహక్కుల ఉల్లంఘనలు అనేకం పెరిగాయని, కిడ్నాప్‌లు, మిస్సింగ్‌లు పెద్దఎత్తున పెరిగాయని, ముఖ్యమంత్రి, బిజెపిల అండ చూసుకుని హిందూ మతోన్మాద మాఫియా పేట్రేగిపోయి గోవుల సంరక్షణ పేరుతోనో, సంస్కృతి పరిరక్షణ పేరుతోనో అనేక మందిని హత్యలు చేస్తున్నారని, ఇవేవీ రికార్డులకెక్కని హత్యలని హక్కుల సంఘాలు, వామపక్ష మేధావులు గొంతు చించుకుంటున్నా ఎవరూ పట్టించుకోలేదు. చివరకు మీడియా కూడా ఈ విషయాలను రెడ్ వర్సెస్ ఆరెంజ్ గానే చూశాయి గానీ, వాస్తవాలను చూపించాలను కోలేదు. అయితే ఈ క్రమంలోనే గోరఖ్‌పూర్ పసిపిల్లల మరణాలు సంభవించాయి. దాంతో మీడియాతో పాటు మధ్యతరగతి ప్రజానీకానికి కూడా యోగి నిర్లక్ష్య పరిపాలన గురించి తెలిసిపోయింది.

ఉత్తరప్రదేశ్ భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా అక్కడ ప్రతి ఏటా వర్షా కాలంలో మెదడు వ్యాధి (ఇన్‌సిఫలిటిస్) ప్రబలుతుంది. పిల్లలు, పెద్దలు అంతా ఆ వ్యాధి భారిన పడుతుంటారు. దశాబ్దాలుగా అక్కడ ఇదే పరిస్థితి. వందలాది మంది చిన్నారులు మృత్యువాత పడుతుంటారు. అట్లా గోరఖ్‌పూర్ మెదడువాపు మరణాలకు పెట్టింది పేరుగా ఉంటూ వస్తున్నది.

జపనీస్ ఇన్‌సిఫలిటిస్ రకానికి చెందిన మెదడువాపు వ్యాధి తూర్పు ఉత్తరప్రదేశ్‌లో ఎక్కువగా వచ్చే ఈ రకం మెదడువాపు సంభవించిన వారిలో జ్వరం, తలనొప్పి, వాంతులు, చికాకు, తలవాపు రావడం జరుగుతుంది. ఎంత జాగ్రత్తగా ఉన్నా వ్యాధిని రాకుండా ఆపడం, వచ్చాక మరణానికి దారితీయకుండా ఆపడం అటు వ్యాధి భారిన పడ్డవారికి, వైద్యులకు కష్టంగా ఉండే విషయం. ఇంత సున్నితమైన వ్యాధికి చికిత్స చేయాలంటే దానికి ఎన్నో పరిశోధనలు, అధ్యయనాలు

---

ప్రజలు ఆలోచిస్తున్నారు. దాదాపు 56 వేల ఓట్లు కలిగిన ముస్లిం ఓటర్లు ఈ ఎన్నికలలో గెలిచే అభ్యర్థిని నిర్ణయించబోతున్నారు. అంతే కాకుండా దాదాపు 60 వేల ఓట్లు ఉన్న దళితులు - క్రిష్టియన్లు కూడా ప్రభావితం చూపబోతున్నారు.

రెండు రాజకీయ పార్టీలు కూడా ఈ ఉప ఎన్నిక ఫలితాలను 2019 ఎన్నికలకు రెఫరెండంగా భావిస్తున్నాయి. ఈ ఉప ఎన్నికలో ఏ పార్టీ అధికారంలోకి వస్తే ఆ పార్టీ 2019లో అధికారంలోకి రావచ్చనే భావన కూడా నెలకొని ఉంది. ఇది విష పరిణామం. అందుకోసం అన్ని రకాల వ్యూహాలను, ఎత్తుగడలను అమలు చేస్తూ, ప్రజలను ఏదో ఒక విధంగా ఆ రొంపిలోనికి దించుతున్నారు. కేవలం 18 మాసాలు ఉండే ఈ పదవికోసం ఇన్ని కోట్ల రూపాయలు ఖర్చ చేయడం ఎంతవరకు సమంజసం? ఇది పూర్తిగా ప్రజలను మభ్యపెట్టడానికే తప్ప మరొకటి కాదు.

ఆంధ్రప్రదేశ్ పునర్విభజన చట్టం 2013 ప్రకారం కేంద్రం నుంచి రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలైన ఉత్తరాంధ్ర, రాయలసీమకు రావలసిన రాయితీలు, నిధులు పొందడంలో విఫలమైన రాష్ట్ర ప్రభుత్వం, ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు; బిజెపి - భాగస్వామ్య పక్షంగా కేంద్రంలో అధికారంలో ఉంటున్నప్పటికీ ఏమాత్రం సాధించలేకపోగా, బిజెపి ప్రభుత్వానికి దాసోహమవ్వడం, కేంద్ర - రాష్ట్ర సంబంధాలను, రాష్ట్రాల హక్కులను గౌరవించకపోవడం, కేంద్ర ప్రభుత్వ దురహంకార, నిరంకుశ వైఖరికి నిదర్శనం. ఈ ఎన్నికలలో ఆ అంశం కూడా తెరపైకి వచ్చింది. ఇది కూడా ఒక ముఖ్యమైన అంశంగా మారింది.

నంద్యాల ఉప ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని దాదాపు 1500 కోట్ల రూపాయల ఖర్చుతో కూడిన అభివృద్ధి పనులు పట్టణంలో జరుగుతున్నాయి. ఈ నిధులను ఈ సమయంలోనే ఎందుకు ఖర్చు చేస్తున్నారు? రాష్ట్రంలోని మిగతా 173 నియోజకవర్గాల పరిస్థితి ఏమిటనేది కూడా రాష్ట్ర ప్రజలు గమనిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ప్రత్యేక హోదా సాధించడానికి జూన్ నెలలో ఎంపిలతో రాజీనామా చేయిస్తానని చెప్పిన జగన్ కూడా మాట మార్చారు. మేము అధికారంలోకి వస్తే ప్రత్యేక హోదా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వెంటనే ఇచ్చేస్తామని కాంగ్రెస్ పార్టీ అంటున్నది. ఈ విధంగా వివిధ పార్టీలు తమ మాటల గారడీతో ప్రజలను మభ్యపెడుతున్నాయి. ప్రజలు కూడా - 'ఏ మాటల వెనుక ఏ వర్గ ప్రయోజనాలు దాగి ఉన్నాయో తెలుసుకోలేనంత కాలం, మళ్లీ మళ్లీ మోసపోతూనే ఉంటారు' అన్న లెనిన్ మహాశయుని సూక్తి గుర్తు చేసుకోవలసి ఉంది.

ఏది ఏమైనప్పటికీ, ఎన్నికల కమిషన్ స్వతంత్ర వ్యవస్థ అయినప్పటికీ ఎన్నికలలో జరుగుతున్న అక్రమాలు, అవినీతి, డబ్బు నియంత్రణ, మద్యం ప్రవాహంను అడ్డుకోలేకపోతున్నది. 'చట్టబద్ధ పాలన, పౌర హక్కుల పరిరక్షణ, చట్టం ముందు అందరూ సమానులే' అనే రాజ్యాంగ ప్రమాణాలు మాత్రం ప్రతి ఎన్నికలలో కూడా ఒక ప్రహసనంగా మారిపోతున్నాయి. దీనికై ప్రతి ఒక్కరూ తమ, తమ స్థాయిల్లో, ఏదో ఒక విధంగా ప్రతిస్పందించాలి, పోరాడాలి! ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం కృషి చేయాలి!

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

అవసరం. కానీ గడిచిన దశాబ్దాలలో ఆ దిశగా జరిగిన ప్రయత్నాలు చాలా తక్కువ. ఇక దానికితోడు ఈ వ్యాధి ఎక్కువగా దళితులకు, ముస్లింలకు, పేద వర్గాల వారికి, డబ్బులతో వైద్యాన్ని కొనలేని వర్గాలకు సోకుతుంది. ఎందుకంటే వీళ్లందరి ఇండ్ల పరిసరాలు పరిశుభ్రంగా, కాలుష్య రహితంగా ఉండవు కనుక. ఈ విషయాలను పట్టించుకోక పోవడమే కాక, ఎలాగూ ఇట్లాంటి ప్రజల ఆరోగ్యాలు, ప్రాణాల పట్ల సహజంగానే ప్రభుత్వాలకు శ్రద్ధా బాధ్యతలు ఉండవు కనుక ఏటా వందలాది మంది ఈ వ్యాధికి బలై ప్రాణాలు కోల్పోతున్నారు. 1978 నుంచి ఒక బాబారాఘవ్‌దాస్ ఆసుపత్రిలోనే సగటున ఏటా ఒక మంచానికి 200 మరణాలు సంభవిస్తున్నాయంటే ఎంత తీవ్రమైన పరిస్థితో ఆలోచించుకోవచ్చు.

గోరఖ్‌పూర్ జిల్లా కేంద్రంలోని బాబా రాఘవ్‌దాస్ ప్రభుత్వ ఆసుపత్రి మెడికల్ కళాశాల కూడా. అందులో నిరంతరం ప్రొఫెసర్లు, అసిస్టెంట్ ప్రొఫెసర్లు, రిసెర్చ్ స్కాలర్‌లు వివిధ వ్యాధుల పట్ల అధ్యయనం చేస్తుంటారు. పరిశోధిస్తుంటారు. ముఖ్యంగా మెదడువాపు మీద. ఎందుకంటే ఈ ప్రాంతంలో మెదడువాపు ఎక్కువగా ప్రబలే వ్యాధి అనేది ఒక కారణమైతే, మెదడువాపు కొసమే ఈ ఆసుపత్రిలో దాదాపు వంద పడకలు రిజర్వ్ చేయబడ్డాయి కనుక చుట్టపక్కల ప్రాంతాల, జిల్లాల ప్రజలు మెదడువాపు చికిత్స కోసం ఎక్కువగా వస్తుండడం వల్ల విభిన్న రకాల కేసులు దొరకడంతో అధ్యయనానికి, పరిశోధనకు అవకాశం ఎక్కువగా ఉంటుందనేది రెండో కారణం. అందుకే గోరఖ్‌పూర్ బిఆర్‌డి ఆసుపత్రి మెదడువాపు చికిత్సకు ఒక గుర్తుగా ఉత్తరప్రదేశ్‌లో నిలిచి పోయింది.

అయితే రాష్ట్రాన్ని పాలించిన ఏ ప్రభుత్వం గానీ, ఏ కేంద్ర ప్రభుత్వం గానీ ఇప్పటి వరకూ ఆ పరిశోధనలకు సరిపోయే బడ్జెట్‌ను గానీ, పరికరాలను గానీ, మానవ వనరులను గానీ సమకూర్చలేదు. కేవలం అక్కడి ప్రొఫెసర్లు మెడికోలు స్కాలర్‌ల స్వంత ఆసక్తితో, సామాజిక నిబద్ధతలతోనే ఆమాత్రం పరిశోధనలైనా ముందుకు సాగాయి. ఇవాళ విమర్శలు గుప్పిస్తున్న ఏ రాజకీయ పార్టీ ఈ చేదు నిజాన్ని అంగీకరించక పోవచ్చు. తన రక్షణ కోసం ఇప్పుడు 'నేను పార్లమెంట్‌లో భీకరంగా మాట్లాడాను' అని పదేపదే చెపుతున్న యోగి ఆదిత్యనాథ్, ఆయన వెనకనున్న బిజెపి కూడా ఒప్పుకోవు. 1998 నుంచి నిన్నటిదాకా ఇరవై ఏళ్లు పార్లమెంట్ సభ్యునిగా ఉన్న ఆదిత్యనాథ్ సమాజ్‌వాది పార్టీ ఉత్తరప్రదేశ్‌లో అధికారంలో ఉన్నప్పుడు ఆ పార్టీని బజారున పడేయడానికి పార్లమెంట్‌లో ఈ అంశాన్ని ప్రస్తావించి మెదడువాపును అంటువ్యాధిగా గుర్తించాలని డిమాండ్ చేశాడు. కానీ ఆయనకున్న నిబద్ధతకు గీటురాయి అంటే కేవలం ఆసుపత్రిని తరచు సందర్శించడం వరకే. గతంలో ఎన్‌డిఏ పాలించిన సమయంలోనైనా ఇప్పుడైనా ఆయన ఈ వ్యాధి కోసం వాళ్ల ప్రభుత్వాలనే తీసుకున్నా బిఆర్‌డి ఆసుపత్రికి కేటాయింపజేసిన బడ్జెట్ చాలా తక్కువ. కనీసం తన ఎంపి నిధుల్లోంచి ఈ ఆసుపత్రి కోసం ఇచ్చిన మొత్తమూ తక్కువే. కానీ మెదడువాపు వ్యాధిని నేను చాలా అధ్యయనం చేశానని మాత్రం పదేపదే చెపుతున్నాడు. రాజకీయాలకు అందుకే మాటలు కావాలి, నటనలు కావాలి కానీ, ప్రాణాలు అక్కర్లేదు. ఇప్పుడు ఇది మరోసారి నిరూపణ అయిన వాస్తవం. సరిగ్గా పన్నెండేళ్ల కిందట యుపిఎ అధికారంలో ఉన్నప్పుడు ఇదే బిఆర్‌డి మెడికల్ కళాశాలలో 1500 మెదడువాపు మరణాలు నమోదైనప్పుడు, అందులో 90 శాతం మంది చిన్న పిల్లలే మరణించినప్పుడు ఆదిత్యనాథ్ అప్పుడు కూడా పార్లమెంట్ సభ్యుడు. కానీ ప్రతిపక్షంలో భాగంగా ఏవో నాలుగు విమర్శలు చేయడం తప్ప ప్రభుత్వం వెంటపడి మరణాలను తగ్గించడానికి చేసిన ప్రయత్నాలు మాత్రం ఏమీ లేవు. 2014 ఎన్నికల సమయంలో బిఆర్‌డి కళాశాలకు అరకిలోమీటర్ దూరంలో ఉన్న మన్‌బెలా ఎన్నికల ర్యాలీలో ఛాతి విరుచుకుని మరీ మెదడువాపు మరణాలను తప్పుపట్టిన మోడీ ఇప్పుడు ప్రధానిగా ఉన్నాడు. మాటకోసారి, పూటకోసారి మెదడువాపు నిర్మూలనే నా లక్ష్యం అని ప్రకటించుకునే ఆదిత్యనాథ్ ఇప్పుడు ఎంపిగా కాదు ఏకంగా ముఖ్యమంత్రిగా ఉన్నారు. కానీ ఈ రెండేళ్లలో జరిగిందేమిటి? గతంతో పోల్చితే కించిత్తు మార్పైనా ఉందా? బిఆర్‌డి ఘటన కవరేజ్‌లో మీడియాలో ఆ ఆసుపత్రిని చూపిస్తుంటే సిగ్గు పడాల్సి వచ్చింది. స్వచ్ఛ భారత్ అని రోజూ వందల కోట్ల మీడియా ప్రకటనలిచ్చే పాలకులు ఆ ఆసుపత్రిలోని స్వచ్ఛతను ఎట్లా గాలికి వదిలేశారో చూడాల్సి వచ్చింది. ఎటు చూసినా చెత్త. ఎక్కడ చూసినా నిలిచిపోయిన నీరు. వాటిమీద ఈగలు, పురుగులు. ఏ మూలలో చూసినా పశువులు. బురద గుంతలు. డ్రైనేజి నీళ్ల మురుగులు. నీళ్లు వదిలేసిన నల్లాలు. ఎంత స్వచ్ఛంగా భారత్‌ను నిర్మిస్తున్నారో ఈ ఆసుపత్రిని చూసి ప్రజలు బాగానే అర్థం చేసుకున్నారు. గోరఖ్‌పూర్ లాంటి ఒక ప్రముఖమైన ప్రదేశంలోని ఈ ఆసుపత్రి కంటే సాదాసీదా పిఎచ్‌సిలు బాగుంటాయనిపించింది. ముఖ్యమంత్రి సందర్శించి మూడు రోజులే అయిన ఒక ఆసుపత్రి, అందునా దేశ వ్యాప్తంగా ఒక పెద్ద సంఘటన జరిగిన ఆసుపత్రి పరిస్థితే ఇట్లా ఉంటే ఆ రాష్ట్రంలోని మిగిలిన ఆసుపత్రులు ఇంకెంత అధ్వాన్నంగా ఉంటాయి? వీటన్నింటికీ బాధ్యులుగా ఎవరిని అనాలి? అధికారంలోకి వచ్చి, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి ఐదు నెలలు అయింది కదా, ఈ కాలంలో పశు మాంసాన్ని నిషేధించినంత, ఆవు పేరెత్తితేనే హత్యలు చేయించినంత వేగంగా ఆదిత్యనాథ్ ఆసుపత్రుల పట్ల, వ్యాధుల పట్ల దృష్టి పెట్టలేదంటే అది ఎవరి తప్పు? ఆయనకు ఆవుల మీద ఉన్న శ్రద్ధ మనుషుల ప్రాణాల మీద లేదని ఎందుకు అనకూడదు?

బిఆర్‌డి మెడికల్ కళాశాలకు సగటున ఏడాదికి 2,500 నుండి 3,000 మెదడువాపు కేసులు వస్తాయి. అంటే బిఆర్‌డి ఆసుపత్రిలో 60 శాతం కేసులు మెదడువాపువే. అందుకే కేసుల పరిశోధనకు, చికిత్సకు, మందులకు, ఆక్సీజన్‌కు, మానవ వనరులకు, లేబరేటరీ నిర్వహణకు పెద్ద మొత్తంలో బడ్జెట్ అవసరమవుతుంది. సరైన బడ్జెట్ ఉంటేనే ఆ సంస్థ నిర్వహణ సాఫీగా సాగుతుంది. పైగా బస్తి, అజాంగర్, బీహార్, నేపాల్‌ల నుండి కూడా ఎక్కువ సంఖ్యలో కేసులు ఈ ఆసుపత్రికి వస్తాయి. కనుక నిర్వహణ భారం చాలా ఎక్కువ. కనుకనే నిజానికి 2016లోనే ఫిబ్రవరి 14న బిఆర్‌డి కళాశాల ప్రిన్సిపల్ మెడికల్ అండ్ హెల్త్ సర్వీసెస్ డైరెక్టర్ జనరల్‌కు ఒక లేఖ రాశాడు. అందులో మెదడువాపు కేసుల సత్వర చికిత్సకు 37.99 కోట్ల రూపాయలు విడుదల చేయమని రాశాడు. ఈ లేఖను ఆ డైరెక్టర్ జనరల్ నేషనల్ హెల్త్ మిషన్ డైరెక్టర్‌కు పంపుతూ వార్షిక కార్యాచరణ ప్రణాళికలో భాగంగా కేటాయించుకునే మొత్తంలో ఉత్తరప్రదేశ్‌కు సంబంధించి ఈ మొత్తాన్ని విడుదల చేయాలని రాశాడు. అప్పటికే బిజెపి కేంద్రంలో అధికారంలో ఉంది. కానీ మోడీ ప్రభుత్వం ఈ విషయాన్ని పట్టించుకోలేదు. ఉత్తరప్రదేశ్‌లో బిజెపి అప్పటికి అధికారంలో లేదు కనుక ఇవ్వలేదేమో అనుకున్నా ఆదిత్యనాథ్ వచ్చిన ఈ మూడు నెలల్లో కూడా ఇవ్వలేదు. అసలు ఈ విషయాన్నే అక్కడి, ఇక్కడి బిజెపిలు మర్చిపోయినట్లు కనబడుతున్నది. మెదడువాపుకు సంబంధించిన అతి ప్రధానమైన పనులను చేపట్టేందుకు, నవజాత శిశువులకు మెదడువాపు వ్యాధి

సోకకుండా జాగ్రత్తలు తీసుకునేందుకు గాను ప్రిన్సిపల్ కోరిన బడ్జెట్‌ను కేటాయించే బాధ్యతను తీసుకోని నాయకులు ఇవాళ బాధ్యతారాహిత్యానికి శిక్ష అంటూ ప్రిన్సిపల్‌ను సస్పెండ్ చేశారు.

ఇంకా లోతుల్లోకి వెళ్లి చూస్తే కేవలం బడ్జెట్ కాకుండా బిఆర్‌డి ఆసుపత్రికి బోలెడన్ని సమస్యలున్నాయి. ఎందరో పేషెంట్లకు మందులు పంపిణీ చేయలేని పరిస్థితి ఉంది. వాళ్లంతా బయట ఫార్మసీల నుండే మందులు కొనుగోలు చేస్తున్నారు. మందులు కొనేంత బడ్జెట్ ఆసుపత్రికి లేదు. ఆసుపత్రిలో వామర్స్ (పుట్టగానే వెచ్చదనాన్ని కల్పించే ఇంక్యులేటర్ లాంటి పరికరాలు) కొరత తీవ్రంగా ఉంది. వామర్స్ లేక ముగ్గురు, నలుగురు పిల్లలను ఒకే వామర్‌లో ఉంచుతున్నారు. ఒక పిల్లవాడి నుండి ఇన్‌ఫెక్షన్ మరొక పిల్లవాడికి సోకి చనిపోతే ఆసుపత్రి తప్పేమీ లేదంటూ తల్లిదండ్రులతో సంతకాలు చేయించుకుని వామర్‌ను కేటాయిస్తున్నారు. నెలకు దాదాపు 300 మంది పిల్లలు ఆసుపత్రిలో చేరుతుంటే ఆసుపత్రిలోని పిల్లల ఐసియులో 50 పడకలే ఉన్నాయి. ఈ వార్డును పెద్దగా చేయమని మెడికల్ కళాశాల వాళ్లు ప్రతిపాదనలు పంపారు. కానీ అందుకుగాను 149 మంది సిబ్బంది, 10 కోట్ల రూపాయల ఖర్చు అవసరమవుతుందని స్వయానా ఈ ఆదిత్యనాథ్ ప్రభుత్వమే ఇప్పటికీ ఆ ప్రతిపాదనను ఒప్పుకోలేదు.

మెడికల్ కళాశాల అత్యవసర నిర్వహణకు ఏడాదికి 7.5 కోట్ల రూపాయలు అవసరమవుతాయి. పరికరాల మరమత్తులు, మందులు, లేబరేటరి నిర్వహణ వంటి అనేక ఖర్చులకు ఈ మొత్తం అవసరమవుతుంది. కానీ అందులో సగభాగాన్ని కూడా కేటాయించడానికి ప్రభుత్వాలు ఆసక్తి చూపవు. అసలైతే ఏటా దాదాపు 20 కోట్ల రూపాయల బడ్జెట్ అవసరమవుతుంది. ఒక్క మెదడువాపును చూసే సిబ్బందే 400 మంది ఈ ఆసుపత్రిలో పనిచేస్తున్నారు. చిన్న పిల్లల వ్యాధులు చూసే శాఖలోని 11 మందికి 27 నెలల నుండి జీతాలు చెల్లించడం లేదు. ఈ కారణంతో ముగ్గురు డాక్టర్లు సంస్థను వదిలి వెళ్లిపోయారు. మిగిలిన సిబ్బందికి కూడా జూలై నాటికి నాలుగు నెలలుగా ప్రభుత్వం జీతాలు చెల్లించడం లేదు.

బిఆర్‌డి ఆసుపత్రి సమస్యల్లో మరో అతిముఖ్యమైనది ఆక్సిజన్ సరఫరా సమస్య. ఇప్పటి పసిపిల్లల మరణాలకు కారణమైన ఈ ఆక్సిజన్ సరఫరా సమస్య ఈనాటిది కాదు. మందులకు బడ్జెట్ కేటాయించినప్పుడే గంపగుత్తగా ఆక్సిజన్‌కు అయ్యే మొత్తాన్ని కూడా ప్రభుత్వం ఆసుపత్రి అకౌంట్‌లో వేస్తుంది. అడ్వాన్స్‌గానే ముందస్తుగా చెల్లించాల్సింది పోయి, ఆక్సిజన్ సరఫరా జరిగిన ఏడాదికి ఏడాది మొత్తాన్ని ఒకేసారి వేస్తుంది. దాంతో పేషెంట్ల సంఖ్య పెరిగినప్పుడు ఈ బడ్జెట్ సరిపోక ఆక్సిజన్ సరఫరా, కొనుగోలు వ్యవహారాలు సంక్షోభంలో పడుతూ వస్తున్నాయి. ఈ మధ్య కాలంలో ఈ సంక్షోభం నిరంతరంగా కొనసాగుతూ వస్తున్నది. ఇప్పటి సంక్షోభం కూడా ఇందులో భాగమే. ఆసుపత్రికి పుష్పసేల్స్ అనే కంపెని లిక్విడ్ ఆక్సిజన్‌ను సరఫరా చేసే కాంట్రాక్ట్‌ను చేపట్టింది. అయితే ఈ కంపెనీకి ఏ దశలోనూ ఖర్చు మొత్తాన్ని ప్రభుత్వం సవ్యంగా అందజేసిన దాఖలా లేదు. ఎప్పుడు చూసినా పెండింగ్ బిల్లులే ఉండేవి. అయినా సరే ఆ కంపెనీ వాళ్లు సరఫరా చేస్తూనే పోయారు. తలకు మించిన వ్యయం అయ్యే సరికి ఆగస్టు 1న ఆసుపత్రి యాజమాన్యానికి, బకాయిపడ్డ 63.65 లక్షల రూపాయలను చెల్లించవలసిందిగా సంస్థ లేఖ రాసింది. లేకుంటే ఆక్సిజన్ సరఫరా నిలిపివేస్తామని కూడా చెప్పింది. దాంతో మెడికల్ కాలేజీ ప్రిన్సిపల్ ఈ విషయాన్ని వివరిస్తూ సంబంధిత ఉన్నతాధికారికి లేఖ రాశారు. ఆ లేఖకు సమాధానం కోసం ఎదురు చూస్తున్నంతలోనే తమ లేఖకు స్పందన రాలేదనే కారణంతో పుష్పసేల్స్ సంస్థ వాళ్లు 3న ఆక్సిజన్ సరఫరా నిలిపివేశారు. ఈ క్రమంలో 5న ప్రభుత్వం నిధులు విడుదల చేసింది. ఆగస్టు 7న ఈ మొత్తం బిఆర్‌డి ఆసుపత్రి ఖాతాలో జమ అయింది. కానీ 11వ తేదీ వరకు ప్రిన్సిపల్ ఆ సంస్థకు డబ్బులు చెల్లించలేదు. ఇందుకు కారణాలేమిటో తెలియరాలేదు. అప్పటికి అంటే ఆగస్టు 7 నుంచి 11 వరకు 60 మంది చిన్నారులు ఆ ఆసుపత్రిలో మరణించగా, వారిలో 30 మంది ఆక్సిజన్ అందక మృతి చెందిన వాళ్లే.

ఆగస్టు 9న ముఖ్యమంత్రి పది పడకల ఐసియును, ఆరు పడకల క్రిటికల్ కేర్ యూనిట్‌ను ప్రారంభించడానికి ఆసుపత్రికి వచ్చాడు. పిల్లల వార్డును చూశాడు. ఆక్సిజన్ గురించి తనకెవరూ చెప్పలేదని ఇప్పుడు అంటున్నాడు గానీ, అప్పటికే ప్రారంభమై కొనసాగుతున్న పిల్లల మరణాల గురించి, వాటి కారణాల గురించి ఆదిత్యనాథ్ కూడా అధికారులను ప్రశ్నించలేదు. తర్వాత 11న 20.84 లక్షల రూపాయలు సంస్థకు చెల్లిస్తూ ఇంకో రెండు రోజుల్లో 30 లక్షలు చెల్లిస్తామని ప్రిన్సిపల్ చెప్పాడు. ఆసుపత్రిలో ఉన్న ఆక్సిజన్ నిల్వలు ఆగస్టు 10 నాటి వరకు సరిపోగా ఆ రాత్రి పరిస్థితి చేయిదాటి పోయింది. ఆక్సిజన్ నిల్వలు ఆనాటి సాయంత్రం వరకు సరిపోతాయని కొత్త సిలిండర్లు తెప్పించాలని స్టోరేజ్ ప్లాంట్ ఉద్యోగులు మెడికల్ ఆఫీసర్‌కు లేఖ రాశారు. ఆ రాత్రి రెండు గంటలకు చిన్న పిల్లల వైద్య విభాగం, మెదడువాపు వార్డు అధిపతి అయిన డాక్టర్ కఫీల్ అహ్మద్ ఆ పరిస్థితిని తెలుసుకుని తన స్నేహితుని నర్సింగ్ హోం నుంచి కొన్ని ఆక్సిజన్ సిలిండర్లను తెప్పించాడు. అవి అయిపోయే సమయానికి జూనియర్ డాక్టర్లకు తక్షణ శిక్షణ ఇచ్చి అంబు బ్యాగ్స్‌తో చేతితో నొక్కి శ్వాస అందించే ఏర్పాట్లు చేశాడు. మరోవైపు హడావిడిగా పరిగెడుతూ ఆక్సిజన్ అందించే అందరు సరఫరా దార్లకూ ఫోన్లు చేస్తూ పోయాడు. అట్లా మరో 12 సిలిండర్లను సంపాదించ గలిగాడు. ఈ లోగా ఒక ఆక్సిజన్ పంపిణీదారుతో మాట్లాడి తన సొంత ఖాతా నుంచి అతనికి పదివేల రూపాయలు అడ్వాన్స్‌గా ఇచ్చి సిలిండర్లు ఏర్పాటు చేయించాడు. అట్లా చాలా ప్రయత్నాలు చేసి వీలైనంతగా పరిస్థితి విషమించకుండా కాపాడగలిగాడు. కానీ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం పరిస్థితిని తటస్థీకరించేందుకు, ఏ చర్యలూ తీసుకోలేదనే విమర్శ రాకుండా ఉండడం కోసం, అన్నింటికంటే ముఖ్యంగా ఆదిత్యనాథ్‌కు విమర్శల నుంచి రక్షణ కల్పించేందుకు ప్రిన్సిపల్ రాజీవ్ మిశ్రాను, కష్టపడి పనిచేసిన కఫీల్ అహ్మద్‌ను సస్పెండ్ చేసింది. 'బిజెపి ప్రభుత్వం ఏర్పడితే ఈ దవాఖానలో అత్యుత్తమ వైద్య సేవలు అందుతాయి' అని ఎన్నికల ముందు వాగ్దానం చేసిన ఆదిత్యనాథ్ మొత్తానికి తన ప్రభుత్వం తప్పేమీ లేదన్నట్లుగా వ్యవహరించాడు.

ఏమైనా పిల్లలు చనిపోయారు. చనిపోతున్నారు. వ్యవస్థలు, ప్రభుత్వాలు, రాజకీయాలు, వాటిని నడిపే నాయకులు డబ్బు చుట్టూ తిరుగుతూ దిగజారిపోతూ డబ్బే లక్ష్యంగా మనుగడ సాగిస్తున్నంత కాలం ఇంకా ఇంకా చనిపోతూనే ఉంటారు. ఈ సందర్భం సమయంలో ఒకరు నాకొక ఫోన్ సందేశం పంపించారు. 'ఇంకా నయం. అరవై మంది చిన్నారులే చనిపోయారు. అదే అరవై ఆవులు చనిపోతే ఈ పాటికి దేశంలో ఎంత కల్లోలం చెలరేగేదో!' అని. అవును.. నిజమే! ఆవులకు అంబులెన్సును, ఐసియులను ఏర్పాటు చేసే పాలకులున్న చోట సహజంగానే వాళ్లకు మనుషుల, చిన్నారుల ప్రాణాలు విలువైనవిగా అనిపించవు. అందుకే వాళ్లు ఆవులను ప్రేమిస్తారు. పూజిస్తారు.. మనుషులను మాత్రం చంపుతారు. అదే వాళ్ల సహజ లక్షణం.. నిజస్వరూపం..

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

# అదానీ కోపం - ఇపిడబ్ల్యు సంపాదకుడి రాజీనామా

***ప్రపంచ ప్రసిద్ధ ప్రగతిశీల సామాజిక, ఆర్థిక, రాజకీయ వారపత్రిక ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ సంపాదకుడి రాజీనామా ఉదంతపు పూర్వాపరాలు వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

దాదాపు ఏడు దశాబ్దాలుగా సామాజిక శాస్త్రవేత్తల, ప్రగతిశీల బుద్ధిజీవుల, ఉద్యమ కార్యకర్తల విశేష ఆదరాభిమానాలను చూరగొంటూ ప్రపంచంలోనే అగ్రశ్రేణి పత్రికగా పేరుపొందిన ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (ఇపిడబ్ల్యు) గత నెల ఒక అవాంఛనీయమైన, విచారకరమైన వివాదంతో వార్తలకెక్కింది. అప్పటికి పన్నెండు సంవత్సరాలుగా పనిచేస్తున్న సంపాదకుడు సి రామమనోహర్ రెడ్డి పద్దెనిమిది నెలల కింద రాజీనామా చేశాక, ఆ స్థానంలో సంపాదకుడుగా వచ్చిన పరంజయ్ గుహ ఠాకూర్తా పదిహేను నెలలు కూడ కాకుండానే హఠాత్తుగా జూలై 18న రాజీనామా చేశారు. అదానీ గ్రూపు కంపెనీలకు రు. 500 కోట్ల ప్రయోజనం కలిగిస్తూ మోడీ ప్రభుత్వం తీసుకున్న ఒక నిర్ణయం గురించి ఇపిడబ్ల్యు వెబ్ సైట్ మీద అంతకు కొద్ది రోజుల ముందు వెలువడిన వ్యాసాన్ని కూడ ఆయన రాజీనామాతోపాటే తొలగించారు. తన రాజీనామాకూ, ఆ వ్యాసం తొలగింపుకూ ఇపిడబ్ల్యు యాజమాన్యం సమీక్షా ట్రస్ట్ తనతో వ్యవహరించిన పద్ధతే కారణమని ఠాకూర్తా ఆ తర్వాత అన్నారు. ఆయన వ్యాఖ్యలను ఖండిస్తూ సమీక్షా ట్రస్ట్ తరఫున ట్రస్టీలలో ఇద్దరు రొమిల్లా థాపర్, దీపాంకర్ గుప్తా ఇండియన్ ఎక్స్ ప్రెస్ లో ఒక లేఖ రాశారు. ఆ తర్వాత సమీక్షా ట్రస్ట్ జూలై 20న, ఆగస్ట్ 2న రెండు పత్రికా ప్రకటనలు విడుదల చేసి తన కథనాన్ని ప్రకటించింది. పూర్వ సంపాదకులు రామమనోహర్ రెడ్డితో సహా ఎంతో మంది విశ్లేషకులు ఈ వివాదం మీద తమ అభిప్రాయాలు ప్రకటించారు. ఇపిడబ్ల్యు పాఠకులు, రచయితలు, అభిమానులు ఇటువంటి అరుదైన సంస్థ ధ్వంసమై, అంతరించి పోకుండా కాపాడాలని విజ్ఞప్తి ప్రకటనలు విడుదల చేశారు.

ఇపిడబ్ల్యు వంటి ప్రతిష్ఠాత్మకమైన పత్రిక గురించి ఇటువంటి వివాదం రావడం, అందులోనూ దీపక్ నయ్యర్ అధ్యక్షుడిగా, రొమిల్లా థాపర్, దీపాంకర్ గుప్తా, ఆంద్రె బెటిల్ వంటి ఉదార ప్రజాస్వామిక వాదులు సభ్యులుగా ఉన్న సమీక్షా ట్రస్ట్ అదానీ గ్రూప్ బెదిరింపులకు భయపడి, వ్యాసాన్ని తక్షణమే తొలగించాలని పట్టు పట్టిందన్న అనుమానాలు తలెత్తడం, అంబానీలు, ఎస్సార్ గ్రూప్ తో సహా ఎన్నో కార్పొరేట్ సంస్థల అక్రమాలను బైటపెట్టి పరిశోధనాత్మక జర్నలిజంలో సుప్రసిద్ధుడైన ఠాకూర్తా ఇటువంటి పరిస్థితిలో రాజీనామా చేయవలసి రావడం, సమీక్షా ట్రస్ట్ రెండు పత్రికా ప్రకటనలు విడుదల చేసినప్పటికీ ప్రధానమైన అదానీ వ్యాసం తొలగింపు విషయాన్ని ప్రస్తావించకపోవడం నిజంగా విచారకరమైన అంశాలు. అయితే ఇవి కేవలం ఇపిడబ్ల్యు అనే ఒకానొక పత్రికకు సంబంధించిన విషయాలు మాత్రమే కాదు. ఈ అంశాలు దేశంలో భావ ప్రకటనా స్వేచ్ఛ మీద జరుగుతున్న దాడికి, భిన్నాభిప్రాయాల పట్ల పెరుగుతున్న అసహనానికి, అప్రజాస్వామిక వ్యవహారశైలికి, కార్పొరేట్-ప్రభుత్వ మిలాఖత్తు సాగిస్తున్న దాష్టీకానికి, స్థిరంగా, ధైర్యంగా నిలబడలేని ప్రగతిశీల శిబిరం అశక్తతకు సూచికలుగా ఉన్నాయి. అందువల్ల ఈ ఉదంతం పూర్వాపరాలను వివరంగానే పరిశీలించవలసి ఉంది.

రిలయన్స్, ఎస్సార్ వంటి కార్పొరేట్ సంస్థల అక్రమాలను, ఆ కార్పొరేట్లకూ ప్రభుత్వాలకూ మధ్య ఉన్న మిలాఖత్తును బైటపెట్టి పరిశోధనాత్మక జర్నలిస్టుగా సుప్రసిద్ధుడైన పరంజయ్ గుహ ఠాకూర్తా ఇపిడబ్ల్యుకు సంపాదకుడిగా 2016 జనవరిలో చేరారు, ఏప్రిల్ నుంచి పని ప్రారంభించారు. అలా ఇపిడబ్ల్యుకు అప్పటిదాకా అర్థశాస్త్రవేత్తలు సంపాదకులుగా ఉండే సంప్రదాయం మారి, మొదటిసారి పూర్తిగా జర్నలిజం నేపథ్యం నుంచి, అది కూడ పరిశోధనాత్మక వార్తావ్యాసాలు రాసే నేపథ్యం నుంచి వచ్చిన సంపాదకుడు వచ్చినట్టయింది. అంతకు కొద్ది ముందే ఆయనగ్యాస్ వార్స్-క్రోనీ కాపిటలిజం అండ్ ది అంబానీస్ అనే దాదాపు 600 పేజీల, విస్తృతమైన పరిశోధనతో ఒక పుస్తకం వెలువరించారు. ఆ పుస్తకానికి ప్రచురణకర్తలు దొరకకుండా, రచయితే సొంతంగా అచ్చువేసుకుంటే దాని ఆవిష్కరణ జరగకుండా, పెద్ద పత్రికలలో సమీక్షలు రాకుండా అంబానీలు అడుగడుగునా అడ్డు తగిలారు. ప్రధానంగా ఆయన ఎప్పటికప్పుడు కార్పొరేట్ల, ప్రభుత్వాల అక్రమాలను బైటపెట్టాలని తపనపడే పరిశోధనాత్మక జర్నలిస్టు. అందువల్లనే ఆయన సంపాదకుడిగా ఉన్న 15 నెలల్లో కూడ ఇపిడబ్ల్యులో ఆయన సొంతంగా రాసినవీ, ఇతరులతో కలిసి రాసినవీ ఇరవై వ్యాసాలు వచ్చాయి. ఇతరుల రచనలను చదివి ప్రచురణార్హం అవునో కాదో నిర్ణయించే, దిద్దే అధికారం ఉన్న సంపాదకుడే వ్యాస రచయిత అయినప్పుడు, ఆ వ్యాసాలు మరెవరి పరిశీలన లేకుండా అచ్చు కావడం చూసి సమీక్షా ట్రస్ట్ ట్రస్టీలు ఇబ్బందిపడడం మొదలుపెట్టారు. అలాగే సంపాదకుడికీ ట్రస్ట్ కూ ఎటువంటి సంబంధాలు ఉండాలనే విషయం కూడ అప్పటికి నిర్దిష్ట మార్గదర్శక సూత్రాలేమీ లేకపోవడం వల్ల ఈ దూరం పెరుగుతూ వచ్చింది. ఒక్క మేనేజింగ్ ట్రస్టీ తప్ప మిగిలిన ట్రస్టీలెవ్వరూ ఎన్నడూ ఇపిడబ్ల్యు కార్యాలయానికి రాలేదని, అక్కడ వ్యవహారాలు ఎలా సాగుతున్నాయో చూడలేదని కూడ ఆరోపణలున్నాయి. సమీక్షా ట్రస్ట్ కు అర్థశాస్త్రవేత్త ప్రొ. దీపక్ నయ్యర్ అధ్యక్షుడు, డి ఎన్ ఘోష్ మేనేజింగ్ ట్రస్టీ, సమాజ శాస్త్రవేత్త ప్రొ. ఆంద్రీ బెటిల్, వ్యాపారవేత్త దీపక్ పరేఖ్, చరిత్రకారిణి ప్రొ. రొమిలా థాపర్, సమాజ శాస్త్రవేత్త

ప్రొ. దీపాంకర్ గుప్తా, రాజనీతి శాస్త్రవేత్త ప్రొ. రాజీవ్ భార్గవ, అంబేద్కర్ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ ప్రొ. శ్యామ్ మీనన్ ట్రస్టీలు.

ట్రస్ట్ కూ సంపాదకుడికీ మధ్య ఇలా దూరం పెరుగుతుండగానే, పరంజయ్ గుహ ఠాకూర్తా, శింజనీ జైన్, అద్వైత్ రావు పాలెపు రాసిన –అదానీ గ్రూప్ వెయ్యి కోట్ల రూపాయల పన్ను ఎగగొట్టిందా? అనే సుదీర్ఘ వ్యాసం ఇపిడబ్ల్యు 2017 జనవరి 14 సంచికలో వెలువడింది. ఈ వ్యాసం అదానీ గ్రూప్‌కు కోపం తెప్పించిందనడానికి ఆధారాలున్నాయి. ఆ తర్వాత జూన్ 19న ఇపిడబ్ల్యు వెబ్ ఎడిషన్ మీద ప్రత్యేక వ్యాసంగా – అదానీ గ్రూప్‌కు మోడీ ప్రభుత్వపు రు. 500 కోట్ల కానుక్క అనే వ్యాసం వెలువడింది. ఈ వ్యాసం పరంజయ్ గుహ ఠాకూర్తా తో పాటు, అద్వైత్ రావు పాలెపు, శింజనీ జైన్, అబీర్ దాస్ గుప్తా అనే ముగ్గురు సహరచయితల పేర్ల మీద వెలువడింది. ఈ వ్యాసం మీద తమ అభ్యంతరం ప్రకటిస్తూ అదానీ గ్రూప్ తరఫున న్యాయవాది సంజీవ్ థాకర్ ఇపిడబ్ల్యుకు ఒక నోటీస్ పంపారు. న్యాయశాస్త్ర పరిభాషలో దీన్ని లాయర్స్ నోటీస్, లీగల్ నోటీస్ అంటారు. ఇటీవలి కాలంలో స్ట్రాటెజిక్ లా సూట్ అగెనెస్ట్ పబ్లిక్ పార్టిసిపేషన్ (ఎస్‌ఎల్‌ఎపిపి–స్లాప్) గా ఇది ప్రాచుర్యంలోకి వచ్చింది. ఇది పరువు నష్టం కేసు కాదు. అటువంటి కేసు వేస్తే, ప్రాత్రికేయులు ఆధారాలు చూపుతారని, తమ గెలుపు సాధ్యం కాదని కార్పొరేట్ సంస్థలకు తెలుసు. కాని, తమ మీద రాసే పత్రికా రచయితలను, తమకు వ్యతిరేకంగా మాట్లాడే ఉద్యమకారులను బెదిరించడానికి, వారి నోరు మూయించడానికి స్లాప్ ఒక సాధనం. అంటే అది భావప్రకటనా స్వేచ్ఛ మీద దెబ్బ. దానికది కేసు కాదు, తదనంతర పరిణామాలు తమకు అనుకూలంగా లేకపోతే, అంటే ప్రత్యర్థులు లొంగిపోకపోతే పరువు నష్టం కేసు పెడతామని చేసే బెదిరింపు మాత్రమే. ఆ బెదిరింపుతోనే చాలమంది పత్రికా రచయితలు, యాజమాన్యాలు భయపడి ఆగిపోతాయని కార్పొరేట్ల అభిప్రాయం. కాని అదానీల లాయర్స్ నోటీస్‌కు జవాబుగా ఇపిడబ్ల్యు సంపాదకుడు తమ వ్యాసంలో ప్రతి అక్షరానికీ తాము కట్టుబడి ఉన్నామని చెపుతూ, తమ తరఫున చంద్రచూడ్ భట్టాచార్య అనే న్యాయవాదితో జవాబు రాయించి, అదానీల లాయర్ నోటీస్ నూ ఇపిడబ్ల్యు జవాబునూ కూడ ఇపిడబ్ల్యు వెబ్‌సైట్ మీద ప్రచురించారు.

ఆ వెంటనే సమీక్షా ట్రస్ట్ ఢిల్లీలో సమావేశం ఏర్పాటు చేసి సంపాదకుడిని పిలిపించింది. ఇపిడబ్ల్యు స్వర్ణోత్సవ డాక్యుమెంటరీ విషయాలు చర్చించడానికి పిలుస్తున్నారని ఠాకూర్తా అనుకున్నారట. కాని సమావేశం ప్రారంభం నుంచే ట్రస్ట్ సభ్యులు సంపాదకుడి మీద ఆగ్రహం ప్రదర్శించారట. సమీక్షా ట్రస్ట్ మీద, సంపాదకుడి మీద, రచయితల మీద వచ్చిన కేసుకు సంపాదకుడు ఒక్కరే ఒక న్యాయవాదిని పెట్టుకుని జవాబు ఎలా రాస్తారని ట్రస్టీలు ప్రశ్నించారట. ఇది అనుచిత చర్య అని, సంపాదకుడి మీద ట్రస్ట్ ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయడమని ట్రస్టీలు అన్నారట. తమకు సమాచారం లేకుండా, తమ అనుమతి లేకుండా తమ తరఫున న్యాయవాది ప్రకటన ఎలా వెలువరిస్తారని అడిగారట. వారికి సమాచారం లేకుండా ఈ పని చేయడం తన పొరపాటేనని, అందుకు క్షమాపణలు చెపుతానని ఠాకూర్తా అన్నారట. అదానీ కేసు వల్ల వందల కోట్ల నష్టపరిహారం చెల్లించడమో, ట్రస్టీలు జైలు శిక్ష అనుభవించడమో జరుగుతుందని ట్రస్టీలు సమావేశంలో అన్నారట. అసలు అదానీల నుంచి వచ్చినది లాయర్ నోటీస్ మాత్రమే నని అది కేసు కాదని, కేసు దాకా పోయినా ప్రతి అక్షరానికీ తన దగ్గర సాక్ష్యాధారాలు ఉన్నాయని ఠాకూర్తా చెప్పిన మాట ట్రస్టీలు అంగీకరించ లేదట. ఆ వ్యాసాన్ని, దాని మీద న్యాయవాదుల వాద ప్రతివాదాలను వెంటనే వెబ్‌సైట్ నుంచి తొలగించాలన్నారట. అవి తొలగించేవరకూ సంపాదకుడు ఆ గది వదిలిపోగూడదని అన్నారట. ఆయన వెంటనే అక్కడి నుంచే ముంబై కార్యాలయానికి ఫోన్ చేసి అవి తొలగించమని ఆదేశించారట. ఆ తర్వాత ఇకనుంచి ట్రస్ట్‌కూ సంపాదకుడికీ సంబంధాలు ఎలా ఉండాలో మార్గదర్శక సూత్రాలు తయారు చేస్తామని, సంపాదకుడికి సమాంతరంగా అదనపు సంపాదకుడిని నియమిస్తామని, ఇక ముందు పత్రికలో సంపాదకుడు స్వయంగా రచనలు చేయగూడదని, చేసినా ట్రస్ట్ అనుమతితో మాత్రమే ప్రచురించాలని అన్నారట. ఈ చివరి షరతు వినగానే పరంజయ్ గుహ ఠాకూర్తా ఆ ట్రస్టీలనే ఒక కాగితం అడిగి తీసుకుని తన రాజీనామా రాసి ఇచ్చి తక్షణమే తనను బాధ్యతల నుంచి తప్పించమని కోరారట. ఈ సమావేశంలో ఇతరులతో పాటు ప్రొ. రొమిలా థాపర్, ప్రొ. దీపాంకర్ గుప్తా కూడ ఉన్నారు.

యాజమాన్యానికి తెలియకుండా చట్టపరమైన వివాదంలో సొంత నిర్ణయం తీసుకోవడం సంపాదకుడికి ఉచితం కాదన్నంతవరకు సరైనదే. దానికి ఠాకూర్తా క్షమాపణ కూడ చెప్పారు. కాని అదానీ కార్పొరేట్ అక్రమాల గురించి వ్యాసాన్ని తొలగించాలనడం ఎటువంటి పరిస్థితిలోను ఆమోదయోగ్యం కాదు. అదానీకి నేరుగా ప్రధాని నరేంద్ర మోడీతో సంబంధాలున్నాయి గనుక, న్యాయస్థానంలో కూడ ఏదైనా మాయ చేయగలదని, శిక్షో, పెద్ద ఎత్తున నష్టపరిహారమో విధింపజేయగలదని ట్రస్టీలు అనుమానించి ఉంటారు. వందల కోట్ల నష్టపరిహారం శిక్ష విధిస్తే ఇపిడబ్ల్యు మనుగడే అసాధ్యమవుతుందని భావించి ఉంటారు. తాము వ్యక్తిగతంగా జైలు శిక్ష అనుభవించవలసి వస్తుందని భయపడి ఉంటారు. కాని అవన్నీ నిజమే అనుకున్నా, సంపూర్ణమైన సాక్ష్యాధారాలతో, కార్పొరేట్–ప్రభుత్వ అక్రమాల గురించి వ్యాసాన్ని తొలగించాలనడం మాత్రం ఇంతకాలం ప్రగతిశీల చరిత్ర ఉన్న మేధావులకు ఉచితం కాదు.

ఇపిడబ్ల్యు అనే ఒకానొక పత్రికలో జరిగిన అంతర్గత వివాదం గురించి, సంపాదకుడి రాజీనామా గురించి ఇంతగా చర్చించడానికి ఆ పత్రిక చారిత్రక నేపథ్యమే కారణం. ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీగా ప్రస్తుతం నడుస్తున్న పత్రిక ఎకనమిక్ వీక్లీ అనే వారపత్రికగా 1949లో ప్రారంభమయింది. వలస పాలన ముగిసిన తర్వాత భారత ఆర్థిక, సామాజిక, రాజకీయ చలనంపై మేధోపూర్వక ప్రతిస్పందనగా, చర్చావేదికగా ఉండాలనే ఉద్దేశంతో బెంగాలీ అర్థశాస్త్రవేత్త సచిన్ చౌధురి (1904–1966) బొంబాయిలో ఈ వారపత్రికను ప్రారంభించారు. గుజరాతీ మధ్యతరహా పత్తి వ్యాపార సంస్థ సెఖ్సారియా ఈ పత్రికకు అవసరమైన పెట్టుబడి సమకూర్చింది. భారత ఆర్థిక వ్యవస్థ పరిణామాల గురించి వార్తలు, వ్యాఖ్యలు ప్రకటించడం ఈ పత్రిక ఎంచుకున్న పని. ఆనాటి సుప్రసిద్ధ శిల్పి శంఖ చౌధురికి, సుప్రసిద్ధ రచయిత్రి, సంఘసేవిక ధరిత్రీ దేవికి (మహాశ్వేతాదేవి తల్లి) సోదరుడిగా, కళా, సాహిత్యాలకు

నిలయమైన కుటుంబం నుంచి వచ్చిన బెంగాలీ బుద్ధిజీవిగా సచిన్ చౌధురి ఆనాటి యువకులందరి లాగానే నెహ్రూ తరహా సోషలిస్టు భావాలతో ప్రభావితులయ్యారు. ఆ ప్రభావమే పత్రికలోకి కూడ ప్రవహించింది. వలస పాలన ముగిసిన భారత సమాజం ఏదో సాధించాలనే కలలతో, సాధిస్తుందనే ఆశతో ఉండిన బుద్ధిజీవులు, ప్రధానంగా అర్థ, రాజనీతిశాస్త్రాల విద్యార్థులు, నిపుణులు, మొత్తంగా భారత సమాజ అభివృద్ధి గురించి ఆలోచిస్తుండిన వారెందరో ఈ పత్రికను ఆదరించారు. మొదటి పంచవర్ష ప్రణాళికతో పాటు ప్రారంభమైన ఈ పత్రికకు అధికార వర్గాలలో, నిర్ణయాధికారం ఉన్న రాజకీయవేత్తలలో చాల ప్రాధాన్యత దొరికింది. కొద్ది కాలంలోనే ఇది దేశంలో అతి ముఖ్యమైన పట్టించుకోక తప్పని పత్రికగా మారింది. కేవలం ఆర్థిక పరిణామాల మీద వార్తలకూ, వ్యాఖ్యలకూ పరిమితం కాకుండా మొత్తంగా సామాజిక శాస్త్ర చర్చలకూ, పరిశోధనలకూ వేదికగా మారింది. అలా పదిహేను సంవత్సరాల పాటు విధాన నిర్ణయ రంగంలో, విద్యావంతులలో ఆదరణతో, ప్రాచుర్యంలో, ప్రకటించే విషయాలలో, ప్రామాణికతలో ఈ పత్రిక నానాటికీ ఎదుగుతూ వచ్చింది. కాని ఆ సమయంలోనే యాజమాన్యానికీ సంపాదకుడికీ విభేదాలు మొదలయ్యాయి. పత్రిక స్వతంత్ర ప్రతిపత్తిని వదులుకోవడానికి అంగీకరించని సచిన్ చౌధురి పత్రికను మూసివేయడానికి కూడ సిద్ధపడ్డారు. అలా 1965 చివరిలో ఎకనమిక్ వీక్లీ మూతపడింది.

కాని అప్పటికే ఆ పత్రిక దేశవ్యాప్తంగా ఎంత ప్రాచుర్యాన్ని సంపాదించుకున్నదంటే అప్పటికి సుప్రసిద్ధులైన యాభైమంది సామాజిక శాస్త్రవేత్తలు ఈ పత్రికను కాపాడడానికి ముందుకు వచ్చి ఇటువంటి పత్రిక ఆగిపోవడానికి వీలులేదని ఒక బహిరంగ ప్రకటన చేశారు. ఆ పత్రికను పునరుద్ధరించడం సాధ్యం కాకపోతే, అదే ధోరణిలో నడిచే మరొక వారపత్రికను ప్రారంభించాలని పిలుపునిచ్చారు. రానున్న పత్రిక ఏదైనా అవే భావాలతో, అవే ప్రమాణాలతో, సచిన్ చౌధురి సంపాదకత్వం లోనే రావాలని వాళ్లు కోరుకున్నారు. కాకపోతే పాత అనుభవం వల్ల ఈ కొత్త పత్రికకు వ్యాపార దృష్టి గల యాజమాన్యం ఉండకుండా చూడాలని భావించారు. కనీసం రెండు లక్షల యాభైవేల రూపాయల విరాళాలు సేకరిస్తే ఇటువంటి పత్రికను నడపవచ్చునని వాళ్లు భావించారు. అలా 1966 తొలిరోజుల్లో వెలువడిన ఈ మేధావుల ప్రకటన మీద సంతకం చేసిన వారిలో అప్పటికే లబ్ధ ప్రతిష్ఠులైన అర్థశాస్త్రవేత్తలు ఎకె దాస్ గుప్తా, కెఎన్ రాజ్, విఎం దండేకర్, సమాజ శాస్త్రవేత్త ఎంఎన్ శ్రీనివాస్, చరిత్రకారులు సర్వేపల్లి గోపాల్, తపన్ రాయ్ చౌధురి, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఉన్నతాధికారులు, అర్థశాస్త్రవేత్తలు కెఎస్ కృష్ణస్వామి, ఎం నరసింహం, దీనా ఖట్కటే, ప్రభుత్వంలో ఉన్నతాధికారులు పిఎన్ ధర్, ఎచ్‌వై శారదా ప్రసాద్, పీతాంబర్ పంత్ వంటి వారితో పాటు అప్పుడప్పుడే మేధో రంగంలో పేరు తెచ్చుకుంటున్న సామాజిక శాస్త్రవేత్తలు అశోక్ మిత్రా, ఎకె సేన్, జగదీష్ భగవతి, రొమిలా థాపర్, అర్జున్ సేన్ గుప్తా, పత్రికారచయితలు రొమేష్ థాపర్, బిజి వర్ఘీస్, ఆర్‌కె లక్ష్మణ్, పారిశ్రామికవేత్తలు సుధీర్ ములీ్జ, ఎచ్‌టి పరేఖ్ వంటి వారెందరో ఉన్నారు. ఈ ప్రకటన మీద సంతకం చేసిన మేధావులు ఇటువంటి పత్రికకు వ్యాపార యాజమాన్యం ఉండడం ఉచితం కాదని భావించారు గనుక తామే చొరవ చేసి ఒక స్వతంత్ర ట్రస్ట్ ను స్థాపించారు. ఆ ట్రస్ట్ పత్రికను ప్రచురించడం మాత్రమే కాక ఇతరేతర సామాజిక పరిశోధనా, చర్చా, ప్రచురణా కార్యక్రమాలు కూడ చేపట్టాలని లక్ష్య ప్రకటన రాసుకుని ట్రస్ట్ ను రిజిస్టర్ చేయించారు. తర్వాత కాలంలో సుప్రీం కోర్టు న్యాయమూర్తిగా పనిచేసిన పిబి గజేంద్రగడ్కర్ అధ్యక్షుడుగా ప్రారంభమైన ఆ ట్రస్ట్‌కు సమీక్షా ట్రస్ట్ అని పేరు పెట్టారు. సమీక్షా ట్రస్ట్ చర్చల సందర్భంలో కెఎన్ రాజ్ పత్రిక పేరులో అప్పటికి ఉండిన ఎకనమిక్ వీక్లీకి పొలిటికల్ అనే మాట కూడ చేర్చాలని సూచించారట. అలా ఆ తర్వాత యాభై సంవత్సరాలుగా ప్రపంచమంతటా అపారమైన ఆదరణను చూరగొన్న ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (మిత్రులకూ చదువరులకూ ఇపిడబ్ల్యు) 1966 ఆగస్ట్‌లో ప్రారంభమైంది. కాని నాలుగు నెలలు తిరగకుండానే డిసెంబర్‌లో సచిన్ చౌధురి మరణించారు.

ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ పట్టభద్రుడు, అప్పటికే మూడు సంవత్సరాలుగా ఎకనమిక్ వీక్లీ లోను, ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ లోను సచిన్ చౌధురికి సహాయ సంపాదకుడిగా పని చేస్తున్న కృష్ణరాజ్ (1937–2004) కు పదోన్నతి కల్పించే బదులు సమీక్షా ట్రస్ట్ బైటి నుంచి కొత్త సంపాదకుడిని తీసుకురావాలని ఆలోచించింది. అలా బొంబాయి విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర ప్రొఫెసర్‌గా ఉండిన ఆర్‌కె హజారిని సంపాదకుడిగా నియమించారు. అప్పటికే ప్రణాళికా సంఘంతో, ప్రభుత్వంతో, పరిశ్రమలతో సన్నిహిత సంబంధంలో ఉన్న హజారిని కేంద్ర ప్రభుత్వం 1969 బ్యాంకుల జాతీయకరణ తర్వాత రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు డెప్యూటీ గవర్నర్ గా నియమించడంతో సమీక్షా ట్రస్ట్‌కు కృష్ణ రాజ్‌ను సంపాదకుడిగా నియమించక తప్పలేదు.

అప్పటి నుంచి 2004లో మరణించేదాకా 35 సంవత్సరాల పాటు తన సర్వస్వాన్నీ ఇపిడబ్ల్యుకు ధారపోసిన కృష్ణరాజ్ ఇపిడబ్ల్యుకు పర్యాయ పదంగా మారిపోయారు. తాను స్వయంగా అర్థశాస్త్రవేత్త అయినప్పటికీ ఆయన తన స్వీయ రచనల మీద కన్న పత్రిక సంపాదకత్వం మీద, పత్రికద్వారా అంతకంతకూ ఎక్కువగా కొత్త రచయితలను, పరిశోధకులను వెలుగులోకి తేవడం మీద, పత్రికను ప్రపంచ స్థాయి ప్రమాణాలతో తీర్చిదిద్దడం మీద కేంద్రీకరించారు. ఆయన సంపాదకుడిగా ఉన్న కాలంలోనే ప్రపంచంలోనూ, దేశంలోనూ ఆర్థిక, సామాజిక, రాజకీయ సంచలనాలెన్నో జరిగాయి. ప్రపంచవ్యాప్తంగా కోపోద్రిక్త యువతరం ఉద్యమాల బాటపట్టిన దందహ్యమాన దశాబ్దమైన అరవైల మధ్య కొత్త రూపంలో ప్రారంభమైన ఇపిడబ్ల్యు కృష్ణరాజ్ సంపాదకత్వంలో ఆ సంచలనాలన్నిటికీ వేదిక కల్పించింది. నక్సల్బరీ ప్రజ్వలనం, భారత సమాజాన్ని నక్సల్బరీ అర్థవలస అర్థభూస్వామ్య వ్యవస్థగా నిర్వచించడం, ఆ తర్వాత భారత వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందా లేదా అనే విస్తృతమైన చర్చ ఆయన సంపాదక బాధ్యతలు చేపట్టడానికి సమాంతరంగా జరిగాయి. ఆ ఉత్పత్తి విధాన చర్చలో కీలకమైన వ్యాసాలెన్నో ఇపిడబ్ల్యులోనే అచ్చయ్యాయి. అప్పటి నుంచి ప్రారంభించి ఆ తర్వాత మూడున్నర దశాబ్దాలలోను ఇపిడబ్ల్యు కేవలం సామాజిక శాస్త్ర పరిశోధనా వ్యాసాల వేదికగా, ఆర్థిక, రాజకీయ వార్తల, వ్యాఖ్యల పత్రికగా మాత్రమే కాక, ప్రత్యామ్నాయ ఉద్యమాల గళంగా

కూడ మారింది. ఒకవైపు తీవ్రమైన మేధో చర్చలకూ, పరిశోధనా వ్యాసాలకూ, సంక్లిష్టమైన సైద్ధాంతిక వాదవివాదాలకూ వేదికగా ఉంటూనే సమకాలీనంగా జరుగుతున్న పరిణామాల గురించి ఎప్పటికప్పుడు ప్రజానుకూల వార్తలు, వ్యాఖ్యలు, విశ్లేషణలు ప్రకటిస్తూ వచ్చింది. ఒకవైపు లబ్ధ ప్రతిష్ఠుల నుంచి, అంతర్జాతీయ స్థాయి నిపుణుల నుంచి ప్రామాణికమైన పరిశోధనా పత్రాలు సేకరిస్తూనే, అట్టడుగు గ్రామీణ ప్రాంతాల నుంచి, చిన్నపట్టణాల నుంచి రాస్తున్న రచయితలను, క్షేత్ర స్థాయి నివేదికలను ప్రోత్సహించడంలో కృష్ణరాజ్ ఎంతో కృషి చేశారు. ముప్పై ఐదు సంవత్సరాల సంపాదకత్వంలో తొలి ఇరవై సంవత్సరాలకు పైగా వామపక్ష భావాలతో, ఆ తర్వాత ప్రారంభమైన ప్రపంచీకరణలో ఎంతో కొంత మేలు ఉన్నదనే ఉదార భావాలతో ఆయనకు వ్యక్తిగతంగా ఏకీభావం ఉన్నప్పటికీ పత్రికను మాత్రం ఒక విశాలమైన, స్థిరమైన ప్రజానుకూల గళంగా నిలబెట్టడంలో కృష్ణరాజ్ అనితరసాధ్యమైన కృషి చేశారు. తనకు మార్క్సిజంలో, సోషలిజంలో విశ్వాసం ఉన్నప్పటికీ భిన్నాభిప్రాయాలకు పత్రిక తలుపులు మూయలేదు. ప్రపంచీకరణ వల్ల ప్రయోజనం ఉందని తాను నమ్మినప్పటికీ ప్రపంచీకరణకు వ్యతిరేక అభిప్రాయాలకు పత్రికలో చాల ఎక్కువ స్థానం ఇచ్చారు.

అయితే ఒకవైపు ప్రమాణాలు, పాఠకుల ఆదరణ పెరుగుతుండగానే పత్రిక తీవ్రమైన ఆర్థిక సమస్యలు ఎదుర్కోవడం మొదలయింది. అసలు వార్తాపత్రికల ఆర్థిక వ్యవహారాల పరిస్థితే అది. పత్రికలు నడపని వారికి, కేవలం చదివేవారికి పత్రికల ఆర్థిక వ్యవస్థ గురించి అసలు విషయాలు తెలియవు. ఏ పత్రికకైనా దాని ఉత్పత్తి వ్యయాన్నంతా పాఠకుల దగ్గరే వసూలు చేయడం కనీసం భారత సమాజంలో అసాధ్యం. పత్రిక క్రమబద్ధంగా వెలువడాలంటే కాగితం, అచ్చు, రవాణాల మీద వెచ్చించే దానికన్న ఎక్కువగా కార్యాలయం, ఉద్యోగులు వంటి నిర్వహణా వ్యవస్థ మీద వెచ్చించవలసి ఉంటుంది. అందువల్ల దినపత్రికల వంటి వాటికైతే మూడో వంతో, నాలుగో వంతో మాత్రమే అచ్చు వ్యయం, మిగిలినదంతా నిర్వహణ వ్యయంగా ఉంటుంది. చిన్నపత్రికలకైతే కాగితం, అచ్చు వ్యయం, నిర్వహణ వ్యయం సగం సగంగా ఉంటాయి. ఇవాళ ఏ దినపత్రికైనా ఒక ప్రతి ఉత్పత్తి వ్యయం దాదాపు రు. 20 ఉండగా, అది రు. 5 కన్న ఎక్కువ ధర పెట్టడానికి వీలు లేదు. చిన్న పత్రికలకైతే అవి అచ్చయ్యే ప్రతుల సంఖ్య తక్కువ గనుక ఉత్పత్తి వ్యయం ఇంకా ఎక్కువగా ఉంటుంది. ఆ ఉత్పత్తి వ్యయంలో సగానికో, ముప్పాతికకో మాత్రమే అమ్మవలసి వస్తుంది. మిగిలిన లోటు పూరించుకోవడానికి అన్ని పత్రికలూ వ్యాపార ప్రకటనల మీద ఆధారపడతాయి. వ్యాపార హంగులు ఉన్న పత్రికలైతే ఈ ప్రకటనల రాబడితో లాభాలు కూడ గడిస్తాయి. చిన్న పత్రికలకు ప్రకటనలు ఇవ్వడానికి వ్యాపార సంస్థలేవీ ముందుకు రావు గనుక వాటికి లోటు ఎప్పటికీ పూడదు. చిన్న పత్రికలను ప్రభుత్వమే ఆదుకోవాలని ఎంతో ఆందోళన జరిగిన తర్వాత ఆయా ప్రభుత్వాలు తమ ప్రకటనల వ్యయంలో కొంత భాగాన్ని, అతి చిన్న భాగాన్ని చిన్న పత్రికలకు కేటాయించాలని నిర్ణయించాయి. కాని అది కూడ ఆ ప్రభుత్వాల, అధికారుల ఇష్టారాజ్యంగా మారిపోయి, చిన్న పత్రికల ఆర్థిక స్థితి దినదిన గండంగా మారిపోయింది.

ఇపిడబ్ల్యుకు కూడ ప్రపంచ వ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు వచ్చినప్పటికీ, దేశవ్యాప్త ప్రముఖ మేధావులతో కూడిన సమీక్షా ట్రస్ట్ యాజమాన్యం ఉన్నప్పటికీ, ఆర్థిక సుస్థిరత సాధ్యం కాలేదు. పత్రిక ప్రారంభించేటప్పుడు విరాళాలు సేకరించిన సమీక్షా ట్రస్ట్ ఆ తర్వాత ఆర్థిక స్థితి గురించి పెద్దగా పట్టించుకోలేదు. ప్రతి ద్రవ్య సంస్థ (ముఖ్యంగా బ్యాంకులు) ఒక ఆర్థిక పత్రికలో తమ వార్షిక నివేదికలు తప్పనిసరిగా ప్రకటన రూపంలో ఇవ్వాలనే నిబంధన వల్ల వచ్చే వ్యాపార ప్రకటనలు, కొద్ది మంది ఇపిడబ్ల్యు అభిమానులు సేకరించి పెట్టిన వ్యాపార ప్రకటనలు మినహా పత్రిక ఆర్థిక స్వావలంబనకు అవసరమైన నిధులు లేకుండానే పత్రిక నడిచింది. అయినా కృష్ణరాజ్ క్రమబద్ధంగా, ఒక్కొక్కసారి రెండు మూడు సంచికలు కలిపి అయినా పత్రికను వెలువరిస్తూనే వచ్చారు. ఉద్యోగులకు చాలీచాలని జీతభత్యాలే ఇచ్చినా, రచయితలకు పారితోషికం చాల తక్కువగానే ఉన్నా, కృష్ణరాజ్ వ్యక్తిత్వమే పత్రికకు అపారమైన గౌరవాన్ని, కొంతవరకు ఆర్థిక వనరులను సంపాదించి పెట్టింది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మాజీ అధినేత డిఎన్ ఘోష్ 1990ల మొదట్లో సమీక్షా ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీగా మారిన తర్వాత, పత్రికకు ఒక మూలనిధి ఏర్పాటు చేయాలని, ఆ మూలనిధి మీద వడ్డీతోనే పత్రిక నిర్వహణ జరగాలని ఆలోచించి, అందుకు అవసరమైన నిధుల సేకరణ ప్రారంభించారు. 1990ల దాకా ఎప్పటి ఆదాయం అప్పటి వ్యయానికి సరిపోయే స్థితిలోనే నడిచిన పత్రికకు ఆ తర్వాత కొంత మెరుగైన ఆర్థిక స్థితి ఏర్పడింది. 1990ల చివరిలో కొద్ది సంవత్సరాల పాటు రిజర్వ్ బ్యాంక్ రు. పది లక్షల వార్షిక విరాళం ఇచ్చింది. అయితే ఆ నిధులు ప్రధానంగా కొత్తగా ఏర్పాటు చేసిన ఇపిడబ్ల్యు రిసర్చ్ ఫౌండేషన్ అవసరాలకే సరిపోయాయి.

అలా ఒకరకంగా పత్రిక సుస్థిరంగానే నడుస్తున్న సమయంలో 2004లో కృష్ణరాజ్ మరణించారు. ఇపిడబ్ల్యు మళ్లీ పాత పద్ధతిలో కొనసాగగలుగుతుందా అని ఎందరో అభిమానులు ఆందోళన పడ్డారు. స్వయంగా అర్థశాస్త్రవేత్త, హిందూ దినపత్రికలో సంపాదకుడిగా ఉన్న సి రామమనోహర్ రెడ్డిని కొత్త సంపాదకుడిగా సమీక్షా ట్రస్ట్ నియమించింది. రామమనోహర్ రెడ్డి సంపాదకత్వంలో ఇపిడబ్ల్యు తన పాత ప్రమాణాలను కొనసాగించడం మాత్రమేకాక, కొత్త సంప్రదాయాలను ప్రవేశపెట్టింది. మరిన్ని ఎక్కువ విషయాలలోకి, మరింత విస్తృతమైన పరిధిలోకి విస్తరించింది. మారుతున్న కాలానికి తగినట్టుగా డిజిటల్ ప్రచురణ కూడ చేపట్టింది. ఆయన సంపాదకుడిగా ఉన్న సమయంలోనే పత్రికకు యాభై సంవత్సరాలు నిండబోతుండగా, ఆ సందర్భంగా చేపట్టవలసిన కార్యక్రమాలను రూపొందించుకుంది. అప్పటికే పత్రిక చిన్న పత్రిక స్థాయి నుంచి పెద్ద పత్రికగా ఎదిగింది. వారం వారం వందకుపైగా పేజీలతో, క్రమం తప్పకుండా వెలువరించడం ఒక ఎత్తయితే, ప్రతి వారం పత్రికకు అందుతున్న దాదాపు వంద రచనల నుంచి వాటిలో మూడో వంతు మాత్రమే ప్రచురణకు ఎంపిక చేయడం మరొక ఎత్తు. అప్పటికే ఇపిడబ్ల్యు వార్షిక బడ్జెట్ రు. 5 కోట్లకు చేరింది. ఈ స్థాయికి ఎదిగిన బృహత్తర సంస్థను రామమనోహర్ రెడ్డి సమర్థంగా నిర్వహించారు.

అయితే సంస్థ నిర్వహణకు, చేపట్టిన కార్యక్రమాలకు, ఇపిడబ్ల్యు స్వర్ణోత్సవాల సందర్భంగా తేదలచుకున్న ప్రచురణలకు, ఇపిడబ్ల్యు

# జీవన్మరణ పోరాటంలో ఆదివాసులు

***ఛత్తీస్‌గడ్‌లో నిజనిర్ధారణకు వెళ్లిన ప్రజాసంఘాల నేతలను పోలీసులు అక్రమంగా జైలులో నిర్బంధించగా, వారిలో ఒకరుగా అక్కడి జైలులో మగ్గుతున్న ఆదివాసుల స్థితిగతులను, వారి అనుభవాలను వివరిస్తున్నారు* దుడ్డు ప్రభాకర్**

ఛత్తీస్‌గడ్‌లోని బస్తర్ డివిజన్ (సుక్మా, దంతెవాడ, బీజాపూర్, నారాయణ్‌పూర్, జగదల్‌పూర్, కొండగాంవ్, కాంకర్ జిల్లాలు)లో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సాయుధ బలగాలు ఆదివాసులపై హత్యాకాండలు, ఆదివాసీ మైనర్ బాలికలపై, మహిళలపై సామూహిక అత్యాచారాలు, గూడేలకు గూడేలను తగులబెట్టడం లాంటి నిత్యకృత్యాలు కొన్నైనా మీడియా ద్వారా బయటి ప్రపంచానికి తెలుస్తున్నాయి. కొన్ని సంఘటనలైనా సమగ్రంగా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నిజనిర్ధారణ చెయ్యాలనుకుంది.

దాదాపు 30 మంది విద్యార్థి, మహిళా, ప్రజా సంఘాల నాయకులను, ప్రొఫెసర్లను, జర్నలిస్టులను ఆహ్వానించింది. 25 డిసెంబర్ 2016 ఉదయం 6 గంటలకు అందరూ భద్రాచలం బస్టాండ్‌లో కలుసుకునే విధంగా తెలంగాణ ప్రజాస్వామిక వేదిక (టిడిఎఫ్) నాయకత్వం ప్రణాళిక చేసుకుంది. వరంగల్, కరీంనగర్, హైదరాబాద్, నిజామాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాల నుండి వారు రావాల్సి ఉంది. అనేక వ్యక్తిగత, సంస్థాగత కారణాలవల్ల వారు కొందరు హాజరు కాలేకపోయారు. 25వ తేదీ ఉదయం 6 గంటలకు భద్రాచలం చేరిన వారిలో చిక్కుడు ప్రభాకర్ (టిపిఎఫ్), బండి దుర్గాప్రసాద్ (టిడిఎఫ్), బల్లా రవీంద్రనాథ్ (సిఆర్‌పిపి) రమణాల లక్ష్మయ్య (తుడుం దెబ్బ), ఆర్. రాజేంద్రప్రసాద్ (జర్నలిస్ట్), ఎం. నజీర్ (టివివి), నేను ఉన్నాం. నిజనిర్ధారణకు ఏయే గ్రామాలు వెళ్లాలో నిర్ణయించుకున్నాం.

బీజాపూర్ జిల్లా మెట్‌పాల్ ప్రాంతంలో 16 డిసెంబర్ 2016న సోమారు పొట్టం (13) అను ఆదివాసీ మైనర్ బాలుడ్ని ఎదురు కాల్పుల పేరిట కాల్చి చంపిన సంఘటనతో పాటు పక్క గ్రామాలలో ఒక ఆదివాసీ హత్య, ఆదివాసి మహిళపై జరిగిన సామూహిక అత్యాచారం సంఘటనలు పరిశీలించాలనుకున్నాం. మొత్తంగా రెండురోజులు, మూడు గ్రామాలు పర్యటించాలనుకున్నాం. తిరిగివచ్చి భద్రాచలంలో ప్రెస్‌మీట్, హైదరాబాద్‌లో రౌండ్ టేబుల్ సమావేశం, ధర్నా చెయ్యాలనుకున్నాం.

కాలకృత్యాలు ముగించుకొని ఉదయం 9 గంటలకు 4 మోటారు సైకిళ్లపై 7 మందిమి బయలుదేరాం. బయలుదేరిన వెంటనే తెలంగాణ – ఛత్తీస్‌గడ్ సరిహద్దు ప్రాంతమైన దుమ్ముగూడెం–పర్ణశాల మధ్య ప్రధాన రహదారిపై 30 మందికి పైగా సాయుధులైన సివిల్ డ్రెస్‌లో ఉన్న వ్యక్తులు మా మోటార్ సైకిళ్లను అడ్డగించారు. మా ప్రతిఘటన వాళ్ల దౌర్జన్యాలను ఆపలేకపోయింది. చివరకు మమ్మల్ని పోలీస్ వ్యాన్‌లో కుక్కి కుంట పోలీస్ స్టేషన్‌కు తరలించారు. మా వద్ద విప్లవ సాహిత్యం, లక్ష రూపాయల రద్దయిన కరెన్సీ నోట్లు ఉన్నాయని, మేం మావోయిస్టు పార్టీ నాయకుడు రామన్నను కలవడానికి వెళుతున్నామనే ఆరోపణలతో

---

చరిత్రపై డాక్యుమెంటరీకి అవసరమైన నిధుల సేకరణ విషయంలో రామమనోహర్ రెడ్డికి సమీక్షా ట్రస్ట్‌కు మధ్య భిన్నాభిప్రాయాలు మొదలయ్యాయి. సంపాదకుడి చొరవతో చాలమంది పెద్ద దాతల నుంచి విరాళాలు సేకరించడం మొదలయింది.

2006, 2007ల్లో ప్రణాళికా సంఘం ఏడాదికి రు. 25 లక్షల చొప్పున రెండుసార్లు నిధులు సమకూర్చింది. 2006లోనే రోహిణి, నందన్ నీలేకణి దంపతులు రు. రెండు కోట్ల విరాళం ఇచ్చారు. ఆ తర్వాతి సంవత్సరం మరొక రెండున్నర కోట్ల రూపాయలు విరాళం ఇచ్చారు. ఆ సమయంలోనే సర్ దొరబ్‌జీ టాటా ట్రస్ట్ మూడు సంవత్సరాల మీద రు. 1.6 కోట్ల విరాళం ఇవ్వడానికి అంగీకరించింది. మరికొన్ని ద్రవ్య, పారిశ్రామిక సంస్థలు కూడ మూల నిధికి విరాళాలు ఇచ్చాయి. ఈ విరాళాల సేకరణ గురించి భిన్నాభిప్రాయా లతో రామమనోహర్ రెడ్డి తన సంపాదక బాధ్యతల నుంచి రాజీనామా చేశారు. అయితే ఈ విరాళాలు ఎంతగా వస్తున్నా, 2016 నాటికి ఇపిడబ్ల్యు వార్షిక బడ్జెట్ రు. 5 కోట్లకు చేరింది గనుక అందులో పది శాతం కన్న తక్కువ మాత్రమే మూలనిధి మీద వడ్డీగా వచ్చేది. మిగిలిన బడ్జెట్‌లో 50 శాతం చందాల నుంచి, 40 శాతం దాకా వ్యాపార ప్రకటనల నుంచి వచ్చేది. ఏమైనా, పత్రికను ఆర్థికంగా సుస్థిరంగా మార్చడానికి సంపాదకుడుగా రామమనోహర్ రెడ్డి చేసిన ప్రయత్నాలు ఆయన అర్ధాంతర రాజీనామాకు దారితీశాయి.

పత్రిక ద్వారా కార్పొరేట్ – ప్రభుత్వ మిలాఖత్తు అక్రమాలను బైటపెట్టడానికి పరిశోధకుడుగా, సంపాదకుడుగా పరంజయ్ గుహా ఠాకూర్తా చేసిన ప్రయత్నాలు ఆయన అర్థంతర రాజీనామాకు దారితీశాయి.

ఇప్పుడు ఇపిడబ్ల్యు వంటి అపారమైన, ప్రజానుకూల, ప్రత్యామ్నాయ చరిత్ర ఉన్న పత్రికను ఇలా విధ్వంసం చేయగూడదని ప్రపంచం నలుమూలల నుంచి ఎందరో మేధావులు, బుద్ధిజీవులు, రచయితలు, పాఠకులు సమీక్షా ట్రస్ట్‌కు విజ్ఞప్తులు చేస్తున్నారు. ట్రస్ట్ తన విధానాలు సవరించుకుంటుందా లేక ప్రత్యామ్నాయ గళాలు అతి ఎక్కువగా అవసరం ఉన్న ప్రస్తుత వాతావరణంలో ఇపిడబ్ల్యు కుంగి కృశించి రద్దయిపోతుందా చూడవలసే ఉంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

కేసు నమోదు చేశారు. ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలోని సుక్మా జిల్లా, కిష్టారం పోలీస్ స్టేషన్ పరిధిలోని అటవీ ప్రాంతంలో మమ్మల్ని అరెస్ట్ చేసినట్లు చూపించారు. ఛత్తీస్‌గడ్ రాష్ట్ర పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ సెక్షన్ 8(1)(2)(3)(5) ప్రకారం ఎఫ్ఐఆర్ తయారు చేసి 26 సాయంత్రం సుక్మా కోర్టు ముందు హాజరుపరిచి సుక్మా జైలుకి తరలించారు.

దేశంలోనే అత్యంత దుర్భర వసతులు కలిగిన జైళ్లు ఉన్న రాష్ట్రంగా ఛత్తీస్‌గడ్‌కి పేరుంది. పోలీసుల ప్రత్యక్షపాలన నడుస్తున్న బస్తర్‌లో జైలుని కూడా పోలీసులే నడిపిస్తుంటారు. యుద్ధక్షేత్రంగా పిలవబడుతూ నిత్యం తుపాకి మోతలతో దద్దరిల్లుతున్న బస్తర్‌లో అతికీలకమైన సుక్మా జిల్లాలో జైలు ఏ విధంగా ఉంటుందో ఊహించడం కష్టమేమీ కాదు. అలాంటి జైలులో సుమారు 190 రోజులు కఠిన కారాగారవాసం ముగించుకొని జూలై 1న బెయిల్ పై విడుదలయ్యాం.

కేవలం రెండు రోజులు మూడు గ్రామాలను పరిశీలించడానికి వెళ్లిన మాకు ఆరునెలలపాటు అందరూ అమాయకులంటున్న ఆదివాసీ పులి బిడ్డలతో గడిపే అవకాశం దక్కింది. సుమారు యాభై గ్రామాలకు చెందిన వందమందికి పైగా ఆదివాసీ యువకుల్ని, ఇంటర్వ్యూ చేశాం. పోలీసుల చిత్రహింసల్ని, ఆదివాసుల పోరాట రూపాల్ని, అన్నల అండదండల్ని కథలు కథలుగా వివరించారు. ఆ 6 నెలలు వారి జీవితాల్ని చదివాం. వారి జీవన విధానాల్ని తెలుసుకున్నాం. వారి జీవన్మరణ పోరాటాల్ని రికార్డ్ చేశాం. మైదాన ప్రాంతాలలోని మధ్యతరగతి బుద్ధిజీవుల మదిలో మెదిలే అనేక ప్రశ్నలకు జవాబులు సంపాదించాం. అక్షరజ్ఞానంలేని ఆదివాసులు మార్క్సిజాన్ని ఆచరిస్తూ, అమలు పరుస్తున్నందుకు అబ్బురపడ్డాం. మేం నిజనిర్ధారణ చేసి ప్రెస్‌మీట్, సభలు, ధర్నాలు చేసినా వందల మందికి మాత్రమే చెప్పగలిగే వాళ్లం. పేపర్లలో ఒకరోజు ఎక్కడో ఒక మూలన చిన్నవార్తగా కనపడేది.

కానీ మేం అరెస్టైన తర్వాత రెండు తెలుగు రాష్ట్రాలలో జరిగిన నిరసనోద్యమాల ద్వారా సరిగ్గా రెండు నెలలపాటు ఛత్తీస్‌గడ్‌లో ఆదివాసులపై జరుగుతున్న రాజ్యహింస, వారికి అండగా ప్రజాస్వామిక హక్కుల అమలు గురించి మాట్లాడుతున్న మానవ హక్కుల కార్యకర్తలపై అమలవుతున్న అణచివేత దేశవ్యాపితంగా ప్రచారమయ్యింది.

ఆంధ్రప్రదేశ్‌లో 46 దళిత, ప్రజాసంఘాలతో ఆంధ్రప్రదేశ్ ప్రజాస్వామిక వేదిక ఏర్పడింది. ఆ వేదిక ద్వారా రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో ప్రెస్‌మీట్‌లు, రౌండ్ టేబుల్ సమావేశాలు, వందలాది మందితో కలెక్టర్ కార్యాలయాల ఎదుట ధర్నాలు, బహిరంగ సభలు జరిగాయి. ఆయా సందర్భాలలో లక్షకు పైగా కరపత్రాలు ముద్రించి ప్రచారం చేశారు. ఆ నిరసన కార్యక్రమాలు పాలకవర్గాలను డిఫెన్స్‌లో పడవేశాయి.

ప్రజాస్వామిక వేదిక చేస్తున్న ప్రతి కార్యక్రమానికి కౌంటర్‌గా అన్ని జిల్లాలలో టిడిపి, బిజెపి కార్యకర్తల్ని సమీకరించిన పోలీసులు వేదికకు వ్యతిరేకంగా పోస్టర్లు వేయించారు. బ్యానర్లు కట్టారు. ర్యాలీలు చేయించారు. ఎదురుగా మైకులు పెట్టి అరుపులు, పెడబొబ్బలతో కూడిన అల్లరి చేశారు. పోలీసుల వ్యూహం ప్రజల ముందు నవ్వుల పాలయ్యింది. దాంతో నేరుగా ఆంధ్రప్రదేశ్ డిజిపి సాంబశివరావు రంగప్రవేశం చేశారు. విజయవాడలో విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసి ఆంధ్రప్రదేశ్ ప్రజాస్వామిక వేదిక మావోయిస్టు పార్టీ ముసుగు సంస్థ అనీ, దాని కార్యక్రమాలకు ఎవ్వరూ హాజరు కావద్దని ప్రకటించారు. అయినప్పటికీ ఆ తర్వాత అన్ని జిల్లాల్లో జరిగిన నిరసన సభల్లో గతం కంటే ఎక్కువ సంఖ్యలో పాల్గొని సభలను విజయవంతం చేశారు. ఆదివాసులపై రాజ్యం చేస్తున్న హింస గురించి ఆరు నెలలపాటు ప్రత్యక్షంగా తెలుసుకున్న మేం విడుదలైన తర్వాత అనేక ప్రాంతాలలో ప్రచారం చేశాం. ఆంధ్రప్రదేశ్ లోని 8 జిల్లాలలో బహిరంగ సభల ద్వారా ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడవ దశ అమలులో భాగంగా ఆదివాసులపై అమలౌతున్న హింస గురించి, ఆదివాసుల ప్రతిఘటనా పోరాటాల గురించి ప్రజలకు వివరించాం. జైలులో మేం తెలుసుకున్న విషయాలు మీతో పంచుకోవాలనుకునే చిన్న ప్రయత్నమే ఈ వ్యాసం.

**ఆదివాసులపై యుద్ధం**

2000, నవంబర్ 1న మధ్యప్రదేశ్ నుండి విడిపడి 27 జిల్లాలతో ఛత్తీస్‌గడ్ రాష్ట్రం ఆవిర్భవించింది. ఛత్తీస్‌గడ్ అడవుల్లో లక్షల కోట్ల విలువ చేసే ఖనిజ సంపద ఉంది. బంగారం, డైమండ్స్, ఇనుము, బొగ్గు, గ్రానైట్, సిలికాన్, బాక్సైట్, యురేనియం లాంటి అత్యంత విలువైన 28 రకాల ఖనిజ నిక్షేపాలు బస్తర్ డివిజన్‌లో సమృద్ధిగా ఉన్నాయి. అందుకే కార్పొరేట్ కంపెనీలు బస్తర్ అడవుల్లో రాబందుల్లా వాలాయి. టాటా, ఎస్సార్, అంబుజా, బిర్లా, జిందాల్, మిట్టల్, ఆదాని కంపెనీలు సుమారు 250 లక్షల హెక్టార్ల అటవీ భూముల్లో మైనింగ్ చేసుకోవడానికి భారత పాలకవర్గాలతో ఒప్పంద పత్రాల ద్వారా ఆమోదం పొందాయి. ఆదివాసుల్ని అడవుల నుండి ఖాళీ చేయించి భూమిని కంపెనీలకు అప్పగించే బాధ్యత మిగిలి ఉంది. వేల సంవత్సరాలుగా అడవిని నమ్ముకొని అడవి తల్లి ఒడిలో సేదతీరుతున్న ఆదివాసులు పాలకుల ప్రయత్నాలను వ్యతిరేకిస్తున్నారు. కాబట్టి ఆదివాసుల్ని అంతం చేసైనా సరే అడవిని కార్పొరేట్ కంపెనీలకు కట్టబెట్టే ప్రయత్నంలో అడవుల్లో ఆదివాసుల నెత్తురు ఏరులై పారుతుంది.

గుజరాత్ రాష్ట్రాన్ని సామ్రాజ్యవాదుల అడ్డాగా మార్చిన గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీని కార్పొరేట్ కంపెనీలు, వారి మీడియా దేశప్రధాని పీఠం మీద కూర్చోబెట్టాయి. వాళ్ల ఆకాంక్షల్ని తీర్చేపనిలో భాగంగా బిజెపి అధికారంలో ఉన్న ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలో ఆదివాసుల్ని అడవి నుండి తరిమేయడానికి వారి గుండెలపై తుపాకీ గురిపెట్టారు. అడవిని ఖాళీ చేస్తారా, చస్తారా? అంటున్నారు.

2019లో జరగబోయే సాధారణ ఎన్నికల నాటికి కార్పొరేట్ కంపెనీలను సంతృప్తిపరిచి వారి ఆశీస్సులతో మళ్లీ కేంద్రంలో, రాష్ట్రంలో అధికారంలోకి రావడానికి బిజెపి తహతహలాడుతోంది. యుపిఏ ప్రభుత్వం ప్రారంభించిన ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఎన్‌డిఏ ప్రభుత్వం మూడవదశను అమలు చేస్తోంది. అందుకు విదేశాల నుండి దిగుమతి చేసుకున్న అత్యంత అధునాతన యుద్ధ యంత్రాలతో రంగంలోకి దిగింది.

ఈ దేశ మూలవాసులైన ఆదివాసుల్ని అడవి నుండి ఖాళీ చేయించడానికి, వారికి అండగా ఉన్న మావోయిస్టుల్ని అంతం చేయడానికి ఆపరేషన్ వాషౌట్‌ను వేగవంతం చేస్తుంది. డ్రోన్‌ల ద్వారా మావోయిస్టుల కదలికలు గుర్తించి, మానవరహిత విమానాల ద్వారా బాంబుల వర్షం కురిపించి మావోలను ఏరివేస్తామని నరేంద్రమోడీ ప్రకటిస్తున్నారు.

మానవరహిత యుద్ధ ట్యాంకులు నేడు బస్తర్‌ను చుట్టుముట్టాయి.

వేలాది కోబ్రా కమెండో బలగాలు బస్తర్‌లో కవాతు చేస్తున్నాయి. బస్తర్ చుట్టూ ప్రతి ఐదు కిలోమీటర్లకు ఒక పోలీస్ క్యాంప్ ఏర్పాటు చేసి ఆదివాసులపై తీవ్రమైన అణచివేతను అమలు చేస్తున్నారు. వందలాది మంది పోలీసులు గూడేలను చుట్టుముట్టి 14 ఏళ్ల పైబడిన యువతీ యువకుల్ని పట్టుకెళ్లి నెలల తరబడి చిత్రహింసలు పెట్టి ఒక్కొక్కరిపై 4-7 వరకు హత్యానేరం కేసులు నమోదు చేసి జైళ్లను నింపుతున్నారు. వీరికి లాయర్‌ను పెట్టుకునే ఆర్థిక స్తోమత లేక సంవత్సరాల తరబడి అండర్‌ట్రయల్ ఖైదీలుగా జైళ్లలో మగ్గుతున్నారు.

ఇపుడు బస్తర్‌లోని గూడేలలో 14-35 సంవత్సరాల వయస్సు ఉన్న స్త్రీ పురుషులెవ్వరూ గూడేలలో లేరు. కుటుంబాలకు కుటుంబాలు ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలోని అనేక జైళ్లలో నిర్బంధించబడి ఉన్నారు. గూడేల నుండి పోలీసులు పట్టుకెళ్లిన 5, 6 నెలల దాకా ఎవరు ఎక్కడున్నారో తెలియదు. ఇంకా పోలీసు కస్టడీలో ఎవరున్నారు, ఏ జైలులో ఎవరున్నారు, అసలు బతికి ఉన్నారా లేక చనిపోయారా, తెలియని స్థితి. పసిబిడ్డలు, ముసలి వాళ్లు మాత్రమే ఆకలితో అలమటిస్తూ గూడేలలో ఉంటున్నారు.

వీరు విడుదలై పోయేసరికి వారు బతికుంటారో లేదో తెలియని దయనీయ పరిస్థితిలో వాళ్లు జీవిస్తున్నారు. ఎవ్వరైనా కొంచెం వెసులుబాటు ఉన్న వారు జైలు ములాఖత్‌కి వస్తూ పిడికెడు పళ్లు తోముకొనే పుల్లలు, గుప్పెడు పచ్చిమిర్చి, ఐదారు టమాటాలు తీసుకొని వస్తారు. జైలులో ఉన్న వారు పచ్చిమిర్చి టమాటాలను ముక్కలు చేసుకొని పళ్లెంలో వేసి, గ్లాసుతో నూరుకొని కనీసం ఒక్కపూటైనా తృప్తిగా (కడుపునిండా కాదు) తింటారు. జైలులో ఎలాంటి తిండి పెడుతున్నారో, బయట ఉన్న వాళ్లు తిండికోసం ఎన్ని కష్టాలు పడుతున్నారో తెలుసుకోవ డానికి ఇలాంటి అనేక సంఘటనలు మనకు కనిపిస్తాయి.

మరోవైపు ఆదివాసీ గూడేలను తగులబెడుతున్నరు. ఆదివాసుల్ని బహిరంగంగా కాల్చి చంపుతున్నారు. మహిళలపై సామూహిక అత్యాచారాలు చేస్తున్నారు. ఏ విధంగానైనా ఆదివాసుల్ని అడవి నుండి ఖాళీ చేయించి అడవిని బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పడమే భారత పాలకులకు తక్షణ ఎజెండాగా ఉంది. ఆదివాసులు వారి గూడేలను, మానప్రాణాలను కాపాడుకోవడం కోసం మాత్రమే పోరాడడం లేదు. ఈ దేశ ఖనిజ సంపదను, సహజ వనరులను, పర్యావరణాన్ని, ఈ దేశ సార్వభౌమాధికారాన్ని కాపాడడం కోసం నెత్తురు చిందిస్తున్నారు.

మధ్యతరగతితో మైండ్‌గేమ్ ఆడుతున్నారు. బస్తర్‌లో ఆదివాసులపై పాలకులు చేస్తున్న నరమేధాన్ని పోలీసులకు, మావోయిస్టులకు మధ్య జరుగుతున్న యుద్ధంగా ప్రచారం చేస్తూ ప్రజల్ని నమ్మించే ప్రయత్నం చేస్తున్నారు. పోలీసులు మరణించినప్పుడు ఆ ప్రచారాన్ని మరింత తీవ్రం చేసి ఆదివాసులపై మరింత హింసను ప్రయోగించడానికి రంగం సిద్ధం చేసుకుంటున్నారు. ఆ విధమైన హింస రాజ్యం అమలు చేయడం సరైందేనని సమాజికామోదం లభించే విధంగా ప్రయత్నిస్తున్నారు.

పదుల సంఖ్యలో ఆదివాసుల్ని, మావోయిస్టుల్ని చంపి.. ప్రజాస్వామ్య దేశంలో ఆయుధాలు పట్టుకొని తిరుగుతూ హత్యలు చేస్తుంటే చూస్తూ వూరుకోవాలా? పారిశ్రామికంగా దేశాన్ని అభివృద్ధి చేస్తుంటే ఇలాంటి అభివృద్ధి నిరోధకులను ఏరి పారెయ్యొద్దా? అంటూ ప్రజాస్వామ్యం గురించి, హక్కుల గురించి నీతులు వల్లిస్తున్నారు. సాయుధులైన మావోయిస్టులకు పోలీసులకు మధ్య అమాయక ఆదివాసులు బలౌతున్నారని ఆవేదన నటిస్తూ ప్రజల్ని నమ్మిస్తున్నారు.

కేంద్రంలో బిజెపి అధికారంలోకొచ్చిన తర్వాత ఇలాంటి మైండ్‌గేమ్ లతో మధ్యతరగతి, ధనిక మేధావి వర్గాన్ని తమవైపు తిప్పుకుంది. ఆదివాసులకు ఎవరు అండగా నిలబడినా, ఆదివాసీ హక్కులు, చట్టాల గురించి ఎవరు మాట్లాడినా వారికి మావోయిస్టులతో సంబంధాలు అంట గట్టి అణచివేస్తున్నారు. హత్యలు చేస్తున్నారు. జైళ్లలో మగ్గుతున్న ఆదివాసు లకు న్యాయ సహాయం చేసే లాయర్లను, రాజ్యహింస గురించి రాసే జర్నలిస్టులను, ప్రొఫెసర్లని, చివరకు క్రైస్తవ మత ప్రచారకులను కూడా వదలకుండా తప్పుడు కేసులు పెట్టి జైళ్లకు పంపుతున్నారు. ఇప్పుడు ఛత్తీస్‌గఢ్ జైళ్లు వాటి కెపాసిటీకి మించి రెండు రెట్లు అధికంగా ఖైదీలతో కిక్కిరిసి ఉన్నాయి. జైళ్లలో కొత్త బ్యారక్‌ల నిర్మాణం జరుగుతూనే ఉంది.

**ప్రజాస్వామిక వాదులందరిపైనా దాడులు**

సంవత్సరాల తరబడి జైళ్లలో అండర్ ట్రయల్ ఖైదీలుగా ఉన్న ఆదివాసులకు న్యాయ సహాయం అందించడానికి ముగ్గురు మహిళా లాయర్లు జగదల్‌పూర్ కేంద్రంగా జగదల్‌పూర్ లీగల్ ఎయిడ్ గ్రూపుగా ఏర్పడ్డారు. ఆమాత్రం సహాయం అందడం కూడా సహించలేని అప్పటి బస్తర్ రేంజ్ ఐజి కల్లూరి, అతని ద్వారా ఏర్పాటు చేయబడ్డ మహిళా ఏక్తామంచ్ ద్వారా దుష్ప్రచారం చేశారు. జగ్‌లాగ్ లాయర్లు బోగస్ లాయర్లని, అసాంఘిక, అనుమానాస్పద కార్యక్రమాలకు పాల్పడుతుంటా రని, మద్యం తాగుతారని ప్రచారం చేశారు. ఇళ్లు అద్దెకిచ్చిన వారిని బెదిరించారు. మధ్యరాత్రుల్లో ఇంటిమీద రాళ్లతో దాడి చేయించారు. జగ్‌లాగ్‌ను ఛత్తీస్‌గడ్ నుండి తరిమికొట్టండి అంటూ పోలీసులు, ఎస్‌పిఒలు దగ్గరుండి వందలాది మందితో ధర్నాలు, ర్యాలీలు చేయించారు. కల్లూరి స్థాపించిన సామాజిక విప్లవ ప్రతిఘాతుక సంఘాలు అనేకం ఉన్నాయి. వాటిలో సామాజిక ఏక్తామంచ్, ఆదివాసీ ఏక్తామంచ్ నాగరిక ఎక్తామంచ్, జనజాగరణ్ అభియాన్, అగ్ని వీటన్నిటికంటే అత్యంత ప్రమాదకరమైన సాయుధ సర్కారీ హంతకముఠా జిల్లా రిజర్వ్ గార్డ్ (స్పెషల్ పోలీసు ఆఫీసర్స్-ఎస్‌పిఒ)లు ప్రధానమైనవి.

ఆదివాసులపై ఎవరు సానుభూతి ప్రకటించినా వారిపై ఎప్పుడు ఎలాంటి ప్రచారం ఏ సంస్థ ద్వారా చేయించాలనేది జిల్లా ఎస్‌పి స్థాయి అధికారి ఆదేశానుసారం అమలౌతూ ఉంటుంది. ఛత్తీస్‌గడ్‌లోని బస్తర్ ప్రాంతమంతా ఆదివాసులు, మావోయిస్టులు అభివృద్ధిని అడ్డుకుంటు న్నారని ఈ సంస్థల ద్వారా ప్రచారం చేయిస్తారు. ఆదివాసులకు అండగా ఉన్న ఆమ్ ఆద్మీ పార్టీ ఛత్తీస్‌గడ్ రాష్ట్ర అధ్యక్షురాలు సోనీ సోరీపై యాసిడ్ దాడి చేయించారు. అనేక తప్పుడు కేసులు పెట్టి జైళ్లలో నిర్బంధించారు. నిజనిర్ధారణ కోసం ఛత్తీస్‌గడ్ వెళ్లిన స్వామి అగ్నివేష్ బృందంపై టమాటాలు, కోడిగుడ్లతో దాడి చేయించారు.

మరోవైపు పోలీసులు జర్నలిస్టులపై, ప్రొఫెసర్లపై తప్పుడు కేసులుపెట్టి వారిని మానసిక శారీరక వేధింపులకు గురిచేస్తున్నారు. ఆదివాసులపై పోలీసుల అత్యాచారాలను మీడియాద్వారా ప్రచారం చేస్తున్న జర్నలిస్టులపై అక్రమ కేసులు పెట్టి నెలల తరబడి జైళ్లలో నిర్బంధిస్తున్నారు. ప్రభాత్ సింగ్ అనే లోకల్ ఈటివి రిపోర్టర్‌ను సివిల్ దుస్తుల్లో ఉన్న పోలీసులు

అతని ఇంటిమీద దాడిచేసి ఇంటి నుంచి ఎత్తుకెళ్లారు. రోజంతా చిత్రహింసలు పెట్టి ఆ మరునాడు తప్పుడు కేసు నమోదు చేసి కోర్టుకు హాజరు పరచారు. గత సంవత్సరం ప్రభాత్ సింగ్‌తో పాటు సోమేరునాగ్, సంతోష్ యాదవ్, దీపక్ జైస్వాల్ అనే జర్నలిస్టులను జైలుకు పంపారు. ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్లు నందినీ సుందర్, అర్చనా ప్రసాద్‌లు బస్తర్ పర్యటన ముగించుకొని వెళ్లిన తర్వాత వీరు పర్యటించిన గ్రామంలో మావోయిస్టు ఇన్‌ఫార్మర్‌ని చంపారు. వీళ్లిచ్చిన సమాచారం ఆధారంగానే చంపారని ఆరోపిస్తూ పోలీసులు వీరిపై 302, 120బితో పాటు అనేక సెక్షన్లు మోపి కేసు నమోదు చేశారు. ఆ విషయం పేపర్లలో వచ్చిన తర్వాత ప్రజల్లో చులకనైన రమణ్‌సింగ్ ప్రభుత్వం ఆ కేసుల్ని వెనక్కు తీసుకుంది.

సాయుధులైన మావోయిస్టుల్ని మాత్రమే రాజ్యం హత్యలు చెయ్యడం లేదు. ఆదివాసులకు ఏ మేరకు సహాయపడినా వారిని అనేక విధాలా వేధింపులకు గురిచేస్తుందనడానికి పైన చెప్పిన సంఘటనలు కొన్ని ఉదాహరణలు మాత్రమే.

2016 డిసెంబర్ 25న జరిగిన మా అరెస్టులు కూడా ఆ కోవకు చెందినవే. డిసెంబర్ 16న పోలీసుల చేతిలో హత్యకు గురైన సోమారు పొట్టం ఎన్‌కౌంటర్ బూటకం అనడానికి ప్రాథమిక సాక్ష్యాధారాలున్నాయని నిర్ధారిస్తూ ఛత్తీస్‌గఢ్ హైకోర్టు సోమారు మృతదేహానికి రీపోస్టు మార్టం చేయించాలని పోలీసులను ఆదేశించింది. జగ్‌లాగ్ అడ్వకేట్ షాలిని గేరా కృషి వల్ల అది సాధ్యమయ్యింది. డిసెంబర్ 25న సోమారు పొట్టం మృతదేహానికి రీపోస్ట్ మార్టమ్ ఏర్పాట్లు జరుగుతున్నాయి. అదే రోజు మేం భద్రాచలం నుండి సోమారు గ్రామం బయలుదేరుతున్నాం. మా రాకతో ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో జరుగుతున్న మానవహననం గురించి రెండు రాష్ట్రాలకు తెలుస్తుందని బెంబేలెత్తిన రమణ్‌సింగ్ ప్రభుత్వం మేం ఛత్తీస్‌గఢ్‌లోకి ప్రవేశించక ముందే అక్రమంగా అరెస్టు చేసింది.

ఆరోజు అనారోగ్యంతో ఆసుపత్రిలో ఉన్న అప్పటి ఐజి కల్లూరి మరుసటి రోజు ప్రెస్‌మీట్ పెట్టి 'హక్కుల కార్యకర్తలు తెల్లబట్టలేసుకున్న మావోయిస్టులు. వీరు అడవిలో ఉండే మావోయిస్టులకంటే ప్రమాదకరం. వీళ్ల అరెస్టు సమయంలో నేనుంటే సీన్ వేరేగా ఉండేది' అని ప్రకటించారు. ఆ తర్వాత దంతెవాడలో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ 'మానవ హక్కుల కార్యకర్తలు మావోయిస్టుల కంటే ప్రమాదకారులు. వారు కనిపిస్తే కుక్కల్ని, పందుల్ని చంపినట్లు లాఠీలతో గుద్ది చంపండి' అన్నారు. దీన్నిబట్టి బస్తర్‌లోని తుపాకీరాజ్యంలో ఆదివాసీ బతుకులు ఎంతగా ఛిద్రమౌతున్నాయో అర్థం చేసుకోవచ్చు.

ఆదివాసుల రక్తంతో బస్తర్ అడవులు తడిసి ముద్దవుతున్నా ఆదివాసులు పోరుబాట వీడటం లేదు. ఎవరికి చేతనైన రీతిలో వారు బస్తర్‌లో ప్రజాస్వామ్యం అమలు కోసం పెనుగులాడుతునేఉన్నారు. బూటకపు ఎదురుకాల్పుల్లో చనిపోయిన రెండు మృతదేహాలకు రీపోస్ట్‌మార్టమ్ చేయాలని డిమాండ్ చేస్తూ ఆ శవాల్ని ఖననం చేయకుండా ఉద్యమించారు. చుట్టుపక్కల గూడేల ప్రజలు ప్రతిరోజూ వందల సంఖ్యలో ఆ గ్రామాన్ని సందర్శించి ఆ ఉద్యమానికి మద్దతు తెలిపారు. సోనీసోరీ నాయకత్వంలో 28 రోజులు ఉద్యమం సాగింది. చివరకు కోర్టు ద్వారా రీపోస్ట్‌మార్టమ్ చేయించిన తర్వాతనే 29వ రోజు శవాల్ని ఖననం చేశారు.

ఆదివాసులు రాజ్యంతో పోరాడుతూ అనుభవిస్తున్న కష్టాలను వారి ద్వారా ప్రత్యక్షంగా తెలుసుకున్న మేము చలించిపోయాం. అంతా విని ఒకరోజు 'మావోయిస్టులకు సహకరించక పోతే మీకే కష్టాలు ఉండవు కదా' అన్నాం. వాళ్లు వింత నవ్వొకటి నవ్వి.. 'ఎవరు ఎవరికి సహకరిస్తున్నారు? సమస్య మాకూ, రాజ్యానికీ మధ్య. మా భూముల్ని లాక్కొని, మా గూడేలను ఖాళీ చెయ్యండని పోలీసులు అంటున్నారు. మేం అందుకు ఒప్పుకోవడం లేదు. దాంతో మాపై ఆయుధాలు ఎక్కుపెడుతున్నారు. గత 30 సంవత్సరాలుగా మాపై దాడి తీవ్రతరం చేస్తున్నారు. మావోయిస్టులు మాకు అండగా ఉంటున్నారు. మేము వాళ్లకు సహకరించడం కాదు. వాళ్లే మాకు సహకరిస్తున్నారు. మాకోసం మాతో పాటు మరణిస్తున్నారు. వాళ్లనే కాదు మాకు సహకరించినోళ్లందరూ రాజ్యానికి వ్యతిరేకులుగా రాజ్యం భావిస్తుంది. అందుకే అలాంటి వారందరిపై తీవ్ర నిర్బంధాన్ని, అణచివేతను కొనసాగిస్తుంది' అని జవాబిచ్చారు.

నక్సల్బరీకి 50 ఏళ్ల సందర్భంగా జరుగుతున్న చర్చలో 'ఈ ఏభై ఏళ్లు నక్సలైట్లు ఏమీ సాధించలేదని, మరో ప్రపంచం ఇంకెంత దూరం ఉందో?' అని హేళన చేస్తున్నారు. అసలు సమస్య మావోయిస్టులది కాదు. ఈ దేశంలోని ప్రజలది. ప్రజల తరపున వారు ఎంచుకున్న మార్గంలో వారు పోరాడుతున్నారు. ఈ పోరాటంలో సామ్రాజ్యవాదుల అండతో ఈ దేశ పాలకులు గెలిస్తే! ఓడేది మావోయిస్టులు కాదు. ఆదివాసులు అంతకంటే కాదు.

ఈ దేశ ప్రజలు. ఈ వాస్తవాన్ని గ్రహించలేని మేధావి వర్గం తప్పుడు సూత్రీకరణలతో వితండవాదనలు, వింత రాతలతో ప్రజల్ని ప్రేక్షకులుగా నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఈ దేశ దోపిడీ పాలకవర్గాలు ఆదివాసులను మాత్రమే విస్థాపనకు గురిచేస్తున్నారనే భ్రమల్లో మైదాన ప్రాంతాల్లోని బుద్ధిజీవులున్నారు. అందుకే అడవుల్ని ధ్వంసం చేస్తున్న పాలకులే 'పచ్చదనం – పర్యావరణం, హరితహారం' పేరుతో ఇంటికొక మొక్క నాటి పర్యావరణాన్ని కాపాడండి" అని పిలుపునిస్తుంటే ఎగేసుకొని పోయి మొక్కలు నాటుతున్నాం. అడవుల్లోని ఆదివాసులు మాత్రమే నిర్వాసితులౌతున్నారని మైదాన ప్రాంత ప్రజలు అనుకునేలా పాలకవర్గాలు నాటకాలాడుతున్నాయి.

పారిశ్రామికాభివృద్ధి పేరుతో మైదాన ప్రాంతాలలో ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలను అనేక విధాలుగా విస్థాపనకు గురిచేస్తున్నారు. విస్థాపనకు గురయ్యే ప్రజలు చేస్తున్న పోరాటాలపై తుపాకులు ఎక్కుపెట్టబడుతున్నాయి. భవిష్యత్ మీద, బతుకు మీద భరోసా లేని రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. చిన్నతరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, చేతివృత్తులు దెబ్బతిని వాటిపై ఆధారపడి బతికే ప్రజలు పట్టణాలలో అడ్డా కూలీలుగా మారుతున్నారు.

మత మైనారిటీలపై హిందూ మతోన్మాద దాడులు తీవ్రతరమౌతున్నాయి. దళితులపై అగ్రకుల భూస్వామ్యదాడులు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. ఇవన్నీ రాజ్యం పీడిత ప్రజలపై చేస్తున్న దాడులే. కావున మైదాన ప్రాంతాలలోని ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీలు ఐక్యంగా పోరాడాల్సిన అవసరం ఉందని బస్తర్ మనల్ని హెచ్చరిస్తుంది.

*(రచయిత రాష్ట్ర అధ్యక్షులు, కుల నిర్మూలన పోరాట సమితి, ఏపి)* వీ

# సామాజిక జీవనాన్ని ఛిద్రం చేస్తున్న మద్యం

***ఆదాయం పెంచేందుకే అంటూ నూతన మద్యం విధానాన్ని ప్రకటించిన చంద్రబాబు ప్రభుత్వం శ్రామిక, అణగారిన వర్గాలను మద్యం మత్తులో ముంచుతోందనీ, ప్రజలు ఐకమత్యంగా ఈ మద్యం మహమ్మరికి వ్యతిరేకంగా పోరాడాలనీ అంటున్నారు*** **ముప్పాళ్ళ భార్గవశ్రీ**

ప్రస్తుత బార్‌ల లైసెన్సుల కాలపరిమితి జూన్ నెలాఖరుతో ముగియడంతో జూన్ 15న సమావేశమైన చంద్రబాబు ప్రభుత్వ కాబినెట్ మంత్రివర్గం నూతన బార్ల లైసెన్సుల విధానాన్ని ప్రకటించి మద్యం విధానం పట్ల తన అసలు స్వరూపాన్ని ప్రకటించుకొంది. గత సంవత్సరం ప్రకటించిన మద్యం విధానం సందర్భంగా తమిళనాడులో అమలులో ఉన్న 'రాష్ట్ర ప్రభుత్వమే మద్యం విక్రయాలు చేపట్టితే రాష్ట్ర ప్రభుత్వానికే పెద్ద ఎత్తున ఆదాయం వస్తుందని, 15వేల మందికి ఉద్యోగాలు కల్పించవచ్చని, హోల్‌సేల్ రిటైల్ వ్యాపారాలు తమ చేతిలోనే ఉంటాయని' ప్రకటించి చివరికి అలా చేయాలంటే మౌలిక వసతుల కల్పనలో ఇబ్బందులుంటాయనే సాకుతో తమిళనాడు విధానానికి మంగళం పాడి పాత విధానాన్ని అమలు జరపడానికి మద్యం మాఫియా వత్తిడే కారణమన్నది బహిరంగ రహస్యం. గతంలో లాగానే ఇప్పుడు కూడా లాటరీ విధానం ద్వారానే మద్యం దుకాణాలకు లైసెన్సులు జారీ చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. మద్యం మాఫియా అధిపత్యాన్ని, అరాచకాలను అరికట్టాలనే పేరుతో వేలం పాటలకు బదులు లాటరీ విధానాన్ని గతంలోనే తీసుకొచ్చింది. వేలం పాటల్లో అనుసరించిన విధానాన్నే లాటరీ విధానంలో కూడా కాంట్రాక్టర్లు సిండికేటుగా ఏర్పడడం, ప్రభుత్వం విధించిన నిబంధనల ప్రకారం ఆదాయపు పన్ను కడుతున్న తమ కుటుంబ సభ్యుల చేత లేక సన్నిహితుల చేత బినామీ దరఖాస్తులు పెట్టించడం, సిండికేట్‌లకు లొంగని వారిని వివిధ ప్రక్రియల్లో దారికి తెచ్చుకోవటం మాఫియా శక్తులకు వెన్నతో బెట్టిన విద్య.

జూలై ఒకటి నుంచి అమల్లోకి వచ్చిన నూతన మద్యం విధానం పేరుతో చంద్రబాబు ప్రభుత్వం దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవడంతో పాటు అధికారం పోయిన తర్వాత కూడా తన అనుచరగణం మద్యం వ్యాపారంలో లాభాలు గడించేలా ఏడాదికోసారి బార్ల లైసెన్సులకు బదులు ఐదేళ్లపాటు బార్ల లైసెన్సులను మంజూరు చేసే అసాధారణ నిర్ణయం చేయడానికి తెగబడింది. ఈ నిర్ణయంతో కోట్లకు పడగలెత్తే మద్యం మాఫియా నుండి కోట్లు దండుకోవడానికి మంత్రుల స్థాయిలో చీకటి పథకాలు రూపుదిద్దుకొంటున్నట్లు కథనాలు వెలుగులోకి వస్తున్నాయి.

బార్లను జాతీయ రహదారులకు 500 మీటర్ల లోపు, రాష్ట్ర రహదారులకు 250 మీటర్ల లోపు ఏర్పాటు చేయకూడదని గత డిసెంబర్‌లో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును రాష్ట్ర ప్రభుత్వం నీరుగార్చడానికి రాష్ట్ర రహదారులను జిల్లాల్లో, జిల్లా ప్రధాన రహదారులుగా, పట్టణ ప్రాంతాల గుండా వెళ్లే జాతీయరహదారుల పేర్లను పట్టణ రహదారులు, మున్సిపల్ రహదారులుగా మార్చే ప్రయత్నాలకు ఊతం ఇస్తూ సుప్రీంకోర్టు కూడా జాతీయ రహదారులను డీ నోటీపై చేయడానికి వెనుకాడలేదు. ఈపేరుతో మరిన్ని బార్‌లకు లైసెన్సులను మంజూరు చేసి రహదారులపై మరిన్ని ప్రాణాలను బలిగొనడానికి పాలకులు ఏమాత్రం వెనకాడడం లేదు. గత సంవత్సరం హైదరాబాదు పంజాగుట్ట వద్ద ఏడుగురు ఇంజనీరింగ్ విద్యార్థులు తప్పతాగి వేగంగా కారునడిపి ఒకే కుటుంబంలో ముగ్గుర్ని బలి తీసుకోవడం, విజయవాడ గొల్లపూడి వద్ద తాగి ఉన్న డ్రైవర్ అతివేగంతో బస్సును అడ్డదిడ్డంగా నడిపి ఐదుగురు యువ మెడికోల ప్రాణాలను తీయడం, ఇటీవల కాళహస్తి వద్ద లారీ డ్రైవర్ తప్పతాగి లారీని రోడ్డు పక్క ఉన్న జనం పైకి తోలటంతో 17మంది అమాయక ప్రజల ప్రాణాలు గాల్లో కలిసిపోవడం, నిన్నగాక మొన్న మున్సిపల్ శాఖామంత్రి నారాయణ కొడుకు హైదరాబాద్‌లో అర్ధరాత్రి తప్ప తాగి కార్ డ్రైవ్ చేయడంతో కారు ఫ్లైఓవర్ పిల్లర్‌కు ఢీకొని అతనితో పాటు ఉన్న స్నేహితుడు కూడా స్పాట్‌లో చనిపోవడం లాంటి ఘోర ప్రమాదాలు జరుగుతున్నా పాలకులు మద్య నిషేధం గురించి తీవ్రంగా ఆలోచించాల్సింది పోయి సినిమా, సీరియల్స్‌లో తాగుతున్న సన్నివేశాలు వచ్చినప్పుడు 'మద్యపానం చేయడం ఆరోగ్యానికి హానికరం' లాంటి ప్రకటనలను పూర్తిగా కనిపించని చిన్న అక్షరాలలో ప్రకటించి ప్రజల్ని మభ్యపెట్టే జిమ్మిక్కులకు పాలకులు పాల్పడుతున్నారు.

ఎక్సైజ్ శాఖలో ప్రోహిబిషన్ డిపార్ట్‌మెంట్ ఆఫీస్‌లు రాష్ట్రంలో చాలా ఉన్నాయి. ఈ డిపార్టుమెంట్ కర్తవ్యం మద్యపాన నిషేధాన్ని అమలు చేయాలి. ఒకవైపు ప్రభుత్వం మద్యపానాన్ని ఒక విధానంగా కొనసాగిస్తుంటే ప్రోహిబిషన్ డిపార్టుమెంట్‌లను కొనసాగించడం ప్రజల్ని మోసగించడం కాదా! మరో వైపు పోలీసు శాఖ డ్రంక్ & డ్రైవ్ పేరుతో తాగి వాహనాలు నడిపే వారిపై కేసులు పెడుతూ రోడ్డు ప్రమాదాలను తగ్గిస్తున్నామని ప్రచారం చేసుకొంటున్నారు. అలానే వైద్య, ఆరోగ్య, కుటుంబ సంక్షేమ శాఖల ఆధ్వర్యంలో రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లో సారా తాగే అలవాటును మాన్పించడం కోసం (డిఎడిక్షన్ సెంటర్స్) కేంద్రాలను ఏర్పాటు చేయడం విడ్డూరంగా ఉంది. నూతన మద్యం విధానంలో భాగంగా మరిన్ని మద్యం షాపులను పెంచడానికి లైసెన్సులు ఇస్తూ, మద్యం షాపులను జనావాసాల మధ్యనే కాక 10 వేల చ.మీ విస్తీర్ణం పైన ఉన్న షాపింగ్ మాల్స్, హైబ్రిడ్ హైపర్ మార్కెట్లలో మద్యం దుకాణాల ఏర్పాటుకు అనుమతులు ఇస్తూ ఉంటే డిఎడిక్షన్ సెంటర్స్ నిర్వహించడం ద్వారా ప్రజల్ని ఎంతకాలం మోసం చేయగలుగుతారు.

మద్యం వలన ఎన్ని పేద కుటుంబాలు కూలిపోయినా, ఎంతమంది ప్రాణాలు అర్ధాంతరంగా గాలిలో కల్సిపోయినా పాలకులకు చీమకుట్టినట్లుఅయినా ఉండకపోగా మద్యంపై కుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్న ఆదాయం మత్తులో జోగుతున్నారు తప్పితే ప్రజల సంక్షేమం గురించి ఆలోచిస్తున్న పాపాన పోలేదు. 2013-14 ఆర్థిక సంవత్సరానికి మద్యం అమ్మకాలపై రాష్ట్ర ప్రభుత్వానికి అధికారిక లెక్కల ప్రకారం దాదాపు రు.9 వేల కోట్ల ఆదాయం రాగా, 2016-17 సంవత్సరానికి రు.14వేల కోట్లకు ఆదాయం పెరిగిపోవడం అంటే

పాలకులు ప్రజల్ని మరింతగా మత్తులో ముంచే పథకాలలో మునిగి తేలుతున్నారని తేటతెల్లమౌతుంది. అధికారికంగా ప్రభుత్వానికే ఇంత ఆదాయం వచ్చిందంటే ప్రభుత్వానికి సమాంతరంగా మద్యం వ్యాపారం సాగిస్తున్న మద్యం మాఫియా శక్తుల ఆదాయాలు ఎంతగా మేటలు వేస్తున్నాయో వేరే వివరించనవసరం లేదు.

జూదం, వ్యభిచారం, మత్తు పదార్థాలు, లాటరీలు వంటి వాటిని ప్రభుత్వాలు ఆదాయవనరులుగా పరిగణించరాదని రాజ్యాంగంలోని 47వ నిబంధన స్పష్టం చేస్తున్నప్పటికీ ప్రజల్ని ఎంతగా మత్తులో ముంచితే అంతగా అధికారం మాటున రాజకీయ ప్రయోజనాలను పొందడానికి రుచి మరిగిన పాలక పార్టీలు తాము రాసుకున్న రాజ్యాంగాన్ని గౌరవించుకోలేని కుహనా శక్తుల జాబితాలో చేరినా ఏమాత్రం సిగ్గుపడలేని స్థితికి దిగజారాయి. దేశంలో మద్యపాన వ్యసనం పెరిగిపోవటం, దాని వల్ల అనేక అనర్థాలు జరగడం పట్ల "రోగగ్రస్త జాతిని తయారుచేయకండి. మద్యం పరవళ్లకు పగ్గం వేయండి" అంటూ రాష్ట్ర ప్రభుత్వాలను గతంలోనే సుప్రీంకోర్టు హెచ్చరించినా మద్యం ద్వారా అనేక ప్రయోజనాలు పొందుతున్న రాష్ట్ర ప్రభుత్వాలకు ఈ హెచ్చరిక కనువిప్పు కల్గించుతుందనుకోవడం వట్టి భ్రమ.

ప్రజల కనీస అవసరాలైన విద్య, ఆరోగ్యం, ఉపాధి, మౌలిక సదుపాయాల కల్పన మొదలైన వాటిని ప్రజల సంక్షేమంగా భావించినట్లయితే, మన రాష్ట్రంలో సంక్షేమం పేరిట వివిధ ప్రభుత్వ పథకాల ద్వారా ఒక్కో కుటుంబానికి సగటున చేస్తున్న ఖర్చు రు.3,850లు కాగా, మద్యం ద్వారా సగటున ఒక కుటుంబం నుండి పిండుతన్న మొత్తం రు.6,500లుగా ఉంది. అంటే సంక్షేమ పథకాలకు ప్రభుత్వం కేటాయిస్తున్న డబ్బు కూడా చాలనంతగా ప్రజల్ని త్రాగించి ముఖ్యంగా పేదవర్గాల జీవితాలతో పాలకులు చెలగాటం ఆడుతున్నారన్నది నగ్నసత్యం. పాలకులు ప్రకటిస్తున్న సంక్షేమ పథకాల వెనుక దాగున్న అసలు 'పథకాలు' ఏమిటో దీనిని బట్టి తేటతెల్లం అవుతున్నది.

చంద్రబాబు ప్రభుత్వం నూతన మద్యం విధానంలో భాగంగా 4380 మద్యం దుకాణాలకు, 830 బార్లకు అనుమతి ఇవ్వడంతో మద్యం వ్యాపారులు చెలరేగిపోయి నిత్యం రద్దీగా ఉండే రోడ్ల పక్కన, పట్టణాలు నగరాల్లో ప్రజలు నివసించే ప్రాంతాల్లో, మూతపడిపోయిన సినిమా హాళ్ళు, రైస్ మిల్లులు, వాటర్ ప్లాంట్‌లలో ఆఖరికి బడి, గుడి కూడా చూడకుండా మద్యం షాపులు పెట్టడంపై రాష్ట్రంలోని అన్ని ముఖ్య నగరాల్లోనే కాక గ్రామ స్థాయిలో కూడా ముఖ్యంగా పేద, మధ్య తరగతి వర్గాల మహిళలు ధర్నాలు, రాస్తారోకోలతో పాటు మద్యం షాపులకు తాళాలు వేయడం, కొన్ని చోట్ల ఆగ్రహించిన మహిళలు మద్యం సీసాలను ధ్వంసం చేయడం, లైసెన్సు షాపులకు సమాంతరంగా నడుస్తున్న బెల్టు షాపులను రద్దు చేయాలని మిలిటెంట్ ఆందోళనలు రాష్ట్రవ్యాపితంగా ఊపందుకొంటున్నాయి. ఇదే సమయంలో జూలై 8,9 తేదీలలో గుంటూరు దగ్గర జరిగిన వైయస్ఆర్ పార్టీ రాష్ట్ర ప్లీనరీ సమావేశం ముగింపు సందర్భంగా ఆ పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు జగన్‌మోహన్‌రెడ్డి ప్రకటించిన నవరత్నాలు సంక్షేమ పథకాల్లో ఒకటైన మద్య నిషేధాన్ని మూడు అంచెలలో అమలు పరుస్తానని ప్రకటించారు. పెరుగుతున్న ప్రజల ఆందోళనతో పాటు జగన్ పార్టీ ఊహించని విధంగా మద్యం పై ప్రకటన చేయడంతో చంద్రబాబు ప్రభుత్వం ముంచుకొస్తున్న మద్యం వ్యతిరేక ఉద్యమాన్ని నీరుగార్చటానికి, అంతకంటే రాబోయే ఎన్నికల్లో ఎవరి ఓట్లు అయితే నాయకుల జాతకాలను మారుస్తాయో ఆ మహిళల ఓట్లను రాబట్టుకోవాలనే పథకంలో భాగంగా జూలై 18న అర్జంట్‌గా భేటి అయిన క్యాబినెట్ మంత్రి వర్గ సమావేశంలో చంద్రబాబు ప్రభుత్వం మరుసటి రోజు నుండే "ప్రభుత్వానికి రు.10-20 కోట్లు ఆదాయం తగ్గినా ఫర్లేదు. బెల్టు షాపులన్నీ తొలగించండి. మహిళల అభీష్టం మేరకు ఈ నిర్ణయం అమలు కావాలి." అని పోలీసు, ఎక్సైజ్ శాఖల అధికారులకు హుకుం జారీ చేసింది.

చంద్రబాబు ప్రభుత్వం ఇంతటితో ఆగకుండా జూలై 18వ తేదీన బెల్టు షాపుల రద్దుకు జిఓ కూడా జారీ చేసింది. అంటే ఇంతవరకు రాష్ట్ర వ్యాప్తంగా వేల సంఖ్యలో అనధికారంగా సాగుతున్న బెల్టు షాపులను నడుపుతున్నట్లు ప్రభుత్వం అంగీకరించటమే కదా! అంతేకాక ఒక వ్యవస్థగా నడుస్తున్న బెల్టు షాపులను కేబినెట్ నిర్ణయం తీసుకొన్న మరుసటి రోజే అల్లావుద్దీన్ అద్భుత దీపం లాగా లేకుండా మాయం చేస్తామని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించడం అంటే ప్రజల చెవుల్లో పూలు పెట్టడమే కదా! ఎందుకంటే జూన్ 8, 2014 నాడు చంద్రబాబు ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసిన సభలో 5 దస్త్రాలపై చేసిన తొలి సంతకాల్లో రాష్ట్రంలో బెల్టు షాపుల రద్దు దస్త్రం ఒకటి. మరి ఈ మూడు సంవత్సరాల్లో సాధ్యం కానిది ఇప్పుడు అర్జంట్ నిర్ణయంతో సాధ్యం అవుతుందా! ప్రజల్ని మభ్యపెట్టడానికి అధికారుల దాడులతో బెల్టు షాపులు కొన్ని రోజులు ఆగినా వీటిని సరికొత్త రూపాల్లో సాగించటం ఇలాంటి వ్యవహారాల్లో ఆరితేరిన మద్యం మాఫియాకు ఏ మాత్రం కష్టం కాదు, కొత్త కాదు.

ముఖ్యమైన ఆదాయవనరుగా మద్యం వ్యాపారాన్ని చూసినంతకాలం ఏ పార్టీ అధికారంలో ఉన్నా మద్యం అక్రమ వ్యాపారాన్ని అపలేవు. ఇవి కవల పిల్లల లాంటివి. అప్పుడు చంద్రబాబు తొలి సంతకం బెల్టుషాపుల రద్దు కోసం చేసినా ఆచరణలో ఈ మూడు సంవత్సరాల పాటు పూర్తిగా ప్రోత్సహించాడు. రేపు కూడా బెల్టుషాపులపై కొరడా ఝుళిపించడం కన్నీటి తుడుపు చర్యగా మాత్రమే మిగులుతుంది. ఎందుకంటే పాలక వర్గాల మద్యం విధానంలో తాము అధికారం నిలబెట్టుకోవడానికి ముఖ్యంగా అవసరమైన మద్యం మాఫియా ఆదాయ వనరులను పెంచడం లాంటి పరస్పర ప్రయోజనాలు దీనిలో ఇమిడి ఉన్నాయి. మద్యం విధానం మూలాల్లోకి వెళితే ఇది అర్ధవలస-అర్ధఫ్యూడల్ వ్యవస్థలో భాగంగానే మనకి సంక్రమించింది. తమ దోపిడి వ్యవస్థలను కాపాడుకోవడానికి రాజుల కాలం నుంచి నేటి కాలం వరకు పాలకులకు మద్యపానం ఒక ముఖ్యమైన ఆయుధంగా ఉపయోగపడుతున్నది. ఈ ఆయుధంతోనే ప్రజల్ని తాగించి అధికార పీఠాలను నిలబెట్టుకుంటున్నారు. కావున ఇది ఒక రాష్ట్రానికి సంబంధించిన సమస్య మాత్రమే కాదు. దోపిడీ వ్యవస్థలో భాగంగానే సంక్రమించింది కనుక ఎపిలోనే కాక అనేక రాష్ట్రాల్లో మద్యం వ్యతిరేక ఉద్యమాలు వివిధ స్థాయిలలో సాగుతున్నాయి. అయినా కేంద్రంలో ఉన్న మోడీ ప్రభుత్వం సమాజంలో ముఖ్యమైన రుగ్మతగా ఉన్నా మద్యం విధానం పట్ల మౌనాన్ని పాటించడం ద్వారా తన అసలు వైఖరిని బహిర్గతం చేసుకొంటున్నది. నానాటికీ పెరిగిపోతున్న నిరుద్యోగ యువతను ఎన్నికల్లో రిగ్గింగ్‌లకు పాల్పడే ప్రైవేట్ సైన్యాల్లోకి ఆకర్షిస్తున్నారు. అన్ని ప్రాంతాల్లో ముఖ్యంగా రాయలసీమ జిల్లాలో ఫ్యాక్షన్ ముఠాలు తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవడానికి యువతకు తాగబోయించి వారి భవిష్యత్తును నాశనం చేస్తున్నారు. ముఖ్యంగా అణగారిన ప్రజల పేదరికాన్ని, బలహీనతలను అడ్డుగా పెట్టుకొని గ్రామాల్లోని పేద వర్గాలకు తాగబోయించి తమ ముఠా రాజకీయల ప్రయోజనాల కోసం వారిని బలిపశువులను చేస్తున్నారు. అలానే ప్రజల బలహీనతల్ని సొమ్ము చేసుకోవడానికి ఎన్నికల సమయంలో పాలకవర్గ పార్టీలు అధికారాన్ని

# మన్యంలో మైనింగ్ పేరుతో విధ్వంసం

***విశాఖ మన్యం ప్రాంతంలో ఉన్న ఖనిజ సంపద దోచుకోవడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అక్కడ నివసిస్తున్న ఆదివాసులపై తీవ్ర నిర్బంధాన్ని అమలు చేస్తున్నాయనీ, దీనికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యవాదులందరూ ఐక్యంగా పోరాడాలని అంటున్నారు* కొర్ర జ్యోతి**

విశాఖ మన్యం అంటేనే పచ్చని అడవులు, జలజలా పారే సెలయేర్లు, రకరకాల వణ్య ప్రాణులు. మన దేశంలోనే గుర్తింపు పొందిన కమ్మని కాఫీ తోటలు (60,000 హెక్టార్లు), ఈ కొండలలోనే రకరకాల విలువైన ఖనిజాలు, బాక్సైట్, ఇనుము, నాపరాయి, రంగురాళ్లు, చైనా క్లే, పింగాని, గ్రానైట్, గ్రావేల్ వంటి ముఖ్యమైన గనులు. వీటి మధ్యలోనే 33 తెగల ఆదివాసులు ఆహ్లాదకరమైన ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో తమ సొంత కాళ్లపై నిలబడి స్వతంత్రమైన జీవితాన్ని సాగిస్తున్నారు. ఈ స్వేచ్ఛా జీవితాన్ని ధ్వంసం చేయడానికి మనదేశ పాలకులు 70 సంవత్సరాల నుంచి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో పూనుకుంటున్నారు. 2014 మేలో దేశంలో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో దేశంలో బిజెపి ప్రభుత్వం 224 సీట్లను కైవసం చేసుకుని 3 దశాబ్దాలుగా ఏ ప్రభుత్వం సాధించలేని మెజార్టీని గెలుచుకుంది. ఈ మెజార్టీ రావడంతో దేశంలో బ్రాహ్మణ హిందూ ఫాసిజాన్ని దేశ వ్యాప్తంగా వ్యాపించచడానికి సామ్రాజ్యవాదుల విధానాలను బలంగా అమలు చేయడానికి బిజెపి ప్రభుత్వానికి బలమైన సాధికారత చేకూరింది. దీంతో దేశ వనరులను సామ్రాజ్యవాద కార్పొరేట్ కంపెనీలకు టోకున కట్టబెట్టడానికి పాలకులు పూనుకున్నారు.

భారతదేశాన్ని అభివృద్ధి పథంలో ముందుకు తీసుకుపోతుంది ఒక్క బిజెపి ప్రభుత్వం మాత్రమే అంటూ, నరేంద్రమోడీ ముఠా అయిన అరుణ్ జైట్లీ, రాజ్‌నాథ్ సింగ్, వెంకయ్యానాయుడు, అమీత్‌షాలు ఊదరగొడు తున్నారు. బిజెపి విధానాలను, మోడీని ఎత్తిపడుతూ కేంద్ర సమాచార ప్రసారాల శాఖా మంత్రి అబద్దాల వెంకయ్యానాయుడు ప్రతిరోజు గావుకేకలు పెడుతున్నాడు. దేశంలో పెద్దనోట్ల రద్దు ద్వారా విదేశాల్లో ఉన్న అక్రమ సంపద స్వదేశానికి చేరిందని, దేశంలో తీవ్రవాద కార్యకలాపాలు తగ్గాయని, (700 మంది లొంగిపోయారని) దేశ అభివృద్ధికి మంచి అవకాశమని, దీన్ని దేశ ప్రజలు స్వాగతిస్తున్నారని, బిజెపి నాయకులు అబద్దాలను నిజాలుగా వల్లిస్తూ పదే పదే ఊకదంపుడు ఉపన్యాసాలు ఇస్తున్నారు.

పెద్దనోట్ల రద్దు ద్వారా దేశంలో పేద బడుగు, బలహీన, మధ్యతరగతి వర్గాల నడ్డి విరిగి మూలిగే నక్కపై తాటి పండు పడ్డ చందంగా దిగజారిందే తప్ప, ధనవంతుడికి దీని ద్వారా జరిగిన నష్టం ఏమీ లేదు. భారతదేశంలో బ్రాహ్మణ హిందూ ఫాసిజాన్ని వ్యాపింప చేయడం కోసం దేశంలో పేద వర్గాలైన ఆదివాసి, దళిత, మైనార్టీ, క్రిష్టియన్, ముస్లింలపై

---

దక్కించుకోవడానికి డబ్బుతో పాటు మద్యాన్ని పెద్ద ఆయుధంగా ఉపయోగించుకొంటున్నాయన్న విషయం బహిరంగ రహస్యంగా మారిపోయింది. అంతే కాదు ఈ మద్యం వ్యాపారంలో ఎక్కువ భాగం అధికార పార్టీకి చెందిన కార్పొరేటర్ మొదలుకొని ఎంఎల్ఎ, ఎంపి, మంత్రుల వరకు భాగస్వాములుగా ఉంటూ కోట్లకు పడగలెత్తుతున్నారు. అంతేకాక ప్రభుత్వం మద్యం విధానం కొనసాగించేలా నిర్ణయాలు తీసుకోవటంలో మంత్రి వర్గ స్థాయిలో ఈ శక్తులు కీలక పట్టును కల్గి ఉంటున్నారు. కాబట్టి అక్రమ మద్యం వ్యాపారంపై ఉక్కుపాదం మోపుతామన్న ప్రభుత్వాల ప్రకటనలు ప్రజల్ని మరి కొంత కాలం మోసగించడానికి ఉపయోగపడేవి మాత్రమే సుమా!

ప్రజల సాంఘిక జీవనాన్ని విచ్ఛిన్నం చేస్తూ దేశ సౌభాగ్యానికి మూల స్తంబాలుగా నిలబడాల్సిన యువతను బలహీనం చేసి పెడదారి పట్టిస్తున్నారు. అణగారిన శ్రామిక ప్రజలను సాంఘికంగా అభివృద్ధి కానీయకుండా, వారి బలహీనతలను సొమ్ము చేసుకొని చౌకగా లభించే కూలీలను గ్యారెంటీ చేసుకొనే ఫ్యూడల్ విధానాలను సరికొత్త రూపాలలో చేపడుతున్నారు. నీతి నియమాలకంటే అధికారమే పరమావధిగా భావించే పాలక పార్టీలు ఎవరు అధికారంలో ఉన్న ప్రజల్ని దగా చేసే విధానాలనే చేపడతారు. కావున ఇప్పుడు ఇళ్ల మధ్య అక్రమంగా ఏర్పాటు చేస్తున్న మద్యం దుకాణాలను ధ్వంసం చేసే క్రమంలోనే ప్రజల సామాజిక జీవనాన్ని విచ్ఛినం చేస్తున్న మద్యం వ్యాపారాన్ని సమూలంగా నాశనం చేసే వైపుగా మద్యం వ్యతిరేక ఉద్యమం అంచెలంచెలుగా ఎదిగేలా మద్యం వ్యతిరేక ఉద్యమం అభివృద్ధి కావాలి. విప్లవకారులు కోరుతున్నట్లు నేటి దోపిడీ వ్యవస్థ స్థానంలో జనతా ప్రజాస్వామిక ఉద్యమ కర్తవ్యాలను సాధించే ఉద్యమంలో భాగంగా మద్యం వ్యతిరేక ఉద్యమం నిరంతరం సాగాల్సిన అవసరం ఉంది. గతంలో సాగిన సారా వ్యతిరేక ఉద్యమాలు అందించిన అనుభవాలు, గుణపాఠాల వెలుగులో ఉద్యమం సాగాలి. 1990లో నెల్లూరు జిల్లా దూబగుంట నుంచి ప్రారంభమైన సారా వ్యతిరేక ఉద్యమం 1992 నాటికి రాష్ట్ర వ్యాప్తంగా ఉధృత రూపం దాల్చడంతో 1994లో జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో టిడిపి వ్యవస్థాపక నాయకుడు ఎన్‌టి. రామారావు తన పార్టీని గెలిపిస్తే పూర్తి మద్యం నిషేధాన్ని ప్రకటిస్తానని వాగ్దానం చేశాడు. ఈ ముఖ్యమైన హామీతో అధికారంలోకి వచ్చిన ఎన్‌టిఆర్ రాష్ట్రంలో మద్య నిషేధాన్ని ప్రకటించి అమలు చేశాడు. అయితే కొంతకాలానికే టిడిపిలో అధికారం కోసం జరిగిన కుమ్ములాటలో చంద్రబాబు పైచేయి సాధించి అధికారం కైవసం చేసుకొని రాష్ట్ర ఆర్థిక పరిస్థితి లోటు బడ్జెట్‌లో ఉందనే సాకుతో తిరిగి మద్యపాన విధానానికి పచ్చజెండా ఊపాడు. చంద్రబాబు ప్రభుత్వం రేపు రాబోయే అసెంబ్లీ ఎన్నికల్లో అధికారాన్ని దక్కించుకోవడానికి అనేక అభివృద్ధి పథకాలతో పాటు బెల్టుషాపు రద్దు పేరుతో ప్రజల్ని మోసగించడానికి ప్రయత్నాలు సాగిస్తున్నది. ప్రజల నెత్తిన కరాళ నృత్యం చేస్తున్న మద్యం మహమ్మారిని పెంచి పోషిస్తున్న పాలకులను బోనులో నిలబెట్టే వరకూ అవిశ్రాంత పోరాటం కొనసాగించాలి.

*(రచయిత సి.పి.ఐ (యం.యల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

దాడులు పెరిగాయి. గోవు మాంసం పేరుతో దేశంలో దళితులపై రోజుకో దాడి జరుగుతుంది. ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్యం గల దేశమని పాలకులు చెప్పడం సిగ్గుచేటు. కేంద్రంలో బిజెపి, రాష్ట్రాల్లో (తెలుగు రాష్ట్రాలు) టిడిపి, టిఆర్ఎస్‌లు అధికారం చేపట్టిన మూడు సంవత్సరాల కాలంలో (దేశాన్ని, రాష్ట్రాలను) సైనిక పాలనపై ఆధారపడుతూ, తమ అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం హింసను సృష్టిస్తూ, ప్రజల జీవించే స్వేచ్ఛను హరించి వేస్తున్నాయి.

బిజెపి అనుబంధ సంస్థలైన ఆర్ఎస్ఎస్, విశ్వహిందూ పరిషత్, హిందూ వాహిని, భజరంగ్‌దళ్, ఎబివిపి, యువ మోర్చ వంటివి మొదలుకొని కేంద్ర పారా మిలటరీ బలగాల నుంచి ప్రైవేట్ గూండాలైన గ్రేహౌండ్స్, కోబ్రా, సి. 60 కమాండో, కోయ కమాండో, సల్వాజుడుం, ఆర్మ్‌డ్‌వాహిని వంటి బలగాలు ప్రజలపై మరీ ముఖ్యంగా దేశానికి మూల వాసులైన ఆదివాసులపై, వీరి గ్రామాలపై దాడులు చేసి విధ్వంసం సృష్టిస్తున్నారు. పంటలను ధ్వంసం చేస్తున్నారు. స్త్రీలపై అత్యాచారాలు చేయడం, హత్యలు చేయడం వంటి దుర్మార్గాలకు పూనుకుంటున్నారు. మరో పక్కన మన దేశం ప్రజాస్వామ్య దేశమని, అబద్ధాలను నిజాలుగా వల్లించడంలో మోడీ, వెంకయ్య, అరుణ్ జైట్లీ, రాజ్‌నాథ్ సింగ్, అమిత్‌షాలకు వెన్నతో పెట్టిన విద్యగా మారింది. గుజరాత్‌లో మారణ హోమాన్ని సృష్టించిన మోడీ దేశానికి ప్రధాని కావడం, అమిత్‌షా జాతీయ అధ్యక్షుడు కావడంలోనే మన దేశ రాజకీయ వ్యవస్థ ఎంత దౌర్భాగ్య స్థితిలోకి దిగజారిందో ప్రజలు అర్థం చేసుకోవచ్చు.

ఈ రోజు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలలో జరుగుతుంది కూడా అదే. అధికారాన్ని అడ్డుపెట్టుకున్న టిడిపి, టిఆర్ఎస్ నాయకులు గల్లి సార బట్టీల నుంచి భూ కబ్జాలు, రియల్ ఎస్టేట్, సెజ్‌లు, పార్క్‌లు, ప్రాజెక్టులు, గనుల తవ్వకాల వంటివి మొదలుకొని, చివరికి స్త్రీలపై అత్యాచారాలు, హత్యల వరకు వీరి పదవులను, అధికారాన్ని అడ్డు పెట్టుకుంటున్నారు. రాజకీయం అంటేనే 5 సంవత్సరాల లోపు ధనాన్ని కూడబెట్టుకునే వ్యాపారంగా మారిపోయింది. రాష్ట్రంలో టిడిపి నాయకుల ఆగడాలకు అడ్డు అదుపు లేకుండా పోయింది. విశాఖలో 270 ఎకరాలలో 265 ఎకరాలు అధికార పార్టీ నేతలు, కాంగ్రెస్ పార్టీ నేతలు కుమ్మక్కై బినామి పట్టాల పేరుతో స్థానిక ప్రజల నుంచి బలవంతంగా స్వాధీనం చేసుకున్నారు. అమరావతి నగరంలో రాజధాని పేరుతో నారా లోకేష్ 500 ఎకరాల భూమిని కొనుగోలు చేశాడు. చెల్లించింది 50 కోట్లు. ప్రస్తుత విలువ 650 కోట్లు. సుజన చౌదరి 700 ఎకరాల భూమిని కొనుగోలు చేశాడు. చెల్లించింది 35 కోట్లు. ప్రస్తుత విలువ 700 కోట్లు. మురళీ మోహన్ 53 ఎకరాల భూమిని కొనుగోలు చేశాడు. చెల్లించింది 16 కోట్లు. ప్రస్తుత విలువ 212 కోట్లు. రావెల కిషోర్‌బాబు 55 ఎకరాల భూమిని కొనుగోలు చేశాడు. చెల్లించింది 5.5 కోట్లు. ప్రస్తుత విలువ 85.5 కోట్లు. పత్తిపాటి పుల్లారావు 196 ఎకరాల భూమిని కొనుగోలు చేశాడు. చెల్లించింది 39 కోట్లు. ప్రస్తుత విలువ 784 కోట్లు. దేవినేని 86 ఎకరాలు, నారాయణ 3.129 ఎకరాలు, కొమ్ములపాటి 42 ఎకరాలు కొనుగోలు చేసి వీరి విలాస భోగాల కోసం, రియల్ ఎస్టేట్, సెజ్‌లు, గనులు, పార్క్‌లు, ప్రాజెక్టులు, విమానాశ్రయాలు, రాజధాని రింగురోడ్డు, పోలీస్ ఫీల్డ్ ఫైరింగ్ కేంద్రాలు వంటి పేరుతో భూములను బలవంతంగా రైతుల నుంచి కబ్జా చేస్తూ, భూమి నుంచి గెంటివేస్తున్నారు. వారి భూమిలో వారినే కట్టు బానిసలుగా, కూలీలుగా మార్చుతూ, రాజకీయ నాయకులు రాజభోగాలను అనుభవిస్తున్నారు.

వీరి కన్ను విశాఖ మన్యంపై పడింది. గనుల పేరుతో మన్యాన్ని విధ్వంసం చేస్తున్నారు. ఒక అనకాపల్లి గనులు, భూగర్భ గనులశాఖ పరిధిలోనే 363 క్వారీలు, 24 క్రషర్‌లు ఉన్నాయి. ఈ ప్రాంతంలో రాతి, తెల్ల గ్రానైట్, గ్రావెల్ క్వారీలకు అనుమతులు ఇచ్చారు. అధికారుల అనుమతి పొంది కొండలను పూర్తిగా తొలిచివేస్తూ ధనాన్ని ఆర్జిస్తున్నారు. 1/70, పెసా (1996), 5.6వ షెడ్యూల్డ్ వంటి ఆదివాసి చట్టాలను ఉల్లంఘిస్తూ అక్రమాలకు బరితెగిస్తున్నారు. మన్యంలో గిరిజన గ్రామాల్లో కొండలు కనిపిస్తే చాలు దాన్ని తవ్వేస్తూ జేబులు నింపుకోవడానికి పూనుకుంటున్నారు. పైకి కొండల్లా కనిపిస్తున్నా లోనంతా డొల్ల చేసేలా యథేచ్ఛగా తవ్వకాలు చేస్తున్నారు. కొండ కనిపిస్తే దాన్ని కబ్జాచేసే మాదిరి గా వ్యవహరిస్తున్న వ్యక్తులకు రాజకీయ నాయకుల, పోలీసు అధికారుల, రెవెన్యూ అధికారుల అండదండలు పుష్కలంగా ఉంటున్నాయి.

జిల్లాలోని కొన్ని క్వారీలను రాజకీయ నాయకులు, పోలీసు అధికారులే లీజులకు తీసుకుని, స్వయంగా నిర్వహిస్తూ నిబంధనలను ఉల్లంఘిస్తు న్నారు. నాతవరం, మాకవరపాలెం మండలాల్లో అక్రమ క్వారీ దందా జోరుగా సాగుతుంది. బ్లాస్టింగ్‌ల ద్వారా గ్రామాలు దద్దరిల్లుతున్నాయి. గ్రామాలను అంటిపెట్టుకుని ఉన్న క్వారీలతో ఎప్పుడు ఏ ప్రమాదం జరుగుతుందోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. నాతవరం మండలం గన్నవరం, మల్లు, భూపాలపట్నం, బుచ్చంపేట గ్రామాల్లో 20 రాళ్ల క్వారీలు ఉన్నాయి. వారంలో రెండు సార్లు పేలుళ్లు జరుగు తున్నాయి. శక్తివంతమైన మందు గుండును పేల్చడంతో విపరీతమైన శబ్ద కాలుష్యం వెదజల్లుతుంది. దీంతో గ్రామాలు పగుళ్ల వచ్చాయని ఇటీవల శరబవరం గ్రామస్తులు స్థానిక అధికారులకు ఫిర్యాదు చేశారు. మల్లు భూపాలపట్నం గ్రామస్తులు తీవ్రమైన ఆందోళనను వ్యక్తం చేశారు. ఇవి ఏవి అధికారుల చెవికి ఎక్కడం లేదు. మాడుగుల మండలంలో 10 క్వారీలు ఉన్నాయి. వీటిలో చింతలూరు, విజే పురం, అవురువాడ, వీరనారాయణం, ఎరుకువాడ, ఎం కృష్ణపురం గ్రామాల్లో ఇవి విస్తరించి ఉన్నాయి. చాలా వరకు బ్లాస్టింగ్‌లతోనే నడుపుతున్నారు. వీటి వలన పరిసర గ్రామాల పంట పొలాలపైకి రాళ్లు ఎగిరి పడడం వల్ల పంటలు నాశనమవుతున్నాయి. గ్రామాలు బీటలు వారుతున్నాయని స్థానిక గిరిజన ప్రజలు ఆందోళన వ్యక్తం చేశారు.

చింతపల్లి, గూడెం కొత్తవీధి మండలాల్లో విలువైన లేటరైట్, తెల్లరాయి, గ్రానైట్ క్వారీలు ఉన్నాయి. వీటిని కొందరు ప్రభుత్వ పెద్దలు పోలీసు అధికారుల ఆశీస్సులతో, తూర్పుగోదావరి జిల్లాకు చెందిన కొందరు పెట్టుబడి దారులు చేజిక్కించుకునే ప్రయత్నాలు మొదలు పెట్టారు. ఇప్పటికే గూడెం కొత్తవీధి మండలం చాపరాతిపాలెం వద్ద లేటరైట్ క్వారీ పేరుతో 65 శాతం ఇనుము, 35 శాతం సిలికాన్ కలిగిన విలువైన ఖనిజాలను నర్సింగ్‌పట్నం నుంచి రాజమండ్రికి తరలిస్తున్నారు. దీంట్లో కొంత మంది ఆదివాసి మేధావులు, పిల్లి వెంకటేశ్వర్లు, విశాఖ జిల్లా ఎస్‌పి కోయ ప్రవీణ్ కుమార్‌ల వాటాలు ఉన్నాయి. నర్సింగ్‌పట్నం నుంచి తరలించబడుతుంది అనే ఉద్దేశంతో రోడ్డు రవాణా శాఖ మంత్రి చింతకాయల అయ్యన్న పాత్రుడి కుమారుడు విజయ్ (100 లారీలు) లారికి 250 రూపాయల చొప్పున కమిషన్ వసూలు చేస్తున్నాడు.

గూడెం కొత్తవీధి మండలంలోని దావనపల్లి పంచాయితి లింగవరం, కట్టుపల్లి గ్రామాల మధ్య ఉన్న తెల్లరాయి, గ్రానైట్ క్వారీలపై వీరి కన్ను పడింది. చింతపల్లి మండలం పెదబండ పంచాయితి కృష్ణపురంలోను తెల్లరాయి, గ్రానైట్, రాతి నిక్షేపాలున్నాయి. గతంలో చెన్నై, కడపకు

చెందిన గుత్తెదారులకు ప్రభుత్వం అనుమతులు మంజూరు చేసింది. క్వారీ మొదలు పెట్టన కొద్ది రోజులకే మావోయిస్టు పార్టీ యంత్ర సామాగ్రిని ధ్వంసం చేసి గుత్తెదారులను హెచ్చరించింది. ప్రాణ భయంతో కొంతకాలం పనులు మానుకొని మళ్లీ క్వారీ పనులను ప్రారంభించారు. ఇటీవల క్వారీలో తవ్వకాలకు సంబంధించి రెవెన్యూ అధికారులు గ్రామ సభను నిర్వహిస్తే స్థానిక గిరిజనులు గ్రామ సభను బహిష్కరించారు. మునగపాక మండలంలోని పాటిపల్లి, మల్లవరం గ్రామాల్లో జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్‌ల అనుమతితోని అక్రమంగా గ్రావేల్ తరలించుకు పోతున్నారు. దేవరపల్లి మండలంలో వెంకటరాజపురం, చిన్న గంగవరం, వాకపల్లి జీవనాదులో రాతి పిక్క క్వారీలు ఉన్నాయి. వీటిని పర్యవేక్షించే నాథుడే లేదు. చింతలపూడిలో భారీగా నిక్షేపాలు ఉన్నాయి. వీటి తవ్వకానికి హైదరాబాద్‌కు చెందిన వ్యక్తి ధరఖాస్తు చేయగా ప్రభుత్వం నుంచి అనుమతులు మంజూరు చేసింది. దీన్ని స్థానిక గిరిజనులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. అనకాపల్లి మండలంలోని మార్టూరు, వేటజంగాల పాలెం, తుమ్మపాల, కుంచంగి, కుంద్రం, గ్రామాలు, రాంబిల్లి, అచ్యుతపురం మండలాల పరిధిలో పేలోదుమొట్ట, జడ్‌చింతున, లాలంకోడూరు, చోమలపల్లి, వెదురువాడ, దొప్పెర్ల, మనపర్తి, నబంపల్లి, చోడపల్లి ప్రాంతాల్లో కంకర క్వారీలు జోరుగా సాగుతున్నాయి. చింతపల్లి మండలం రాజుపాకల క్వారీలో స్థానిక ఆదివాసులకు పక్క గృహాలు, సిసి రోడ్లు, నెలకు 20 వేల నగదు ఇస్తామని గూడెం కొత్తవీధి తహసిల్దార్ చిరంజీవి పదాల్ స్థానిక ఆదివాసులను నమ్మించి, ప్రదీప్ వర్మ అనే కాంట్రాక్టర్‌కు అప్పగించాడు. ఇలా విశాఖ మన్యాన్ని, పర్యావరణాన్ని విధ్వంసం చేస్తూ ఆదివాసి జీవితాలను బుగ్గిపాలు చేస్తున్నారు. మైనింగ్ తవ్వకాలను వ్యతిరేకిస్తున్న ఆదివాసులను, పీడిత ప్రజలను సంఘ విద్రోహ శక్తులుగా, టెర్రరిస్టులుగా, తీవ్రవాదులుగా, వారి సానుభూతిపరులుగా ముద్రవేసి గ్రామాలపై దాడులు, స్త్రీలపై అత్యాచారాలు, లూటీలు, అక్రమ అరెస్టులు, బూటకపు లొంగుబాట్లు (బలవంతపు లొంగుబాట్లు), బూటకపు ఎన్‌కౌంటర్లు, హత్యల పేరుతో హతమార్చుతున్నారు. దేశంలో, రాష్ట్రాలల్లో అర్ధ సైనిక బలగాలే రాజ్యమేలుతున్నాయి.

విశాఖ మన్యంలో మరో జమ్ము కశ్మీర్‌ను తలపించే విధంగా రాజ్యం, పోలీసుల అరాచకాలు సాగుతున్నాయి. గత సంవత్సరం ఫిబ్రవరి 18న విశాఖలో కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్ అధ్యక్షతన రాష్ట్రాల డిజిపిల సమావేశం జరిగిన వెంటనే విశాఖ మన్యంలో పోలీసుల అరాచకాలు పెరిగాయి. 2016 ఫిబ్రవరి 23న కూంబింగ్‌కు వచ్చిన గ్రేహౌండ్స్ పోలీసులు వేట నిమిత్తం అడవికి వెళ్లిన మల్కన్‌గిరి జిల్లా ఆదివాసులపై పుట్టకోట వద్ద కాల్పులు జరపగా ఇద్దరు ఆదివాసులు అక్కడికక్కడే మరణించారు. మరో వ్యక్తి తీవ్రంగా గాయపడ్డాడు. చింతపల్లి, గూడెం కొత్తవీధి మండలాల పరిధిలో 25న మొదలైన కూంబింగ్ ఏప్రిల్ 5 వరకు ఆంధ్ర, ఒడిశా గ్రామాలల్లో పోలీసులు బీభత్సం సృష్టించారు. జెర్రెల పంచాయితి నాలుగు గ్రామాలకు చెందిన 24 మంది ఆదివాసులను అక్రమంగా నిర్బంధించి, తీవ్రమైన చిత్రహింసలు పెట్టి జైల్లో బంధించారు. గ్రామాలపై దాడి చేసి ఇంట్లో సామాన్లు ధ్వంసం చేసి, ఇంటిలో డబ్బు, నగలు దొంగల్లా దోచుకున్నారు. పిల్ల, జల్ల, ముసలి, ముతక అనే తేడా లేకుండా చితకబాదారు.

మన్యం ఆదివాసులకు అండగా ఉన్న మావోయిస్టు పార్టీని అణిచి వేయడానికి స్థానిక ఇన్‌ఫార్మర్స్ కోవర్టు నెట్‌వర్క్‌ను పెంచుకొని దళాలను చుట్టు ముట్టి హత్యలు చేయడం జరుగుతుంది. 2016 మే 4న పక్కా సమాచారంతో మర్రిపాకల వద్ద గాలికొండ ఏరియా దళాన్ని చుట్టు ముట్టి ముగ్గురు మావోయిస్టు కార్యకర్తలను (అజీద్, ఆనంద్, కమల) హతమార్చారు. అక్టోబర్ 6న గాలికొండ ఏరియా కమాండర్ జేంబ్రీ ఉన్నాడన్న సమాచారంతో లక్కవరం పంచాయితి పెద్దపాడు గ్రామం వద్ద తెల్లవారుజామున 3 గంటలకు నిద్రిస్తున్న స్థానిక ఆదివాసి యువకులపైన గ్రేహౌండ్స్ బలగాలు జరిపిన కాల్పుల్లో నిరాయుధులైన స్థానిక ఆదివాసి యువకులైన నర్సింగ్, సీడిగొండి గ్రామం అంబ్రీలు తీవ్రంగా గాయపడ్డారు. గాయపడ్డ వారిని స్థానిక ఆదివాసులు పోలీసుల చెర నుంచి కాపాడుకున్నారు. గాయపడ్డవారిని పోలీసులు అదుపులోకి తీసుకుని రాజకీయంగా ఉపయోగించుకోవడం కోసం హాస్పిటల్‌లో చేర్చి, పోలీసుల మానవత్వం, మావోయిస్టుల అరాచకత్వం అంటూ మన్యం వ్యాప్తంగా పోస్టర్లు, కరపత్రాలు అంటించి ప్రచారానికి పూనుకున్నారు. ఈ ప్రచారం చేసిన కొద్ది రోజులకే అక్టోబర్ 24న రాయ్‌గూడ వద్ద 30 మంది మావోయిస్టులను (9 మంది సాధారణ ఆదివాసి యువత) పట్టుకొని కోర్టుకు హాజరుపరిచే అవకాశం ఉన్నప్పటికీ అతి కిరాతకంగా (మూర్ఖంగా) కాల్చి, గాయపడ్డ మహిళలపై అత్యాచారం చేసి, ఛాతీలను కోసి, శవాలను ఛిద్రం చేసి మానవత్వం అనే పదాన్ని మంటలో కలిపారు.

ఈ సంవత్సరం ఫిబ్రవరి 21న గాలికొండ ఏరియా కమాండర్ జేంబ్రి ఉన్నాడన్న సమాచారం తెలుసుకున్న ఆంధ్ర ఎస్ఐబి గ్రేహౌండ్స్ పోలీసులు 10 గ్రామాలను చుట్టుముట్టి ఎర్రగెడ్డ, సాగులు, చెరుకుంపాల గ్రామాల నుంచి 10 మంది ఆదివాసులను అదుపులోకి తీసుకొని జేంబ్రి ఆచూకి చెప్పమని తీవ్రమైన చిత్రహింసలకు గురిచేశారు. 21 నుంచి 24 వరకు 10 గ్రామాలను జల్లెడపట్టి, 24న నిరాయుధంగా ఉన్న జేంబ్రి, చిట్టిబాబులపై విచక్షణారహితంగా కాల్పులు జరిపి, గాయపడ్డ వారిని పట్టుకొని తీవ్రంగా హింసించి నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపి ఎన్‌కౌంటర్ కథను వల్లించారు. ఈ సంఘటన సమీపాన కల్లుచెట్టు దగ్గర ఉన్న ఆదివాసి (అన్నవరం గ్రామం) లను పట్టుకొని తీవ్రంగా హింసించి సత్తిబాబు అనే ఆదివాసి రైతును జైల్లో బంధించారు. జేంబ్రి ఆదివాసి అట్టడుగు వర్గంలో పుట్టాడు. మావోయిస్టు పార్టీ అందించిన ఎంఎల్ఎం రాజకీయాలతోని, స్థానిక ఆదివాసి ప్రజల పక్షాన నిలబడ్డ నాయకుడు. 2008లో మర్రిపాకల కాఫీ ఎస్టేట్ (67 హెక్టార్లు) ను స్వాధీనం చేసుకొని స్థానిక ఆదివాసులకు పంచడంలో కీలక పాత్ర పోషించాడు. మన్యంలో 15 సంవత్సరాల నుంచి జరుగుతున్న బాక్సైట్ వ్యతిరేక ఉద్యమంలో స్థానిక ఆదివాసి ప్రజలను చైతన్యం చేస్తూ వచ్చాడు. ఈ ప్రాంతంలో తెగ పెత్తందార్ల, ముఠాదారుల ఆగడాలపై ప్రజలను చైతన్యం చేస్తూ పీడిత వర్గం పక్షాణ నిలబడ్డ ప్రజా నాయకుడు. జేంబ్రిని లొంగుబాటు చేయించడం కోసం పోలీసులు, రాజ్యం చేయని ప్రయత్నం అంటూ లేదు. 2008లో జేంబ్రి లొంగడం లేదు అనే కక్షతో జేంబ్రి పెద్ద కొడుకు 9 సంవత్సరాల సుబ్బారావును ఆర్‌వి నగర్‌లో ఎస్‌బి ఎక్స్ సిఐ వెంకట్రావ్ కారుతో గుద్ది హత్యచేసి యాక్సిడెంట్‌గా సృష్టించారు. అయినా జేంబ్రి మొక్కవోని రాజకీయ చైతన్యంతో పోలీసుల, రాజ్యం కుట్రలను అర్థం చేసుకొని చివరి శ్వాస వరకు ప్రజల పక్షాణ నిలబడ్డ గొప్ప ఆదివాసి నాయకుడు.

ఈ సంవత్సరం మార్చ్, ఏప్రిల్ నెలల్లో సుక్మా జిల్లాలో 36 మంది సిఆర్‌పిఎఫ్ జవాన్లు చావడం, విశాఖ జిల్లాలో కాళ్లగడ్డ వద్ద మే 5న మావోయిస్టులు మైన్ బ్లాస్టింగ్ చేయగా హోంగార్డు చావడం వంటి

దాడులు రాజ్యాన్ని కలవరానికి గురిచేశాయి. దీంతో కేంద్ర హోం మంత్రి అధ్యక్షతన వామపక్ష తీవ్రవాద రాష్ట్రాలతో (ముఖ్యమంత్రులు, డిజిపిలు, కలెక్టర్లు) మే 17న ఢిల్లీలో సమావేశం జరిగింది. ఈ సమావేశంలో మావోయిస్టులను తీవ్రంగా అణచివేయడం కోసం కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నారు. సమాధాన్ అనే దాడిని ఎక్కుపెట్టారు. ఇందులో 8 కార్యక్రమాలను రూపొందించారు. 1) ఎస్. స్మార్ట్ లీడర్‌షిప్, 2) ఎ. అగ్రెసివ్ స్ట్రాటజి (దూకుడు వ్యూహాలు), 3) ఎం. మోటివేషన్ అండ్ ట్రైనింగ్ (ప్రేరణ శిక్షణ), 4) ఎ. యాక్షనబుల్ ఇంటలిజెన్సీ (కార్యాచరణ నిఘ), 5) డి. డ్యాష్‌బోర్డు బెస్ట్ ఇండికేటర్ (డ్యాష్‌బోర్డు సూచీలు), 6) ఎచ్. హర్నెసింగ్ టెక్నాలజీ (సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించడం), 7) ఎ. యాక్షన్ ప్లాన్ ఫర్ ఈచ్ థ్రెట్ (ప్రతి సమధాన్‌కి తగిన కార్యాచరణ ప్రణాళిక), 8) ఎన్. నోయక్సెస్ టు ఫైనాన్సింగ్ (ఆర్థిక వనరులకు కత్తెర) వంటి కార్యక్రమాలను రూపొందించి, ఆదివాసి పీడిత ప్రజలపైన పెద్ద దాడిని ఎక్కు పెట్టారు.

చింతపల్లి మండలం కోటగున్నాల గ్రామం వద్ద (మే 5) అంబుష్ జరిగిన వారం రోజుల తర్వాత కోటగున్నాల గ్రామంపై దాడి చేసి, 34 మంది ఆదివాసులను పట్టుకొని తీవ్రంగా చిత్రహింసలకు గురిచేసి బైండవర్ కేసులు పెట్టింది. 12న మొదలైన పోలీసు కూంబింగ్ 20 వరకు కొనసాగింది. 13న గాజుల మామిడి గ్రామంపై దాడి చేసి, మువ్వల రమేష్ అనే ఆదివాసి రైతును పట్టుకొని 15 రోజులు రహస్య ప్రాంతంలో పెట్టి, తీవ్రంగా చిత్రహింసలకు గురిచేసి తర్వాత జైల్లో బంధించారు. 17న బలపం పంచాయితి లమ్మడంపల్లి గ్రామస్తులైన చంటి, చిట్టిబాబు, లక్ష్మణ్‌రావులను, 20న ఇదే పంచాయితికి చెందిన దిగువలసపల్లి గ్రామస్తులైన కాశ్వరావు, రమణలను, జూన్ 17న మంసిపల్లికి చెందిన సాంగిన పడాల్, కోరుకొండ గ్రామానికి చెందిన తల్లే ఆనందరావులను పట్టుకొని తీవ్రంగా హింసిస్తున్నారు. వీరిని ఇప్పటి వరకు కోర్టుకు హాజరుపరచడం కానీ, కుటుంబ సభ్యులకు అప్పగించడం కానీ చేయలేదు. మే 31న ఆంధ్ర, ఒడిశా బార్డర్, చిత్రకింద పరిసరాల్లో ద్రోహి ఇచ్చిన సమాచారంతో చిన్నబ్బాయి, (సురేష్, గుడ నాగేశ్వరరావు) మావోయిస్టు పార్టీ దళ కమాండర్‌ని పట్టుకొని తీవ్ర చిత్రహింసలు పెట్టి జూన్ 2న కప్పతోట అటవీ ప్రాంతంలో బూటకపు ఎన్‌కౌంటర్ పేరుతో పాశవికంగా హత్యచేసి ఎప్పటిలాగే ఎన్‌కౌంటర్ కథను అల్లారు. చిన్నబ్బాయి సహచరిని అకీలను మార్చ్ మొదటి వారంలోనే ఆంధ్ర పోలీసులు లొంగుబాటు చేయించుకున్నారు. వాస్తవానికి అకీల మావోయిస్టు కాదు. 1998లో రిక్రూట్ అయి 2003లో రాజకీయంగా బలహీనపడి, పార్టీని వదిలి బయట జీవిస్తున్నారు. 2005లో అరెస్ట్ అయి 2007 వరకు జైలు జీవితాన్ని గడిపి, 2007 నుంచి మల్కాన్‌గిరి జిల్లా కలిమెల ప్రాంతంలో సాధారణ జీవితం గడుపుతున్నారు.

2013లో ఒడిశా ప్రభుత్వం కలిమెల ప్రాంత గ్రామాలపై బిఎస్ఎఫ్ పోలీసుల దాడులను తీవ్రతరం చేసి సాధారణ ఆదివాసులను జైల్లో బంధించడం, ఎన్‌కౌంటర్స్ చేయడం వంటి మూర్ఖమైన దాడులకు పూనుకుంది. ఈ దాడికి గురైన వాంట్లో చిన్నబ్బాయి ఒకడు. దీంతో 2014లో మరోసారి పూర్తికాలం కార్యకర్తగా పనిచేయడానికి సిద్ధపడి పనిచేస్తున్నాడు. అకీల మాత్రం బయట సాధారణ జీవితాన్నే గడుపుతుంది. అయినా అకీలను మావోయిస్టుగా ముద్రవేసి మరోదాపు లొంగుబాటు చూపించారు. అకీల ద్వారా చిన్నబ్బాయిని లొంగుబాటు చేయించుకునే ఒప్పందాలు చేసుకున్నారు. దీంతో చిన్నబ్బాయిలో రాజకీయ ఊగిసలాట మొదలై, 2017 మే 25న పార్టీని వదిలి బయటకు వెళ్లాడు. 31న అదుపులోకి తీసుకొని జూన్ 2న బూటకపు ఎన్‌కౌంటర్ చేసి, కప్పతాటి అడవుల్లో పడవేశారు. మల్కాన్‌గిరి ఎస్‌పి మిత్రబాను, విశాఖ ఎస్‌పి రాహుల్ దేవ్ శర్మ, ఎస్‌బి ఎక్స్ వెంకట్రావ్‌లు ఈ ఎన్‌కౌంటర్‌కు ప్రధాన సూత్రదారులు. ఈ ముగ్గురు ముఠా ఆంధ్ర, ఒడిశా బోర్డర్‌లో చట్టాలను, రాజ్యాంగాన్ని ఉల్లంఘిస్తూ, ప్రభుత్వ యంత్రాంగాన్ని తమ అదుపులో పెట్టుకున్నారు. ఈ ముఠా ఆడినట్లుగా (ఈ ప్రాంతంలో) ప్రభుత్వ యంత్రాంగం ఆడుతుంది. చత్తీస్‌గడ్ (బస్తర్)లో కల్లూరి, విశాఖ మన్యంలో ఎస్‌బి ఎక్స్ వెంకట్రావ్ (కొత్త తరహా కల్లూరి) ఆదివాసి ప్రజల జీవితాలతో ఆడుకుంటున్నారు.

70 సంవత్సరాలు వెనక్కి తిరిగి చూస్తే దేశంలో తెల్ల దొరల (బ్రిటిష్ సామ్రాజ్యవాదుల) పాలన జరిగింది. అది నేడు కొత్త రూపం దాల్చి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, ఓట్ల పేరుతో మన ముందుకు వచ్చింది. ఆనాడు తెల్ల దొరల దోపిడీ పాలనకు కానీ, నేడు చెప్పబడుతున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి కానీ పెద్ద తేడా ఏమి లేదు. దోపిడి రూపం మారిందే తప్ప, సారం మారలేదు. ఆనాడు తెల్ల దొరలైన దేశ పీడిత ప్రజల (దేశంలో ఉన్న విలువైన ఖనిజాలను) శ్రమ శక్తిని దోపిడి చేస్తూ, ప్రజలను అణిచిపెట్టారు. ఈనాడు నల్ల దొరలు ప్రజల శ్రమ శక్తిని దోపిడి చేస్తూ, దేశ సంపదను లూటి చేయడం కోసం పార్లమెంటరీ ప్రజాస్వామ్య ముసుగులో దేశ ప్రజలను అణిచివేస్తున్నారు.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఓట్లు అంటేనే 5 సంవత్సరాలు ధనాన్ని కూడబెట్టడం కోసం ప్రజల నుంచి లైసెన్స్, గుర్తింపు కార్డు పొందడంగా మారిపోయింది. ఆనాడు తెల్లదొరల పాలనకు వ్యతిరేకంగా దేశంలో వందల పోరాటాలు జరిగాయి. ఇందులో ప్రధానంగా భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్‌గురు, చంద్రశేఖర్ ఆజాద్, కొమురంభీం, అల్లూరి సీతారామరాజు, లక్ష్మణ్ నాయక్ వంటి వారంత ప్రజల విముక్తి కోసం త్యాగాలు చేశారు. ఆదిమ సమాజంలో మానవుడు ప్రకృతితో బతకడం కోసం యుద్ధం చేశాడు. ఆదిమ సమాజం నుండి బానిస సమాజం, బానిస సమాజం నుండి భూస్వామ్య సమాజం, భూస్వామ్య సమాజం నుండి పెట్టుబడిదారీ సమాజంగా మార్పు చెందుతూ వచ్చింది. ఈ మార్పు దానికదే జరగలేదు. బానిస సమాజంలో బానిసకు యజమానికి మధ్య యుద్ధం జరగగా, భూస్వామ్య సమాజంలో రైతుకు భూస్వామికి మధ్య యుద్ధం జరిగి పెట్టుబడిదారీ సమాజంగా అవతరించింది. (మన దేశంలో ఈనాటికి కూడా అర్ధ వలస అర్ధ భూస్వామ్య వ్యవస్థనే కొనసాగుతుంది) ఇక్కడ పెట్టుబడికి, శ్రమకు మధ్య యుద్ధం జరగాల్సి ఉంది. మానవుడు ఉనికిలోనికి వచ్చినప్పటి నుండి బతకడం కోసం యుద్ధం చేయాల్సి వచ్చింది. ఈనాడు మన దేశంలో ఉన్న అర్ధ వలస అర్ధ భూస్వామ్య సంబంధాలను ధ్వంసం చేసి, ప్రజలకు నిజమైన ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సమానత్వం, జల్ జంగల్ జమీన్, ఇజ్జత్, అధికారం, దున్నేవాడికే భూమి (గ్రామ రాజ్య కమిటీలకు అధికారం) ప్రజలకు అధికారం దక్కాలంటే దేశంలో భ్రష్టుపట్టి 70 సంవత్సరాలుగా పార్లమెంటరీ ప్రజాస్వామ్య ముసుగుని, 1967 – 68 నక్సల్బరీ పంథాలో ధ్వంసం చేసి, దేశంలో నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని (ప్రజల అధికారాన్ని) స్థాపించడమే మార్గం.

*(రచయిత ఆదివాసి విప్లవ మహిళ సంఘం)* వీ

# మోడీ కుతంత్రం - నితీశ్ అవకాశవాదం

***బీహార్ రాజకీయ పరిణామాలను గమనిస్తే పార్టీల మధ్య ఎన్ని రాజకీయ విభేదాలున్నా అధికారం కోసం ఒక్కటవుతాయని, ఓటు వేసిన ప్రజలు మాత్రం ఎప్పటికీ పార్టీలకు పావులుగా మారుతున్నారని అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

బీహార్ ముఖ్యమంత్రి, జనతాదళ్ (యు) అధినేత నితీశ్ కుమార్ జూలై 26 నాడు గవర్నర్‌ను కలిసి తన పదవికి రాజీనామా సమర్పించడంతో అధికార కూటమి అయిన మహాఘట్‌బంధన్ కుప్పకూలిపోయింది. లాలూ కుమారుడు తేజస్వి అవినీతి ఆరోపణలు రావడం వల్లనే విలువలకు కట్టుబడి తాను రాజీనామా చేసినట్టు నితీశ్ చెప్పుకుంటున్నారు. కానీ నితీశ్ రాజకీయ చరిత్ర, ఆయన ఎత్తుగడలు గమనిస్తే విలువలకు కట్టుబడి లేదా ఆవేశంతో రాజీనామా చేశారని అనిపించదు. బీహార్‌లో నితీశ్‌కు విస్తృత రాజకీయ పునాది లేదు. సొంత సామాజికవర్గం కూడా చాలా చిన్నదే కాకుండా అంతగా రాజకీయ ప్రాబల్యం ఉన్నది కాదు. సొంతంగా ఎన్నికలలో గెలిచే బలం లేకున్నా ఎప్పటికప్పుడు లెక్కలు వేసుకొని అడుగులు వేస్తుంటారు. ఈ నేపథ్యంలో తాజా నిర్ణయం కూడా అచితూచి తీసుకున్నదే. కేంద్రంలో అధికారం ఉన్న బిజెపితో అవగాహన కుదుర్చుకున్న తరువాతనే నితీశ్ లాలూ కుమారుడు తేజస్వి మంత్రివర్గం నుంచి వైదొలగాలనే డిమాండ్ ముందు పెట్టారనే అభిప్రాయం బలంగా ఉంది. రాష్ట్రపతి ఎన్నికలలో కూడా నితీశ్ లౌకిక కూటమి అభ్యర్థి, బీహార్ బిడ్డ అయిన మీరా కుమార్‌కు కాకుండా, బిజెపి అభ్యర్థి అయిన రామ్‌నాథ్ కోవింద్‌కు మద్దతు ఇచ్చారు.

1970ల నాటి జయప్రకాశ్ నారాయణ్ సంపూర్ణ విప్లవం నుంచి లాలూతో పాటు ఎదిగి వచ్చిన నితీశ్ బలమైన ఆర్‌జెడి నాయకుడు లాలూ ప్రసాద్ యాదవ్‌ను ఎదురించడానికి 1996లోనే బిజెపితో చెయ్యి కలిపారు. బాబ్రీ మసీదు కూల్చివేత తర్వాత అంతా బిజెపికి దూరంగా ఉంటున్న కాలంలోనే ఆ పని చేయగలిగారు. ఎన్‌డిఏతో కలసి సాగిన దాదాపు దశాబ్ద కాలంలో ఆయన కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ అధికారంలో కొనసాగ గలిగారు. భాజపా జాతీయ ప్రచార సారథిగా మోడీ ఎదుగుదలను జీర్ణించుకోలేని నితీశ్ కుమార్ 2013 జూన్‌లో సంకీర్ణ భాగస్వామ్యానికి తిలోదకాలు వదిలారు. మతతత్వంపై పోరాడే యోధుడిగా, లౌకిక వాదానికి అత్యంత విధేయుడిగా చెప్పుకున్నారు. 2002లో మోడీ నాయకత్వంలో సాగిన గుజరాత్ మారణహోమాన్ని, బిజెపి మతతత్వాన్ని విమర్శించాడు.

ఇవాళ లాలూతో తెగతెంపులు చేసుకోవాలని నిర్ణయించుకుని అవినీతిని ఆయుధంగా మలచుకున్న నితీశ్, తాను 2015లో బీహార్ అసెంబ్లీ ఎన్నికల ముందు లాలూతో జత కట్టే నాటికే ఆయన పశుగ్రాస కుంభకోణంలో దోషిగా నిర్ధారితుడై ఉన్నాడన్న సత్యాన్ని చాలా సౌకర్యవంతంగా మరచిపోయారు. అలాగే, 2015లో మహాగట్‌బంధన్ ఏర్పాటు సమయంలో 'మోడీ-షా- ఆర్‌ఎస్‌ఎస్‌లను ఓడించి లౌకికవాదాన్ని పరిరక్షించేందుకు తాము ప్రజల ముందుకు వస్తున్నామని' ప్రకటించిన లాలూ, అప్పటికే 17 ఏండ్లుగా నితీశ్ మతతత్వవాదులతో అంటకాగుతున్నాడన్న విషయాన్ని విస్మరించారు. 2002 గుజరాత్ మారణకాండ సమయంలో అప్పటి వాజ్‌పేయి (ఎన్‌డిఏ) ప్రభుత్వంలో కేంద్ర రైల్వే శాఖా మంత్రిగా ఉన్న నితీశ్ గుజరాత్ మారణకాండను కనీసం ఖండించలేదన్న చేదు నిజాన్నీ విస్మరించారు.

అందరికీ ఆమోదయోగ్యుడైన నేతగా ఎన్‌డిఏ తరపున 2014లో ప్రధాని పదవిని చేపట్టే అవకాశం దక్కవచ్చున్న నితీశ్ ఆశలపై మోడీ గెలుపు నీళ్లు చల్లింది. 2014 సార్వత్రికంలో బీహార్‌లోనూ మోడీ జైత్రయాత్ర సాగడంతో బిత్తరపోయి-ఆర్‌జెడి, కాంగ్రెస్ తదితర పక్షాలతో మహా గట్‌బంధన్‌కు ప్రాణ ప్రతిష్ట చేశారు. 2015 బీహార్ అసెంబ్లీ ఎన్నికల్లో మహా కూటమి దెబ్బకు భాజపా సీట్లు భారీగా తగ్గాయి. కాంగ్రెస్ హస్తవాసీ గణనీయంగా మెరుగుపడింది. ప్రతిపక్షాల కూటమి అభ్యర్థిగా 2019 ఎన్నికల్లో ప్రధాని పదవి తిరిగి దక్కవచ్చునే ఆశలు నితీశ్‌కు లేకపోలేదు. కానీ కాంగ్రెస్ అభ్యర్థిగా రాహుల్ బరిలో ఉండడం వలన ఆయన బిజెపితో సత్సంబంధాలను నెరపేలా నెట్టాయి. మోడీ పొడగిట్టక ఇరవై నెలలుగా లాలూతో ఈదులాడిన నితీశ్ తిరిగి ఎన్‌డిఏతో కలిసి సాగడమే మేలనుకొన్నారు. పెద్ద నోట్ల రద్దు నుంచి రాష్ట్రపతి ఎన్నికల వరకు నితీశ్ తీరు దానినే సూచిస్తూ వచ్చింది.

బూర్జువా పార్లమెంటరీ భ్రష్ట రాజకీయాల్లో శాశ్వత మిత్రులు, శాశ్వత శత్రువులు ఉండరన్న నానుడి ఎంత నిజమో జెడి(యు), భాజపా, కాంగ్రెస్, ఆర్‌జెడిల నాలుగు స్తంభాలాటతో రుజువవుతోంది! బీహారులో కాంగ్రెస్ ప్రాభవం 1990లోనే గతించిపోగా, దరిమిలా 15 ఏళ్లపాటు సాగింది లాలూ కుటుంబ పాలనే! లాలూ రబ్రీల భ్రష్ట పాలనకు చరమగీతి పాడి తొలిసారిగా జెడి(యు)-భాజపా కూటమి 2005లో అధికారానికి వచ్చింది. 2010లో బీహార్లో ప్రచారానికి మోడీ వస్తే తెగతెంపులు తప్పవన్న నితీశ్ హెచ్చరిక జవదాటలేక భాజపా సర్దుకొనిపోయింది. జెడి(యు) బిజెపి కూటమికి 2010లో అద్భుత విజయాల్ని నమోదు చేసింది. 243 స్థానాల అసెంబ్లీలో 206 సీట్లు గెలిచారు. 2005-13 మధ్యకాలంలో బీహార్లో నితీశే పెద్దదిక్కుగా నెట్టుకొచ్చిన భాజపా-నేడక్కడ తన ప్రజాపునాది విస్తరణకు పటిష్ట కార్యాచరణతో పావులు కదుపుతోంది. భాజపా- నితీశ్‌తో రాజకీయ బేరసారాల్లో గట్టిగానే వ్యవహరించింది. ప్రాబల్య విస్తరణ కాంక్ష పరంగా ఒక ఒరలో ఇమడని రెండు కత్తుల్లాంటిదే ఈ కూటమి కూడా! ఆత్మాశ్రయ ధోరణులు, అభిజాత్య పోకడలు లేకుండా ఎంతకాలం ఈ కూటమి పరస్పర సహకారంతో ప్రజారంజక పాలన అందించగలదన్నది అనుమానమే. అయినా 2019 సార్వత్రిక ఎన్నికల దాక ఈ మైత్రిని కొనసాగించగలిగితే బిజెపి ఎంతో కొంత ప్రయోజనం పొందుతుంది.

2015 బీహార్ శాసనసభ ఎన్నికల్లో మోడీ – అమిత్ షా జంట బీహార్‌ను ఎలాగైనా చేజిక్కించుకోవాలనే వ్యూహంతో అక్కడి ఓటర్లకు రకరకాల వాగ్దానాలు చేశారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించి సూక్ష్మస్థాయిలో ప్రచారం చేశారు. ప్రతిపక్షాల ఉమ్మడి శక్తిని బిజెపి ఎదుర్కొనలేకపోయింది. మహాఘట్‌బంధన్‌ను ప్రజలు వరించారు. బీహార్ ఎన్నికల్లో ఓటమిని మోడీకి తొలి పరాజయంగా అభివర్ణించారు. జాతీయ స్థాయిలో ప్రత్యామ్నాయానికి మార్గదర్శిగా నితీశ్ ప్రయోగాన్ని అభివర్ణించారు. శాసనసభ ఎన్నికల్లో లాలూ పొత్తు వల్లే తిరిగి నితీశ్ ముఖ్యమంత్రి కాగలిగారు. ఎన్నికల్లో పొత్తు కుదుర్చుకున్నప్పుడు లాలూ ప్రసాద్ అవినీతి నేపథ్యం నితీశ్‌కు తెలియంది కాదు గదా! ఎన్నికలలో కుదిరిన ఒప్పందం మేరకే తేజస్వీ యాదవ్‌కు ఉప ముఖ్యమంత్రి పదవి లభించింది. ఇంతకాలంగా ఆర్‌జెడిని అంటి పెట్టుకున్నప్పుడు నితీశ్‌కు ఈ అవినీతి ఎందుకు గుర్తుకు రాలేదు. ఇప్పుడు హఠాత్తుగా అవినీతి తెరమీదకు తెచ్చి మతోన్మాదాన్ని బలపర్చడానికి కారణం నితీశ్ అధికారదాహం మినహా ఏదీ కాదు. నెల రోజులుగా బిజెపితో రహస్య మంతనాలు జరుపుతూ, అవి ఒక కొలిక్కి వచ్చిన తర్వాతనే ఒక నిర్దేశ స్క్రిప్టు ప్రకారమే ఈ రాజీనామా డ్రామా ముగించారు.

విలువలకు కట్టుబడి తాను రాజీనామా చేసినట్లు నితీశ్ చెప్పడమే ఓ పెద్ద దగా. బీహార్‌లో ఒకప్పుడు బలమైన నాయకుడుగా ఉన్న లాలూను దెబ్బతీయడానికి వీలుగా నితీష్ బిజెపితో చేతులు కలిపారు. 2014లో ప్రధానమంత్రి అభ్యర్థిగా నరేంద్రమోడీని బిజెపి ఎంపిక చేయడాన్ని నిరసిస్తూ దానికి దూరమయ్యారు. ఆ తర్వాత బిజెపి మతతత్వపార్టీ అనీ, మోడీ నరహంతకుడని దుయ్యబట్టారు. 2014 సార్వత్రిక ఎన్నికల్లో ఒంటరిగా పోటీ చేసి పరాజయం పాలయ్యారు. ఒడిశాలో నవీన్ పట్నాయక్ మాదిరిగా బిజెపి పొత్తు వదిలేయడం వల్ల సొంతంగా అధికారం సాధించుకోవచ్చన్న ఆయన అంచనాలు, ఆశలు నీరుగారిపోయాయి. 2015 నవంబర్‌లో బీహార్ శాసనసభ ఎన్నికల నాటికి ఆర్‌జెడి, కాంగ్రెస్‌తో తన జెడి(యు)ను కలిపి మహాఘట్ బంధన్‌ను ఏర్పాటు చేశారు. అది లౌకిక భావాలకు, పేదలకు అనుకూలమైన గ్రామీణాభివృద్ధికి సంకేతంలా కనిపించింది. ఉధృతంగా వీస్తున్న 'మోడీ గాలి'ని అడ్డుకోవడానికి అనివార్యమైన చర్యగా, 2015లో చీలిపోయి ఉన్న ప్రతిపక్షాన్ని కూడగట్టేదిగా కూడా కనిపించింది.

బిజెపితో అనుబంధాన్ని తిరిగి పునరుద్ధరించుకోవడం వల్ల గతంలో లాగే 2019 సార్వత్రిక ఎన్నికల్లోనూ, 2020 బీహార్ శాసనసభ ఎన్నికల్లోనూ లబ్ధిని చేకూరుస్తుందని నితీశ్ భావించవచ్చు. అందువల్లనే జూలై 26న నితీష్ తన పదవికి రాజీనామా చేయడం, క్షణంలోనే గవర్నర్ దాన్ని ఆమోదించడం జరిగింది. ఆ వెంటనే బీహార్‌లో ఎన్నికలు కోరుకోవడం లేదని బిజెపి నేతలు ప్రకటించడం, మోడీ కూడా అవినీతిపై నితీశ్ పోరాటాన్ని అందుకు ఎన్నుకొన్న వ్యూహాల గురించి ట్విటర్‌లో ప్రశంసించారు. నితీశ్ రాజీనామా వార్త వెలువడిన వెంటనే అమిత్ షా తమ బీహార్ పార్టీ శాఖకు ఫోన్‌చేసి ఆయనకు మద్దతు ఇవ్వాలని ఆదేశించారు. పరిణామాలను సమీక్షించి మార్గనిర్దేశన చేసేందుకు ఆగమేఘాల మీద బిజెపి పార్లమెంటరీ బోర్డు త్రిసభ్య కమిటీని ఏర్పాటు చేసింది. రాత్రికి రాత్రి బిజెపి శాసనసభాపక్షం బేటీ కావడం, ఎన్‌డిఎ పక్ష నేతగా నితీష్‌ను ఎన్నుకోవడం, జూలై 28 సాయంత్రం మళ్లీ ఆయన సిఎం పదవిని అలంకరించడం, ఆయన మంత్రివర్గంలో బిజెపి నాయకుడు సుశీల్ కుమార్ మోడీ చేరడం ఈ పరిణామాలన్నీ ఒకటొకటిగా ఇరవై నాలుగ్గంటల్లో సంభవించాయి. ఎంత 'ముందు' చూపు లేకపోతే ఇంతలా హైడ్రామాను మోడీ, నితీష్ రక్తి కట్టించగలిగారు? నితీశ్ రాజీనామా, ఆ వెనువెంటనే తిరిగి ముఖ్యమంత్రిగా పునఃప్రతిష్ఠకు ముందస్తు పథకమే ఉన్నట్లు సుస్పష్టమవుతోంది. బిజెపితో ముందుగానే ఓ రహస్య ఒప్పందానికి వచ్చిన తర్వాతే తేజస్వీ యాదవ్ రాజీనామాకు నితీశ్ డిమాండు చేశారని అర్థమవుతోంది.

గతంలో కాంగ్రెస్ ఏకచ్ఛత్రాధిపత్యం దేశంలో నియంతృత్వ పరిస్థితిని తీసుకొచ్చింది. కేంద్రంలో, రాష్ట్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉండాలన్న ధోరణి అనేక రాష్ట్రాల్లో ప్రజల చేత ఎన్నికైన ప్రభుత్వాలను కూలదోసింది. ఇవాళ నరేంద్ర మోడీ, బిజెపి అధ్యక్షుడు అమిత్ షా తప్ప మరో నాయకుడు మనకూడదని ఆ ద్వయం సిద్ధాంతంగా పెట్టుకున్నారు. దేశంలో మరే పార్టీకి మనుగడ లేకుండా 'అహం బ్రహ్మాస్మి' అన్నట్టు నడుస్తోంది. తాము నడుస్తున్న దారి ప్రజాస్వామికమా కాదా అన్నది దానికి అక్కర్లేదు. కావలసిందల్లా రాజకీయంగా (తాత్కాలికంగానైనా) లబ్ధి కలుగుతోందా లేదా అన్నది మాత్రమే ఆ పార్టీకి కావలసిన అంశం. మిగతావాటి గురించి అసలు పట్టించుకోదు. ఆ ఆలోచనే రానివ్వదు. దేశంలోని అన్ని రాష్ట్రాల్లోనూ తమ పార్టీనే అధికారంలో ఉండాలి. ప్రతిపక్షం అనేది అసలుండకూడదు. ఆ ధ్యేయంతోనే ప్రతిపక్ష ప్రభుత్వాలను, ప్రతిపక్షాలను అస్థిరపరిచే ప్రక్రియను వారిద్దరూ ఔపోశన పట్టి మరీ నడుచుకుంటున్నారు.

కేంద్రంలో బిజెపి అధికారం చేపట్టిన నాటి నుండి ఒక్కొక్క రాష్ట్రం తరువాత మరో రాష్ట్రం పట్ల అనకొండలా కబళించే ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగిస్తోంది. జమ్మూ కశ్మీర్‌లో ప్రజలు తనకు వ్యతిరేకంగా తీర్పునివ్వగా అందుకు విరుద్ధంగా పిడిపితో కలిసి సర్కారును ఏర్పాటు చేసింది. గోవా, మణిపూర్ ఎన్నికల్లో ప్రజలు బిజెపిని తిరస్కరించినా పరస్పర విరుద్ధ పార్టీలతో దోస్తీ కట్టి దొడ్డిదారిలో సిఎం పీఠమెక్కింది. గతంలో అరుణాచల్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్‌లో అనేక అనైతిక చర్యలకు పాల్పడింది. ఇప్పుడు బీహార్‌లోనూ అదే పని చేసింది. అందుకు అన్ని రాష్ట్రాల్లోని గవర్నర్లు సంపూర్ణంగా సహకరిస్తున్నారు. అధికారంలోకి వచ్చిన కొత్తలో దేశంలో 'కాంగ్రెస్ ముక్త్ భారత్' నినాదం కాస్తా ఇప్పుడు 'ముక్త్ పొలిటికల్ పార్టీస్'గా పరిణమించిందని భావించవచ్చు. ఒట్టి భావనే కాదు.... వారి ఆశ, ఆలోచన అదే! ఇందులో సందేహం అక్కర్లేదు.

సిబిఐని కాంగ్రెస్ తన జేబు సంస్థగా వాడుకుంటోందని ప్రతిపక్షంలో ఉండగా తెగ యాగీ చేసిన బిజెపి, తాను అధికారంలోకి వచ్చాక కాంగ్రెస్‌ను మించిపోయింది. రాజకీయంగా ప్రత్యర్థులపై పాత కేసులు తిరగదోడడమో లేక ఏదో ఒక కేసులో ఇరికించడమో చేసి తన దారికి తెచ్చుకోవడం మోడీ సర్కారు ఎజెండాగా చేసుకుంది. 1991లో ఒక మహిళ హత్య కేసులో నితీష్ నిందితుడని, ఆ కేసును చూపి నితీష్‌ను మోడీ తమ పక్కకు లాక్కున్నారని లాలూ ప్రసాద్ యాదవ్ చేసిన ఆరోపణ గమనించదగింది. నిజంగా మోడీ అవినీతిని క్షమించని వారే అయితే బిజెపి ఏలుబడిలోని మధ్యప్రదేశ్‌లో వ్యాపం కుంభకోణం సంగతేంటి? సిఎం శివరాజ్‌సింగ్ చౌహాన్‌తో ఎందుకు ఇప్పటి వరకు రాజీనామా చేయించలేదు. లలిత్‌మోడీ పాస్‌పోర్టు వ్యవహారంలో ఆరోపణలు ఎదుర్కొంటున్న సుష్మాస్వరాజ్ సంగతేంటి? బ్యాంకులకు వేల కోట్ల

రూపాయలు ఎగ్గొట్టిన విజయ్ మాల్యా ఎలా దేశం విడిచి పారిపోయారు? స్విస్ బ్యాంకుల్లో ఉన్న లక్షల కోట్ల రూపాయల అక్రమ డబ్బు ఎందుకు వెనక్కి రప్పించ లేదు? అంబానీల చమురు, గ్యాస్ స్కాంలు పట్టవా? ఈ ప్రశ్నలు సామాన్యుల మెదళ్లను తొలుస్తున్నాయి. లాలూ అయినా, మరెవరైనా అవినీతి చేస్తే దర్యాప్తు చేసి శిక్షించాల్సిందే. కేసులతో రాజకీయాలు చేయాలనుకోవడం మాత్రం ఎల్లకాలం చెల్లుబాటు కాదు.

ఒక్కొక్క రాష్ట్రంపై దృష్టిపెట్టి ప్రతిపక్ష సభ్యులందరినీ నయానో భయానో కబళించే ప్రయత్నాలకు కమలనాథులు దిగారు. అధికారం వారిచేతిలో ఉంది కాబట్టి సామ దాన భేద దండోపాయాలు వారికి కరతలామలకం కాబట్టి పెద్దగా కష్టపడకుండానే బీహార్ ముఖ్యమంత్రి నితీశ్ కుమార్ తేలికగా వారి బుట్టలో పడ్డారు. మోడీకి వ్యతిరేకంగా బీహార్ ప్రజలు తీర్పు చెప్పినా బిజెపికి స్నేహ హస్తం అందించారు నితీశ్. ఇప్పటి వరకు తనను ముఖ్యమంత్రిని చేసిన లాలూ ప్రసాద్ యాదవ్ గొప్పవాడని కీర్తించిన నితీష్‌కు హఠాత్తుగా లాలూలో అవినీతిపరుడు కనిపించాడు. కేంద్రం సిబిఐని రంగంలోకి దించింది. బిజెపి ప్రయోగించిన భేదోపాయం ఫలించింది. గంటల వ్యవధిలో బీహార్ ప్రభుత్వం బిజెపి వశమైంది. పేరుకు నితీష్ ముఖ్యమంత్రి అయినా రిమోట్ మాత్రం మోడీ చేతుల్లో ఉంటుంది. ఇక్కడా గవర్నర్ కేసరినాథ్ త్రిపాఠి ఢిల్లీ ఏజెంట్‌గానే ఢిల్లీ ఆజ్ఞలకు లోబడి వ్యవహరించారు.

ఇప్పుడు నితీశ్ కుమార్ బిజెపితో జతకట్టడం బీహార్‌లో పునర్వైభవంతోపాటు, 2019 ఎన్నికల్లో సవాలు కాగలదనుకొన్న మహాకూటమి మట్టిగొట్టుకుపోవడం కమలనాథులకు వ్యూహాత్మక విజయమేననడంలో సందేహం లేదు! నితీశ్-లాలూ మైత్రి విచ్ఛిన్నం కావడం అంటే జాతీయ స్థాయిలో బిజెపి, ఎన్‌డిఏ వ్యతిరేక మహా కూటమి ఏర్పాటు ప్రయత్నాలకు తూట్లు పడడమే. అలాంటి అవకాశాన్ని ప్రత్యర్థి పక్షాలే అందిస్తే దాన్ని కాదనేటంతటి వెర్రిబాగులతనం బిజెపికి లేదు. ఏ పద్ధతి అనుసరించి అయినా వీలైనన్ని ఎక్కువ రాష్ట్రాలలో ప్రభుత్వాలు ఏర్పాటు చేయడమే బిజెపి ప్రధాన లక్ష్యంగా ఉంది. ఆ రకంగా దేశంలో మొత్తం 29 రాష్ట్రాలు ఉంటే 17 రాష్ట్రాలలో బిజెపి ఏదో ఒక రకంగా అధికారంలో ఉంది. సంకీర్ణ రాజకీయాలను వినియోగించుకుని బిజెపి అసమ్మతిని, ప్రతిఘటనను లేకుండా చేసి ఫెడరల్ విధానాన్ని వీలైనంత మేర నీరుగార్చి సాంస్కృతిక, రాజకీయ ఆధిపత్యం చేలాయించాలని చూస్తోంది. సాంస్కృతిక, రాజకీయ ఆధిపత్యం సంపాదించడానికి ఏ రాజకీయ పార్టీ ఇంతవరకు బిజెపి లాగా రాజకీయ స్వప్రయోజనం కోసం ప్రయత్నించ లేదు.

బీహార్‌లో నితీశ్ పిల్లిమొగ్గలు దేశంలో రాజకీయ విలువల పతనాన్ని, అధికారం కోసం నేతల దిగజారుడుతనాన్ని మరోమారు ఆవిష్కరించింది. రాష్ట్రాల్లో ప్రజాభీష్టాన్ని కాలదన్ని ఏ అడ్డదారిలోనైనా అధికారం అందుకోవడమే ఏకైక లక్ష్యంగా ఎంచుకొన్న బిజెపి తన పావులను విజయవంతంగా కదిపింది. అవకాశవాద రాజకీయ నాయకులు ఎటువంటి అకార్యాలు చేసైనా ప్రయోజనం పొందేందుకు ప్రయత్నిస్తారు. ఎదుటివాడికి అన్యాయం చేస్తున్నామా లేక విలువలకు వమ్ముచేస్తున్నామా అని ఆలోచించరు. కేవలం తన స్వార్థం మాత్రమే వారికి ప్రధానం. సరిగ్గా ఇదే దారిని బిజెపి ఇప్పుడు ఎంచుకున్నది. మరో రెండేళ్లలో సార్వత్రిక ఎన్నికలు రానున్నందున బీహార్ రాష్ట్రంలో తమ పట్టు బిగించుకొనేందుకు మోడీ-అమిత్‌షా జంట మహాఘట్ బంధన్‌ను నిలువునా చీల్చగలిగింది. అయితే బిజెపి వ్యూహం, ఎత్తుగడ ఏమైనప్పటికీ నితీశ్ తీరు రాజకీయాల్లో విలువలను ఆశించేవారికి ఏవగింపు కలిగిస్తోంది. కానీ ఆయన రాజకీయ చరిత్ర, ఎత్తుగడలు గమనిస్తే... అవసరార్థం పొత్తులు కుదుర్చుకోవడం, అధికారంలో కొనసాగడమే నితీశ్ ఏకైక పరమార్థం అనేది స్పష్టమవుతోంది. దానికి అభివృద్ధి ముసుగు, అవినీతి ఆరోపణలను అతికినట్లు ఉపయోగించుకోవడం ఆయన ప్రత్యేకత.

రాష్ట్రీయ జనతాదళ్ నేత, ఉప ముఖ్యమంత్రి తేజస్వీ యాదవ్‌పై అవినీతి ఆరోపణలు వచ్చినందున ఆయనను రాజీనామా చేయాలని నితీశ్ కొద్ది రోజులుగా కోరుతున్నారు. తేజస్వీపై వచ్చిన అవినీతి ఆరోపణలు రుజువైన అనంతరం కేబినెట్ నుండి తేజస్వీని తొలగించవలసిందిగా నితీష్‌పై రాహుల్ ఒత్తిడి పెరగడంతో కాంగ్రెస్, ఆర్‌జెడి 'మహాకూటమి' మధ్య ఉద్రిక్తత చోటు చేసుకుంది. జూన్ 20న ఆదాయపు పన్ను శాఖ అధికారులు లాలూప్రసాద్ యాదవ్ కుటుంబంలోని ఆరుగురిపై నేరారోపణ చేస్తూ తేజస్వీ యాదవ్‌తో సహా మిగిలిన వారి పేరిట ఉన్న ఆస్తులను స్వాధీనం చేసుకున్నారు. తమపై కేసులు రాజకీయ కుట్రతో పెట్టినవనీ, అందువల్ల తేజస్వీ యాదవ్ రాజీనామా చేయాల్సిన పనిలేదని లాలూప్రసాద్ యాదవ్ మొండికేశారు. రాహుల్ గాంధీ రంగంలోకి దిగి రాజీకి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. దీంతో సంక్షోభం తీవ్ర స్థాయికి చేరి జూలై 26న నితీశ్ తన పదవికి రాజీనామా చేశారు.

దీనికి పునాది రాష్ట్రపతి ఎన్నికల సందర్భంగానే పడిందనేది తేటతెల్లమవుతోంది. మోడీకి వ్యతిరేకంగా ప్రతిపక్షాల ఐక్యతను నిర్మించాలని చెప్పే నితీశ్ నోట్లరద్దు సందర్భంలోనే తన అడుగు పక్కకు వేశారు. మోడీ చర్యను సమర్థించారు. ఇది ఇతర ప్రతిపక్షాల వైఖరికి విరుద్ధమైంది. రాష్ట్రపతి పదవికి ఉమ్మడి ప్రతిపక్ష అభ్యర్థిని పోటీ చేయించాలని సోనియాకు అందరికన్నా ముందు సలహా ఇచ్చిన నితీశ్ ఎన్నికల్లో బిజెపి అభ్యర్థికి ఓటు వేయడం ద్వారానే తన విలువలు ఏమిటో చాటుకున్నారు. బిజెపితో నితీశ్ సర్దుబాటుకు వచ్చిన తర్వాతనే సిబిఐ..లాలూప్రసాద్ ఇళ్లపై దాడులు చేసిందనే అభిప్రాయం కూడా బలంగా వినిపిస్తోంది. అంటే లాలూ కుటుంబీకులు అవినీతి మచ్చలేని వారని చెప్పడం కాదు. నితీశ్ కుమార్ నిజంగా విలువలకు విలువ ఇచ్చేవారయితే తిరిగి ప్రజల తీర్పును కోరి ఉండేవారు.

నిజానికి నితీశ్‌పై అసమ్మతి రాలేదు. పార్టీలో తిరుగుబాటు రాలేదు. అంతా నాటకీయంగా జరిగింది. 24 గంటల్లో తిరిగి ముఖ్యమంత్రి అయ్యారు. బీహార్ ప్రజలు తిరస్కరించిన పార్టీతో జట్టుకట్టి అధికారం పీఠం నిలబెట్టుకోవడం ఏ నైతిక విలువలకు అద్దం పడుతుందో నితీశ్ కుమారే చెప్పాలి. ప్రజల తీర్పును గౌరవించే సంస్కారం ఆయనకు కొరవడింది. నిబద్ధతతో కూడిన విధానాలకు ఆయన వ్యతిరేకంగా నిలిచారు. అధికారమే పరమావధిగా ఆయన తీరు ఉంది. వాస్తవానికి తొలినుంచి ఆయన అట్లే అవకాశవాద రాజకీయాలు కొనసాగిస్తున్నారని ఇప్పుడు స్పష్టమవుతోంది. అవసరార్థం పొత్తులు కుదుర్చుకుంటూ అధికారంలో కొనసాగడంలో నితీశ్ దిట్ట. సొంతంగా ఎన్నికలలో గెలిచే బలం లేకున్నా ఎప్పటికప్పుడు లెక్కలు వేసుకొని అడుగులు వేయడం ఆయన నైజంగా కనిపిస్తోంది.

నితీశ్ తాజా పిల్లిమొగ్గ కూడా అటువంటిదే. అవినీతి వ్యతిరేక

# భారత్ - చైనాల మాటల యుద్ధం

*చర్చల ద్వారా పరిష్కరించుకోవాల్సిన భారత్ - చైనా వివాదాన్ని యుద్ధం వైపు నెట్టడంలో ఇరు దేశాల పాలకుల స్వార్థ ప్రయోజనం ఉందని, జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టి మోడీ రానున్న ఎన్నికల్లో లబ్ధిపొందాలని చూస్తున్నారని అంటున్నారు* **సంతోష్**

**భూ**టాన్ సరిహద్దు డోక్లాం పీఠభూమిలో చైనా రహదారి నిర్మాణానికి పూనుకొంది. దీంతో భారత్, భూటాన్, చైనాల మధ్య కూడలిగా పిలిచే ట్రైజంక్షన్‌లో ఉద్రిక్తతలు తీవ్రస్థాయికి చేరాయి. డోక్లాం పీఠభూమిని చైనా డాంగ్‌లాంగ్‌గా పిలుస్తోంది. భూటాన్ ఉత్తర భాగంలోని జకర్లంగ్, పసమ్‌లంగ్ లోయలతో పాటు తూర్పు భాగంలోని డోక్లాం పీఠభూమిపైనా చాలాకాలంగా చైనాతో భూటాన్‌కు వివాదం ఉంది. డోక్లాం పీఠభూమి వ్యూహాత్మకంగా అత్యంత కీలకమైన పాంత్రమైనందున డోక్లాం పీఠభూమి అంశంలో భారత్, చైనా, భూటాన్‌ల మధ్య ప్రతిష్టంబన తెరపైకి వచ్చి పలు ప్రశ్నలు, సందేహాలను ముందుకు తెస్తున్నది. జూన్ 26 నుంచి భారత తూర్పు సరిహద్దు హిమాలయ మంచుకొండలలో భారత్ చైనా ప్రభుత్వాల మధ్య మాటల యుద్ధం కొనసాగుతోంది. సరిహద్దు ఉద్రిక్తతలు ప్రత్యక్ష యుద్ధానికి దారితీస్తుందా అన్న అనుమానాలు ఇరు దేశాల ప్రజల్ని ఆందోళనకు గురిచేస్తున్నాయి.

సరిహద్దుకు ఇరువైపుల ఇరుదేశాల ఉన్నత సైనికాధికారుల పర్యటనలు, సైన్యం మోహరింపులు, ఉన్నతస్థాయి సమావేశాలు జరిగాయి. తాజా వివాదంపై మీడియా రాతలు, సామాజిక మీడియాలో ఉభయ దేశాల మైత్రిని గాక శతృత్వాన్ని కోరుకొనే వారి పోస్టులు, వ్యాఖ్యలను గమనిస్తే 1962 నాటి ఉద్రిక్త యుద్ధ వాతావరణాన్ని తలపిస్తున్నది. 1962 నాటి ఓటమి గుర్తు లేదా అంటూ చైనా భారత్‌ను వెటకారం చేస్తుంటే, 2017 నాటి భారత్ 1962 నాటి భారత్ కన్నా భిన్నమైనదని భారత్ రక్షణమంత్రి అరుణ్ జైట్లీ వ్యాఖ్యానించారు. రెండున్నర యుద్ధాలకు భారత్ పూర్తిస్థాయిలో సంసిద్ధంగా ఉందని భారత సైనిక దళాల ప్రధానాధికారి జనరల్ రావత్ అన్నారు. (రెండున్నర అంటే-చైనా, పాకిస్తాన్, అంతర్గత భద్రతా సమస్యలు అన్నమాట).

భారత్-చైనా మధ్య దీర్ఘకాలంగా సరిహద్దు విభేదాలు కొన సాగినప్పటికీ ప్రస్తుత సమస్య కొంత ప్రాధాన్యత సంతరించుకుంది. ఇరు దేశాల మధ్య గత కొంత కాలంగా క్షీణించిన దౌత్య సంబంధాల క్రమంలోనే డోక్లాం వ్యవహారం తీవ్రతను చూడాల్సిన అవసరం ఉంది. గతంలో అన్ని సందర్భాలలోనూ ఇరు పక్షాలు వాస్తవాధీనరేఖ (సరిహద్దు) దాటారంటూ పరస్పరం ఆరోపించుకునేవి. అయితే, ప్రస్తుత వివాదం అందుకు భిన్నమైంది. ఇప్పుడు భూటాన్ సరిహద్దులో 'డోక్లాం' పీఠభూమిలో చైనా రహదారి నిర్మిస్తున్నది. ఇది నేరుగా చైనా -భూటాన్‌లకు సంబంధించిన సమస్య. ఈ వివాదం భారత-చైనా సరిహద్దు సమస్య కాదు. దాదాపు 269 చ.కి.మీ విస్తీర్ణం కలిగిన ఈ ప్రాంతం టిబెట్‌కు పక్కనే ఉంది. 1890లో ఆంగ్లేయులు -చైనాకు మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం డోక్లాం టిబెట్‌లో భాగం. ఆ ఒప్పందంలో పార్టీగా లేని భూటాన్ డోక్లాం తమ భూభాగమే అని పేర్కొంటుంది. ఆ భూభాగం తమదేనని, తమ నియంత్రణలో ఉన్న భూభాగంలో రహదారి నిర్మించుకోవడానికి పూర్తి అధికారం ఉందని చైనా వాదిస్తోంది. అయితే చైనా నిర్మిస్తున్న రహదారిని భారత ప్రభుత్వం భద్రతా రీత్యా గతం నుంచి వ్యతిరేకిస్తోంది. భారత్, చైనా, భూటాన్‌ల మధ్య ట్రైజంక్షన్‌గా ఏర్పడిన చుంబీవాలి ప్రాంతానికి దిగువన 'డోక్లాం' ఉంది. 'డోక్లాం' పీఠభూమి భారత్(సిక్కిం), చైనా భూటాన్‌ల సరిహద్దులు కలిసే ప్రాంతంలో ఉండడంతో వ్యూహాత్మకంగా ప్రాధాన్యతను సంతరించుకుంది.

ప్రస్తుత వివాదంలో చైనా తను మామూలుగా వ్యవహరించేదానికి భిన్నంగా ఈ సారి డోక్లాం పీఠభూమి మీద తనకున్న చట్టబద్ధమైన హక్కును నిరూపించేందుకు చాలా దూరం వెళుతోంది. దీనికోసం అది

---

పోరాటంలో నితీశ్ కలిసివచ్చారంటూ మోడీ అక్కున చేర్చుకున్నారు. మరోవైపున, అవినీతి కేసుల్లోనూ, ఆరోపణల్లోనూ సిబిఐ, ఇడి విచారణలను ఎదుర్కొంటున్న ప్రాంతీయ పార్టీల అధినేతలను తన కను సైగలతోనే మద్దతుదారులుగా మార్చుకొనే కళా నైపుణ్యాన్ని మోడీ ప్రదర్శిస్తున్నారు. 2019 లోక్‌సభ ఎన్నికల్లో గెలుపే లక్ష్యంగా కొత్త మిత్రుల కోసం మోడీ పథకం ప్రకారమే పావులు కదుపుతున్నారనడానికి బీహార్ పరిణామాలే నిదర్శనం. రాష్ట్రపతి ఎన్నికల్లో మద్దతు కూడగట్టుకొనే పనిలో భాగంగానే ఈ వేట కూడా మొదలుపెట్టారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, తమిళనాడు, బీహార్ రాజకీయ పరిణామాలే ఈ వాస్తవాన్ని రేఖా మాత్రంగా తేటతెల్లం చేస్తున్నాయి.

బీహార్ పరిణామాలు గమనిస్తే మోడీ భావి రాజకీయ వ్యూహం గురించి ఒక అంచనాకు రావడానికి తోడ్పడుతోంది. నితీష్-మోడీ మైత్రికి పునాదులు వేసిన సూత్రం అవినీతిపై పోరాటం కాదు. అధికారం కోసం ఆరాటం అనేది స్పష్టం. నితీశ్ ఎన్‌డిఎ కూటమిలో తిరిగి చేరడంతో దేశంలో అధికార కేంద్రీకరణకు ఊతం ఇచ్చినట్లు అవుతోంది. అలాగే బీహార్ పరిణామాలు సంకీర్ణ ప్రభుత్వాల మనుగడను ప్రశ్నార్థకం చేస్తున్నాయి. బిజెపి బలం పుంజుకోవడం దేశానికి ప్రమాదకరం. ఈ నేపథ్యంలో కాంగ్రెస్‌తో పాటు ప్రాంతీయ పార్టీలు నేర్చుకోవాల్సిన గుణపాఠాలు గతం కంటే స్పష్టంగా ఉన్నాయి. రాజకీయ అవకాశం ఏలా ఉన్నప్పటికీ ఇవాళ దేశంలో మరే ఇతర పార్టీల నుంచి లేని సైద్ధాంతిక సవాళ్లు బిజెపి నుంచి అధికంగా ఉన్నాయి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

1890లో భారత్‌లోని బ్రిటిష్ వైస్‌రాయ్ లార్డ్ లాండ్స్‌డౌన్‌కూ చైనాకు చెందిన టిబెట్‌లోని ఇంపీరియల్ అసోసియేట్ రెసిడెంట్‌కూ మధ్య కుదిరిన ఒప్పందాన్ని గురించి చెబుతోంది. ఈ ఒప్పందంలోని ఒకటవ అధికరణం ప్రకారం "నీటి ప్రవాహం ఒకవైపు సిక్కింలోని తీస్త నది, దాని ఉపనదుల్లోకి, మరోవైపు టిబెట్‌లోని మోచు నదిలోకి టిబెట్ ఉత్తరాన ఉన్న ఇతర నదుల్లోకి ప్రవహించేటట్లు విభజించే పర్వత శ్రేణుల శిఖరాలే సిక్కింనూ, టిబెట్‌నూ విభజించే సరిహద్దు. ఈ రేఖ భూటాన్‌లోని గిప్‌మోచి పర్వతం దగ్గర ప్రారంభమై పైన చెప్పినట్లు నీటి ప్రవాహాన్ని విభజిస్తూ నేపాల్ వరకు ప్రయాణిస్తుంది." 1890 ఒప్పందం సిక్కిం, టిబెట్‌ల మధ్య ఇంకా చెప్పాలంటే బ్రిటిష్ ఇండియా, చైనాల మధ్య సరిహద్దు స్థిరపరిచింది. కానీ టిబెట్, భూటాన్‌ల మధ్య సరిహద్దును తిరిగి రాసింది. తీస్తా, మోచు నదుల మధ్య వాటర్ షెడ్ భూటాన్ వాస్తవ సరిహద్దుకు దక్షిణ వైపు నుండి వెళుతుంది. అప్పుడు డోక్లాం పీఠభూమి భూటాన్ సరిహద్దుకు ఆవల ఉత్తరంగా ఉండిపోతోంది. భూటాన్ చైనాలు ఈ వివాదాన్ని పక్కన పెట్టేయాలని 2002లో ఒప్పందం కుదుర్చుకున్నాయి.

భూటాన్‌తో రక్షణ ఒప్పందం నెరపుతున్న భారత్, రాయల్ భూటాన్ సైన్యం ఫిర్యాదు మేరకు తాము స్పందించామని భారత ప్రభుత్వం చెబుతోంది. ఈ అంశంలో భూటాన్‌కు బాసటగా ఉంటామని భారత్ ప్రకటించింది. భూటాన్ ఒక స్వతంత్ర దేశం. సైన్యం సహాయం కావాలని భూటాన్ నుండి మనకు ఎటువంటి బహిరంగ విజ్ఞప్తి లేదు. అటువంటప్పుడు మన సైన్యాలను డోక్లాం భూభాగంలోకి పంపి అక్కడ రోడ్డు నిర్మించే చైనా వారితో ఘర్షణ పడడం చట్ట సమ్మతం కాదు. పోనీ భారత్‌కు భూటాన్‌తో సన్నిహిత సంబంధాలున్నాయనుకుందాం, అలాగే దానితో సైనిక ఒప్పందం కూడా ఉందనుకుందాం, అలాంటి సమయంలో కూడా చైనీయులను తొలగించే పనిని భారతీయ సైనికులకు అప్పగించాల్సింది భూటాన్ ప్రభుత్వమే. అంతేగానీ భూటాన్ తరపున భారత్ యుద్ధం చేయకూడదు. ఇది అంతర్జాతీయ న్యాయ సూత్రాల ఉల్లంఘనే అవుతుంది.

భారత్, చైనాలు గతంలో సరిహద్దులపై ఇలాంటి వివాదాలు తలెత్తితే పరిష్కరించుకునేందుకు 1993లో ఓ యంత్రాంగం రూపొందించు కున్నాయి. దానిపై సంతకాలు చేశాయి. దీని ప్రకారం ఎలాంటి సరిహద్దు వివాదాలు తలెత్తినా యథాతథ స్థితి కొనసాగిస్తూ శాంతియుత చర్చల ద్వారా విభేదాలు పరిష్కరించుకోవాలన్నది ఈ ఒప్పంద ఉద్దేశం. ఇరు పక్షాల నుంచి ప్రత్యేక ప్రతినిధులను కూడా నియమించి చర్చలకు అవసరమైన వేదికను కూడా ఏర్పాటు చేశారు. సరిహద్దు సమస్య పరిష్కారం సుదీర్ఘ సమయం తీసుకునే అవకాశం ఉన్నందున, ఇతర రంగాలలో పరస్పరం సహకరించుకుంటూ స్నేహ పూర్వక సంబంధాలు కొనసాగించాలని ఇరుదేశాలు నిర్ణయించుకున్నాయి. ఫలితంగా ఇరుదేశాల మధ్య వాణిజ్యం 7 వేల కోట్ల డాలర్ల స్థాయికి చేరుకుంది.

ఇటీవలి కాలంలో ఇరుదేశాల మధ్య అనేక అంశాలలో విభేదాలు పెరుగుతున్న నేపథ్యంలో డోక్లాం వివాదం అధిక ప్రాధాన్యతను సంతరించుకుంది. అయితే ప్రస్తుత డోక్లాం అంశంలో భారత్ పాత్ర అనవసరమైనదని చైనా వాదిస్తున్నది. 1984 నుంచి భూటాన్ తన సరిహద్దు వివాదాలపై నేరుగా చైనాతోనే సంప్రదింపులు జరుపుతున్నది. డోక్లాం సమీపంలోని చుంబీ లోయను 1988 లోనే చైనా స్వాధీనం చేసుకుంది. ఆ తరవాత డోక్లాంపై చైనా గురిపెట్టింది. అప్పటినుంచీ భూటాన్-చైనా మధ్య చర్చలు జరుగుతూనే ఉన్నాయి. డోక్లాం పీఠభూమిని తమకు అప్పగిస్తే ఉత్తర భాగంలోని రెండు లోయలపై వివాదాలను పక్కన పెట్టి, వాటిని భూటాన్‌కు అప్పగిస్తామని ప్రతిపాదించింది. ప్రస్తుతం డోక్లాం సహా ఇతర వివాదాస్పద ప్రాంతాలపై చైనాతో భూటాన్ చర్చలు జరిపేలా చూడడమే భారత్ చేయగలిగిన పని. భారత్ చైనా తమ విభేదాలు వివాదాలుగా మారకుండా వ్యవహరించాలని, దీన్ని ఎలా నిర్వహిస్తామనేది మన పరిణతిపై ఆధారపడి ఉంటుందని విదేశాంగ కార్యదర్శి ఎస్ జైశంకర్ ఇటీవల సింగపూర్‌లో వ్యాఖ్యానించడం గమనార్హం.

భారత్-చైనా-భూటాన్ సరిహద్దు మూడు ప్రాంతాల కూడలి కోడి మెడ ఆకారంలో ఉంటుంది. ఈశాన్య రాష్ట్రాలతో అనుసందానించే సిలిగురి నడవాకు డోక్లాం పీఠభూమి కేవలం కొన్ని కిలోమీటర్ల దూరంలోనే ఉంది. కాబట్టి ఈ ప్రాంతంలో ప్రత్యర్థి కదలికలను అడ్డుకోవడం భారత్ భద్రతా సమస్యగా భావిస్తోంది. డోక్లాం పీఠభూమిలో చైనా గనుక రహదారిని నిర్మిస్తే ముందు యుద్ధ పరిస్థితులు తలెత్తితే బీజింగ్ నేరుగా సాయుధ బలగాలను సిలిగురి సరిహద్దు వరకు తరలించేందుకు అవకాశం ఏర్పడుతుందన్నది భారత్ భయం. సిక్కిం పైభాగంలో తమ ఆధీనంలో ఉన్న యడొంగ్ ప్రాంతంలో చైనా ఇప్పటికే పలు నిర్మాణాలు ప్రారంభించింది. రైల్వే మార్గంతోపాటు రహదారి పనులూ చేపట్టింది. ఈ నిర్మాణాలు పూర్తయితే అవసరమైనప్పుడు భారత్ సరిహద్దులవరకు భారీగా సైనికదళాలను మోహరించేందుకు చైనాకు వీలు దొరుకుతుంది. సిక్కిం దగ్గరి సరిహద్దుతో చైనా భారత్ మధ్య ఇప్పటి వరకు వివాదాలు లేవు.

భూటాన్-చైనాల మధ్య సరిహద్దు విభజనపై ఆ రెండు దేశాల మధ్య వివాదం చాలా కాలంగా ఉంది. ప్రస్తుతం మన సేనలు ప్రవేశించినట్లు చెబుతున్న డోక్లాం ప్రాంతం తనదని భూటాన్ వాదిస్తుండగా తమ ఆధీనంలో ఉన్న తమ ప్రాంతమని చైనా చెబుతున్నది. 'డోక్లాం' ప్రాంతంలో నిర్మిస్తున్న రోడ్డును నిలిపివేయాలని భూటాన్ సైన్యం చేసిన ప్రయత్నానికి చైనా నిరాకరించింది. తరువాత ఆ ప్రాంతానికి వచ్చిన భారతీయ సైన్యం రోడ్డు నిర్మాణాన్ని నిలిపివేసింది. దానికి ప్రతిగా చైనా సైన్యం ఇరుకుగా ఉన్న ఆ ప్రాంతంలో భారత సైనికులు నిర్మించిన చిన్న మిలిటరీ అవుట్ పోస్టులను ధ్వంసం చేసింది. చైనా నిర్మించ తలపెట్టిన రహదారి పూర్తయితే సిలిగురి సంధి చైనాకు అందుబాటులోకి వస్తుందని, భారత దేశానికి ఈశాన్య రాష్ట్రాలకు మధ్య దారి అయిన ఈ 20 కి.మీ. సంధి మీద చైనా దాడిచేసి పట్టు సాధిస్తే, భారత్ నుంచి ఈశాన్య రాష్ట్రాలు వేరయిపోతాయని భారత ప్రభుత్వం ఆందోళన చెందుతోంది.

1962 చైనా యుద్ధం తరువాత కొంతకాలం అడపాదడపా కొన్ని ఉద్రిక్తతలు కొనసాగినా, గత ఐదున్నర దశాబ్దాల కాలం రెండు దేశాల మధ్య సామరస్యమే కొనసాగింది. 1976 మావో మరణాంతరం డెంగ్ మార్కెట్ సోషలిజం అంటూ పెట్టుబడిదారీ విధానాలను ప్రవేశపెట్టాడు, విదేశీ నిధులను ఆహ్వానించాడు. మావో అనంతరం చైనాలో మొదలైన

మార్పులు అంతిమంగా, ఆ దేశం ఏకపార్టీ పెట్టుబడిదారీ దేశంగా పరిణమించేట్టు చేశాయి. 1990ల తరువాత ప్రపంచ రంగస్థలం మీద చైనా ఆర్థిక విజృంభణ పెరిగి, భారత్–చైనాల మధ్య వ్యాపార వినిమయం పెరిగింది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలను వినియోగించు కోవడం మీద ఆధారపడి ఆర్థిక పురోగమనాన్ని రచించుకుంటున్న చైనా, భారత్‌లో గణనీయమైన పెట్టుబడులు పెడుతున్నది. మరోవైపు కొన్ని గ్లోబల్ రంగాలలో భారత్‌తో స్పర్ధతోనూ ఉన్నది. 1990ల నుంచి చైనా ప్రపంచ రాజకీయాలలో కానీ, సైనిక ఘర్షణల్లో కానీ క్రియాశీలంగా పాలుపంచుకోలేదు. అమెరికాతోనూ, రష్యాతోనూ, అనేక మూడో ప్రపంచ దేశాలతోనూ నేరుగానూ, వివిధ ఆర్థిక వేదికల భాగస్వామిగానూ వ్యవహరిస్తున్నది తప్ప వివాదాలలో గొంతు విప్పడం లేదు. చైనా సోషలిజాన్ని వదిలి పెట్టుబడిదారీ దేశంగా మారాలని గతంలో కోరుకున్న అమెరికా, పశ్చిమ దేశాలు ఇప్పుడు పెట్టుబడిదారీ దేశంగా దూసుకుపోతున్న చైనాను చూసి బెంబేలెత్తిపోతున్నాయి.

ఆసియాలో అగ్ర రాజ్యంగా ఆధిపత్యం చలాయించాలని చైనా పావులు కదుపుతుంటే, ఆసియా ఖండంలో చైనాను కట్టడి చేసే మిత్రుల కోసం అమెరికా వెదుకుతున్నది. భారత్–చైనాల మధ్య సామరస్యం, స్నేహం అంటే అమెరికాకు గిట్టదు. అది మన దేశంలో చైనా పట్ల వ్యతిరేకతను పెంచడానికి అన్ని విధాల ప్రయత్నాలు సాగిస్తోంది. ఇటీవలే భారత్‌తో వ్యూహాత్మక సైనిక భాగస్వామ్య ఒప్పందం కుదుర్చుకుంది. చైనా ప్రభావాన్ని అడ్డుకునే లక్ష్యంతో ఆసియా పసిఫిక్, హిందు మహాసముద్ర ప్రాంతాలలో అమెరికా అనుసరిస్తున్న వ్యూహాలలో భారత్ భాగస్వామిగా మారింది. దక్షిణ పసిఫిక్ మహా సముద్రంలో భారత్‌తో కలిసి సైనిక విన్యాసాలు నిర్వహించింది. చైనా తలపెట్టిన 'ఒక బెల్ట్ – ఒక రోడ్', చైనా–పాకిస్తాన్ కారిడార్, దక్షిణ చైనా సముద్ర ప్రాంతం వంటి అంశాలలో భారత్–చైనాల మధ్య విభేదాలున్నాయి. చైనాకు వ్యతిరేకంగా అమెరికా సామ్రాజ్యవాద ప్రయోజనాలు కాపాడడానికి జూనియర్ భాగస్వామిగా భారత్ మారడాన్ని చైనా జీర్ణించుకోలేక పోతున్నది.

భారత ప్రభుత్వం దలైలామకు, ప్రవాస టిబెట్ ప్రభుత్వానికి అగ్ర ప్రాధాన్యతనిస్తోంది. దలైలామ ఇటీవల ఒక కేంద్ర మంత్రితో కలిసి అరుణాచల్‌ప్రదేశ్‌లో పర్యటించడం, లడక్‌లో టిబెట్ ప్రవాస ప్రభుత్వ పతాకాన్ని ఆవిష్కరించడం వంటి అంశాలు చైనాకు ఆగ్రహం కలిగించాయి. అణు సరఫరాదారుల గ్రూప్‌లో ప్రాధాన్యతా ప్రాతిపదికన సభ్యత్వాన్ని ఆశిస్తున్న భారత్ లక్ష్యసాధనకు చైనా అడ్డుతగులుతోందని భావిస్తోంది. అంతేకాక మసూద్ అజర్ పేరును ఐరాస ఉగ్రవాద జాబితాలో చేర్చడాన్ని కూడా చైనా అంగీకరించడం లేదు. ఇరు దేశాల మధ్య ఇప్పటివరకూ కొనసాగుతున్న విశ్వాసం, పరస్పర నమ్మకం బీటలు వారడానికి కారణమైన పరిస్థితులే ప్రస్తుతం డోక్లాం ప్రాంతంలో కొనసాగుతున్న ఉద్రిక్త పరిస్థితులకు కూడా కారణాలవుతున్నాయి. ప్రస్తుత భారత్–చైనా ఉద్రిక్తతకు ఈ అంతర్జాతీయకోణం ఉన్నది.

చైనాను ప్రధాన శత్రువుగా చూడడం ఎన్‌డిఏ మొదటి ప్రభుత్వ హయాంలోనే మొదలైంది. జార్జి ఫెర్నాండెజ్ ఆ రోజుల్లో తరచు చైనాను నిందించేవారు. తిరిగి, ఇప్పటి రెండో ఎన్‌డిఏ ప్రభుత్వ కాలంలో చైనాతో ఉద్రిక్తతలు మరింత తీవ్రమయ్యాయి. రాజకీయ నాయకత్వాన్ని బట్టే విదేశీ సంబంధాలు ఉంటాయి. అమెరికా కల అయిన నూతన ప్రపంచ వ్యవస్థపై ఎన్‌డిఏ ప్రభుత్వానికి ఎక్కువ నమ్మకం ఉంది. అందుకే ప్రపంచ ప్రజలపై అమెరికా దాష్టీకాన్ని ఎన్నడూ ప్రశ్నించనివారు, నడివీధిలో జరుగుతున్న హిందుత్వ ఫాసిస్టు మూకల హత్యలను సమర్థించేవారు కూడా ఇప్పుడు చైనాకు బుద్ధి చెప్పాలని సోషల్ మీడియాలో ఉద్యమం నడుపుతున్నారు. సిక్కిం సమీపంలోని ముక్కోణపు కూడలిలో చైనా నిర్మాణాలు భారత్‌కు వ్యూహాత్మకంగా ప్రమాదకరమైనవే. ఆ కూడలికి భారత్ చెబుతున్న అభ్యంతరాలతో చైనా ఏకీభవించడం లేదు. భూటాన్ తరపున వ్యవహరించడం మానుకోవాలని భారత్‌ను హెచ్చరిస్తున్నది.

తక్షణమే భారత్–చైనాలు రెండూ యుద్ధానికి తలపడక పోయినా, రెండు దేశాల పాలకులకు తమ దేశ ప్రజల్లో యుద్ధ భయాన్ని, కుహనా దేశభక్తిని నూరిపోయాల్సిన పరిస్థితి, తద్వారా ప్రజలు మౌలిక సమస్యల పరిష్కారం కొరకు చేస్తున్న ప్రజా ఆందోళనలను పక్కదారి పట్టించి లబ్ది పొందాల్సిన దుస్థితి ఏర్పడిందని ఈ పరిణామాలు తెలియచేస్తున్నాయి. సామ్రాజ్యవాద శక్తిగా ఎదుగుతున్న చైనా పాలకవర్గాలకు అమెరికాతో పోటీ పడగల శక్తిగా రుజువు చేసుకోవాలన్న తపనతో ఒక యుద్ధంలో విజయం సాధించాలన్న ఉబలాటం కన్పిస్తోంది. అలాగే ప్రజల్లో పెరుగుతున్న అసంతృప్తి నుండి బయట పడడానికి, ఎన్నికల్లో తాము ఇచ్చిన హామీలు నెరవేర్చలేని వైఫల్యాన్ని కప్పి పుచ్చుకోవడానికి జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడం ద్వారా 2019 ఎన్నికల్లో లబ్ది పొందాలని మోడీ భావిస్తున్నారు. యుద్ధం పాలక వర్గాల ప్రయోజనాల కోసమే తప్ప ప్రజల కోసం కాదు.

ప్రపంచ భౌగోళిక రాజకీయాధిపత్యం కోసం పడుతున్న అమానవీయపోటీ, మారణాయుధాలు ఎక్కువ కలిగి ఉన్న వాళ్లే అధిపతులన్న దురహంకారం యుద్ధాలకు దారితీస్తుంది. ఇవ్వాళ సామ్రాజ్యవాద దేశాలే కాకుండా, వర్తమాన దేశాల్లో కూడా మీటనొక్కితే వేల కి.మీ. దూరంలోని ప్రదేశాలను, మానవ జాతిని భస్మీ పటలం చేయగల అణ్వాయుధాలు ఉన్నాయి. ఇవాళ న్యూక్లియర్ ఆయుధాలు కలిగి ఉండి ఖండాంతర లక్ష్యాలను ఛేదించగల యుద్ధ సామాగ్రిని కలిగి ఉన్న తొమ్మిది దేశాలతో పాటు న్యూక్లియర్ పాకిస్తాన్, ఇండియా, ఇజ్రాయెల్, ఉత్తర కొరియా ఒకరిపై ఒకరు కాలు దువ్వుకోవడం మూడో ప్రపంచ యుద్ధ భయాన్ని కల్గించడమే కాకుండా ప్రపంచాన్ని మృత్యు కుహరంలోకి నెట్టుతున్నాయి.

యుద్ధంలో ఎవరు గెలిచినా, ఎవరు ఓడినా జరిగేది మానవ వినాశనమేనన్నది చారిత్రక సత్యం. ప్రపంచంలో ఇప్పటి వరకు జరిగిన యుద్ధాలు అన్ని ఆధిపత్యం కోసం జరిగినవే. ఒక దేశంపై మరో దేశం, ఒక జాతిపై మరోజాతి, ఒక ప్రాంతంపై మరో ప్రాంతపు వారి ఆధిపత్యం కోసం జరిగినవే. ఏ ఒక్క యుద్ధం మానవ సంక్షేమం కొరకు జరుగలేదు. అన్ని యుద్ధాల్లోనూ జరిగింది మానవ హననమే, రక్తపుటేర్లు పారడమే జరిగింది. ఏది ఏమైనా భారత్–చైనా దేశాలకు అవరోధాలుగా ముందుకొస్తున్న అంశాలపై నిర్మాణాత్మక చర్చలు శాంతియుత వాతావరణంలో జరుపుకోవడం తప్ప మరోమార్గం లేదు. ప్రస్తుత డోక్లాం పీఠభూమి వద్ద భారత్ – చైనా మధ్య కొనసాగుతున్న ప్రతిష్టంభన పరిష్కారానికి చర్చలు తప్ప మరో మార్గం లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

# చైనాతో భారత్ యుద్ధం వాంఛనీయం కాదు

*కేంద్ర ప్రభుత్వం తన తప్పుడు విధానాలు కప్పిపుచ్చుకునేందుకే చైనాతో యుద్ధ మంత్రాన్ని జపిస్తోందనీ, యుద్ధం వల్ల ప్రజల జీవన స్థితిగతులు మరింత దిగజారుతాయనీ అంటున్నారు* **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

ప్రియమైన ప్రధాన మంత్రి నరేంద్రమోడీ గారు

భారత్ చైనా సరిహద్దు డొక్లాం వద్ద యుద్ధమేఘాలు ఆవృతమై ఉన్నాయని ప్రపంచవ్యాప్త సమాచారం చెవులను తాకుతుంది. ఇరుదేశాల సైన్యం నూరు మీటర్ల దూరంలోనే కేంద్రీకృతమైందని ధృవీకరిస్తుంది. సవాళ్లు ప్రతి సవాళ్లతో యుద్ధం మరింత రెచ్చిపోయి బుసలుకొడుతున్నట్లు మీడియా గంట మోగిస్తుంది. భారత వాయుసేన సిద్ధంగా ఉండాలని కేంద్ర రక్షణశాఖ వర్గాలు అప్రమత్తం చేసినట్లు వార్త విన్నాం. ఎంతటి పరిణామాలనైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నట్లు కేంద్ర మంత్రి అరుణ్ జైట్లీ పదేపదే హెచ్చరికలు జారీచేస్తూనే ఉన్నారు. ఈ సందర్భంలో మీకు కొన్ని విన్నపాలు వినిపించాలనుకుంటున్నాను.

యుద్ధం విధ్వంసం, వినాశనం. యుద్ధమంటే ప్రాణనష్టం, ధననష్టం. యుద్ధం అభివృద్ధికి ఆటంకం, ప్రగతి నిరోధకం. ఈ వాక్యాలను ఇప్పుడు భారత పాలకులు, ప్రజలు పదే పదే నెమరు వేసుకోవాల్సిన తక్షణ తరుణం కళ్లముందు, కాళ్లముందు ఆవిష్కృతమై ఉంది. గత నెల రోజులుగా మనదేశ సరిహద్దులో చైనా దేశంతో ఏర్పడిన యుద్ధ వాతావరణం, ఆపై రెండు దేశాల ప్రతినిధుల సవాళ్లు ప్రతి సవాళ్ల మధ్య నెలకొన్న విపత్కర పరిస్థితుల నేపథ్యంలో, యుద్ధ పరిణామాలను విస్తృతంగా సమీక్షించుకోవడం తప్పనిసరి అవసరం. సిక్కిం రాష్ట్ర సరిహద్దులో డోకలా వద్ద భారత్ బంకర్లను చైనా సైన్యం స్వయంగా తొలగించడం సమస్యను మరింత మండించింది. చైనా దుడుకు చర్యలపై భారత్ తరపున కేంద్ర మంత్రి అరుణ్ జైట్లీ తీవ్రంగా స్పందించారు. 1962 నాటి భారత్ చైనా యుద్ధాన్ని అంచనా వేసుకుని చైనా కాలుదువ్వుతున్నట్లుగా ఉందని, ఇప్పటి ఈ భారత్ నాటిది కాదని చైనా పరిగణించాలని జైట్లీ ఘాటైన హెచ్చరిక చేశారు. చైనా కూడా అదే స్థాయిలో దూకుడుగా మాట్లాడుతుంది. ఈ పూర్వరంగంలో మన దేశంలోని కొన్ని మీడియా ఛానళ్లు, పత్రికా మాధ్యమాలు, బిజెపి, ఆ పార్టీ అనుబంధ శ్రేణులు వినిపిస్తున్న మాటేమిటంటే! భారత్ చైనాపై యుద్ధం చేయడం ద్వారా కంటగింపుగా మారిన మరో చిరకాల పొరుగు శత్రువైన పాకిస్తాన్‌కు కూడా బుద్ధి చేప్పాలని.

పాకిస్తాన్ విషయానికి వస్తే తరచూ ఒప్పందాలను అతిక్రమించి మన భూభాగం లోపలికి చొచ్చుకురావడం, నియంత్రణ రేఖను పదేపదే అధిగమించడం, మన సైనిక స్థావరాలపై, సరిహద్దు గ్రామాల అమాయక పౌరులపై కాల్పులు జరిపి ఉల్లంఘనలకు పాల్పడడం వంటి అనుచితాలను మనం మీడియా పరంగా మళ్లీ మళ్లీ తెలుసుకుంటూనే ఉన్నాం. వాస్తవానికి పాక్‌పై రెండు పర్యాయాలు యుద్ధం చేయడమే కాక, ఆ దేశాన్ని బలహీనపరచడం కోసం ఆ దేశ అంతర్భాగమైన బంగ్లాదేశ్ స్వాతంత్ర్య పోరాటాన్ని అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ బలపరిచి బంగ్లాకు స్వేచ్ఛను కట్టబెట్టింది. ఈ క్రమంలో మన దేశం ఎంతమేరకు ప్రయోజనం పొందినదో తెలియదు. కానీ, ఇందిరకు మాత్రం ఈ పరిణామం వలన భారత ప్రజల అపారమైన సానుభూతి లభించింది. వాజ్‌పేయి ప్రధానిగా ఉన్న సమయంలో కార్గిల్ యుద్ధం చూశాం. పాకిస్తాన్‌తో యుద్ధం ముగిసిన ప్రతి పర్యాయం ఆ దేశంపై భారత్ విజయం సాధించిందని మన పాలకులు చెప్పుకుపోవడం దేశ ప్రజలంతా ఛాతిని పెద్దదిగా చేసుకుని పొంగిపోవడం అనుభవిస్తూనే ఉన్నాం. పాకిస్తాన్ ఓటమిపై ఓటమి చవిచూస్తూ, భారత్ దెబ్బకు చతికిలబడి కూడా మళ్లీమళ్లీ నియంత్రణ రేఖ వద్ద ఎందుకు తుళ్లిపడుతుంది. ఏ విధంగా తరచూ కాల్పుల మోతలు వినిపిస్తున్నాయనేదే ఇక్కడి పెద్ద ప్రశ్న. ప్రతిసారీ పాక్ సైన్యం నియంత్రణ రేఖ దాటి మన భూభాగంలోనికి చొచ్చుకురావడం, మన సైన్యాలు సమర్థంగా తిప్పికొట్టడం మనం వింటున్న కంచె కథనాలు. అడపా దడపా మన బంకర్లను ధ్వంసం చేయడం, మన సైనికులను చెరపట్టి వికృత హింసలకు గురిచేయడం, కాల్పులతో మట్టుబెట్టడం వంటి సంఘటనలు మన చెవిని సోకుతూనే ఉన్నాయి. పాక్ నుండి బంగ్లా విడివడి పాక్ భౌతికంగా, జనాభా పరంగా, వనరుల పరంగా బలహీనపడినా భారత్‌పై దాని దూకుడు వేగం తగ్గిందన్న దాఖలా ఏమాత్రం కనిపించడం లేదు. అనుచిత సైనిక చర్యలతో పాటు ఉగ్రమూకలను తయారు చేసి, వాటిని మనదేశం పైకి తోలడం గత కొంతకాలంగా సాగుతున్న పాక్ వైఖరి ఆ దేశం భారత్‌పట్ల అనుసరిస్తున్న రాక్షస పోకడలకు మరో కోణం.

మరి పాకిస్తాన్‌పై మన విజయ పరంపర సంగతేమిటి? ఒక్క కార్గిల్ యుద్ధం సందర్భంగానే మనం ఎందరో సైనికులను పోగొట్టుకున్నాం. ఎంతో ప్రాణ, ధన నష్టం జరిగింది. వాస్తవానికి కార్గిల్ యుద్ధం ఏమంత గొప్పది కాదు, పెద్దదీ కాదు. ఆ మాత్రానికే మనం దేశవ్యాప్తంగా వీధుల వెంట డబ్బాలు పట్టుకుని పాఠశాల విద్యార్థులతో సహా కార్గిల్ యుద్ధ సహాయార్థం విరాళాలంటూ సేకరించాం. పాక్‌తో పోల్చితే భారత్ ఆర్థిక, రక్షణ, సైనిక వ్యవస్థలు చాలా విశాలమైనవి. అయినా పాక్‌కు నేటికీ సరియైన సమాధానం ఇవ్వలేకపోయాం. కార్గిల్ యుద్ధంలో భారత్‌దే విజయమంటూ నాటి వాజ్‌పేయి ప్రభుత్వం మీసాలు మెలివేసి ఫోజులిచ్చింది. అయితే ఆ యుద్ధ ఫలితమేమిటో ఇప్పటికీ బోధపడని విషయం. ఆ విజయం ద్వారా పాక్ ఆక్రమిత కశ్మీర్ అంగుళం వెనుకకు రాలేదు సరికదా! కనీసం పాక్ దుడుకు పోకడకు కళ్లెంవేసి, మన జోలికి రాకుండా అదుపు కూడా చేయలేకపోయాం. మరి ఏమిటో ప్రయోజనం? కశ్మీర్ సమస్య ఎప్పటివలే ఉంది. పాక్ దూకుడు మునుపటి మాదిరిగానే ఉంది. పాక్‌ను కట్టడి చేయలేని స్థితిలో ఉన్న మన దేశం చైనాతో ఢీకొని దాని పీచమణచాలంటుంది మోడీ ప్రభుత్వం. బహుశా చైనాతో యుద్ధం చేసి తద్వారా భారత ప్రజల సానుభూతి పొంది అధికారాన్ని పదిలంగా కొనసాగించాలని మోడీ ఆకాంక్షిస్తున్నట్లుగా ఉంది.

ఈ 'రణ'గొణధ్వనులు ప్రారంభమైన పిదప దేశ అత్యుత్తమ అంచనాల సంస్థ 'కాగ్' మన ఆయుధ నిల్వల గురించి ఒక నివేదికను బహిరంగ

పరిచింది. మన ఆయుధాలు, మందుగుండు సామాగ్రి యుద్ధమంటూ మొదలైతే 10 రోజులకు మాత్రమే పరిమితమని వెల్లడించింది. 11వ రోజున మన పరిస్థితి ఏమిటి? అల్లూరి సీతారామరాజు చలన చిత్రంలో రూథర్‌ఫర్డ్ నేతృత్వంలోని బ్రిటిష్ సైన్యాలతో పోరాడే క్రమంలో మందు గుండు నిల్వ నిండుకుందని సీతారామరాజు చెప్పిన విషయానికి గంటం దొర 'మందుగుండు లేకపోతేమిటి! మనకు గుండెబలం ఉందికదా!' అని అనునయిస్తాడు. ఆ సంభాషణ చలనచిత్రానికైతే అన్వయం కుదురుతుంది. వాస్తవ పరిస్థితులకు బహుదూరం కదా!

కాగ్ ఈ విధంగా మన రక్షణరంగ బలహీనతలను బహిర్గతం చేయడం గర్హనీయమని దేశభక్తులు అనేకమంది తప్పుపడుతూ ఆగ్రహిస్తున్నారు. కాగ్ నివేదించిన వివరాలు బహుశా సాధారణ ప్రజానీకం తెలుసుకునే సరికొత్త సమాచారమై ఉండవచ్చు. మన సైనిక బలం, రక్షణ పాటవం, ఆయుధ సంపత్తి గురించి చైనాకు తెలియదనుకోవడం, అదేవిధంగా చైనా సైనిక, రక్షణ, ఆయుధ బలాబలాలు భారత్ రక్షణ వ్యవస్థలకూ, కేంద్ర పాలక పెద్దలకూ తెలియదనుకోవడం తెలివి మాలిన విషయమే అవుతుంది. చైనా ఆర్థిక, రక్షణ వ్యవస్థలు, సైనిక పాటవం గురించి సమగ్రమైన అవగాహనకు రావలసి ఉంది. పూర్తి సమాచారం లేకుండా, అంచనాలు వేసుకోకుండా అడుగు ముందుకు పడితే 1962 నాటి పరిస్థితులను మరోమారు మూటకట్టుకునే పరిస్థితులు మనం పొందవలసి ఉంటుంది.

నిజానికి రెండు దేశాలు మానవ వనరులలో ఒకటి, రెండు స్థానాలలో ఉండి ఉండవచ్చు. అయితే అభివృద్ధి సూచికలు, జిడిపి, సైనిక రక్షణ పాటవాలలో చైనా కంటే మనం చాలా వెనుకబడి ఉన్నామన్న సంగతి మన ప్రస్తుత, గత పాలకులకు ఎరుకలేక పోలేదు. ఇవాళ ప్రపంచ అగ్రరాజ్యాలలో చైనా ఒకటని అందరూ అంగీకరిస్తున్న విషయమే. రష్యా బలహీనపడిన తదుపరి అమెరికాను ఎదుర్కోగల శక్తి, సత్తా ఒక్క చైనాకు మాత్రమే కలదన్న విషయం అందరూ అంగీకరించే సత్యమే. ఉత్పత్తి, విజ్ఞాన రంగంలో ఆ దేశం మనకంటే ఎంతో పురోగామిగా ఉంది. మనకంటే ఒక ఏడాది ఆలస్యంగా ఆ దేశ సాంస్కృతిక విప్లవం విజయవంతమై స్వాతంత్ర్యాన్ని సాధించినా అన్ని కోణాలలో ఆ దేశ అభివృద్ధి వేగాన్ని మనం అందుకోలేకపోయాం. కారణం వెతుక్కుంటే మనదేశ పాలకుల, రాజకీయ నాయకుల వక్రనీతి, వంకరరీతి జవాబుగా దొరుకుతుంది. యుద్ధం చేసినా, సంధి ఒడంబడిక జరిగినా దేశ ప్రయోజనాల కన్నా మన పాలకులకు అధికారం, రాజకీయ ప్రయోజనాలే ప్రధానంగా వ్యవహరిస్తారు. అందువల్లనే మన ప్రగతి, దేశ స్థితిగతి నత్తకు సమానంగా ప్రయాణిస్తాయనేది జనమెరిగిన సంగతే!

ఇప్పుడు చైనాతో సై అంటున్నారు. 1962 యుద్ధం సందర్భంలో అంచనాల లోపంతో 3,800 మంది సైనికులను బలిపెట్టాం. మరో నాలుగువేల మంది బంధీలుగా చైనాకు పట్టుబడ్డారు. ఆనాడు మన సైనిక బలం 12 వేలు. చైనా రెడ్ ఆర్మీ 80 వేలు. బహుశా ఇప్పుడు మన బలగాలు బాగా పెరిగి ఉంటాయి. అదే కోవలో చైనా సైనిక శక్తి కూడా విస్తృతమై ఉంటుందనేది విస్మరించలేని నిజం. చైనాలో యువత అంతా సైనిక శిక్షణ పొంది ఉంటుందంటారు. ఒలంపిక్ క్రీడల ఫలితాలే చైనా–భారత్ అభివృద్ధి వ్యత్యాసాలను సూచిస్తుంటాయి. క్రీడారంగం మాదిరిగానే చైనా అన్నిరంగాలలో ఆ మేరకే అభివృద్ధి చెందిందని విశ్వసించకపోతే ఆత్మవంచనే అవుతుంది. గుజరాత్ ముఖ్యమంత్రిగా మోడీ ఆ రాష్ట్ర ప్రభుత్వం తరపున భారత తొలి గృహశాఖా మంత్రి సర్దార్ వల్లాభాయి పటేల్ లోహ విగ్రహాన్ని నర్మదానదీ గర్భాన ప్రతిష్టించాలని నిర్ణయించారు. ఈ మేరకు విగ్రహం తయారీని చైనా కంపెనీకి అప్పగించింది. రిలయన్స్ కంపెనీ 4జి (జియో) ప్రారంభించి సంచారవాణి రంగంలో సంచలనం తీసుకువచ్చిన ముఖేష్ అంబానీ ఇటీవల 2 కోట్ల 4జి సెల్‌ఫోన్ల కొనుగోలు ఒప్పందాలు చైనా కంపెనీలకే అప్పగించారు. ఈ ఫోన్లు మనదేశంలోని వినియోగదారులకు ఒక్కొక్కటి రు. 500 లకు అందుతాయట. విగ్రహాన్ని, సెల్‌ఫోన్లను మనదేశంలో మన కంపెనీలు తయారు చేయలేవా? చేయగలవా? ఫోన్ అంత తక్కువ ధరకు విక్రయించగలమా? ప్రశ్నించుకోవాలి. ఈ రెండు సంఘటనలు చాలు, చైనాతో మనదేశ పాటవాన్ని సరితూచడానికి. ప్రపంచంలో అగ్ర రాజ్యమైన అమెరికా అధ్యక్షుడు చిన్న బుష్ ఉన్నప్పుడు తీసుకున్న నిర్ణయం ఇరాక్‌తో యుద్ధం. ఒబామా రెండు పర్యాయాలు దాటి ఇప్పుడు ట్రంప్ హయాంలో కూడా ఆఫ్ఘన్‌లో సాగుతుంది. దశాబ్దం దాటినా ముగింపుకు రాలేదు. రాచరికాల్లో మాదిరిగా ఆధునిక యుగంలో యుద్ధం ఒక పట్టాన ముగియదన్నది అంగీకరించాల్సిన వాస్తవం కళ్లముందు కనిపిస్తున్న పరిణామమే. ఒక్క ఇరాక్ దేశంతో యుద్ధమే అమెరికా ఆర్థిక వ్యవస్థను కుప్పకూల్చింది. డాలర్ అతలాకుతలమై 40 రూపాయల దిగువకు జారిపోయింది. తిరిగి నిలదొక్కుకోవడానికి చాలాకాలమే పట్టింది. ఒకవైపు ప్రపంచంలోని వివిధ దేశాల కరెన్సీ బలపడుతుంటే మన రూపాయి చిక్కిపోతున్న సంగతిని మనం చూస్తూనే ఉన్నాం. ఈ పూర్వ రంగంలో చైనాతో యుద్ధమేవస్తే దేశంలోని అనేక వ్యవస్థల స్థూల పరిస్థితులు తారుమారు కావా? కావని చెప్పడానికి వీలుకలదా? అలనాడు బంగ్లా స్వాతంత్ర పోరాటానికి మద్దతిచ్చి రాజకీయంగా తిరుగులేని శక్తిగా మారిన ఇందిరాగాంధీ లాభపడినట్లుగా, మోడీ చైనాతో తారసిల్లి ప్రజా సానుభూతితో లబ్ధి పొందాలని ఆశిస్తున్నట్లుగా అనిపిస్తుంది. అయితే ఈ దిశలోనే దేశ పరిస్థితులు, ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులు, ప్రజల జీవన స్థితిగతులను ఆయన దృష్టిలో పెట్టుకున్నట్లు తోచదు.

ప్రజల నెత్తిన శఠగోపం పెడుతూ ఇప్పటికే కేంద్రం ఆర్థిక వ్యవస్థ బలోపేతం నెపంతో అనేక కఠిన నిర్ణయాలు చేపట్టింది. పిల్ల కాలువల్లో చేపలు పట్టిన చందంగా పౌరులు పొందుతున్న అనేక రాయితీలకు కత్తెరలు వేయడం మొదలు పెట్టింది. అనేక రాయితీలను స్వచ్ఛందంగా వదులుకోమంటూ కేంద్రం వేడికోలు స్తోత్రాలు ఆలపిస్తుంది. అధికారంలోకి వచ్చింది మొదలు మోడీ ప్రభుత్వం ఇటువంటి చీప్ సంగతులపై దృష్టిపెట్టి ఖజానా నింపుకునే ఏడుపులు సాగిస్తూనే ఉంది. యాచనకు తక్కువ కాని విధంగా ఇది మానండీ, అది మానండీ అంటూ నంగి మాటలు వల్లెవేస్తూనే ఉంది. ఈ క్రమంలో వంట గ్యాస్‌పై రాయితీని వదులుకోమని చేసిన విజ్ఞప్తి మేరకు రెండు కోట్ల కుటుంబాలు ఆ బాటన నడిచాయి. అంతేగాక పది లక్షలు, అంతకంటే అధికంగా ఆదాయం ఉన్నవాళ్ల కుటుంబాలకు తనే రాయితీ గ్యాస్‌ను రద్దు పరిచింది. రైల్వే చార్జీలను పెంచడం, అర టిక్కెట్లు నిండు టిక్కెట్లుగా పరిగణించడం, రిజర్వేషన్ టిక్కెట్లు రద్దు చేసుకునే సందర్భంగా గతంలో అమలవుతున్న పద్ధతికి భిన్నంగా ప్రయాణికుని చేతిలో పదోపరకో పెట్టడం వంటి వైఖరులతో భారత ప్రజల నెత్తిన అరటోపి పెట్టింది. దేశవ్యాప్తంగా రేషన్ దుకాణాల్లో సబ్సిడీ ధరలపై అందించే కిరోసిన్, చక్కెర కోటాలను రద్దుపరిచి, వినియోగదారులను ప్రైవేట్ దుకాణాల వైపుకు తరిమింది. తాజాగా రైల్వే శాఖ వృద్ధులకు టిక్కెట్ ధరలపై ఇచ్చే రాయితీలను స్వచ్ఛందంగా వీడమని బీదపలుకులు వినిపిస్తుంది. ఇంత దీనావస్థలో ఉందా మన కేంద్ర ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థ? గత ప్రభుత్వాలన్నీ అమలు పరిచిన ఈ మాత్రం సబ్సిడీలు, రాయితీలు కల్పించలేని నిర్భాగ్య పరిస్థితిలో ఉన్నదా మన ఖజానా?

ఇంత బేలగా ఉన్న ఆర్థిక వనరులతో చైనాపై యుద్ధానికి

దిగుతానంటుంది మోడీ ప్రభుత్వం. సబ్సిడీలు, రాయితీల విషయంలో వెనక్కు తగ్గుతున్న కేంద్రం మరోవైపు ప్రజల జేబులకు చిల్లులు పెద్దవి చేసే పనిలో నిమగ్నమైంది. పెద్ద నోట్ల రద్దు అనంతరం ప్రోత్సహించిన ఎలక్ట్రానిక్ చెల్లింపుల వలన ప్రజలు అదనపు బ్యాంకు చార్జీలు చెల్లిస్తున్నారు. 15 శాతంగా ఉన్న సర్వీస్ చార్జీ 18 శాతానికి ఎగబాకింది. ఇటీవల మొదలు పెట్టిన జిఎస్‌టితో నిత్యావసరాలు అనేకం తగ్గుముఖం పడతాయని ఊదరగొట్టారు. కాని వాస్తవం అందుకు భిన్నంగా ఉంది. సరుకుల కొనుగోలుకు వెళ్లిన క్రయదారు జిఎస్‌టి వసూలుతో హతాశుడౌతున్నాడు. తన ఖజానాను అడ్డగోలుగా నింపుకునేందుకు ఏర్పరచిన జిఎస్‌టి వలన ధరలు ఎట్లా తగ్గుతాయని విజ్ఞులు ప్రశ్నిస్తున్నారు. హోటళ్లలో భోజనంతో పాటు, అన్ని తినుబండారాలపై జిఎస్‌టి వసూలుతో వినియోగదారుని మాడు పగులుతుంది. జిల్లా కేంద్రాలలో ఒక మాదిరి నాన్‌ఏసి హోటళ్లలో భోజనం ధర రు. 95 నుండి120కి చేరింది.

ఇంకోవైపు చూస్తే అంతర్జాతీయంగా క్రూడ్ ధరలు పతనమై మూడో వంతుకు చేరినా, ఇప్పటికీ ఆ ప్రకారం పెట్రోలు, డీజిల్ ధరలను ఏమాత్రం తగ్గించకుండా అధిక ధరలను వసూలు చేస్తూనే ఉంది. ఎప్పుడూ దండగలతో కునారిల్లే పెట్రోలియం కార్పొరేషన్లు లాభాల దారిలో పరుగులు పెడుతున్నాయి. ఒక్క ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ ఖాతాలోకే గడచిన ఆర్థిక సంవత్సరంలో 1020 కోట్ల లాభం జమపడింది. ప్రయాణికులు రిజర్వేషన్ టిక్కెట్లు రద్దు పరుచుకున్న సందర్భంగా ఈ ఏడాది రైల్వే శాఖ 1004 కోట్ల అదనపు ఆదాయాన్ని అనుభవించింది. కాగా దేశ పౌరులకు రాయితీల గురించి విజ్ఞప్తులు చేసే కేంద్ర ప్రభుత్వం అంతకంటే ముందుగా దేశంలోని ఎంపి, ఎంఎల్ఎ, ఎంఎల్‌సిలు, ఇతరత్రా నామినేటెడ్ పదవులు అనుభవిస్తున్న రాజకీయ ఆశ్రితులు నెలవారీ జీతాలు, అలవెన్సులు, పెన్షన్లు వదులుకోమని కోరితే సమంజసంగా ఉంటుందేమో! మోడీ ప్రభుత్వం ఆలోచించాలి.

ప్రస్తుత ఉద్వేగ తరుణాన్ని ఆసరా చేసుకుని సామాజిక మాధ్యమాలలో (సోషల్ మీడియా) వీర దేశభక్తులు కొందరు చైనా ఉత్పత్తులను, వస్తువులను బహిష్కరించి, వాణిజ్య పరంగా ఆ దేశ ఆర్థికవ్యవస్థను లొంగదీయాలని ఎస్ఎంఎస్‌లు, పోస్టింగ్‌లతో ఊదరగొడుతున్నారు. వారుగా చెపితే పాటించరేమోననే సంశయంతో బీహార్ రాష్ట్రహైకోర్టు, మధ్యప్రదేశ్ హైకోర్టు తీర్పులంటూ ప్రచారం చేస్తున్నారు. విక్రయించిన వారికి రెండువేలు, కొనుగోలు చేసిన వారికి వెయ్యి రూపాయలు అపరాధ రుసుం విధిస్తూ తీర్పులిచ్చినట్లు తెలియజేస్తున్నారు. ఈ రగడ ఎంతవరకు సమంజసం. కొంచెం కూడా మెదడుతో ఆలోచన చేయరా? మన కేంద్ర ప్రభుత్వ అనుమతులతో చైనా ఉత్పాదనలు విచ్చలవిడిగా మన సరిహద్దులు దాటి దేశంలోనికి పరుగులు తీస్తున్నాయనే విషయాన్ని మన దేశ భక్తులంతా అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. ముందుగా కేంద్ర ప్రభుత్వం చైనా ఉత్పత్తుల దిగుమతులపై నిషేధం విధించాల్సిన విషయాన్ని విడిచి, ప్రజలంతా కొనుగోలు చేయవద్దని విజ్ఞప్తి చేయడం, వ్యాపారులంతా విక్రయించడం మానాలని కోరడం ఒక విధంగా కేంద్రాన్ని వదిలి ప్రజలను దోషులుగా, వ్యాపారులను నేరస్తులుగా మార్చే ప్రక్రియే అవుతుంది. కేంద్ర ప్రభుత్వ అనుమతులు లేకుండా ఇంత పెద్దఎత్తున చైనా వస్తువులు మన మార్కెట్లను ఎలా ముంచెత్తుతాయో విజ్ఞులంతా ఆలోచన చేయాలి.

ఇప్పటికి అమలవుతున్న దిగుమతి విధానాలు చాలవన్నట్లు, మరింత వెసులుబాటు కల్పించే చర్యల దిశగా ఇటీవల 17 దేశాల మధ్య వస్తు వినిమయ ఒప్పందం మరొకటి రూపుదిద్దుకుంటుంది. 'ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం' (ఆర్‌సిఇపి) పేరుతో ఈ ఒప్పంద సమావేశం హైదరాబాద్ నందు 2017 జూలై 24 నుండి 28 వరకు 5 రోజుల పాటు నిర్విరామంగా జరిగింది. 17 దేశాల వాణిజ్య శాఖా ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొని విధి విధానాలకు రూపకల్పన చేశారు. ఈ 17 దేశాలలో మన దేశంతో పాటు చైనా కూడా సభ్యదేశమే సుమా! ఈ ఒప్పందాలు అమలయితే భారత ఉత్పాదక, వాణిజ్య రంగాలు కుప్పకూలుతాయని వాణిజ్య వేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఎట్లాగంటే! ఇప్పటి వరకూ మన దేశంలో అమలవుతున్న దిగుమతి సుంకాలకు కాలం చెల్లుతుంది. ఈ 17 దేశాలు వారివారి ఉత్పత్తులను స్వేచ్ఛగా ఈ బృంద దేశాలలో విక్రయించుకోవచ్చు. ఆయా దేశాలలో ఉత్పత్తులకు ఆయా ప్రభుత్వాలు విధిస్తున్న పన్నులు మాత్రమే చెల్లిస్తే సరిపోతుంది. మనదేశ ఉత్పత్తుల గిట్టుబాటు ధరతో సమానం చేసే విధంగా ఇతర దేశాల దిగుమతులకు దిగుమతి సుంకాలు విధిస్తూ మన ఉత్పత్తి వాణిజ్య రంగాలు నిలదొక్కుకునే పద్ధతిలో కొనసాగుతున్న చట్టాలు ఈ 17 దేశాలకు ఇకపై వర్తించవన్నమాట. దిగుమతి సుంకాలు తొలగించడంతో కారు చౌకగా తయారయ్యే ఉత్పత్తులన్నీ భారత్‌లోకి వరదలా ప్రవహిస్తాయని విశ్లేషకులు గగ్గోలు పెడుతున్నారు.

ఈ పూర్వ రంగంలో భారత వాణిజ్య, వ్యవసాయ, పాడి రంగాలు కుప్ప కూలుతాయని భయకంపితులవుతున్నారు. ఇప్పటికే చైనా ఉత్పత్తులతో సతమతమౌతున్న రంగాలు ఆర్‌సిఇపితో మరింత దిగజారుతాయని చెపుతున్నారు. ఆర్‌సిఇపిలో భాగస్వామ్య సభ్యత్వం కలిగిన ఫిలిప్పీన్స్ దేశం రోజుకు ఆ దేశ అవసరాలన్నింటికీ మించి 500 శాతం అధికంగా పాల ఉత్పత్తి చేస్తుందట. ఈ మిగులు పాల నిల్వలన్నీ అత్యధిక జనాభా కలిగిన మన దేశానికి సరఫరా అయితే మన పాడి పరిశ్రమ నిజంగానే 'పాడె' ఎక్కడం ఖాయమని అంటున్నారు. కేంద్రం భారత వ్యవస్థల వ్యతిరేక ఒప్పందాలు ఒకదానిపై మరొకటి చేసుకుంటూ పోతూ ఉంటే, సోషల్ మీడియాలో చైనా వస్తువులను కొనకండి, బహిష్కరించండి అంటూ ఎస్ఎంఎస్‌లు, పోస్టింగ్‌లు పెట్టడం అమాయకత్వం మినహా మరొకటి కాదనే చెప్పుకోవాలి. ఆర్‌సిఇపి ఒప్పందం అమలు ప్రారంభమైతే ఇలాంటి ప్రచారం 16 దేశాలపై కొనసాగాల్సి ఉంటుందని హాస్యంగా మాట్లాడుకోవచ్చు.

ముందుగా భారతీయ జనతా పార్టీ నుండి ఈ త్యాగం మొదలైతే గొప్పగా ఉంటుంది. అట్లాగకపోతే ఇన్నింటిని రద్దు చేసిన మోడీ ప్రభుత్వం వీటిని కూడా రద్దు పరిచి రాజకీయాలు ప్రజా సేవకోసమే గాక, స్వచ్ఛంద సేవగా నిరూపించుకోవాలి. ఎంపిలు పార్లమెంటు సమావేశాలకు ఢిల్లీ చేరేందుకు ఇదివరలో మాదిరిగా రైళ్లలో ప్రయాణించే విధంగా విధి విధానాలు సవరిస్తే ప్రజలు హర్షిస్తారు. విమాన ప్రయాణాల ఖర్చు తగ్గించి ఖజానాపై భారాన్ని అదుపు చేయాలి. ఏ ఒడిదుడుకులు లేకుండా అంతా సజావుగా నడుస్తుంటేనే అత్యంత కక్కుర్తి వ్యవహారాలకు పాల్పడుతున్న కేంద్రం చైనాతో యుద్ధమే సంభవిస్తే ప్రజలపై ఎటువంటి భారాలు మోపుతుందోననే భయందోళనలో ఉన్నారు ఆలోచనాపరులు. చైనాతో కయ్యానికే దిగవలసి వస్తే మనదేశానికి మద్దతుగా ఏ దేశమైనా సైనిక సహకారమందిస్తుందా? దేశాధిపతులు కలిసినప్పుడు చేతులు కలపడం, కౌగిలింతలు పెట్టుకోవడం, వీపుచరచడం వంటి ఆకర్షణీయ కార్యక్రమాలు కంటిగింపుగా నడుపుతున్న దేశాధినేతలు మనకు సహాయపడే నిర్ణయం తీసుకోగలరా? ఉగ్ర దాడులు జరిగి ప్రాణ నష్టం జరిగినప్పుడు సానుభూతి వ్యాఖ్యానాలు, ఖండించడాలతో ఆకట్టుకుంటున్న దేశాలు రణానికి భుజం కలుపుతాయా? అన్నది లక్ష డాలర్ల ప్రశ్న. భారత్‌కు భూటాన్ మద్దతు ప్రకటించిందని విన్నాం.

# సత్యాసత్యాల పునర్ వీక్షణం

*ఆగస్ట్ సంచిక సంపాదకీయంలో వ్యక్తం చేసిన అభిప్రాయాలను విమర్శిస్తూ మరో కోణాన్ని చూపుతున్నారు'*

**ఎం. కృష్ణ ఆదిత్య**

**భా**రత్ చైనాల మధ్య దోకాలాలో ఉద్రిక్తత గురించి 'వీక్షణం' ఆగస్టు 2017 సంచిక సంపాదకీయంని 'యుద్ధ మేఘాలు, ప్రకటనలు, నిజంగా యుద్ధం కూడా ఇరు దేశాల ప్రజల కోసం అవసరమైనవి కావు' – అని ముగించారు, అది సరైందే. అయితే ఈ ముగింపుకి ముందు చేసిన కథనంలోనూ, వ్యాఖ్యలోనూ, కొన్ని లోపాలు, చర్చనీయాంశాలు, ఈ విషయంలో గమనించాల్సిన అంశాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్నింటికే పరిమితం ఈ వ్యాఖ్య.

1. 'యుద్ధ రంగంలో మొట్టమొదట మరణించేది సత్యం' సరిగ్గానే ప్రస్తావించారు. అయితే ఈ క్రమంలో ఆయా దేశాల్లోని మాధ్యమాలు సాధారణంగా 'సత్యం–వధ'కు పాల్పడుతుంటాయి. వాటికి ప్రభుత్వాలు విడుదల చేసే సమాచారమే ప్రధాన వనరుగా ఉంటుంది. ఉద్దేశపూర్వకంగా 'మిస్ ఇన్ఫర్మేషన్','డిస్ ఇన్ఫర్మేషన్, పోస్ట్ ట్రూత్' (సత్యాతీత ప్రచారం) పాలకవర్గ కళలు. సత్యంవధ జరిగిపోయినా, ఇలాంటి సందర్భాల్లో పాతి పెట్టబడిన సత్యాన్ని–శవాన్ని మళ్లీ వెలికితీసి చేసే పరిశీలన లాగా – పునర్ వీక్షణం చేయడం అవసరం.

2. 'ఈ ఘర్షణలు ఎక్కడ ప్రారంభమయ్యాయనే దానికి ప్రత్యర్థులలో ఎవరి కథనాలు వారికున్నాయి' అని రాశారు; వాటితో కొట్టుకుపోకుండా, వాస్తవాలు చూడాలి. ఈ ఘర్షణలు ఏ పూర్వరంగంలో, ఏ పరిణామాల క్రమంలో జరిగాయి? ప్రధాని మోడీ అమెరికా వెళ్లి, అక్కడ అధ్యక్షుడు ట్రంప్‌ని కల్సింది (జూన్ 26), డోకాలా ఘర్షణ వెలుగులోకి వచ్చింది కూడా సుమారుగా జూన్ చివరి రోజుల్లోనే; కాగా జాతీయ భద్రతా సలహాదారు, మాజీ 'రా' అధిపతి అజిత్ దోవల్ మార్చిలోనే అమెరికా రక్షణ కార్యదర్శి మాట్టిస్‌ని కలిశారు; మోడీ అమెరికాలో అడుగుపెట్టడానికి ముందే 'చైనాపై గూఢచర్యానికి అద్భుతంగా పనికివచ్చే' 22 డ్రోన్ విమానాలను ఇండియాకు అమ్మడానికి అమెరికా ప్రభుత్వం ఆమోదముద్ర వేసింది. నాటోకు వెలుపల దేశాలకు ఈ ఆధునిక విమానాలను ఇంతకు ముందెన్నడూ ఇవ్వలేద' ని 'రాయిటర్స్' వార్తా సంస్థ ఎత్తి చూపింది. మోడీ– ట్రంప్ భేటీని జూన్ 26 నాటి న్యూయార్క్ టైమ్స్ 'చైనాతో తలపడుతున్న తోటి జాతీయవాదిని' కలిశారు, అన్న శీర్షికతో– 'ట్రంప్‌ని మెప్పించడానికై చైనాతో పోటీ పడడానికి ఇండియా ప్రయత్నిస్తున్న క్రమంలో" కలిశారు అని పేర్కొంది. 'అమెరికా జపాన్ ఇండియాలు ఈసారి భారీ స్థాయిలో 'ఉమ్మడి మిలటరీ విన్యాసాలు' చేయాలని, చైనాకు హెచ్చరికగా ఉంటాయని ప్రకటించారు. మోడీ, ట్రంప్ కలయిక ప్రాముఖ్యత ఏమిటో, అది చైనాకు వ్యతిరేకంగా ఎలా ఎక్కుపెట్టబడినదో? జూలై 3 నాటి 'టైమ్స్'(ఆఫ్ ఇండియా)లో ఒక శీర్షిక ఇది: 'చైనాను నిలవరించగలం అని అమెరికాకు చూపెట్టడాని కోసం మోడీ అమెరికా పర్యటనకు ముందే ఇండియా సరిహద్దుని అతిక్రమించింది అని అంటున్నాయి చైనా మీడియా'. 'చైనా ఎదుగుదలను అడ్డుకోవడానికి దృఢ నిశ్చయంతో ఉన్నామని చూపెట్టుకోడానికే నిర్వివాదమైన సరిహద్దు ప్రాంతంలో ఇండియా ఉల్లంఘించింది'; అని చైనా పత్రిక 'గ్లోబల్ టైమ్స్' రాసిందని టైమ్స్ రిపోర్టు చేసింది.

ట్రంప్–మోడీ భేటీ గురించి జూన్ 27 'టైమ్స్' వార్త శీర్షిక ఇది: 'చైనాను అడ్డుకోవడానికి ఇండియా– అమెరికాల మధ్య కూటమి వినాశకర ఫలితాలకు దారి తీయవచ్చని చైనా మీడియా అంటున్నది'. 'చైనాను నిలువరించే అమెరికా వ్యూహంలో ఒక మిలటరీ చౌకీ దేశంలాగా పాత్ర నిర్వహించడం భారత ప్రయోజనాలకు అనుగుణ్యమైనదేమీ కాదు… తన అలీన వైఖరి నుంచి వైదొలగి, చైనాను ఎదుర్కోవడంలో అమెరికా 'పావు'గా తయారైతే, ఇండియా వ్యూహాత్మక సందిగ్ధతలో చిక్కుకుంటుంది; దక్షిణాసియాలో కొత్త భౌగోళిక రాజకీయ ఘర్షణలు రాజుకుంటాయి? భారత్‌కి అవసరమైన వీసా, ఉద్యోగాల వ్యవహారం వంటి 'ద్వైపాక్షిక వివాదాలను వదిలేసి, చైనాపై గురిపెట్టి చర్చలు జరిపారని ఈ పత్రిక వ్యాఖ్యానించింది. 'చైనా సవాలుని ఎదుర్కోవడంలో భారత–అమెరికాల వ్యూహాత్మక భాగస్వామ్యం గట్టిగానే ఉంటుందని ఆత్మస్థైర్యం పొందడం ఈ పర్యటన ప్రధాన విజయం' అని జూన్ 27 నాటి హిందుస్తాన్ టైమ్స్ సంపాదకీయంలో పేర్కొన్నారు. కొత్తగా ప్రారంభించిన 'ఇండియా యుఎస్ ఫోరం' ని ప్రారంభిస్తూ, విదేశాంగ మంత్రి సుష్మాస్వరాజ్ 'మోడీ–ట్రంప్ సమావేశంలో కొన్ని ఉమ్మడి సూత్రాలను రూపుదిద్ది ప్రకటించారని, ఇది ప్రాముఖ్యత గల విషయం'అని ఎకనామిక్ టైమ్స్ ( 31-7-2017) రిపోర్టు చేసింది.

---

భూటాన్ ఎంత? దాని బలగమెంత? అది చేయగలిగిన సాయమెంత? భూటాన్ మద్దతును పరిగణనలోకి తీసుకోగలమా?

చైనాతో యుద్ధం భారత్‌లోని అన్ని వ్యవస్థలకు తీవ్రమైన నష్టాన్ని కలుగజేస్తుందని మేధావులు విశ్లేషిస్తున్నారు. అంతమాత్రంచే చైనాకు లొంగిపోవలసిన అవసరం కానీ, భయపడవలసిన అగత్యం కానీ అవసరం లేదంటున్నారు. గౌరవం, మర్యాద తగ్గని మార్గంలో సమస్యను చర్చల ద్వారా పరిష్కరించుకోవడం ఉత్తమమని వారు స్పష్టం చేస్తున్నారు. యుద్ధాలతో భారత సాధారణ జీవనాన్ని దుర్భరం చేయవద్దని ప్రజలు కూడా కేంద్ర ప్రభుత్వాన్ని కోరాలని విశ్లేషకులు సలహా ఇస్తున్నారు. చైనాతో స్నేహమే భారత్‌కు శ్రేయోదాయకమని విశ్వసించాలి. ఇరాక్, ఆఫ్గన్ దేశాలలోని యుద్ధానంతర స్థితిగతులను, వాటి ముఖ చిత్రాలను గమనంలోకి తీసుకోవాలి. 1962 నాటి యుద్ధంతోనే మూడు తరాలుగా ఆ దేశ ప్రజలలో భారత్ పట్ల శతృవైఖరి కొనసాగుతుంది. అదే విధంగా చైనా పట్ల కూడా భారత్ ప్రజలు ద్వేష భావంతో ఉన్నారు. మరోమారు యుద్ధంతో ఆ అవాంఛనీయ స్వభావాలను స్థిరపడచడమే అవుతుంది.

*(రచయిత గౌరవాధ్యక్షులు: గుంటూరు జిల్లా రచయితల సంఘం)* వీ

3. ప్రధాని మోడీ అంతకుముందు జూన్ 2న రష్యాలో 'ఇంటర్నేషనల్ ఎకనామిక్ ఫోరం' సమావేశాల్లో పాల్గొన్నారు. 'భారత్–చైనాల మధ్య సరిహద్దు వివాదం ఉన్నా, అక్కడ గత 40 ఏళ్లలో ఒక్క తుపాకీ గుండు కూడా పేలలేదు'–అని అక్కడ మోడీ పేర్కొన్నారు. ఈ వైఖరిని చైనా స్వాగతిస్తూ జూన్ 5న ప్రకటన చేసింది. అంతకు ముందు హోం మంత్రి రాజనాథ్ సింగ్ మాట్లాడుతూ వాస్తవాధీన రేఖ సరిగ్గా ఎక్కడ ఉంది అన్న విషయంలో వేర్వేరు అవగాహనలున్నందున (డిఫరెంట్ పెర్సప్షన్) సంఘటనలు జరుగుతుంటాయని చెప్పారు. కాగా మోడీ–ట్రంప్‌ల సమావేశం నాటికి కొద్ది వారాల్లోనే భారత్ వైఖరి మారిపోయింది; ఎందుకో పైన చూశాము. చైనాని ఆటంకపరిచే అస్థిర వాతావరణం కల్పించడం ఒక వ్యూహంలో భాగం.

4. విదేశీ వ్యవహారాల పార్లమెంటరీ కమిటీకి విదేశాంగ శాఖ కార్యదర్శి జయశంకర్ ఈ వ్యవహారాన్ని వివరించారు. సమావేశంలోని రెండు కోణాలను 'బిజినెస్ స్టాండర్డ్' జూలై 19 నాటి రిపోర్టులో మాత్రం చూడవచ్చును :

అ) 'అతి జాతీయవాదము', 'మీడియాలో అతిగా చిత్రించడమూ' ప్రస్తుత ప్రతిష్టంభనను మరీ రెట్టించి, దౌత్యం ద్వారా, చర్చల ద్వారా వివాదాన్ని పరిష్కరించడానికి చేస్తున్న ప్రయత్నాలను ఆటంకపరించింది– అని జయశంకర్ చెప్పారు. అయితే చైనా వస్తువులను బహిష్కరించాలని, కైలాస్ మానస సరోవరాన్ని భారత్ ఆక్రమించి, వశం చేసుకోవాలని సంఘ్ పరివార్ అంటున్న విషయాన్ని ఆయన పేరుపెట్టి ప్రస్తావించలేదు– అని ఆ పత్రిక రిపోర్టు చేసింది.

ఆ) ఈ వ్యవహారంలో కశ్మీర్, బెంగాల్ ముఖ్యమంత్రుల ప్రమేయం ప్రకటనలవల్ల చర్చలు జటిలమవుతున్న మాట నిజం. దేశంలోని ఆంతరంగిక రాజకీయాలు, సంఘ్‌పరివార్ యుద్ధోన్మాదము, మాధ్యమం లో దేశభక్తి అత్యుత్సాహము నిర్వహిస్తున్న పాత్రను పైవార్తలో గ్రహించవచ్చును.

5. 'మానస సరోవర్ యాత్రికులను వెనుకకు పంపాలని చైనా ప్రభుత్వం నిర్ణయించింది. తదుపరి యాత్రలను భారత ప్రభుత్వం రద్దు చేసింది'. అని వీక్షణంలో రాశారు. మానస సరోవర్‌కి లోగడ 1980ల నుంచీ ఉత్తరాఖండ్ ద్వారా రహదారి ఏర్పాటు ఉండేది. సిక్కిం రూటుని తెరిపించడం ద్వారా సిక్కింని చైనా గుర్తించేట్టు చేయాలని; వ్యూహాత్మకంగా కొంత ప్రయోజనం ఆశించి ఇండియా మరో రూటుని కోరింది. ఇండియా వచ్చి చైనా అధ్యక్షుడు మోడీని కల్సిన సందర్భంలోనే ఈ రూట్‌ని తెరుస్తున్నట్టు చైనా ప్రకటించింది. సరిగ్గా ఇక్కడే ప్రస్తుత వివాదం. అందువల్ల ఈ రూటుని చైనా ప్రస్తుతానికి మూసివేసింది. పాతరూటుని మళ్లీ తెరిచింది. ఈ విషయంలో దేశంలో ఉన్న హిందూమతపరమైన సెంటిమెంట్లను విస్తరణవాద లక్ష్యంతో మోడీ ప్రభుత్వం ప్రయోగిస్తున్నది. రూటు విషయంలో చైనా రాయితీవల్ల ఏర్పడిన సుహృద్భావాన్ని సైతం రూపుమాపాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

6. 'సామ్రాజ్యవాద శక్తిగా ఎదుగుతున్న చైనా పాలకవర్గాలు అమెరికాను కూడా మించిపోగల మొనగాడుగా తమను తాము నిరూపించుకోవాలంటే తక్షణమే ఒక యుద్ధంలో తమ ప్రతాపాన్ని చూపుకోవలసి ఉంది' అని వీక్షణంలో రాశారు. ప్రస్తుత ఉద్రిక్తతలలో నిర్వివాదాంశాలైన అమెరికా సామ్రాజ్యవాద నిర్దిష్ట పాత్ర, భారత విస్తరణవాదం గురించి పూర్తిగా విస్మరించారు; చర్చనీయాంశమైన 'చైనా సామ్రాజ్యవాదం' గురించి నిరాధారంగా రాశారు! భారత విస్తరణ వాదానికి సంబంధించి:

అ) భారత సరిహద్దులలో చైనా చొరబడడంవల్ల డోకాలాలో ఉద్రిక్తత ఏర్పడినట్టుగా మొదటిదశలో ప్రచారం చేశారు; దీన్ని చైనా ఖండించడం తో ఆ ప్రాంతాన్ని సందర్శించిన భారత సైనికాధికారులు ఆ ప్రాంతం భారత్‌కి చెందినది కాదని; భూటాన్‌కి చెందినదని; భూటాన్‌కు సహాయంగా భారత సైన్యాలను పంపామని వివరణ ఇచ్చారు.

ఆ) 'ఇక్కడ భారత్ ప్రాంతంగా చెప్పబడుతున్నది సిక్కింలోని భాగమని గమనించాలి. సిక్కిం 1975 వరకూ నేపాల్, భూటాన్ వలెనే విడిదేశంగా ఉండేదని; 1975లో భారత ప్రభుత్వం ఆ ప్రాంతాన్ని కుట్రలతో దురాక్రమించి, భారత్‌లో కలిపేసుకుందని ప్రస్తుత తరంలోని చాలా మందికి తెలియదు. తెలిసో, తెలియకో విస్తరణవాదాన్ని చూడడం లేదు.

ఇ) సహజంగానే అనేక దేశాలతో పాటు చైనా ఆ దురాక్రమణను ఖండించింది. సిక్కింను భారత భూభాగంగా గుర్తించ నిరాకరించింది. వాజపేయి ప్రధానిగా ఉన్న రోజుల్లో భారత్ దౌత్యం ఫలితంగా ఆ ప్రాంతంలో సరిహద్దు వాణిజ్యం సాగే ఏర్పాట్లకు ఒప్పుకోవడం రూపంలో, చైనా సిక్కింను భారత్ అంతర్భాగంగా గుర్తించింది పరోక్షంగా మాత్రమేనని గుర్తించాలి. టిబెట్ పేరిట మదత పేచీలు పెట్టబోమని వాజపేయి ప్రభుత్వం హామీ ఇచ్చినదాని ఫలితంగా మాత్రమే– షరతులతో కూడిన ఆ రాయితీకి చైనా అంగీకరించింది. ఏ ఒక్క దేశమూ టిబెట్‌ని స్వతంత్ర దేశంగా గుర్తించదని ఇక్కడ గమనించాలి. అయినా భారత భూభాగంలోని ధర్మశాలలో టిబెట్ పేరిట ఒక పోటీ ప్రభుత్వం బాహాటంగానే నడుస్తున్నది. దానికొక ప్రధాని, మంత్రివర్గం, అధికారిక మీడియా, సాయుధ బలగాలు ఉన్నాయి. అమెరికా, యూరపు దేశాలు వేలాది కోట్లతో దాన్ని దశాబ్దాలుగా పోషిస్తున్నాయి. భారత ప్రభుత్వం అక్కడ ప్రాదేశిక వసతి, ఇతర సదుపాయాలు కల్పిస్తున్నది. ఒకదేశం అంతర్జాతీయ చట్టాన్ని ఇంత బాహాటంగా ఉల్లంఘించి, తప్పించుకు తిరుగుతున్న మరో ఉదంతం లేదేమో! దలైలామాను మతగురువుగా చిత్రిస్తూ, చైనా వ్యతిరేక రాజకీయ కార్యకలాపాలతో దేశ విదేశాల్లో ఊరేగిస్తున్నారు. ఇటీవల మోడీ ప్రభుత్వం చైనా అభ్యంతరాలని తోసిపుచ్చి, దలైలామాను అరుణాచల్ ప్రదేశ్‌కీ, ఇతర చోట్లకీ ఊరేగించి, అతని రాజకీయాలకు విశేష ప్రాచుర్యం కల్పించింది. వాజపేయి హయాంలో కుదిరిన అవగాహనను మోడీ ప్రభుత్వం ఉల్లంఘిస్తున్న పూర్వరంగంలో సిక్కింకి సమీపంలో ప్రస్తుత ఉద్రిక్తతలు సాగుతున్నాయి. ఈ ప్రవర్తన ఇలాగే కొనసాగితే, సిక్కింపై ఆనాటి అవగాహనని రద్దు చేస్తామని చైనా సూచన ప్రాయంగా తెలియజేసింది.

7. విస్తరణ వాదానికి సంబంధించి ప్రస్తుతం కీలకాంశం భూటాన్‌తో సంబంధాలు, అది వేరే కథ, పెద్ద గాథ. క్లుప్తంగా కొన్ని విషయాలు: పేరుకి భూటాన్ స్వతంత్ర దేశం. బ్రిటిషు వలస పాలకులు నేపాల్, సిక్కిం, భూటాన్‌లను విడి విడి రాజ్యాలుగా గుర్తించినా, వారి విదేశాంగ, రక్షణ వ్యవహారాలను శాసిస్తూ వచ్చారు. 1947 తర్వాత అదే సంబంధాన్ని నెహ్రూ ప్రభుత్వం కొనసాగించింది; స్వతంత్ర కాంక్షతో ఆ ఒడంబడికను సవరించాలని భూటాన్ పట్టుపట్టింది. 2007లో కాంగ్రెసు ప్రభుత్వం కీలకమైన క్లాజులను సవరించి, విదేశీ రక్షణ వ్యవహారాల్లో స్వతంత్రంగా వ్యవహరించే హక్కుని అంగీకరించింది. అయితే ఆ హక్కు కాగితంపైనే మిగిలిపోయింది. 2012 జూన్‌లో భూటాన్ కొత్త ప్రధాని జిగ్మితిన్‌లే – అప్పటి చైనా ప్రధాని వెన్‌జియాబావో సరిహద్దుపై స్థూలంగా ఒక ఒప్పందానికి వచ్చారు; ఇండియా అడ్డుపడి, ఆపేసింది. భూటాన్‌కి కొన్ని సప్లయిలను, సదుపాయాలను, సబ్సిడీలను నిలిపివేసి, ఒత్తిడి చేసింది. అప్పటికీ లొంగడం లేదని 2013 ఎన్నికల్లో జోక్యం చేసుకొని, ప్రధాని

జిగ్మితిన్‌లేని ఓడించింది. కొత్త ప్రధానిపై ఒత్తిడి కొనసాగించింది. తను ఎన్నికవగానే ప్రధాని మోడీ 2014 జూన్‌లో భూటాన్‌లో పర్యటించారు. ప్రణబ్ ముఖర్జీని 2014 నవంబర్‌లో భూటాన్‌కి రాష్ట్రపతి హోదాలో పంపించారు. చైనా–భూటాన్‌ల మధ్య సరిహద్దు చర్చల పురోగతి గురించి భారత ప్రభుత్వ 'ఆందోళన'ని ఆయన వ్యక్తంచేసి, చర్చిస్తారని కలకత్తా పత్రిక 'టెలిగ్రాఫ్' (అక్టోబర్28,2014) ఒక ప్రముఖ వ్యాసాన్ని ప్రచురించింది. భూటాన్‌తో చైనా సరిహద్దు ఒప్పందం కుదిరితే, ఆ వెంటనే ఇరు దేశాల మధ్యా దౌత్య సంబంధాలు ఏర్పడడం ఖాయం అని భావించి, భారత్ ఆ క్రమాన్ని అడ్డుకొని ఆపేసింది. భారత్ 'పెద్దన్నలాగా పెత్తనం' చేస్తున్నదని భూటాన్‌లో విస్తృత చర్చ, నిరసన సాగాయి. భూటాన్‌కి పడమటి (సిక్కిం వైపు) సరిహద్దుని, దక్షిణ సరిహద్దుని (బెంగాల్ వైపు) ఇండియా నిర్ణయించి ప్రకటించింది. ఉత్తర సరిహద్దు (చైనా వైపు) ఒప్పందాన్ని అడ్డుకున్నది. తూర్పు సరిహద్దుని (అరుణాచల్ ప్రదేశ్ వైపు) తేల్చకుండా అట్టిపెట్టింది. అక్కడ భూటాన్ భూభాగాన్ని ఇండియా ఆక్రమించుకొని ఉన్నదని; ప్రస్తుత వివాద ప్రాంతంలో చైనా నుంచి ఎక్కువ భూభాగాన్ని రాబట్టుకోవాలని భారత్ ఒత్తిడి చేస్తున్నదని భూటాన్‌లో నిరసనలు వ్యక్తమవుతున్నాయి. ఈ విషయాల్లో ఇండియా నిరంకుశంగా సెన్సారుని అమలు చేస్తున్నది. మాట వరసకు ఐరాస సభ్యత్వం ఉన్న భూటాన్‌కి నేటికీ పొరుగు దేశమైన చైనాతో దౌత్య సంబంధాలు లేకుండా అడ్డుకొన్నది.

ఇతరుల వ్యాఖ్యలు : ప్రస్తుత వివాదాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడానికి కొన్ని ప్రముఖ అభిప్రాయాల్ని గమనించడం ఉపయోగపడుతుంది.

◆ 'ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ' 2017 జూలై 8 సంచికలో సంపాదకీయం 'చైనాతో మతిలేని శత్రుత్వం' (ఇన్‌సేన్ హోస్టిలిటీ విత్ చైనా) శీర్షికతో ఇలా వ్యాఖ్యానించింది : 'ఇప్పటికే భారత చైనాల మధ్య రెండు ఘర్షణ కేంద్రాలున్నాయి: ఈశాన్యంలో మెక్ మోహన్ రేఖ గురించి, వాయవ్యంలో అక్సాయ్‌చిన్ గురించి, వీటికి తోడు మూడో ఘర్షణా కేంద్రాన్ని సృష్టించాలని ప్రయత్నిస్తున్నారు. ఈ ఆలోచన హిందుత్వవాది ప్రధాని మోడీగారి మానస పుత్రిక. అమెరికా సామ్రాజ్యవాదంతో తన కూటమిని గట్టిపరుచుకోవడానికి రూపొందించినట్టు కనబడుతున్నది; సరిగ్గా భారత సైన్యాలు వివాద ప్రాంతంలోకి అడుగు పెట్టి, చైనా రోడ్డు పనిని అడ్డుకున్న రోజునే (జూన్26) ప్రధాని మోడీ ట్రంప్‌ని కలిశారని, అమెరికాతో భారత్‌కున్న విబేధాలను తగ్గించి మాట్లాడారని అదే సంపాదకీయంలో పేర్కొన్నారు. చైనాతో అమెరికా ఘర్షణలో భారత్ 'తొలివరుసలో నిలబడే రాజ్యంగా' (ఫ్రంట్‌లైన్ స్టేట్) ఉండాలని కోరుకున్న ఒబామా ప్రభుత్వం బిజెపి సైద్ధాంతిక వైఖరులను దానికై పూర్తిగా వినియోగించుకున్నదని; తన 'మేజర్ డిఫెన్స్ పార్ట్‌నర్'గా భారత్‌ని పేర్కొన్నదని ఆ సంపాదకీయంలో గుర్తుచేశారు. ఈ క్రమంలో ట్రంప్ వచ్చారని, ప్రాదేశిక వివాదాల్లో భారత్ వైఖరిని అమెరికా సమర్థిస్తుందని మోడీ సలహాదారులు భావించినట్టుందని వ్యాఖ్యానించింది, ఆ పత్రిక. ఈ క్రమంలోనే చైనాతో శత్రుత్వ చర్యలను రెచ్చగొట్టినట్టు కనపడు తున్నదని; గత మూడేళ్లుగా చైనా పట్ల శత్రుత్వాన్ని పెంచుకు పోతున్న క్రమంలోనే ఇది జరిగిందని రాసింది. అయితే ట్రంప్ ఆ తర్వాత చైనాతో సర్దుకుపోయే వాలకం కనబరిచారని, మోడీ కూడా అలాగే వెనక్కి తగ్గుతారా ? అన్న ప్రశ్నతో ముగించింది.

◆ జూన్ 29 నాడు హిందుస్తాన్ టైమ్స్ విలేఖరి ఇలా రాశారు : 'ఈ ప్రదేశం చైనా కంట్రోల్లో ఉన్నది; టిబెట్ స్వపరిపాలనా ప్రాంతం లోపలే ఉంది; అయితే ఆ ప్రదేశం తమదని భూటాన్ క్లెయిం చేస్తున్నది'.

◆ ఈనాటి వివాదం గురించి 'ఫ్రంట్ లైన్' (హిందూ గ్రూపుకి చెందిన) పక్షపత్రిక ఆగస్టు4 నాటి సంచికలో– నిపుణుడైన ప్రముఖ రచయిత ఏజీ. నూరానీ రాసిన వ్యాసంలో ఇలా పేర్కొన్నారు : '1954 జూలై 1 నాడు నెహ్రూ ఏకపక్షంగా భారత పటంలో మార్పులు చేశారు. పశ్చిమ సరిహద్దులో 'సెటిల్డ్ బౌండరీ' (పరిష్కరించబడిన సరిహద్దు) ఉన్నట్టుగానూ, చర్చించడానికి ఎలాంటి తావులేని ప్రదేశంగా చూపెట్ట దానికీ ప్రయత్నించారు. అంతేకాక పాత మ్యాపులన్నింటినీ నాశనం చేసేయాలని ఉత్తర్వులిచ్చారు. చైనాతో వివాదాలకు మూలం ఇక్కడే ఉంది. చైనా ప్రధాని చౌన్ ఎన్ లై ఇచ్చిన రాజీ ప్రతిపాదనలను నెహ్రూ తిరస్కరించారు. ఈ క్రమంలోనే సైన్యం ముందుకు దూసుకువెళ్లే 'ఫార్వర్డ్' పాలసీ నెహ్రూ అప్పట్లో అనుసరించిన ఫలితమే 1962 యుద్ధం. మళ్లీ అలాంటి విధానాల వల్లే అలాంటి తీవ్ర పరిస్థితే ఈనాడు ఏర్పడింది. చైనా తనకు 14 దేశాలతో ఉన్న భూ సరిహద్దుల్లో పన్నెండిటిని చర్చల ద్వారా పరిష్కరించుకున్నది. మిగిలిన రెండూ భారత్, ఇండియా అజమాయిషీలో (పరాధీనంగా) ఉన్న భూటాన్ మాత్రమే అని రాశారు.

'సామ్రాజ్యవాద శక్తిగా ఎదుగుతున్న చైనా'? పైన పేర్కొన్న నిపుణులెవరూ ఇలాంటి వైఖరిని వ్యక్తం చేయలేదు. ఇది నిరాధారం, అపోహ మాత్రమే. ఈమధ్య చైనా వైఖరి మారిందని కొందరు అనుకో వచ్చు. నిజమేనా? ఈ వివాదంపై రాస్తూ నూరానీ ఇలా రాశారు: 1959లో చౌఎన్‌లై రూపొందించిన దృక్పథాన్ని, 'అప్రోచ్'ని చైనా ఒక్కసారి కూడా మార్చలేదు. 1959 నుంచి నేటి వరకూ 60 ఏళ్లుగా చైనా 'అప్రోచ్'లో పూసల్లో దారంలాగా ఒకే విధానం గట్టిగా కొనసాగుతున్నది.

ఏకధ్రువ ప్రపంచానికి కాలం చెల్లిందని గుర్తిస్తూ, తాము కూడా ప్రపంచ రాజకీయాల్లో పాత్ర నిర్వహించగల ఒక ప్రబల రాజ్యంగా ఎదుగుతున్నామని భావించి, భారత పాలక వర్గాలు, అందులోనూ ముఖ్యంగా బిజెపి చైనాతో పాటు తమకూ అగ్రస్థానం లభించే బహుళధ్రువ ప్రపంచం వైపు ఇటీవలి కాలంలో మొగ్గు చూపుతున్నాయి. భారత చైనాలు కలిస్తే 21వ శతాబ్దం ఆసియాకే చెందుతుందని చైనా పదేపదే చెబుతూ వచ్చింది. చైనా ఎదుగుదల విస్పష్టం; దాన్ని నిరూపించుకోవడానికి వారికి యుద్ధం అవసరం లేదు; యుద్ధాన్ని వారు కోరుకోవడం లేదు కూడా. ఈ వాస్తవాలు భారత పాలకవర్గాలకు తెలుసు. అందులో ఒక భాగం చైనాతో వాణిజ్యాన్ని కోరుకుంటున్నదే కానీ, యుద్ధాన్ని కాదు. అయితే తమకు గల చైనా వ్యతిరేక ద్వేషంతో అమెరికా అనుసరిస్తున్న చైనా వ్యతిరేక ప్రపంచ వ్యూహంలో ముందువరుసలో (ఫ్రంట్‌లైన్ రాజ్యంగా) నిలబడాలన్న వైఖరిని అధికార వర్గాలు తీసుకుంటున్నాయి. ఇది ప్రమాద కరమైనది; భారతదేశ, భారత ప్రజల ప్రయోజనాలకు విరుద్ధమైనది. 'ఒకే చైనా విధానంలో' ట్రంప్ వెనకడుగు వేశారు; దాంతో భారత ప్రభుత్వం అంచనాలు తలకిందులయ్యాయి. అమెరికా సంక్షోభమార్గమూ, చైనా పురోగమనమూ నేడు సందేహాల స్థాయిని దాటిపోయాయి. శాంతి మార్గమే భారత్‌కు మంచిది, అనివార్యం. చైనా కూడా అదే కోరుతోంది. అందువల్లనే పాకిస్తాన్ విషయంలో 'మెరుపు దాడుల' గురించి చెప్తున్న ప్రభుత్వం చైనా విషయానికి వచ్చేసరికి 'దౌత్యమే మార్గం, యుద్ధం పరిష్కారం కాదు' అని వల్లిస్తున్నది. ఇండియా సైన్యాన్ని వెనక్కి తీసుకొని, విస్తరణ వాదాన్ని, భూటాన్ పై ఆధిపత్యం వదులుకోవడమే పరిష్కారం. చైనాకు వ్యతిరేకంగా యుద్ధమే కాదు, యుద్ధోన్మాదం కూడా ప్రస్తుత స్థితిలో భారత పాలకవర్గాలకూ రాజకీయంగా లాభదాయకం కాదు. ఆ విజ్ఞతతోనైనా యుద్ధం నివారించబడుతుందని ఆశిద్దాం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం!?

***స్వేచ్ఛా మార్కెట్ పేరుతో జరుగుతున్న ఒప్పందాలన్నీ సహజ వనరులను కొల్లగొట్టేందుకేననీ, దీనికి వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా ప్రజలు ఉద్యమించాల్సిన తరుణం ఆసన్నమైందనీ అంటున్నారు బి. రామకృష్ణ***

ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్య ఒప్పందం (రీజినల్ కాంప్రెహెన్సివ్ ఎకనామిక్ పార్టనర్‌షిప్–ఆర్‌సిఇపి) అనేది భారీ ప్రాంతీయ స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం. ఇది 16 దేశాలతో ప్రపంచంలో 45 శాతం జనాభాతో కూడి ఉన్న ఆసియా పసిఫిక్ వాణిజ్య ప్రాంతానికి వర్తిస్తుంది. ప్రపంచంలోని 3.4 బిలియన్‌ల ప్రజలను ప్రభావితం చేస్తుంది. ఈ భాగస్వామ్య ఒప్పందంలో విద్య, శక్తి, మేధోసంపత్తి, సేవలు, వస్తు ఉత్పత్తుల తయారీ (మాన్యుఫాక్చరింగ్), ఆరోగ్యం, అంతర్జాల ఆర్థిక రంగం, ప్రజాసేవలు, విదేశీ పెట్టుబడుల వంటి అనేక రంగాలు ఇమిడి ఉన్నాయి. అందుకే దీన్ని సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం అని అంటున్నారు. దీని ప్రధాన ఉద్దేశం ఆయా దేశాల్లోని దేశీయ చట్టాలను, రాజ్యాంగాలను బలహీన పరిచి లేదా రద్దుచేసి దేశ, విదేశీ కార్పొరేట్, మార్కెట్ శక్తులకు స్వేచ్ఛగా ప్రవేశించే రాచబాటలను కల్పించడమే.

అసోసియేషన్ ఆఫ్ సౌత్ ఈస్ట్ ఏషియన్ నేషన్స్ (ఎఎస్ఇఎఎన్)లోని బ్రూనై దరుస్సలాం, కాంబోడియా, ఇండోనేషియా, లావోస్, మలేషియా, మయన్మార్, ఫిలిప్పైన్స్, సింగపూర్, థాయ్‌లాండ్, వియత్నాం వంటి 10 దేశాలతో పాటు వాటి 6 స్వేచ్ఛా వాణిజ్య ఒప్పంద (ఎఫ్‌టిఎ) భాగస్వామిక దేశాలైన భారత్, ఆస్ట్రేలియా, చైనా, జపాన్, న్యూజిలాండ్, రిపబ్లిక్ ఆఫ్ కొరియాతో మొత్తం 16 దేశాలు ఉన్నాయి. ఈ 16 దేశాలు ప్రపంచంలో నాలుగో వంతు ఆర్థిక వ్యవస్థను కలిగి ఉన్నాయి.

ఆర్‌సిఇపి మొదటి సమావేశం నవంబర్ 2012లో కాంబోడియాలో జరిగింది. బ్రూనై దారుస్సలాం దేశంలో 9–13 మే 2013లో జరిగిన ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్య వాణిజ్య సంప్రదింపుల కమిటీ సమావేశంలో భారత్ మొదటిసారిగా పాల్గొంది. 19వ సమావేశం జూలై 24 నుండి 28 వరకు హైదరాబాద్‌లో జరిగాయి.

2012 నుండి నేటివరకు కూడా ఆర్‌సిఇపికి సంబంధించిన డాక్యుమెంట్‌లు, చర్చలు, ఒప్పందాల వివరాలు అధికారికంగా గత యుపిఏ ప్రభుత్వం గాని నేటి బిజెపి ప్రభుత్వం గానీ బయట పెట్టలేదు. ఆ చర్చల్లో రాష్ట్రాలను భాగస్వాములను చేసిందీ లేదు. పార్లమెంట్‌లో చర్చకు పెట్టిందీలేదు. అనధికారికంగా ఈ సమాచారం లీకయి కొన్ని వెబ్‌సైట్‌లలో కనిపిస్తున్నది. ఆ సమాచారం ఆధారంగా ఆర్‌సిఇపి ఒప్పందాలు దేశంలోని సాధారణ రైతులకు, రోగులకు, కార్మికులకు మొత్తంగా అశేష ప్రజానీకానికి ఎంత ప్రమాదకరమో తెలుస్తుంది.

ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) రాకముందు వంద శాతం ఉన్న విదేశీ దిగుమతి సుంకాలు 33 శాతానికి కుదించబడ్డాయి. ఆర్‌సిఇపి అమల్లోకి వస్తే ఈ సుంకాలు తొలగించబడతాయి లేదా చాలా తక్కువగా 0–3 శాతంలోపు ఉంటాయి. ఫలితంగా విదేశీ దిగుమతులపై విధించే పన్నుల ద్వారా భారత్‌కు వచ్చే ఆదాయం రద్దయిపోతుంది. దిగుమతి సుంకాల ద్వారా రావాల్సిన ఆదాయం రాకపోను ఆయా కంపెనీలకు ఇక్కడి ప్రజలు, ఈ ప్రాంతం మార్కెట్ కాలనీలుగా మారతాయి. ఇక్కడి సంపదలను కార్పొరేట్ శక్తులు కొల్లగొట్టుకుపోవడం ద్వారా విద్య, ఆరోగ్యం, పారిశుధ్యం, సాగునీరు, తాగునీరు మొదలగు అత్యవసర సేవల రంగాలకు కేటాయించే నిధుల్లో కోతలు పడతాయి. అవి అసంఖ్యాకంగా ఉన్న పేద ప్రజానీకానికి అందకుండా పోతాయి. అంటే పేదరికం మరింతగా పెరగడానికి ఆస్కారం ఏర్పడుతుంది.

ఆర్‌సిఇపి అమలయితే మన దేశంలో ఏ కంపెనీ అయినా వ్యాపారం చేసుకోవచ్చు. వాటి వ్యాపార దిగుమతులపై సుంకాలు విధించే అవకాశం ఈ దేశానికి ఉండదు. భారత రాజ్యాంగం బలహీనపడుతుంది. సార్వభౌమాధికారం, స్వావలంబనలు గాల్లో కలిసిపోతాయి. దేశ సంపదలపై భారత భూమి పుత్రులకు అధికారం లేకుండా పోతుంది.

కిందటేడాది కందులు క్వింటాలుకు 9 వేల రూపాయల ధర ఉండేది. నేడు అది 4 వేలకు పడిపోయింది. కారణం భారత ప్రభుత్వం గత నవంబర్ 2016లో పెద్ద ఎత్తున కందులను దిగుమతి చేసుకుంది. ఈ దిగుమతులు భారత్‌లోని ఎంఎన్‌సిలు, ఆదాని కంపెనీల అవసరాల మేరకు చౌక దిగుమతులను ప్రోత్సహించారు. దాని వలన రైతులకు గిట్టుబాటు ధరలు లేకుండా పోయాయి. పప్పుధాన్యాలు పండించిన భారత దేశ రైతాంగం సంక్షోభంలో కూరుకుపోయింది.

ఆర్‌సిఇపి వలన వైద్యరంగంలో మందులకు సంబంధించిన కంపెనీలకు బలమైన పేటెంట్ హక్కులు ఏర్పడుతాయి. దీనివలన మందుల ధరలు పెరుగుతాయి. జనరిక్ మందుల తయారీపై ఆంక్షలు పెరుగుతాయి. ప్రస్తుతం జనరిక్ మందుల తయారీ రంగంలో భారత్ అగ్రస్థానంలో ఉంది.

జనరిక్ మందుల తయారీవల్ల ఎచ్ఐవి రోగం మందుల ధరలు లక్షల రూపాయల నుండి పదిహేను వందల రూపాయల వరకు తగ్గిపోయాయి. ప్రస్తుతం మూడవ ప్రపంచ దేశాలకు 80 శాతం వరకు ఎచ్ఐవి జనరిక్ మందులను భారత్ సరఫరా చేస్తున్నది. ప్రాణాంతక వ్యాధులైన క్యాన్సర్, క్షయ, హెపటైటిస్ రోగాలకు ఇతర దేశాల్లో మందుల ధరలు లక్షల్లో ఉంటే మన దగ్గర వీటికి సంబంధించిన జనరిక్ మందులు వెయ్యి రూపాయలకే దొరుకుతున్నాయి.

భారత్‌లో చవకగా లభించే జనరిక్ మందులు ఇక చరిత్రగా మిగిలిపోనున్నాయి. ప్రాణ రక్షణ మందులను కేవలం ఒక కంపెనీయే కాదు ఏ కంపెనీ అయినా తయారు చేయొచ్చు అనే వెసులుబాటు ఉండాలనేది మన దేశ చట్టాలు చెబుతున్నాయి. ఆర్‌సిఇపి వస్తే ఇది చెల్లుబాటు కాదు. ఇక ఆ మందుల తయారీ, సరఫరా, ధర అంతా కొన్ని కంపెనీల గుత్తాధికారం కిందకు వస్తాయి. ఇష్టారాజ్యంగా ధరలు పెరుగుతాయి. ఆరోగ్యం, మందులు, చవకగా లభించడం అనేది ప్రజల హక్కుగా ఉండాలి కాని ఎంఎన్‌సిల హక్కుగా మారడం అమానవీయం.

ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ దేశాలలో తమ అవసరాలకు మించి 5 రెట్లు అదనంగా డైరీ ఉత్పత్తులు తయారవుతున్నాయి. వాటిని అమ్ముకోవ డానికి మార్కెట్ కావాలి. ఆ మార్కెట్ ప్రాంతాల కోసం ఆర్‌సిఇపి ఉపయోగపడుతుంది. తక్కువ ధరల్లో దిగుమతి చేసే ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ల పోటీని దేశీయ పాడి పరిశ్రమ తట్టుకోలేక చావు బతుకుల్లో కొట్టుమిట్టాడుతుంది. భారతదేశ డెయిరీ ఆధారిత రైతులు, కూలీలు తమ ఉపాధులను కోల్పోతారు. దేశంలో రెండు కోట్ల ప్రజలు పాడి పరిశ్రమపై ఆధారపడి జీవితాలను నెట్టుకొస్తున్నారు. వీరి భవిష్యత్ ప్రమాదంలో పడుతుంది. ప్రస్తుతం విదేశీ పాల ఉత్పత్తులపై 15 శాతం - 40 శాతం వరకు దిగుమతి పన్నులు ఉన్నాయి. ఆర్‌సిఇపి అమల్లోకి వస్తే ఈ పన్నులన్నీ రద్దు చేయబడతాయి. ఫలితంగా భారత ఆర్థిక వ్యవస్థపై ప్రతికూల ప్రభావం ఏర్పడుతుంది. స్వేచ్ఛా వాణిజ్యం అంటే అర్థం ఇదేమరి.

ఆర్‌సిఇపిలో స్వేచ్ఛా వాణిజ్యం గురించి ఉంటుంది. ఈ స్వేచ్ఛ ఎవరికి అంటే బహుళజాతి పెట్టుబడిదారీ, కార్పొరేట్ శక్తులకు అన్నమాట. ఆయాదేశాల్లోని ప్రజలకు తమకేది కావాలో, దేన్ని తిరస్కరించాలో తెలియచెప్పే స్వేచ్ఛ లేదు. ఆర్‌సిఇపి అమల్లోకి వస్తే ఎచ్ఐవి మందుల ధరలు విపరీతంగా పెరుగుతాయని అలా జరగడం సరైంది కాదని ఆర్‌సిఇపిని వ్యతిరేకిస్తూ 19వ దఫా చర్చలు జరుగుతున్న హైదరాబాద్‌లో ఎచ్ఐవి రోగగ్రస్తులు కొందరు మౌనంగా నిలబడి నిరసన తెలుపుతుంటే వారిని అరెస్టు చేశారు. ఈ నేపథ్యంలో స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలు ఎవరికి స్వేచ్ఛనిస్తాయి? ఎవరి స్వేచ్ఛలను హరిస్తాయో అర్థం చేసుకోవడం కష్టమేమి కాదు.

విత్తనాలపై కంపెనీలకు పేటెంట్ హక్కుల గురించి ఆర్‌సిఇపిలో రక్షణలున్నాయి. వీటివల్ల విత్తనాలపై గుత్తాధికారం కంపెనీల పరమవు తుంది. నేటికీ అది జరుగుతూనే ఉన్నది. విత్తనాలపై హక్కు రైతుల నుండి ఎలాగూ లాగేయబడింది ప్రభుత్వాలకు సహితం ఆ అధికారం లేకుండా పోతుంది. ఏ పంటలు పండించాలి? ఏ విత్తనాలు వాడాలి, ఏ ఎరువులు, పురుగుమందులు వాడాలో నిర్ణయాధికారం కంపెనీల చేతుల్లో ఉంటుంది. వాటి ధరలు కంపెనీల ఇష్టా రాజ్యాంగ మారుతాయి. వలసప్రాంతంగా మిగిలిపోవడం తప్పిస్తే దేశానికి ఉండే స్వయం నిర్ణయాధికారం అర్థరహితం అవుతుంది. ఇప్పటికే ప్రపంచ వ్యవసాయ రంగాన్ని మొన్‌శాంటో, కార్గిల్, డ్యుపాంట్, సిన్‌జెంటా వంటి అంతర్జాతీయ బహుళ జాతి కార్పొరేషన్లు తమ గుప్పిట్లో పెట్టుకున్నాయి. ఆర్‌సిఇపి అమల్లోకి వస్తే ఆ విషకౌగిలి మరింతగా బిగుసుకు పోతోంది.

వ్యవసాయం రాష్ట్రాల జాబితాలో ఉంది. వ్యవసాయరంగం పై తీవ్ర ప్రభావం చూపబోతున్న ఆర్‌సిఇపి ఒప్పంద వివరాలను కేరళ తప్ప ఏ రాష్ట్రం వ్యతిరేకించింది లేదు. పోనీ కనీసం వివరాలు తెలుసుకున్నదీ లేదు. తమ రాష్ట్రాల్లో రైతులపై ప్రమాదకరంగా మారబోతున్న ఆర్‌సిఇపి నుండి భారత ప్రభుత్వం తప్పుకోవాలని డిమాండ్ చేసింది లేదు. అంటే ప్రజా వ్యతిరేక విధానాలు చేపట్టడంలో కేంద్ర, రాష్ట్రాల ప్రభుత్వాలు ఒకేలా వ్యవహరిస్తున్నాయని తేలిపోతున్నది.

దేశంలోనే తెలంగాణ రాష్ట్రాన్ని విత్తన భాండాగారంగా మారుస్తామని వాగ్దానం చేసిన కెసిఆర్ ప్రభుత్వం ప్రమాదకర ఆర్‌సిఇపిని అడ్డుకోకపోగా జూలై 24-29, 2017లో హైదరాబాద్‌లో ఆర్‌సిఇపి 19వ దఫా సంప్రదింపులు జరుపుకోవడానికి చేయూతనిచ్చింది. విచిత్రం ఏంటంటే వ్యవసాయ రంగంలో కృషి చేశాడని చెబుతూ కెసిఆర్‌కు అగ్రికల్చరల్ లీడర్‌షిప్ అవార్డ్ 2017ను ఇచ్చారు. దాన్ని గవర్నర్ మెచ్చుకోవడం వెంటవెంటనే జరిగిపోయాయి. ఈ అవార్డ్‌ను ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఫుడ్ అండ్ అగ్రికల్చర్ అనే ప్రైవేటు సంస్థ 2008 నుండి ఇస్తూ వస్తున్నది. గతంలో ఈ అవార్డ్ ప్రస్తుత హోం మినిస్టర్ రాజ్‌నాథ్ సింగ్‌కు, ఒకప్పటి మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్ సింగ్ చౌహాన్‌కు, ఒకప్పటి పంజాబ్ ముఖ్యమంత్రి ప్రకాశ్‌సింగ్ బాదల్, ఒకప్పటి కేంద్ర వ్యవసాయశాఖ మంత్రి శరద్‌పవార్, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా పనచేసిన అఖిలేష్ యాదవ్, చత్తీస్‌ఘడ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్‌లకు గతంలో ఈ అవార్డును ఇచ్చారు. ఈ అవార్డు పొందిన వారెవరూ కూడా ఈ దేశ రైతులకు హాని కలిగించే ప్రపంచ బ్యాంకు విధానాలను అమలు పరుస్తూ వచ్చారే గానీ వ్యతిరేకించింది లేదు. అలాంటి వారికి అవార్డు ఇచ్చిన ఈ సంస్థ ఎవరి ప్రయోజనాలను ఆశిస్తున్నదో అర్థం చేసుకోవచ్చు.

భారతదేశ వ్యవసాయరంగం నేడు తీవ్రమైన సంక్షోభంలో పడిపోయింది. ప్రతి సంవత్సరం దేశవ్యాప్తంగా రైతుల ఆత్మహత్యలు లక్షల్లో పెరిగిపోతున్నాయి. ఈ ఆత్మహత్యలు వ్యవసాయరంగ దయనీయ పరిస్థితిని తెలుపుతున్నాయి. బహుళజాతి కార్పొరేషన్‌ల ప్రయోజనాల కోసం వాటి ధనదాహం తీర్చడం కోసం, ఇక్కడి సంపదలను అవి కొల్లగొట్టుకుపోవడానికి అవకాశం ఇస్తూ పూర్తిస్థాయిలో లొంగిపోయిన భారత పాలకవర్గాలు ఎన్‌డిఎ, యుపిఎల కూటముల్లో భాగస్వాములైన అనేక పార్లమెంటరీ పార్టీలు ఏమైనా కావచ్చు. వాటి చాటున తమ వర్గ ప్రయోజనాలను నెరవేర్చుకుంటున్న భూస్వామ్య, పెట్టుబడిదారీ, కార్పొరేట్ వర్గాల దుర్మార్గాలను ప్రతిబింబిస్తున్నది. ఈ పరిస్థితిని ప్రపంచవ్యాప్తం గానూ గమనించవచ్చు. ఆయా దేశాల్లోని భూస్వామ్య, కార్పొరేట్ శక్తులు తమ వర్గ ప్రయోజనాల కోసం పాలకవర్గాలను తమ గుప్పిట్లో పెట్టుకోవడం లేదా తామే పాలకవర్గంగా మారడాన్ని గమనించవచ్చు. ఈ శక్తులు తమ దేశాల్లోని సంపదను అలాగే పొరుగు దేశాల్లోని సంపదను లూటీ చేస్తున్నాయి. ఇలా సంపదలను కొల్లగొట్టడంలో పెట్టుబడిదారీ, కార్పొరేట్ శక్తుల మధ్య సఖ్యత ఉంటుంది. ఆ సఖ్యతలో భాగంగానే డబ్ల్యుటిఒ, ఐఎంఎఫ్ మొదలగు అనేక అంతర్జాతీయ ఆర్థిక సంస్థలను, ఒప్పందాలను నేడు ముందుకు రాబోతున్న ఆర్‌సిఇపిని అర్థం చేసుకోవాలి.

ఫెడరల్ స్ఫూర్తికి భిన్నంగా కేంద్రం ఏకచత్రాధిపత్యంగా అన్నిరకాల అంతర్జాతీయ ఒప్పందాలను ఒంటిచేత్తో చేసుకుంటూపోవడం జరుగుతున్నది. ఈ ఒప్పందాలలోని న్యాయబద్ధత, భారత ప్రజానీకంపై చూపే ప్రమాదకర ప్రతికూల ప్రభావాలపై రాష్ట్రాలతో సంప్రదింపులు జరగడం లేదు. రాష్ట్రాలు ఆ హక్కును డిమాండ్ చేయడం లేదు. అశేష ప్రజానీకంపై తీవ్రమైన ప్రమాదకర ప్రభావాన్ని కలుగచేసే ఆర్‌సిఇపి వంటి ఒప్పందాలపై పౌరసమాజానికి సమాచారం అందించడం లేదు. ప్రజల అభిప్రాయాలను సేకరించే ప్రయత్నమూ లేదు. ప్రజాస్వామిక దేశంలో ప్రజాభిప్రాయానికి అధిక ప్రాధాన్యత ఉండాలి. పై స్థాయిలో నిర్ణయాలు జరుగుతుంటాయి. వాటి పర్యవసనాలు విధానాలు అమలవుతున్న క్రమంలో బయటపడుతుంటాయి. ఆ విధానాలను నిరసిస్తే, వద్దని వత్తిడి వస్తే ఆ ఒప్పందాలపై సంతకాలు జరిగిపోయాయి ఇప్పుడేం చేయలేం అనే వాదన వస్తుంది. అంతకుమించి నిరసనలపై, దమననీతి, నిర్బంధం అమలు చేస్తారు. చట్టసభల్లో సహితం ఇటువంటి ప్రమాదకర విధాన నిర్ణయాల గురించి చర్చకు పెట్టకపోవడం దేన్ని సూచిస్తుంది? ప్రజాస్వామ్యాన్నా? నియంతృత్వాన్నా? ప్రజాస్వామ్యం పేరిట ధనస్వామ్యాన్నా? పాలకవర్గాలు చట్టసభల్లోకి ప్రవేశించాక తమ

ఇష్టారాజ్యంగా విధానాలు చేస్తున్నారు. ఎన్నికల్లో ఓట్లేసింది ఇటువంటి దుర్మార్గమైన నిర్ణయాలు చేయడానికి కాదు కదా! ప్రజలు మమ్మల్ని గెలిపించారని దబాయిస్తూ ప్రజా వ్యతిరేకమైన నిర్ణయాలు తీసుకుంటూ భూస్వామ్య, ఆధిపత్య, కార్పొరేట్ వర్గాల ప్రయోజనాలు నెరవేర్చ బదుతుండడం ఈ దేశ ప్రజాస్వామ్యాన్ని అవమానపరచడమే.

ప్రభుత్వ ప్రజా వ్యతిరేక నిర్ణయాలను వ్యతిరేకించే శక్తులను, వ్యక్తులను దేశద్రోహులుగా చిత్రీకరిస్తున్నారు వారిపై తీవ్రమైన నిర్బంధాలను ప్రయోగిస్తున్నారు. ప్రజలతో చర్చలకు, సంప్రదింపులకు తావు లేకుండా పోయింది. కాని అంతర్జాతీయ, దేశీయ కార్పొరేట్, పెట్టుబడిదారీ శక్తులతో మాత్రం స్టార్ హోటల్‌లలో సంప్రదింపులు జరుగుతుంటాయి. వారికి రెడ్ కార్పెట్ స్వాగతం లభిస్తుంది. వారి ప్రాపకం కోసం ప్రభుత్వాలు వెంపర్లాడడం వెగటు పుట్టించకమానదు. ఈ సందర్భంలో సమాజం, ప్రజల గురించి ఆలోచించే యువత, విద్యార్థి, మేధావులకు ఈ దేశ ప్రజాస్వామ్యం, రాజ్యాంగ యంత్రాంగాలు, వ్యవస్థలపై గౌరవం తగ్గకుండా ఉండడం సాధ్యమా?

పెట్టుబడిదారీ, కార్పొరేట్ శక్తులకు స్వేచ్ఛా ద్వారాలు తెరవమని ఆర్‌సిఇపి నిర్దేశిస్తున్నది. వాటి పెట్టుబడుల, రక్షణకోసం ఆయాదేశాలు బాధ్యత పడాలి. ఆ కంపెనీల లాభాలకు ఎలాంటి నష్టం కలగని రీతిలో ప్రభుత్వాలు మసలుకోవాలి. లేదంటే నష్ట పరిహారం చెల్లించడానికి కట్టుబడి ఉండాలి. పెట్టుబడిదారుల ప్రయోజనాలకు నష్టం వాటిల్లే పక్షంలో వివాదాల పరిష్కారం కోసం ది ఇన్వెస్టర్ స్టేట్ డిస్‌ప్యూట్ సెటిల్‌మెంట్(ఐఎస్‌డిఎస్) అనే ట్రిబ్యునల్ ఉంటుంది. ఇది పెట్టుబడిదారీ శక్తుల హక్కులకు ప్రాధాన్యతనిస్తుంది. ప్రజల హక్కులను ఫణంగా పెట్టి పెట్టుబడిదారులకు అనుకూలంగా ఐఎస్‌డిఎస్ పనిచేస్తుంది. ఈ అంతర్జాతీయ ట్రిబ్యునల్ వివిధ దేశాల న్యాయస్థానాలను, పార్లమెంట్‌లను లెక్కచేయదు. వాటి పరిధిలోకి ఈ ట్రిబ్యునల్ రాదు. ఇది కార్పొరేట్ శక్తులకు అనుకూలంగా వారి లాభాలకు ఏ విఘాతం కలుగకుండా చూస్తుంది. ఆర్‌సిఇపి ప్రకారం దేశీయంగా ఉండే కంపెనీలకు, రైతులకు ఇచ్చే అన్ని రకాల రాయితీలు, సౌలభ్యాలను, మార్కెట్‌ను అంతర్జాతీయ కార్పొరేట్ శక్తులకు సమాన స్థాయిలో కల్పించాలి. అయితే దేశీయ చట్టాలు, న్యాయస్థానాలు, పార్లమెంట్‌ల పరిధిలోకి మాత్రం కార్పొరేట్ శక్తులు రావు. వాటికి సంబంధించిన వివాదాలు మాత్రం ఐఎస్‌డిఎస్‌లో తేల్చుకోవాలి. దేశాల సార్వభౌమత్వాలను గేలిచేసే ఈ విధానం ఎంత ప్రమాదకరమో వేరే చెప్పనక్కరలేదు.

ఆర్‌సిఇపి అమల్లోకి వస్తే కార్మికులకు ఇప్పుడున్న కనీస హక్కులకు కూడా భద్రత ఉండదు. కార్మిక చట్టాల్లో ఇప్పటికే అనేక మార్పులు వచ్చాయి. కంపెనీలకు మేలు చేసే కార్మికులకు నష్టం చేసే మరింత ప్రమాదకర చట్టాలు వస్తాయి. ఇక చట్టబద్ధంగానే కంపెనీల ప్రయోజనాల కోసం ప్రభుత్వాలు కార్మికుల హక్కులను అణచివేస్తాయి. సామాజిక భద్రతతో కూడుకున్న పర్మినెంట్ ఉద్యోగాలు ఉండవు. అవుట్ సోర్సింగ్, కాంట్రాక్టు, దినసరి వేతన ఉద్యోగాలు మాత్రమే మిగులుతాయి. వేతనాలు పడిపోతాయి. కార్పొరేట్ల లాభాల కోసం ఆర్‌సిఇపి వీటన్నింటిని ముందుకు తెస్తున్నది. ప్రభుత్వం ప్రజల కోసం కాకుండా కార్పొరేట్ల కోసం పనిచేస్తుందన్న మాట. ఇక్కడి కార్పొరేట్ శక్తులు అంతర్జాతీయ ఫైనాన్స్‌తో కుమ్మక్కయి అంతర్జాతీయ పెట్టుబడిదారుల ప్రయోజనాల్లో తమ ప్రయోజనాలను కలిపి చూసుకుంటున్నారు. తమ ప్రయోజనాలను నెరవేర్చుకోవడంలో భాగంగా అంతర్జాతీయ కార్పొరేట్ శక్తులకు బాసటగా నిలుస్తున్నారు. కార్పొరేట్ శక్తులు ఏ దేశానికి చెందినవైనా సరే అవి వాటి ప్రయోజనాల కోసం సమస్త ప్రజా సంపదలను, సహజ వనరులను కొల్లగొట్టడంలో ఒకే రీతిగా ఉంటాయి. వాటి మధ్య సఖ్యత ఎప్పుడు ఉంటుంది. వాటిని వ్యతిరేకించే ప్రజలపై ప్రపంచవ్యాప్తంగా నిర్బంధాలను ప్రయోగిస్తుంటాయి. మరోరకంగా చెప్పాలంటే తమ అనుంగు పాలక వర్గాల సహాయంతో చట్టం, న్యాయం పేరుతో రాజ్యయంత్రాంగమైన పోలీసులు, సైన్యం తదితర విభాగాలను ఉపయోగించి ప్రత్యక్షంగా నిర్బంధాలను, అణచివేతలను, తీవ్రమైన హింసను ప్రయోగించి అదుపులో పెట్టే ప్రయత్నం చేస్తుంటాయి. చాలాసార్లు వారు సక్సెస్ అవుతుంటారు కూడా. ఇటువంటి విధానాలపై ప్రజల్లో అవగాహన పెరగాల్సి ఉంది. ఆర్‌సిఇపిలో బాగస్వామి కాకుండా ప్రభుత్వంపై వత్తిడి పెంచవల్సి ఉన్నది.

దేశాల మధ్య వాణిజ్య సంబంధాలు చాలా సహజమే అవి అనివార్యం కూడా. అయితే ఆ సంబంధాలు దేశాల మధ్య ప్రజాస్వామిక, సమానత్వ ప్రాతిపదికన పరస్పర సహాయ సహకారాలతో ఆయా దేశాల్లోని అట్టడుగు పొరల్లోని, అభివృద్ధికి నోచుకోకుండా, విద్యా, వైద్యం, కూడు, గుడ్డ, నీడలకు దూరమై అనేక అవస్థల పాలవుతున్న ప్రజల సంక్షేమం, వారి సామాజికార్థిక ఉన్నతికి దోహదపడేవిగా ఉండాలి. అలాంటి పరస్పర సహాయ సహకారాలను నెలకొల్పుకోవడంలో భాగంగా దేశాల, ప్రాంతాల మధ్య జరిగే అంగీకారాలు ఒప్పందాలను ఎవరైనా ఎప్పుడైనా ఆహ్వానించ వల్సిందే. ప్రపంచంలో అన్ని ప్రాంతాలలో వనరులు ఒకే స్థాయిలో ఉండవు. ఒక ప్రాంతంలోనివి మరో ప్రాంతంలో ఉండాలని నియమం ఏదీ లేదు. అలా ఉండవు కూడా. సకల మానవ జాతి వికాసానికి ప్రాంతాల మధ్య, దేశాల మధ్య ప్రజాస్వామిక, సమానత్వం విలువల ప్రాతిపదికన, అవగాహనలు, అంగీకారాలు ఉండాలి.

ఒక ప్రాంతంలోని లేదా దేశంలోని వనరులను, సహజ సంపదలను, మానవ వనరులను, మరో ప్రాంతం లేదా దేశం కొల్లగొట్టడానికి ఒప్పందాలుండకూడదు. కొన్ని కార్పొరేట్, పెట్టుబడిదారీ, ఆధిపత్య శక్తులు దేశాలు తమకు అనుకూలంగా అంతర్జాతీయ ఒప్పందాలను మలుచుకోవడం జరుగుతున్నది. మూడవ ప్రపంచ దేశాలుగా పిలువబడుతున్న అనేక దేశాల్లో ఆకలి, దరిద్రం, పర్యావరణం, కాలుష్యం, అణచివేతలు, అసమానతలు మరెన్నో సమస్యలతో సతమతమవుతున్నాయి. ధనిక దేశాలుగా చెప్పబడుతున్న దేశాల్లో సహితం నిరుద్యోగం, సామాజిక, ఆర్థిక భద్రత లేమి అసమానతలు కొనసాగుతున్నాయి. కార్పొరేట్, పెట్టుబడి, పెత్తందారీ వర్గం, భూస్వామ్య వర్గం సామాజిక సంపదలను తమ ప్రయోజనాలకు ఉపయోగించు కోవడంలో భాగంగా జరిగే ఏ రకమైన అంగీకారం, అవగాహన ఒప్పందాలైన అవి నిరోధింప బడాల్సిందే. సామ్రాజ్యవాదశక్తులు, బడా పెట్టుబడిదారీ, కార్పొరేట్ శక్తులు ప్రపంచంలో ఏ మూలనైనా సరే నిక్షిప్తమై ఉన్న అనేక సహజ వనరులను కొల్లగొట్టడానికి రకరకాల పద్ధతుల్లో ముందుకొస్తున్నాయి. ఆయా దేశాల్లోని పాలకవర్గాలను, పెత్తందారీ ఆధిపత్య శక్తులను తమకు అనుకూలంగా మల్చుకొని తమ ప్రయోజనాలను నెరవేర్చుకుంటున్నాయి. అందులో భాగంగానే అంతర్జాతీయంగా జరిగే రాజకీయ, శాస్త్ర సాంకేతిక, వ్యవసాయం, ఆర్థిక, పర్యావరణ సంబంధిత మొదలగు ఒప్పందాలను విశ్లేషిస్తే గానీ వాటి అసలు రంగు బయటపడదు. వివిధ దేశాల్లోని, ప్రాంతాల్లోని సంపదలను, సహజవనరులను కొల్లగొట్టే క్రమంలో ముందుకొస్తున్న ఒప్పందాలలో ఒకటిగా ఆర్‌సిఇపిను గుర్తించాలి. ఈ ప్రమాదకరమైన విధానాన్ని తిప్పికొట్టాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఆర్మీ, అమెరికానే షరీఫ్‌ను దింపాయి

***సైనిక చర్యతో అధికారాన్ని చేజిక్కించుకునే పరిస్థితులు లేకపోవడంతో అమెరికా, పాకిస్తాన్ ఆర్మీ ఒక్కటై పనామా పేపర్స్‌లో వెల్లడయిన నవాజ్ షరీఫ్ అవినీతిని చూపి న్యాయవ్యవస్థ ద్వారా అధికారం నుంచి తొలగించారని అంటున్నారు ఆజాద్***

డెబ్బై ఏళ్ల పాకిస్తాన్ పార్లమెంటరీ ప్రభుత్వ వ్యవస్థలో ఏ ప్రధాని కూడా తన పదవీ కాలాన్ని పూర్తి చేయలేదు. హత్య చేయబడడమో, పదవి నుంచి బలవంతంగా ఆర్మీ ప్రత్యక్ష లేదా పరోక్ష చర్య ద్వారానో తొలగించబడడం జరిగింది. జులై 28న పాకిస్తాన్ సుప్రీంకోర్టు పనామా గేట్‌గా పిలువబడుతున్న కేసులో పాకిస్తాన్ ప్రధాని నవాబ్ షరీఫ్‌ను దోషిగా ప్రకటించడంతో పార్లమెంట్ సభ్యుడిగా కొనసాగే అర్హతను కోల్పోవడంతో ప్రధాని పదవి నుంచి కూడా తప్పుకోవాల్సి వచ్చింది. షరీఫ్ కంటే ముందు ప్రధానులుగా పనిచేసిన 17 మంది ఏ విధంగా అర్థాంతరంగా నిష్క్రమించారో మూడు పర్యాయాలు ప్రధాని అయిన షరీఫ్ కూడా మూడు సార్లూ మధ్యలోనే పదవిని కోల్పోయాడు.

మిలిటరీ నియంత అయిన జనరల్ జియా ఉల్ హఖ్ కాలంలో పాకిస్తాన్ రాజ్యాంగంలో చేర్చబడిన 62, 63 అధికరణల ప్రకారం 'సత్యవంతుడు, విశ్వసనీయుడు, ధర్మకర్త' గా వ్యవహరించలేని వ్యక్తి పార్లమెంట్‌కు ఎన్నిక కావడానికి అనర్హుడు. సరిగ్గా ఈ ఆర్టికల్స్‌ను ఆధారం చేసుకొనే పాకిస్తాన్ రాజ్యాంగ ధర్మాసనం నవాజ్ షరీఫ్‌ను అనర్హుడిగా ప్రకటించడంతో పదవిని కోల్పోవాల్సి వచ్చింది.

ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాల్లోని సంపన్న వర్గాలు, కార్పొరేట్ సంస్థలకు ఇతర దేశాల్లో వ్యాపార లావాదేవీలను సులభతరం చేసి పన్నుల ఎగవేతలోను, అక్రమ సంపాదన తరలింపునకు సహకరించే పనామా కేంద్రంగా నడిచే మోస్సాక్ ఫోన్సెకా అనే సంస్థ అంతర్గత వెబ్‌సైట్‌లో నుంచి లీకైన 11 మిలియన్లకు పైగా ఉన్న పేపర్లలో అనేక దేశాల సంపన్నుల, రాజకీయ నాయకుల పేర్లు వెల్లడైనాయి. ఈ లీకేజీనే పనామా పేపర్స్‌గా వ్యవహరించ బడుతున్నది. దీని ఫలితంగా అనేక దేశాల్లో రాజకీయ దుమారం చెలరేగింది. దీంట్లో పాకిస్తాన్ ప్రధాని పేరు కూడా చోటుచేసుకోవడంతో ఆ దేశంలో పనామా గేట్‌గా ప్రాచుర్యం పొందింది. ఈ పేపర్స్‌లో షరీఫ్‌తో పాటు ఆయన కుటుంబ సభ్యులు విదేశాల్లో ఆస్తులు కూడబెట్టారని, బ్యాంకు అకౌంట్లను కలిగి ఉన్నారని బయటపడింది. నిజానికి ఇలాంటిది ఏ దేశ రాజకీయవేత్తలకైనా కొత్తేమీ కాదు! దుబాయి, సౌది అరేబియా, లండన్‌లలో ఖరీదైన ఆస్తులున్నట్టు, దుబాయి కేంద్రంగా నవాజ్ షరీఫ్ క్యాపిటల్ ఎఫ్‌జడ్ఇ అనే సంస్థకు చైర్మెన్‌గా ఉండి నెలవారి జీతం తీసుకుంటూ కూడా 2013లో పాకిస్తాన్ లో జరిగిన సాధారణ ఎన్నికల సందర్భంగా ఎన్నికల కమిషన్‌కు సమర్పించిన ఆస్తుల వెల్లడి పత్రంలో ఈ విషయాన్ని పొందుపర్చలేదని దీనితో పాటు పనామా పేపర్స్‌కు సంబంధించిన విషయంలో కూడా దర్యాప్తు చేయమని రాజకీయ నాయకుని అవతారమెత్తిన క్రికెటర్ అయిన ఇమ్రాన్ ఖాన్ సుప్రీంకోర్టులో పిటిషన్ వేయడంతో షరీఫ్‌కు ఇబ్బందులు మొదలైనాయి.

గడిచిన ఏప్రిల్ నెలలో సుప్రీంకోర్టు జాయింట్ ఇన్వెస్టిగేషన్ టీమ్ (జె.ఐ.టి.) ని ఏర్పాటుచేసి దర్యాప్తు చేయించింది. 10 సంపుటాల తన నివేదికలో పాకిస్తాన్ నుండి షరీఫ్ కుటుంబం అక్రమంగా సంపాదించిన సొమ్మును విదేశాలకు తరలించి ఖరీదైన ఆస్తులు కొనుగోలు చేసినట్టు, దుబాయి కంపెనీలో జీతం తీసుకుంటూ ఆస్తుల వెల్లడి పత్రంలో ఈ వివరాలు పొందుపర్చలేదనే విషయాన్ని ప్రాథమికంగా నిర్ధారణ చేసింది. ఈ నిర్ధారణల ఆధారంగా రాజ్యాంగంలో పొందుపర్చబడిన ఆర్టికల్స్ 62, 63 కింద విచారించి షరీఫ్‌తో పాటు ఆయన కుటుంబ సభ్యులను సుప్రీంకోర్టు దోషులుగా పేర్కొన్నది. ఈ ఆర్టికల్స్ ప్రకారం శాసన సభ్యులుగా ఎన్నికయ్యే వాళ్లు 'సత్య సందులు, ధర్మ కర్తలు' గా ఉండాలనే నిబంధనలకు విరుద్ధంగా ఉన్నాయని ఇది పూర్తిగా రాజ్యాంగ ఉల్లంఘణ కిందకు వస్తుందని సుప్రీంకోర్టు తేల్చి చెప్పింది. దాని ఫలితంగా పార్లమెంట్ సభ్యుడుగా కొనసాగే అర్హతను కోల్పోవడంతో పాటు రాజ్యాంగ ఉన్నత పదవి అయిన ప్రధాని పదవిని సైతం వదులుకోవాల్సి వచ్చింది. ఆయన పదవిని కోల్పోయినా ఆయన సోదరుడైన షహబాజ్ నవాజ్‌ను తన వారసునిగా ప్రకటించాడు.

ఈ మొత్తం పరిణామాలను చూసినప్పుడు పాకిస్తాన్‌లో ఏదో న్యాయవ్యవస్థ చురుకుగా ఉన్నదని, క్రియాశీలకంగా పనిచేస్తూ రాజకీయ వ్యవస్థను ప్రక్షాళన చేసి సరియైన మార్గంలో పెడుతుందని అనుకునే అవకాశమూ లేకపోలేదు. నిజానికి ఇది నాణానికి ఒక పార్శ్వం మాత్రమే. అక్కడి రాజకీయ వ్యవస్థ అవినీతి మయమైపోయిందని న్యాయ వ్యవస్థ పనితీరుతో అవినీతి నాయకుల పదవీ పీఠాలు కదులుతున్నాయని అనుకోవాల్సిందేమీ లేదు. అన్ని దేశాల్లో ఉన్నట్టే ఆ దేశ రాజకీయ న్యాయకత్వం అవినీతిలో, అక్రమార్జనలో ఈతలు కొడుతూ అక్రమార్జనను సరిహద్దులు దాటిస్తూ విదేశాల్లో సంపదను పోగేస్తున్నది. నిజానికి నవాజ్ షరీఫ్ ఒక్కడే అక్రమార్జన చేస్తున్నాడా?

నవాజ్ షరీఫ్ కంటే ముందు అధికారం వెలగబెట్టిన పౌర, సైనిక ప్రభుత్వాదినేతలు అంతకంటే అవినీతిపరులు, ప్రజల సొమ్మును మూటగట్టుకున్న వాళ్లూ ఉన్నారు. మరి వాళ్లందరు ఎదుర్కోని పరిస్థితి ఒక్క నవాజ్ మాత్రమే ఎందుకు ఎదుర్కున్నాడు? పాకిస్తాన్ గతంలోకి తొంగిచూస్తే ఈ ప్రశ్నలకి సులభంగానే సమాధానాలు దొరుకుతాయి. 70 సంవత్సరాల అస్థిత్వంలో పాకిస్తాన్ ఎదుర్కొన్నంత రాజకీయ అస్థిరతను ఏ దేశమూ ఎదుర్కోలేదు. ఎన్నికైన ఏ ప్రభుత్వమూ పూర్తి పదవీకాలాన్ని చూడలేకపోయింది. చారిత్రకంగా పాకిస్తాన్ ప్రజా జీవితాన్ని ప్రబలంగా ప్రభావితం చేస్తున్నవి మూడు 'ఏ' లు! అల్లా, ఆర్మీ, అమెరికా! ఈ మూడింటి ప్రభావం నుండి తప్పించుకొని స్వతంత్ర మనుగడ కొనసాగించే జీవనరంగం పాకిస్తాన్‌లో లేదంటే ఏ మాత్రం అతిశయోక్తి కాదు. భారత దేశంలో పాలకవర్గ రాజకీయాలు అగ్రకుల, సంపన్నుల చేతుల్లో ఉన్నట్టే పాకిస్తాన్‌లో కూడా అధికారం అంతా కులీన

వర్గాల చేతుల్లోనే కేంద్రీకృతమైంది. ఆ కులీన వర్గాలే ఆర్మీలో కూడా అత్యున్నత స్థాయిల్లో ఉన్నాయి. పాకిస్తాన్ ఏర్పడిన నాటి నుండి ఈ రెండు వర్గాల మధ్య పరస్పరం అధికారం దక్కించుకునే, పైచేయి సాధించే ప్రయత్నాలు నిరంతరం జరుగుతూ 'పౌర ప్రభుత్వం' పూర్తికాల మనుగడ కొనసాగించే స్థితి లేకుండా పోయింది. వీటికి తోడు మతోన్మాద రాజకీయాలకు కూడా కొదవలేదు. ఈ మతోన్మాద శక్తులను ఆర్మీ, రాజకీయ వ్యవస్థ వారివారి ప్రయోజనాలకు అనుగుణంగా పెంచి పోషించడమో, ఉపయోగించుకోవడమో చేస్తుంటాయి.

అనేక దేశాల్లో ఉన్నటువంటి ప్రజాస్వామిక, ప్రగతిశీల ఉద్యమాల ఉనికి పెద్దగా లేకపోవడం కూడా ఈ వర్గాలు మరింత పట్టును పెంచుకున్నాయి. గ్రామీణ జన భాహుళ్యానికి జీవనాధారమైన వ్యవసాయం, ఇతర ఉపాధి మార్గాలు అంతంత మాత్రంగానే ఉన్నాయి. ఆధునిక విద్యకంటే మదర్సా మతపరమైన విద్యే పేద ప్రజానీకానికి అందుబాటులో ఉంది. ఈ వర్గాలే మతోన్మాద చర్యలకు పాల్పడే సంస్థల్లోకి సులభంగా ఆకర్షింప బడుతున్నాయి. పట్టణ పేదవర్గాల పరిస్థితి కూడా ఇంతకంటే భిన్నంగా ఉండే అవకాశమూ లేదు. నగరాల్లో, పట్టణాల్లో ఉన్న సంపన్నులు దేశ ఆర్థిక వ్యవస్థను నియంత్రిస్తున్నారు.

పాకిస్తాన్‌కే ప్రత్యేకమైన అంశం ఏంటంటే అత్యంత ఖరీదైన నగర, పట్టణ భూములు, స్థిరాస్తులు సైన్యం చేతిలో ఉండడం. ఎక్కడా లేని విధంగా అక్కడి ఆర్థిక వ్యవస్థను సైన్యం కూడా ప్రభావితం చేయ గలుగుతుంది. చారిత్రకంగా ఇంతటి ప్రభావితం కల్గి ఉండడం మూలంగానే పౌర ప్రభుత్వాలకు, కార్యనిర్వహణ వ్యవస్థకు సమాంతరంగా పాలనను నడిపించే సత్తాను సంతరించుకున్నది సైన్యం. జనరల్ జియా ఉల్ హఖ్ సైనిక నియంతగా అనేక సంవత్సరాలు పాలించడానికి ఈ నేపథ్యమే ఉపకరించింది. జుల్ఫికర్ అలీ బుట్టో లాంటి నేతను ఉరితీసినా, అనేక ప్రభుత్వాలను పడదోసి పాలనా పగ్గాలను చేపట్టినా ఆ దేశంలో సైనిక ప్రభుత్వాలను పూర్తిగా నిర్మూలించగలిగే కనీస ప్రజాస్వామిక ఉద్యమాలు ఉధృతంగా తలెత్తక పోవడానికి ఆర్మీ చేతుల్లో ఉన్న ఆయుధ సంపత్తే కారణం. దీనికి తోడు అమెరికా ప్రయోజనాలకు అనుగుణంగా పౌర ప్రభుత్వం నడిచినా, సైనిక ప్రభుత్వం వ్యవహరించినా ఎలాంటి సమస్య లేదన్నట్టు అమెరికా వ్యవహరించడమే కాకుండా ఆ ప్రభుత్వాలకు ప్రపంచ వ్యాప్తంగా ఒక లెజిటిమసీని తెచ్చిపెట్టే పని కూడా చేస్తుంది.

విచిత్రమైన పరిస్థితి ఏమిటంటే పాకిస్తాన్ ఆర్మీ పైన నిత్యం దాడులు చేసే మతోన్మాద సాయుధ సంస్థలూ ఉన్నాయి, అదే ఆర్మీ పెంచి పోషించిన సమయానుకూలంగా వాడుకునే ఉన్మాద సంస్థల సంఖ్య కూడా తక్కువేమీ లేదు. దేశీయంగాను, అంతర్జాతీయం గాను నెలకొనే పరిస్థితులను బట్టి ఆర్మీయే అనేక విధానాలను ప్రత్యేకించి విదేశాంగ విధానాలను నిర్దేశిస్తుంది. విదేశీ ప్రభుత్వాలు సైతం ఏదైనా ఒప్పందాలు కుదుర్చుకొనే సందర్భంలో ఆర్మీ 'అభిప్రాయాన్ని' పరిగణలోకి తీసుకోవడం గమనార్హం. ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ ప్రభుత్వాన్ని కూలదోయాలన్నా, ఆల్‌ఖైదాపైన యుద్ధం చేయాలన్నా సరిహద్దు దేశం అవడమే కాక, తాలిబన్ పైన పట్టున్న పాక్ ఆర్మీ, ఐఎస్ఐ అవసరం అమెరికాకు ఎక్కువైంది. మిగతా ముస్లిం దేశాల్లో ప్రజాస్వామ్య విలువలు లేవని గోలచేసే అమెరికా పాక్‌లోను ఇటు సౌదీ అరేబియాలోను సైన్యం, రాజరిక పెత్తనం ఉన్నప్పటికీ తమ అడుగులకు మడుగులొత్తే పనిచేస్తాయి కాబట్టి, వాటి విషయాల్లో ప్రజాస్వామ్య యుతంగా ఎన్నిక కావల్సిన ప్రభుత్వ వ్యవస్థ అవసరం గురించి ఎక్కువగా మాట్లాడదు. మరోవైపు ఇరాన్ ప్రాభల్యం పెరుగుతుండడం, ఇరాక్‌లో ఐ.ఎస్. లాంటి మత సంస్థలతో జరుగుతున్న యుద్ధంలో అమెరికా కంటే ఇరాన్ పాత్ర కీలకంగా పెరిగిపోవడం, యెమెన్‌లో జరుగుతున్న అంతర్యుద్ధంలో ఇరాన్ నిర్ణయాత్మక పాత్ర పోషించడం అమెరికా ఏమాత్రం జీర్ణం చేసుకోలేకపోతున్నది.

పాలస్తీనా పౌరులపై నిత్యం ఇజ్రాయిల్ జరిపే దాడులపై ఏ మాత్రం స్పందించని సౌదీ అరేబియా తన ప్రాంతీయ ఆదిపత్యం నిలబెట్టు కోవడానికి, ఇరాన్ ప్రాభల్యాన్ని అడ్డుకోవడానికి అమెరికా కనుసన్నల్లో 51 దేశాలతో కూడిన 'ముస్లిం నాటో' కూటమిగా పిలవబడుతున్న అతిపెద్ద ఇస్లామిక్ బ్లాక్‌కు నవాజ్ షరీఫ్ ప్రభుత్వం పెద్దగా సహకరించకపోవడం అమెరికాకు ఆగ్రహం కల్గించింది. మరోవైపు చైనా-పాకిస్తాన్ ఎకనామిక్ కారిడార్ నిర్మాణం, చైనాతో అన్నిరంగాల్లో సంబంధాలను సన్నిహిత పర్చుకోవడం అమెరికా సహించలేకపోతుంది. ముషారఫ్ సైనిక పాలనలో కనుమరుగైపోయిన షరీఫ్ మళ్లీ అధికారం చేపట్టడం, పౌర ప్రభుత్వ వ్యవస్థను స్థిరపరిచే ప్రయత్నం చేయడం, ఆర్మీపై పట్టును సాధించే విధంగా వ్యవహరించడం కూడా పాక్ ఆర్మీకి కోపాన్ని తెప్పించింది. విదేశాంగ విధానం ప్రత్యేకించి రక్షణ వ్యవహారాలకు సంబంధించి నవాజ్ షరీఫ్ ప్రభుత్వం స్వతంత్రంగా వ్యవహరించడం ఆర్మీకి కంటగింపుగా మారిపోయింది.

అయితే ప్రత్యక్షంగా సైనిక చర్య జరిపి అధికారాన్ని చేజిక్కించుకొనే పరిస్థితులు లేనందువల్ల పరోక్షంగా న్యాయవ్యవస్థ ద్వారా షరీఫ్‌ను పదవీచ్యుతున్ని చేసింది ఆర్మీ. నవాజ్ షరీఫ్ స్వతహాగా వ్యాపారవేత్త అవడం లాలూచి లావాదేవీలు ఉండడం, పనామా పేపర్స్ లీకేజీతో ఆర్మీకి, అమెరికాకు పరిస్థితి అనుకూలమయింది. షరీఫ్ నిజాయితిపరుడు కాదనే విషయం రుజువైనప్పటికీ ఆయన్ని దోషిగా నిలబెట్టి శిక్షించే ప్రక్రియలో అనేక లోపాలున్నట్లు ఆయన్ని వ్యతిరేకించే శక్తులు కూడా నమ్ముతున్నాయి. దీనికి తోడు సుప్రీంకోర్టు నియమించిన జాయింట్ ఇన్వెస్టిగేషన్ టీమ్‌లో ఆర్మీ ఇంటలిజెన్స్ అధికారులు ఉండడం కూడా దర్యాప్తు ప్రక్రియ అంతా కూడా షరీఫ్‌కు వ్యతిరేకంగా తయారయ్యింది. ముషారఫ్‌పైన మోపబడిన కేసుల దర్యాప్తు నెమ్మదించేలా చూడాలని, ఇమ్రాన్‌ఖాన్ షరీఫ్‌కు వ్యతిరేకంగా చేసిన అనేక ఆందోళనలకు ఆర్మీ మద్దతు ఉందని తద్వార అతిపెద్దదైన పంజాబ్ ప్రావిన్స్‌లో నవాజ్ షరీఫ్ పట్టును దెబ్బతీయాలని ఎన్నికల్లో అంత ప్రభావం చూపలేకపోయిన ఇమ్రాన్ ఖాన్ ర్యాలీలకు జనాన్ని భారీ ఎత్తున తరలించారు. భారతదేశంతో వ్యవహరించే విషయంలో ఆర్మీని, ఆ దేశ చాందసవాధ వర్గాలను ఏ మాత్రం విస్మరించినా భారీ మూల్యం చెల్లించుకోవాల్సిందే. సరిగ్గా షరీఫ్‌కు అదే జరిగింది.

నవాజ్ షరీఫ్, అతని కుటుంబ అక్రమ సంపాదన అవినీతి వ్యవస్థకు ఓ మచ్చుతునకే. పాకిస్తాన్ ప్రధానిగా ఉన్న బెనజీర్ బుట్టో భర్త ఆసిఫ్ జర్దారీ ఆమె అధికారాన్ని అడ్డు పెట్టుకొని విచ్చల విడిగా సంపాదించాడు. ఆయన 'మిస్టర్ 10 శాతం' గా చాలా ప్రసిద్ధుడు కూడా! అనేక ఆర్థిక, ఇతర నేరాలతో జైలు జీవితం గడిపిన జర్దారీ, బుట్టో హత్యానంతరం ఏకంగా దేశాధ్యక్షుడే అయినాడు. నిజంగా పాకిస్తాన్ న్యాయవ్యవస్థ అంత క్రియాశీలకంగా ఉండి రాజకీయ అవినీతిని రూపుమాపేలా వ్యవహరించి ఉంటే జర్దారీకి అంతటి ఉన్నత స్థానం దక్కేదే కాదు. జర్దారీ రాజ్యాంగ 62, 63 అధికరణల ప్రకారం సత్యవంతుడు, విశ్వసనీయుడు కానేకాకపోయినా ఆయన్ని కనిపించని 'లోపలి శక్తులు' కాపాడుకున్నాయి. దానికి తగ్గట్టుగానే ఆలోపలి శక్తుల ప్రయోజనాలకు అనుగుణంగా ఆయనా వ్యవహరించాడు. పరస్పర ప్రయోజనాలు ఆర్మీతో అయినా అమెరికాతో అయినా నెరవేరినాయని అర్థమవుతూనే ఉంది.

అవినీతి రాజకీయ నాయకుడు అయిన నవాజ్ షరీఫ్‌ను

# రాజీపడని హేతువాది డా. భార్గవ

*డా. పుష్పా ఎం. భార్గవ ఒక సైంటిస్టుగా హేతువాద దృక్పథంతో ప్రజలపక్షం వహించి తన జీవిత కాలంలో చేసిన కృషిని వివరిస్తున్నారు* **ఆశాలత**

**చా**లామందికి ఒక గొప్ప శాస్త్రవేత్తగా తెలిసిన డా. పుష్పమిత్ర భార్గవ నిజానికి అనేక కోణాలు, అనేక విశిష్టతలు ఉన్న మహా మనిషి. హేతువాద దృక్పథం, హక్కుల దృక్పథం, అభివృద్ధి దృక్పథం, మానవతా దృక్పథం ఇవన్నీ కలగలసిన గొప్ప వ్యక్తిత్వం ఆయనది. విజ్ఞానశాస్త్రం చదువుకుని శాస్త్రీయ దృక్పథం అలవరచుకుంటే మిగిలిన అన్ని ప్రజాహిత దృక్పథాలు కూడా కచ్చితంగా అలవడి తీరాలి అని నిరూపించడానికి ఆయన తన 90 ఏళ్ల జీవితంలో ఆచరించి చూపించాడు. విజ్ఞాన శాస్త్రం అణగారిన ప్రజలకు ప్రయోజనం చేకూర్చాలి అనే ఉద్దేశంతో జీవితాంతం కృషి చేశారు డా. భార్గవ. తన చుట్టూ జరుగుతున్న ప్రజావ్యతిరేక విధానాలు, చర్యల గురించి అసమ్మతిని వ్యక్తం చేయడం, విమర్శించడం తన హక్కుగా భావించి అట్లా జరిగిన ప్రతిసారీ తన గొంతు విప్పారు.

అనేక ఉన్నత పదవులలో ఉండి, జీవకణాలు– పరమాణువుల గురించి, జీవసాంకేతికత గురించి అత్యంత లోతైన సీరియస్ పరిశోధనలో మునిగి ఉన్న మనిషి ఒక జీవిత కాలంలో ఎన్నో వైవిధ్యమైన అంశాలపై సామాజిక, రాజకీయ, కళా రంగాలలో స్పందించి చొరవ తీసుకుని పనిచేయడం చాలా అరుదు. మొత్తం 125 పరిశోధనా పత్రాలను ప్రచురించాడు, అనేక అవార్డులు, బహుమతులు పొందాడు. ఒక శాస్త్రవేత్తగా వృత్తిపరంగా ఆయన అనేక ఉన్నత శిఖరాలను అందు కున్నారు. దేశంలో అత్యంత ప్రతిష్టాత్మకమైన మూడు జాతీయ సైన్స్ అకాడెమీలలో ఆయనను ఫెలోగా అనుకున్నారు. అయితే అవి దేశంలో సైన్స్ అభివృద్ధికి ఎటువంటి దోహదం చేయకుండా మేధోపరంగా, శాస్త్రీయంగా బలహీనం అయిపోయాయనె నిరసనతో అయన వాటి నుండి రాజీనామా చేశారు. 1977లో హైదరాబాదులో అయన స్థాపించిన సెంటర్ సెల్యులర్ అండ్ మాలిక్యులర్ బయాలాజి (సిసిఎంబి) అనే కేంద్ర ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన కేంద్రంలో డిఎన్ఎ, ఫింగర్ ప్రింటింగ్ వంటి అత్యంత ప్రాముఖ్యత కలిగిన పరిశోధనలను ప్రోత్సహించడమే కాదు, ఆ కేంద్రం ఆవరణను కళాత్మకంగా తీర్చిదిద్దడం, దాని గెస్ట్ హౌస్‌లో దుప్పట్లు కర్టెన్లు మిల్లులో తయారయినవి వాడకుండా చేనేతను నిలబెట్టాలనే సదుద్దేశంతో పోచంపల్లి వంటి చేనేత వస్త్రాలనే కొనుగోలు చేయాలని, నిర్ణయించడం – ఇవన్నీ అయనలో ఉన్న వైవిధ్యమైన వ్యక్తిత్వానికి చిహ్నాలు.

దేశంలో శాస్త్రవేత్తలలో లోపిస్తున్న శాస్త్రీయతను, ప్రభుత్వాలు పెంచి పోషిస్తున్న మూఢనమ్మకాలు అశాస్త్రీయ భావాలను, అవి ముందుకు తెస్తున్న మతపరమైన విధానాలను ఎండగట్టడంలో నిర్మొహమాటంగా వ్యవహరించారు. 1981లో అణు భౌతిక శాస్త్రవేత్త డాక్టర్ రాజ రామన్న, పి.ఎన్. హక్సర్‌లతో కలసి రాసిన 'ఎ స్టేట్‌మెంట్ అన్ సైంటిఫిక్ టెంపర్' అనే వ్యాసంలో 'నేడు మనం ప్రజల నుండి వాస్తవాలను దాచిపెట్టి మూఢ నమ్మకాలను పెంచి పోషించడం చూస్తున్నాం. దేవుడి పేరుతో బాబాలు చేస్తున్న మోసాలను, అద్భుతాలుగా ప్రచారం చేస్తూ ప్రజలను విపరీతంగా ప్రభావితం చేయడం అంగీకరించరాని విషయం, మధ్య యుగాలనాటి చరిత్రను మతతత్వాన్ని రెచ్చగొట్టే విధంగా వక్రీకరిస్తున్నారు' అని ఇందిరాగాంధీ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించాడు. జ్యోతిష్య శాస్త్రాన్ని విశ్వవిద్యాలయాలో పాఠ్యాంశంగా ప్రవేశపెట్టాలని అప్పటి విద్యాశాఖ మంత్రి మురళిమనోహర్ జోషి ప్రయత్నించినప్పుడు సుప్రీం కోర్టులో డా. భార్గవ అయనపై కేసుపెట్టాడు. 1997లో అయన ఇండియన్ సైన్స్ కాంగ్రెస్‌లో అశాస్త్రీయ అంశాలను చర్చిస్తున్నందుకు తీవ్రంగా విమర్శిస్తూ దానిని 'సైన్స్ వ్యతిరేక కాంగ్రెస్' గా పేరు మార్చాలని ఎద్దేవా చేశారు. దేశంలో ఉన్న సైన్స్ అకాడెమీలు సైన్స్‌కు మరింత హాని కలిగించకముందే వాటిని మూసివేయాలని ప్రకటించారు. 2003లో డా. చందన చక్రవర్తితో కలసి రాసిన 'ఎ సాగా ఆఫ్ ఇండియన్ సైన్స్ సిన్స్ ఇండిపెండెన్స్' అనే పుస్తకంలో భారతదేశంలో విజ్ఞానశాస్త్ర వ్యవస్థ వైఫల్యాలను వివరించారు. మనదేశంలో శాస్త్రవేత్తలుగా చెప్పుకునే వారిలో చాలామంది పూర్తిగా హేతు విరుద్ధమైన అశాస్త్రీయ అంశాలను నమ్ముతారని, ఆ రకంగా వారు పొంతనలేని రెండు రకాల జీవితాలను గడుపుతున్నారని తీవ్రంగా విమర్శించారు. దేశంలో పెచ్చు పెరిగిపోతున్న ఈ అశాస్త్రీయ వాతావరణాన్ని సరిదిద్దడానికి అయన అనేక ప్రజా సైన్స్ ఉద్యమాలకు మార్గదర్శకత్వం వహించారు.

నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్ రిసర్చ్ అండ్ ట్రైనింగ్ అనే సంస్థ కోసం డా. భార్గవ ప్రజలలో ప్రశ్నించే తత్వాన్ని ప్రోత్సహించాలనే ఉద్దేశంతో 'మెథడ్ ఆఫ్ సైన్స్' అనే పేరుతో ఒక సైన్స్ ఎగ్జిబిషన్‌ను రూపకల్పన చేశారు. ఆ ఎగ్జిబిషన్‌లో క్లిష్టమైన సైన్స్ విషయాలను కూడా సామాన్య ప్రజలకు సులభంగా అర్థమయ్యే విధంగా రోజువారీ గమనించే విషయాలలో సైన్స్ సూత్రాలను వివరించడం, వాటి వెనుక నున్న కారణాలను ప్రశ్నించేలా చేయడం వంటి అనేక ఆసక్తికరమైన అంశాలతో

---

శిక్షించకుండా మినహాయించాలని కాదు, మినహాయింపు పొంది అక్రమ సంపాదనాపరులైన ఇతర రాజకీయ నాయకత్వం విషయంలో న్యాయవ్యవస్థ, ఆర్మీ ఎందుకంత చొరవ చూపలేదనేదే ప్రశ్న? అమెరికాకో, ఆర్మీకో ప్రయోజనాన్ని కల్పించడానికో, ఆదిపత్యం నిలబెట్టడానికో న్యాయవ్యవస్థ చొరవను, దూకుడును చూపెట్టడం కంటే ఆ దేశ అశేష పీడిత ప్రజానీకం ప్రయోజనాలు పరిరక్షించబడేలా, దేశ రాజకీయ వ్యవస్థ ప్రజలకు సంపూర్ణ జవాబుదారీగా మారేలా అన్ని వేళల్లో వ్యవహరించాలి. దానికి ప్రజాస్వామిక, ప్రగతిశీల శక్తుల ప్రభావ వంతమైన ఉద్యమం మినహా మరో మార్గం లేదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

పాటు బాబాల మోసాలను బహిర్గతం చేసే అంశాలను కూడా ప్రదర్శించారు. ఎమర్జెన్సి కాలంలో ఈ సైన్స్ ఎగ్జిబిషన్ న్యూఢిల్లీ బాల్‌భవన్‌లో నిర్వహించినప్పుడు కొంతమంది మతోన్మాద దుండగులు ఆ ఎగ్జిబిట్స్‌ను ఎత్తుకుపోయి అది జరగకుండా అడ్డుకోవడానికి, ధ్వంసం చేయడానికి ప్రయత్నించారు. ఆ తర్వాత డా. భార్గవ ఆ ఎగ్జిబిషన్‌ను 1980-81లో హైదరాబాద్‌లో నిర్వహించారు. ఇక్కడ ఒక విషయం చెప్పాలి - హైదరాబాదులో ఆ ఎగ్జిబిషన్ నిర్వహించేందుకు అయన వాలంటీర్ల కోసం చూస్తున్నప్పుడు ఉస్మానియా యూనివర్సిటీకి చెందిన కొంతమంది విద్యార్థులు (ఈ వ్యాస రచయితతో సహ దాదాపు 20మంది) ముందుకొచ్చారు. ఆ విద్యార్థులకు డా. భార్గవ తార్నాకలోని సిసిఎంబిలో రాతపరీక్ష నిర్వహించి ఆ తర్వాత ప్రతి ఒక్కరినీ అయన స్వయంగా ఇంటర్వ్యూ చేశారు. ఆ ఇంటర్వ్యూలో అయన వాలంటీర్లలో కేవలం సైన్స్ పరిజ్ఞానం గురించే కాక సమకాలీన సామాజిక, రాజకీయ అంశాల గురించి కూడా విపులంగా ప్రశ్నించి వారి అభిప్రాయాలను రాబట్టారు. ఎగ్జిబిషన్‌లో అంశాలను సందర్శకులకు వివరించడానికి వాలంటీర్లకు సైన్స్ పరిజ్ఞానం ఒక్కటే ఉంటే సరిపోదు, సమగ్రమైన అవగాహన అవసరం అనే అర్థాన్ని స్ఫురింప చేశారు. ఆ ఇంటర్వ్యూలో పాల్గొని ఆ తర్వాత ఆ ఎగ్జిబిషన్‌లో పనిచేసిన విద్యార్థులలో డా. భార్గవ నింపిన ఉత్తేజం శాశ్వతంగా ముద్రవేసింది.

డా. భార్గవ ప్రజల హక్కులకు భంగం కలిగిన ప్రతి సందర్భంలోనూ స్పందించడం తన బాధ్యతగా భావించాడు. ఎమర్జెన్సీ నిర్బంధ కాలంలో అయన ఒక జాతీయ స్థాయి సదస్సు నిర్వహిస్తూ దానికి సంబంధించిన నేపథ్య పత్రాన్ని రాయవలసిందిగా ప్రముఖ న్యాయవాది కె.జి. కన్నబిరాన్‌ను కోరాడని వసంత్ కన్నబిరాన్ అయనకు నివాళి అర్పిస్తూ గుర్తు చేసుకున్నారు. కన్నబిరాన్ ఎమర్జెన్సీని విమర్శిస్తూ రాస్తాడని తెలిసి కూడా ఆయను ఆ పత్రాన్ని రాయమని అడగడంలోనే అయన రాజకీయ నిబద్ధత స్పష్టమవుతుంది.

మెజారిటి ప్రజలకు హాని చేసే ప్రభుత్వ విధానాలను, నిర్ణయాలను ప్రాజెక్టులను ఖండించడానికి అయన వెనుకాడలేదు. కేరళలో కుడంకులం వద్ద కేంద్ర ప్రభుత్వం నిర్మించ తలపెట్టిన అణువిద్యుత్తు ప్రాజెక్టును అయన గట్టిగా వ్యతిరేకించారు. ఆ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు సాగిస్తున్న ఉద్యమానికి అయన ప్రకటన పెద్ద బలాన్ని ఇచ్చింది. పాలకులు దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టుపెట్టే విధంగా, బహుళజాతి కంపెనీలకు వనరులను కట్టబెట్టడాన్ని తద్వారా ఆ కంపెనీలు ప్రభుత్వం నిర్ణయాలు తీసుకునే క్రమంలో జోక్యం చేసుకోవడాన్ని, అ క్రమాన్ని నియంత్రించడాన్ని అనేక సందర్భాలలో ఖండించాడు. 1984లో భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ పరిశ్రమలో గ్యాస్‌లీక్ జరిగి 4 వేల మందికి పైగా చనిపోయి, మొత్తం 5 లక్షల మంది ప్రజలు గ్యాస్ వల్ల బాధితులైన నేపథ్యంలో డా. భార్గవ ఆ సంఘటనలో ప్రభుత్వం బాధ్యతా రాహిత్యాన్ని బహిర్గతం చేస్తూనే అనేక మంది ఇతర సామాజిక కార్యకర్తలతో కలసి ఆ సమస్యపై వెంటనే స్పందించి గ్యాస్ బాధితుల సహాయం కోసం సంభావన ట్రస్ట్‌ను స్థాపించి దాని చైర్మన్‌గా ఉన్నారు.

దేశంలో జీవ సాంకేతిక పరిజ్ఞాన్ని ప్రవేశపెట్టడంలో ఆద్యుడు తానే అయినప్పటికీ డా. భార్గవ కేంద్ర ప్రభుత్వం జన్యు మార్పిడి పంటలను ప్రవేశపెట్టడానికి చేస్తున్న ప్రయత్నాలను తీవ్రంగా విమర్శించాడు. జన్యు మార్పిడి జీవాలను నియంత్రించబడిన పరిస్థితులలో ఉపయోగించడంలో ఉన్న లాభాల గురించి చెబుతూనే ఒకసారి పర్యావరణంలోకి విడుదల చేసిన తర్వాత అదుపు లేకుండాపోయి, తిరిగి వెనక్కు తీసుకోలేని జన్యుమార్పిడి పంటలకు అనుమతించడాన్ని వ్యతిరేకించాడు. జన్యు మార్పిడి అనుమతుల కమిటీ జిఐఎసిలోకి సుప్రీం కోర్టు డా. భార్గవను సభ్యుడిగా నియమించిన తర్వాత ఆ కమిటీ సమావేశాలలో తన అభిప్రాయాలను నిక్కచ్చిగా వెలిబుచ్చారు. అ కమిటీలో బాధ్యతా రహితంగా తీసుకుంటున్న నిర్ణయాలను ఎండగట్టారు. అయన చనిపోయే వరకు కూడా జన్యుమార్పిడి ఆవాల పంటకు అనుమతివ్వడానికి జరుగుతున్న ప్రయత్నాలపై తన విమర్శనాత్మక అభిప్రాయాలను తెలియ చేస్తూనే ఉన్నారు. ఆ విషమయంలో ఉద్యమిస్తున్న కార్యకర్తలకు, రైతు సంఘాలకు అండగా నిలిచారు.

తీవ్ర సమస్యలలో కొట్టుమిట్టాడుతున్న రైతుల పట్ల ఎంతో అక్కర కలిగిన భార్గవ వారి ప్రయోజనాలకు హాని కలిగించే విధానాలను వ్యతిరేకించాడు. పర్యావరణ సుస్థిరతే రైతులకు ఆహార భద్రతను, ఆర్థిక భద్రతను కలిపిస్తుందని గట్టిగా నమ్మారు, రైతులు గౌరవ ప్రదమైన జీవితం గడపాలని ఆశించారు.

తాను నమ్మిన విషయాలకు కట్టుబడి ఉండే భార్గవ హోమియోపతి వైద్యం విషయంలో చాలా వివాదాస్పదమైన వైఖరిని ప్రకటించాడు. హోమియోపతివైద్యం శాస్త్రీయంగా పరీక్షించబడినది కాదని అభిప్రాయపడి ఒక వైద్యవిధానంగా దానికి ఉన్న గుర్తింపును రద్దు చేయాలని ప్రతిపాదించారు. దీనిపై పెద్ద దుమారం లేచింది, హోమియోపతిని విశ్వసించే కొందరు సిసిఎంబి ముందు ఆయనకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు చేశారు, అయన ఇంటిపై దాడి చేశారు కూడా.

అయన జీవితంలో అన్నిటికంటే గొప్పగా చెప్పుకోవలసింది దేశంలో పెచ్చరిల్లుతున్న మతపరమైన అసహనానికి నిరసగా తన పద్మభూషణ్ బిరుదును ప్రభుత్వానికి తిరిగి ఇచ్చేయడం. 1986లో విజ్ఞానశాస్త్ర రంగంలో అయన దేశానికీ చేసిన సేవకు గుర్తింపుగా ప్రభుత్వం ఆయనను పద్మభూషణ్ బిరుదుతో సత్కరించింది. 2015లో కల్బుర్గి వంటి ప్రజాస్వామిక రచయితలను చంపడం, గొడ్డుమాంసం ఇంట్లో ఉంచుకున్నాడనే నెపంతో అఖ్లాక్‌ను చంపడం వంటి సంఘటనలు జరిగిన తర్వాత అటువంటి సంఘటనలను ఎన్‌డిఎ ప్రభుత్వం నిలువరించలేక పోతున్నందుకు నిరసనగా పద్మభూషణ్ను తిరిగి ఇచ్చివేయలని నిర్ణయించుకున్నాడు డా. భార్గవ. 'దేశ భవిష్యత్తు పట్ల తీవ్ర ఆందోళన చెంది ఈ బిరుదును తిరిగి ఇచ్చేస్తున్నాను. ప్రస్తుత ధోరణి ఇలాగే కొనసాగితే మనది ప్రజాస్వామ్య దేశంగా మిగలదు. నాకు గత యుపిఎ ప్రభుత్వం పట్ల కూడా ఏమి ప్రేమలేదు. కాని అప్పుడు కనీసం మనం ఏం తినాలి, ఏం ధరించాలి, ఎట్లా ఉండాలి అనేది ప్రభుత్వం నిర్ణయించలేదు' అని తన పద్మభూషణ్‌ను తిరిగి ఇచ్చేటప్పుడు ప్రకటన ఇచ్చాడు.

అయన నిరంతర అన్వేషి అని చెప్పడానికి తాను రిటైర్ అయిన తర్వాత కూడా సైన్స్ పరిశోధనలు కొనసాగించడానికి 'అన్వేషణ' అనే స్వంతసంస్థను పెట్టుకున్నాడు. తన ఇంటిలోనే ఒక భాగంలో ఒక పెద్ద లైబ్రరి, ఒక లేబొరేటరి స్థాపించుకుని కొంతమంది సన్నిహితులతో చివరి నిమిషం వరకు కూడా తన అన్వేషణను కొనసాగించాడు. దేశం కోసం, ప్రజల కోసం పనిచేయాలనుకునే నిజాయితీపరులైన యువ శాస్త్రవేత్తలు డా. భార్గవ నుండి ఉత్తేజం పొంది బాధ్యతాయుతమైన సైన్స్ వ్యాప్తి కోసం ప్రజలకు పనికి వచ్చే విధంగా కృషి చేయగలిగితే అదే ఆయనకు నిజమైన నివాళి అవుతుంది. అలాగే అయన బయోటెక్నాలజీ విషయంలో చేసిన సూచనలను ప్రభుత్వం, సుప్రీంకోర్టు అంగీకరించి అమలుచేస్తే దేశానికి, అణగారిన ప్రజలకు ఎంతో మేలు జరుగుతుంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ఉత్తర కొరియాపై యుద్ధానికి అమెరికా సై

***ఉత్తర కొరియాలో అణ్వాయుధాలు ఉన్నాయనే నెపంతో ఆంక్షలు విధిస్తూ అమెరికా యుద్ధ సన్నాహాలు చేస్తోందని, దీన్ని ప్రపంచ ప్రజలు అడ్డుకోవాలని అంటున్నారు బి.ఎస్. రాజు***

పెద్దగా సిరిసంపదలు లేని ఒక చిన్న బలహీన దేశం; ప్రపంచంలోనే అత్యంత అర్థిక, సైనిక, అణ్వాయుధ బలం కలిగిన శక్తివంతమైన దేశంపై, అదీ యుద్ధాలకు, దురాక్రమణలకు, బెదిరింపులకు చరిత్రలో ఘనత గాంచిన దేశాన్ని ఎందుకు 'ఢీ' కొట్టాలనుకుంటుంది? ఒకవేళ నిజంగానే అటువంటి బలహీన దేశం, ఒక బలమైన దేశాన్ని 'ఢీ' కొట్టాలని అనుకుంటున్నదంటే దాని వెనుక చాలా బలీయమైన, హేతుబద్ధమైన కారణాలు తప్పక ఉంటాయి. ఇక్కడ యుద్ధోన్మాద అహంకారాన్ని ప్రదర్శిస్తూ వస్తున్న దేశం అమెరికా అయితే, దాని దుష్టపన్నాగాన్ని ఎదుర్కొంటున్న చిరుదేశం ఉత్తర కొరియా.

మానవాళికి, సమస్త జీవరాసులకు, భూమండలానికి వినాశకరమైన అణ్వాయుధాలను ఎప్పుడో ఇబ్బడి, ముబ్బడిగా సమకూర్చుకున్న అగ్ర రాజ్యాలు. అసలు ఏ అణ్వాయుధాలు లేని దేశాలు ఆ ఊసెత్తకుండా ఎనలేని ఆంక్షలు విధిస్తూ కట్టడి చేస్తున్నాయి. తమ ఆత్మరక్షణార్థమై అణ్వాయుధాలను సమకూర్చుకోక తప్పని పరిస్థితుల్లో ఏ ఇతర దేశమైనా ప్రయత్నిస్తే, ప్రళయమొచ్చినట్లే ఈ అగ్రరాజ్యాలు గగ్గోలు పెడతాయి. తమవద్ద కుప్పలు తెప్పలుగా అత్యంత భయంకరమైన, వినాశకరమైన అణ్వాయుధాలు ఉండడం సమంజసమని, ఇతరులెవరైనా అటువంటి ఆయుధాలు సమకూర్చుకోవడానికి ప్రయత్నిస్తే, ప్రపంచ శాంతికి భంగకరమని అగ్ర రాజ్యాలు విరుచుకుపడతాయి. ప్రపంచ శాంతికి వీరే హక్కుదారులైనట్లు, వీరే శాంతికాముకులైనట్లు, శాంతికి కాపలాకాసే మొనగాళ్లు వీరే అన్నట్లు, అసలు-సిసలు శాంతి విచ్ఛిన్నకులైన వీరే పోజులు పెడతారు. ముఖ్యంగా, సామ్రాజ్యవాద దేశమైన అమెరికా, ప్రపంచం నలుమూలలా 'విమాన-నౌకా' సైనిక స్థావరాలను స్థాపించి ప్రపంచ మానవాళిని భయపెడుతూ, శాసిస్తూ ఉంది. నిత్యం యుద్ధభీతితో, ఎప్పుడు తమ జాడ చెరిగిపోతుందో తెలియని భయంతో, ప్రపంచ ప్రజలు జీవనం కొనసాగించే స్థితికి అగ్రరాజ్యమైన అమెరికా నెట్టి వేసింది.

ఉత్తర కొరియాకు అమెరికా నుండి దాపురించిన కష్టాలు ఈనాటివి కావు. గత 70 ఏళ్లుగా, కొరియా ప్రజలు ఈ యుద్ధోన్మాదంతో సతమతమౌతున్నారు. ఈ యుద్ధోన్మాద అమెరికా ఇరాక్, లిబియా, సిరియా, ఆఫ్ఘనిస్తాన్, యెమెన్ ఇత్యాది దేశాల్లో కురిపించిన బాంబుల వర్షం, కావించిన సామూహిక వినాశనం నుండి ఇవ్వాళ కొత్తగా కొరియా ప్రజలు ప్రత్యేకంగా తెలుసుకోవాల్సిన దేమీ లేదు. ఇటువంటి వినాశనాన్ని వారు ఇప్పటికే అనుభవించి ఉన్నారు. ఆ అనుభవాల బీభత్సం నుండి వారు ఇంకా కోలుకోలేదు సరికదా, ఇప్పటికీ అమెరికా అగ్రరాజ్యపు నిత్య యుద్ధ బెదిరింపులతో సగం నిద్రతోనే వారు జీవిస్తున్నారు. అసలు కొరియా రెండుముక్కలైంది ఈ సామ్రాజ్యవాద యుద్ధోన్మాధంతోనే కదా!

అమెరికా ప్రజలు చాలామంది కొరియా సమస్యను ఎక్కడో దూరంగా ఉన్న వ్యవహారంగా భావిస్తారు. ఇది కొరియన్ల సమస్య అనుకోవడం సరికాదు. నిజానికి ఈ సమస్య కొరియా భూభాగంపై గత 70 ఏళ్లుగా మండుతూ కొనసాగుతున్న కాష్ఠానికి కారణం అమెరికా దుష్ట విదేశీ నీతే అని ప్రత్యేకంగా ఎవరూ చెప్పవసరంలేదు. కావాలని కళ్లుమూసుకుని కొట్టుకు చావనియ్ అనుకునే వారు అణుయుద్ధ ప్రమాదం నుండి తప్పించుకోలేరు. అలా అనుకోవడం ఒక భ్రమే అవుతుంది.

రెండవ ప్రపంచ యుద్ధం ముగుస్తున్న సమయంలో, జపాన్, పసిఫిక్ తీర ప్రాంత విజేతలుగా అమెరికా, సోవియెట్ రష్యాలు కొరియాను రెండు ముక్కలు చేశాయి. ఇద్దరు ఆమెరికన్ యువ సైనికాధికారులు నేషనల్ జియోగ్రాఫిక్ పుస్తకం నుండి భౌగోళిక చిత్రపటాన్ని చించి 38వ పేర్లల్ వెంబడి ఒక గీత గీశారు. అలా ఆ గీతకు ఇటూ అటూ ఉత్తర, దక్షిణ కొరియాలను సృష్టించారు. సియోల్‌ను, ప్యాంగ్యాంగ్‌ను అమెరికా సోవియెట్ యూనియన్లు ఇది నాకు, అది నీకు అని పంచుకున్నాయి. జపాన్ వలసగా ఉన్న కొరియా ప్రజలు అప్పటికి 35 సంవత్సరాలుగా జాతీయ విముక్తి యుద్ధం చేస్తూ విజయం చేజిక్కించుకునే సందర్భంలో ఉన్నారు. చరిత్రలోనే చెప్పుకోదగ్గ అత్యంత ప్రజాస్వామికమైన గడ్డివేళ్ల ప్రజారాజ్య కమిటీల స్వపరిపాలనా వ్యవస్థ అక్కడ వేళ్లూనుకుని ఉంది. అయితే స్వాతంత్రానికి బదులు కొరియన్ ప్రజలకు చివరకు దక్కింది జాతివిభజన. ఈ కృత్రిమ విభజన కారణంగా 1945లో రెండు కొరియా దేశాలు ఏర్పడ్డాయి. ఒకటి: ఉత్తర కొరియాగా పిలువబడుతున్న 'ప్రజాస్వామ్య కొరియా ప్రజా రిపబ్లిక్'; రెండవది: దక్షిణ కొరియాగా పిలవబడుతున్న 'రిపబ్లిక్ ఆఫ్ కొరియా'. ఈ విభజన అంతిమంగా 1950-53 కొరియా యుద్ధానికి దారితీయడమేగాక, ఎడతెరిపిలేని పరోక్ష యుద్ధానికి (కోల్డ్-వార్‌కు) తెరలేపింది. ఈ పరోక్ష యుద్ధ కాష్ఠం ఇంకా మండుతూనే ఉంది.

1951 మేలో అప్పటి సైనిక జనరల్ డగ్లస్ మెకార్థర్, అమెరికా కాంగ్రెస్ ముందు చదివి వినిపించిన నివేదికలో- 'గత సంవత్సర కాలంలోనే, 20 మిలియన్ జనాభాగల కొరియాను మనం ధ్వంసం చేశాం. ఇంతటి విచ్ఛిన్నాన్ని నేను ఎప్పుడు చూడలేదు. నేను చూసినంతగా మానవరక్త ప్రవాహాలను, వినాశాన్ని బహుశా ఇంతవరకు బతికున్న ఏ వ్యక్తి చూసి ఉండకపోవచ్చు, అయినప్పటికీ కొరియాలో జరిగిన విధ్వంసం నా కడుపు దేవేసింది. ఆ మానవ శవాల, స్త్రీల, పిల్లల మృతదేహాల గుట్టలు చూసి నేను వాంతిచేసుకున్నాను... ఇలాగే మనం కొనసాగితే, మరింత మానవ హననం చూడవలసి వస్తుంది". తదనంతరం, డగ్లస్

మెకార్తర్ జాగాలో వచ్చిన 'కర్టిస్ లీమే' అనే సైన్యాధికారి ఇలా రాశాడు: "ఉత్తర దక్షిణ కొరియాల్లో అన్ని నగరాలను, పట్టణాలను మేం తగలబెట్టేశాం, ఓ 10 లక్షల వరుకు జనాభాను చంపేశాం, అంతకు అంతగా జనాన్ని ఊళ్ల నుండి తరిమివేశాం"..

ఇటువంటి విచ్ఛిన్నం నుండి ఉభయ కొరియాలు రెండు విభిన్న రాజకీయ-ఆర్థిక-సామాజిక పద్ధతుల ననుసరించి తమ తమ దేశాల పునర్ నిర్మాణాలను చేపట్టాయి. దక్షిణ కొరియా పరతంత్రంతో అమెరికాకు, జపాన్‌కు నయావలసగా మారి, జపాన్ అమెరికా సైనిక రాజకీయాలకు, పెట్టుబడిదారులకు స్వర్గధామంగా, అమెరికా సైనిక స్థావరాలకు అడ్డాగా అవతరిస్తే; ఉత్తర కొరియా అమెరికాకు, జపాన్‌కు తలొగ్గక, కిమ్ ఇల్ సుంగ్ నాయకత్వంలో తనదైన శైలిలో ఓ స్వతంత్ర దేశంగా నిలిచింది. ఉత్తర కొరియా కూడా, దక్షిణ కొరియా బాటపట్టి అమెరికా తొత్తుగా మారి ఉంటే, అమెరికా చెప్పు చేతలకు లోబడి పనిచేస్తే చరిత్ర వేరే విధంగా ఉండేది.

కొరియన్ ప్రజల జాతీయ నాయకుడైన 'కిమ్ ఇల్ సుంగ్' ఆరితేరిన ప్రజాగెరిల్లా యుద్ధ నాయకుడు. జపాన్ నుండి విముక్తి కోసం జరిపిన కొరియా ప్రజా యుద్ధంలో ప్రముఖ పాత్ర పోషించిన, వారి స్వతంత్ర ఆకాంక్షలను గౌరవించి పోరాడి 'కిమ్' కొరియన్ ప్రజల ప్రియతమ నాయకుడయ్యాడు. జపాన్ సామ్రాజ్యవాదుల మిలటరీలో 'పార్క్ చుంగ్-హీ' సైనిక నియంతగా మారి జాతి విముక్తి పోరాట నాయకుడైన 'కిమ్ ఇల్ సుంగ్' ను, అతని గెరిల్లా సైన్యాన్ని వెంటాడి, వేటాడిన వాడు. ఇతను అమెరికా జపాన్ల తొత్తుగా దక్షిణ కొరియాను మలిచాడు. 'పార్క్ గియున్ -హెయ్' ఈ నియంత కూతురే. ఈమె దక్షిణ కొరియా అధ్యక్షురాలిగా కొంత కాలం ఉంది కూడా! 'కిమ్ ఇల్ సుంగ్' వారసత్వ పాలన ఉత్తర కొరియాలో కొనసాగుతున్నది. అది ఎటువంటి రాజ్యం? అక్కడి వంశపారంపర్య నాయకత్వానికి, ప్రజలకు ఉన్న వైరుధ్యాలేమిటి? అది శుద్ధ మిలటరీ అణచివేత లక్షణాలుగల నియంతృత్వ వ్యవస్థనా? అనే ప్రశ్నలకు జవాబులు వెదికే పని ఈ వ్యాసపరిధిలోనిది కాదు కాబట్టి, వాటిని ప్రస్తుతం పక్కకు పెట్టి ఇప్పుడు అమెరికా, ఉత్తర కొరియాలు యుద్ధానికి ఎందుకు కాలు దువ్వుతున్నాయో చూడాలి. దీనిలో యుద్ధోన్మాదం ఎవరిదో, ఆత్మరక్షణ ఎవరిదో, దీనిలో నిజానిజాలు, న్యాయాన్యాయాలు, ప్రపంచ ప్రజల మనుగడ, వారి ప్రపంచ శాంతి కాముకతా ఆకాంక్షలు అనే కోణం నుండి చర్చించాల్సి ఉంటుంది.

'కిమ్ ఇల్ సుంగ్' మరణానంతరం అతని కొడుకు 'కిమ్ జాంగ్ ఇల్' కొంతకాలం తండ్రి అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక వారసత్వాన్ని కొనసాగించాడు. అతని తరువాత ఇప్పుడు అతని కొడుకు 'కిమ్ చోంగ్ ఇయున్' ఉత్తర కొరియా అధ్యక్షునిగా అమెరికా బెదిరింపులకు తల ఒగ్గని - 'పెద్ద కిమ్' వారసత్వాన్ని మరింత పట్టుదలతో, ధీరత్వంతో కొనసాగిస్తున్నాడు. ఉత్తర కొరియాలో ఈ కిమ్‌ల పాలన అంత మొందించాలని అమెరికా శతవిధాల మొదటి నుండీ ప్రయత్నిస్తూ వస్తున్నది. అప్పటి నుండి అమెరికా అధ్యక్షులుగా ఎన్నికైన ప్రతి ఒక్కరు ఉత్తర కొరియాలో కిమ్ కుటుంబ వారసత్వ పాలనను ఎలాగైనా మట్టుపెట్టి తమకు అనుకూలమైన కీలుబొమ్మను ఆ పీఠంపై కూర్చోబెట్టాలనే వ్యూహాలు రచిస్తునే వచ్చారు. ఐతే, ఈ వ్యూహాలన్నీ బెడిసికొట్టాయి. ఒక 'సద్దాం హుస్సేన్' లానో, ఒక 'గద్దాఫీ' లానో, ఒక 'ఒసామా బిన్ లాడెన్' లానో కిమ్ ల విషయంలో అవేవి సాధ్యపడలేదు. ఎందుకని సాధ్య పడలేదు?

ప్రస్తుత అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ 'ఫైర్ ఎండ్ ఫ్యూరీ' అని, 'లాక్డ్ ఎండ్ లోడెడ్' అని ఎంతగా రంకెలు వేసినా బుల్లి కిమ్ బెదరక తాతకు మించిన మనవడుగా తలవంచక అమెరికాకు యుద్ధ క్షిపణుల గొంతుతో సమాధానం చెపుతున్నాడు. శక్తివంతమైన ఖండాంతర క్షిపణులు సమకూర్చుకుని అమెరికాను హెచ్చరిస్తున్నాడు; నువ్వు నా దేశంపై బాంబులు కురిపించి వినాశకర యుద్ధానికి దిగితే గనుక మేము కూడా అమెరికా భూభాగాన్ని కొద్ది క్షణాల్లోనే మా బాంబులతో ముంచెత్తుతాం, జాగ్రత్త, మా జోలికి రావద్దు అని హెచ్చరిస్తున్నాడు. అందుచేత ఇక్కడ ఉన్నది ఒక పక్క సామ్రాజ్యవాద యుద్ధోన్మాదం, దాని అమెరికా నాయకత్వం. మరోపక్క చావు బతుకుల మధ్య ఆత్మరక్షణకై ధీశాలిగా నిలబడ్డ ఉత్తర కొరియా అనే బుల్లి దేశం. అమెరికా సామ్రాజ్యవాదం ఎప్పటిలాగే తనను కాదన్న వాళ్లపై ఎంతటి దుష్ప్రచారానికి, మానసిక యుద్ధానికి దిగుతుందో వేరే చెప్పనక్కర్లేదు. మన హిందూ పురాణాల్లో ప్రత్యర్థి జాతులను రాక్షసులని, అనాగరికులని, దుర్మార్గులని చిత్రించిన విధంగానే ఉత్తర కొరియా నాయకత్వాన్ని, ప్రజలను కూడా అమెరికా అలానే చిత్రిస్తుంది. పాలకుల, పెట్టుబడుల సేవకై వెలసిన మాధ్యమాలన్నీ ఇవే కారుకూతలను నిత్యం ప్రచారం చేస్తూ ఉంటాయి.

ఉత్తర కొరియా అప్పుడు ఇప్పుడు కూడా ఆత్మరక్షణ పనిలోనే తలమునకలౌతోంది. అమెరికా విధిస్తున్న ఆర్థిక వ్యాపార ఆంక్షల వలయంలో ఊపిరి నిలబెట్టుకుని మనుగడ సాగిస్తోంది. అమెరికా వంటి సామ్రాజ్యవాద దేశం నుండి తమ ప్రజలను కాపాడుకోవాలంటే, తన ఉనికిని నిలబెట్టుకోవాలంటే, తన స్వతంత్రతను కోల్పోకుండా ఉండాలంటే; తన సొంత సైనిక పాఠవాన్ని, శక్తివంతమైన ఖండాంతర క్షిపణులను, ఎప్పుడైనా ఏ క్షణంలోనైనా సామ్రాజ్యవాదుల దాడులను ఎదుర్కొనే సన్నద్ధత గల్గిన సుశిక్షిత గల సైన్యం, ప్రజా మిలీషియా, స్థానిక ప్రజా మద్దతు, తన సరిహద్దుల్లో ఉన్న దేశాలతో సత్సంబంధాలు అవసరం. అలాకాక బేలగా దేబిరింపులకు దిగి, అమెరికాను నిలువరించగలిగే సైనిక శక్తిని, యుద్ధ వ్యూహాన్ని కలిగి ఉండకపోతే ఈ రోజు ఉత్తర కొరియా నామరూపాలు ఉండేవా?

ఒక ఇరాక్‌లానో, లిబియాలానో, సిరియాలానో మారిపోకుండా ఉండేదా? ఇప్పటి ప్రపంచ అగ్రదేశాల జాబితాలో ఉన్న చైనా, రష్యా దేశాలతో ఉత్తర కొరియాకు తొలి నాళ్లనుండి సుదృఢమైన రాజకీయార్థిక సంబంధాలున్నాయి. అవి ఇంకా కొనసాగుతున్నాయి. అయితే ఇది వరకటి మావో కాలపు చైనా, స్టాలిన్ కాలపు రష్యా ఇప్పుడు లేవు కదా! అంటూ ఒకటి ఉంటున్నది. అందుచేత ప్రస్తుతానికి చైనా, రష్యాల మద్దతు ఉత్తర కొరియాకు లభిస్తున్నది. ఇక వ్యాపార సంబంధాలు ఎలానూ ఉంటాయి.

అమెరికా కబంధ హస్తాల్లో ఉన్న దక్షిణ కొరియా ప్రజలు ఉత్తర కొరియా ప్రజలకు వ్యతిరేకులు కారు. అలానే జపాన్ దేశ ప్రజలు యుద్ధాన్ని కోరుకోవడం లేదు. వియాత్నం అనుభవం తరువాత అమెరికా, యూరోప్ సాధారణ ప్రజానీకం మరో ప్రపంచ యుద్ధాన్ని ససేమిరా అంటున్నారు. దీనికి విరుద్ధంగా నలు దిశలా తిరిగి ఫాసిజం పడగవిప్పి

# హిందూ ఉగ్రవాదం రాలుస్తున్న నెత్తుటి చుక్కలు

***దేశంలో దళిత, మైనారిటీ వర్గాలపై హిందూ మతోన్మాదులు చేస్తున్న దాడులతో ప్రజలంతా అభద్రతకు గురవుతున్నారనీ, ఇది మరింత ఉద్రిక్తంగా మారి ఫాసిస్టు విధానాలకు దారితీస్తుందనీ అంటున్నారు డా. కత్తి పద్మారావు***

**భా**రతదేశంలో ఈనాడు సంఘ్‌పరివార్ శక్తులు విజృంభిస్తున్నాయి. ఆర్‌ఎస్‌ఎస్ నుండి వచ్చినవారే ప్రభుత్వంలో కీలకమైన పదవుల్లో ఉన్నందువల్ల వీరు సాయుధులై, గోరక్షణ దళాల పేరుతో దళితులపై, ముస్లింలపై దాడులు పెంచారు. పోలీస్‌స్టేషన్లలో కేసులు పెట్టడం లేదు. ఇప్పటివరకు లౌకికవాదాన్ని బోధించిన పత్రికలు ఒక్కసారిగా సంఘ్ పరివార్ చర్యలను సమర్థిస్తున్నాయి. లౌకికవాదానికి కట్టుబడి ఉండ నవసరం లేదు. ఇది హిందూ రాజ్యం, హిందూ మతేతరులంతా హిందువులకు లోబడి బతకాలని వాదిస్తున్నాయి.

అసలు హిందూ మతం ఆవిర్భావం క్రీస్తుశకం 6వ శతాబ్దం వరకు మనకు కనిపించలేదు. క్రీస్తు పూర్వం 50 ఏళ్లకు పైగా అనేక యుగాలను నిర్మించిన దళితులనే వీరు మీరు హిందువులు కాదు కాబట్టి మీకు జీవించే హక్కు లేదంటున్నారు. అసలు హిందూ పదం పారశీకులకు 'స'కారం పలకడం రాక 'హ'గా పలకడం వల్ల వచ్చింది. వారు 'సింధూ'ని హిందూ అని పలికారు. బ్రాహ్మణులు ఈ పదాన్ని మోసుకొచ్చి భారతీయులు హిందువులు అని అందరి మీద రుద్దుతున్నారు. భారతదేశంలో గిరిజనులు, దళితులు, ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు ఎవరూ హిందువు కాదు. ఈశాన్య రాష్ట్రాల్లో హిందూ మతానికి ఒక మత గ్రంథం లేదు. ఒక దేవుడు లేదు. అందరూ దేవుళ్లు ఒకరిని ఒకరు తిట్టుకొంటారు. వారి పేరు మీద హిందువులు తమలో తాము తన్నుకుంటారు, వధించుకుంటారు.

**'హిందూ' పేరుతో దాడులు – అభద్రత**

ఇప్పుడు 'హిందూ' పేరుతో వీరిని ఏకం చేసి దళితుల మీద, ముస్లింల మీద ఉసిగొల్పాలని చూస్తున్నారు. ఇప్పుడున్న ప్రధానమంత్రికి గాని, ఇతర రాజకీయ పదవుల్లో ఉన్నవారికి హిందూ గర్భాలయాల్లోకెళ్లే హక్కు లేదు. జంధ్యధారణ హక్కు లేదు. బ్రాహ్మణవాదం హిందూ శబ్దం పేరుతో చలామణి అవుతోంది. హిందూ మతం ప్రపంచంలో ఎక్కడాలేదు. దేవుళ్లంతా కల్పించబడ్డవాళ్లు. ఆయుధ ధారులు, కక్ష, కార్పణ్యం కలవారు. అటువంటి దేవుళ్లను పూజించే వీరు ఉన్మాదులుగా, దళితులపై, మైనారిటీలపై దాడులు చేస్తున్నారు. ఈ సందర్భంగా ఒక దశాబ్దం భారతదేశానికి ఉప రాష్ట్రపతిగా ఉన్న మహ్మద్ హమీద్ అన్సారీ రాజ్యసభ టివికి ఇచ్చిన ఇంటర్వ్యూలో కరణ్ థాపర్... ముస్లింలలో భయం నెలకొంది, వారు అభద్రతతో ఉన్నట్టు భావిస్తున్నారు. భారత ముస్లింల మనోభావాల గురించి ఇది సరైన అంచనాయేనా లేక అతిశయీ కరించినదా? అని ప్రశ్నించారు. హమీద్ అన్సారీ 'దేశంలోని విభిన్న వర్గాల నుంచి వినవస్తున్న వాటినన్నిటినీ బట్టి చూస్తే నిజమే. అది సరైన అంచనాయే. బెంగుళూర్‌లో కూడా నేను అదే విషయాన్ని వింటున్నాను, దేశంలోని ఇతర ప్రాంతాల నుంచి కూడా విన్నాను. ఉత్తర భారతంలో మరింత ఎక్కువగా విన్నా ఇబ్బందిలో ఉన్న భావన, అభద్రతా భావం మెల్లగా వ్యాపిస్తున్నాయి' అని సమాధానం చెప్పారు.

నిజానికి మైనారిటీలు భారతదేశంలో అభద్రతలో ఉన్నారనే మాట 150 కోట్ల భారతీయుల్లో 100 కోట్ల మందినైనా ఆలోచింప చేసినా తప్పదు. ఎందుకంటే అన్సారీ ఆలోచనాపరుడు, తొందరపడి మాట్లాడే వాడు కాదు, సమన్వయం కల్గిన వ్యక్తి. ఆయన నోటిగుండా ఇటువంటి సమాధానం రావడంతో ఒక్కసారిగా భారతదేశంలో ఉన్న మైనారిటీలు ఆలోచించడం ప్రారంభించారు. అంబేద్కర్ ఒక మేధావిగా అభద్రతను కాకుండా ఆత్మగౌరవాన్ని బోధించాడు. మేధావి అంటే ఎవరు? సత్యమే పలకాలన్న కోరిక ఉన్నవాడే నిజమైన మేధావి. అలాగే ధైర్యం, తార్కిక

---

కోరలు చాస్తోంది. అయితే దక్షిణ కొరియా పాలకవర్గం సామ్రాజ్యవాద పెట్టుబడికి ఊడిగం చేస్తున్నది కాబట్టి ఆ భూభాగంలో అమెరికా సైనిక స్థావరాలను స్థాపించి కొరియా ప్రజల కుత్తుకలపై కత్తిపెట్టి నడిపిస్తున్నది.

ఇటు అటుగా విడిపోయిన కొరియా ప్రజలు ఒక్కటవ్వాలనే ఆకాంక్ష ఆవిరైపోలేదు. శాంతియుత వాతావరణంలో కొరియా ప్రజలు స్నేహపూర్వక సంబంధాలైనా కలిగి ఉండాలనే మనోభిలాష వారిలో దృఢంగా ఉంది. ఇరువైపులా పాలక వర్గాల అధికార కాంక్షలే ఆటంకం. కొరియా ప్రజల ఐక్యతకు, స్నేహజీవనానికి సామ్రాజ్యవాదమే పెద్ద అడ్డంకి. ఈ అడ్డంకి తొలిగితే కొరియన్ ప్రజలకు పండగే! అయితే ఇది జరిగే పనేనా? సామ్రాజ్యవాదాన్ని ప్రపంచ ప్రజలు నలువైపుల నుండి చుట్టుముట్టి ఓడించి అంతమొందించనిదే కొరియా ప్రజలకే కాదు సమస్త జాతులకు మరో ప్రపంచ యుద్ధ ప్రమాదం తొలగిపోదు. ప్రపంచ శాంతి అన్నది సాధ్యంకాదు. అసలు ముందుగా ఇటువంటి అభ్యుదయ శుభ పరిణామం చోటు చేసుకోవాలంటే, ప్రపంచ శ్రామిక ప్రజలు సామ్రాజ్యవాద రొంపి ఆలోచనల నుండి విముక్తులు కావాలి. పెట్టుబడి బంధనాలను తెంచుకోవాలనే స్పృహ, చైతన్యం పెంచుకోవాలి. ప్రపంచ శ్రామికులంతా ఒక తాటిపైకి వచ్చి సామ్రాజ్యవాదాన్ని ఎదురొడ్డిన రోజు సామ్రాజ్యవాదం నశించే క్రమానికి మొదటి రోజవుతుంది. ఇంకా ఆ రోజు రానేలేదు, రాక తప్పదు, వస్తుంది.

*(రచయిత 'శ్రామికనేస్తం' పత్రిక సంపాదకులు)* వీ

శాస్త్రీయ అధ్యయనం, నిర్మాణాత్మకమైన విమర్శ మేధావి గుణాలను సూచిస్తాయి. ప్రతి కార్యాన్ని, ప్రణాళికను, వ్యవస్థను ప్రశ్నించగలిగే హేతుబద్ధత ఉన్నవాడు మేధో సంపన్నుడు. సమాజ విమర్శకుడిగా మేధావి అవతరించి, మానవతా విలువలు, పురోభివృద్ధి, హేతుబద్ధమైన నవ సమాజ నిర్మాణానికి కృషి చేస్తాడు.

భారతదేశంలో ఈ తరహా మేధావుల సంఖ్య తగ్గుతున్న సందర్భంగా అన్సారీ చెందిన ఆందోళనలో ముస్లింలే కాదు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు, హేతువాదులు అందరూ ఆందోళనలోనే ఉన్నారు. ఇటీవల హిందూ మతోన్మాదంతో చెలరేగి పోతున్న ఆర్ఎస్ఎస్, విశ్వహిందూ పరిషత్ వంటి సంస్థలు ఆలోచించే వారిమీద, హేతువాదుల మీద, చరిత్రకారుల మీద దాడులు చేస్తున్న సందర్భంగా అన్సారీ కంటే ముందే అమెరికా, ఇంగ్లాండ్ తదితర దేశాలకు సంబంధించిన మేధావులు ఒక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటనలో వారు భారత దేశంలో ప్రస్తుతం నెలకొని ఉన్న రాజకీయ వాతావరణం, సహన సంప్రదాయాలు, వాక్ స్వాతంత్ర్యం, మత స్వేచ్ఛకు హాని కల్గిస్తుండడంపై తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తూ గత నెల 26న ప్రముఖ భారతీయ చరిత్రకారులు ఒక ప్రకటన జారీ చేశారు. శతాబ్దాలుగా నాగరిక ప్రపంచమంతటా భారతీయ సహన సంప్రదాయాలు ప్రశంసలు పొందుతున్నాయి. ఇప్పుడు వాటికిముప్పు వాటిల్లడంపై చరిత్రకారులు సహజంగానే కలవర పడుతున్నారు. భారత్ వెలుపల అన్ని ఖండాలలోని వివిధ దేశాల విశ్వవిద్యాలయాలలో సమున్నత భారతదేశ చరిత్ర, సమాజం గురించి బోధనా పరిశోధనలు చేస్తున్న మేము భారతీయ చరిత్రకారుల ప్రకటనకు సంఘీభావం వ్యక్తం చేసేందుకు ఈ బహిరంగ లేఖ రాస్తున్నాం అని వారు రాశారు.

**శాస్త్రవేత్తల ఆందోళన**

భారత్‌లో ఇటీవల కొన్ని పరిణామాలు రచయితల, మేధావుల, కళాకారుల స్వేచ్ఛకు, చారిత్రక సామాజిక పరిశోధనలకు, ప్రతికూల పరిస్థితులను సృష్టించడంపై వ్యక్తమవుతోన్న తీవ్ర ఆందోళనలో మేమూ పాలుపంచుకొంటున్నాం. ఆ పరిణామాలు సంకుచితత్వాన్ని, అసహనాన్ని, మత దురహంకారాన్ని దేశంలో సర్వవ్యాప్తం చేస్తున్నాయి. ఈ ప్రకటనలో భారతీయ మేధావులు నారాయణరావు, తేజస్వినీ గంటి, మనుగోస్వామి, అనన్య చక్రవర్తి ఇంకా ఎందరో ఉన్నారు. అంటే అన్సారీ తన పదవిలో ఉన్నప్పుడు చెప్పడానికి అంశాలు వీరు ముందే బయట పెట్టారు. హిందూ మతానికి భిన్నమైన ఏ మతాన్ని, ఏ సిద్ధాంతాన్ని మేము మెజార్టీ ప్రజలు అవ్వడం ద్వారా ఏ మైనారిటీ మతానికి స్వతంత్రత లేదు. అది రాజ్యాంగానికి విరుద్ధమైన అంశం. స్వాతంత్ర్యం వచ్చే కాలంలో భారతదేశంలో ఉండేటటువంటి ముస్లింలు, ముస్లిం హక్కులకు భంగం కలుగకూడదని అజాద్ ముస్లిం కాన్ఫరెన్స్ నిర్ధారించింది. డా. బి.ఆర్. అంబేద్కర్ ముస్లింలు భారతదేశంలో భాగం. వారు బయటివారు కాదు. ఇక్కడ భారతదేశంలో పుట్టి ముస్లిం మతాన్ని స్వీకరించిన వారే. వారిలో జాతీయతకు ఎటువంటి కొదువలేదు. పైగా స్వాతంత్ర్యం కోసం పోరాడిన వారిలో ముస్లింలు ఎంతో ఘనమైన పాత్రను నిర్వహించిన వారు ఉన్నారని చెప్పారు. అంతేకాక ఆయన భౌగోళిక, రాజకీయ సరిహద్దులతో ఒక స్వతంత్ర దేశంగా భారత దేశం ఉంటుంది.

ఈ దేశ వనరులను అనుభవించడానికి భాగస్వాములుగా ప్రజలందరూ, దేశం నలుమూలల్లోని, ముస్లిం ప్రజల హృదయాలు, స్వగృహాలు, వారి జీవితాలకంటే, వారి చారిత్రక ఔన్నత్యం, మతం, సంస్కృతి వారికి ప్రీతి. అయితే జాతీయతా భావ కోణం నుంచి చూస్తే ప్రతి ముస్లిమూ భారతీయుడే. ఉమ్మడి హక్కులు, బాధ్యతల విషయానికి కొస్తే ఇతరులతో వీరు సమానమే. ఈ విధంగా పోలిస్తే, ప్రభుత్వ సర్వీసుల లోనూ, ప్రభుత్వంలోనూ, ఆర్థిక రంగంలో, ఇతర రంగాల్లో ఒక ముస్లిం దేశంలో ఏ ఇతర పౌరుడితో సమానంగా హక్కులు పొందడానికి అర్హుడే. అదే విధంగా దేశ స్వాతంత్ర సాధనకు ఇతరులతో సమానంగా ముస్లింలు కూడా త్యాగాలు చేశారు కూడా. నిజానికి డా. బి.ఆర్.అంబేద్కర్ రాజ్యాంగాన్ని రూపొందించక ముందే మైనారిటీ హక్కుల కోసం ఆయన రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో ఎంతో పోరాడారు. అసలు మైనారిటీలనే భావమే తప్పు. భారతదేశంలో ఉన్న ప్రజలందరికి ఒకే రాజకీయం ఉన్నప్పుడు హక్కులు కూడా సమానంగా ఉండాలని నిర్ధారించారు. ఆ సందర్భంగా అంబేద్కర్ మాట్లాడుతూ శాసనాలను రూపొందించే పద్ధతిలో మన రాజ్యాంగానికి, ఆస్ట్రేలియా రాజ్యాంగానికి చాలా పోలికలున్నాయి. ఆస్ట్రేలియా రాజ్యాంగ చట్టం ప్రకారం ఆయా రాష్ట్రాల విధులు, బాధ్యతలు, హక్కులు, విధానాలు కేంద్ర ప్రభుత్వమే నిర్ణయిస్తుంది.

కేంద్ర ప్రభుత్వంతో ప్రజలు సన్నిహిత సంబంధాలను పెంపొందించే ఉద్దేశ్యంతోనే మన రాజ్యాంగ చట్టంలో కూడ ఇదే పద్ధతి అనుసరించడమైంది. యావద్భారత దేశానికి ఒకే న్యాయశాఖ. ఒకే విధమైన న్యాయసూత్రం, ఒకే ఉద్యోగ విధానం ఉండడం వల్ల ప్రజలందరికీ ఒకే విధమైన పౌరసత్వపు హక్కులు లభిస్తున్నాయి. వివిధ దేశాల రాజ్యాంగ చట్టాల్లోని సూత్రాలు మన రాజ్యాంగ చట్టంలో జేర్చబడ్డవని కొందరు సభ్యులు విమర్శించారు. అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా, స్విట్జర్లాండు, గ్రీస్ దేశాల రాజ్యాంగ చట్టాల్లోని వివిధ అంశాలను, వాటిపై ఆయా దేశాల అనుభవాలను, మార్పులను, చేర్పులను క్షుణ్ణంగా పరిశీలించిన మీదట వాటిలోని మంచినీ స్వీకరించడంలో తప్పులేదని నా అభిప్రాయం.

రాజ్యాంగ చట్ట నిర్మాణంలో శత్రు, మిత్ర భావం పనికిరాదు. రాజ్యాంగ చట్టాన్ని దేశ ప్రజలంతా విధిగా గౌరవించి అనుసరించాలని అన్నారు. నిజానికి హిందువుల అభద్రతలో నుండి హిందూ మహాసభ పుట్టింది. ముస్లింల అభద్రతలో నుండి ముస్లింలీగ్ పుట్టింది. అభద్రత నుండే ఉగ్రవాద ఉన్మాద చర్యలు పుడతాయి. మానవులను జ్ఞానం నుండి, హేతు భావనల నుండి సాంకేతిక ప్రగతి నుండి ఐక్యం చేయాల్సింది పోయి మత భావన నుండి అభద్రతను కలిగించే మాటలు చేతలు హిందూ మతోన్మాదులు చేస్తున్నారు. ముస్లింలు భారతదేశంలో ఎన్నో కళా ఖండాలు సృష్టించారు. అరబ్ భాషలోని అనంత జ్ఞానాన్ని తీసుకొచ్చారు.

**హేతువాదులు పెరుగుతున్నారు**

ముస్లిం రాజులు అక్బర్ వంటి వాళ్లు శాంతి సామరస్యాలను భారత దేశంలో పాదుకొల్పారు. తాజ్‌మహల్, ఎర్రకోట ఇంకా ఎన్నో కళాత్మకతతో కూడిన చిరస్మరణీయ కట్టడాలు నిర్మించారు. ముస్లింలు

చూపించే అనేక ఆహార పదార్థాలు భారతీయులందరికి పుష్టిని, రుచిని చేకూర్చుతున్నాయి. ముస్లింల్లో పుట్టి సంగీత విద్యాంసులు భారత రత్నను పొందారు. ముస్లిం అనేది ఒక మతం కాదు. ఒక సంస్కృతిగా విస్తరిస్తుంది అనే ఆధునిక భావాలు విస్తరిస్తున్నాయి. అలాగే క్రైస్తవంలోని మానవత, విద్య, సేవ ద్వారా అవి విస్తరిస్తున్నాయి. సిక్కు మతం నుండి ఎందరో రాజకీయ ఉద్దండులు మనకు ఆవిర్భవించారు. భారతదేశంలో పుట్టిన ప్రతి ఒక్కరు అనేక సంస్కృత సమ్మేళనాల ద్వారా నూత్న రూపాన్ని ఆవిష్కరించారు. ఈ సామాజిక, రాజకీయ సత్యాన్ని మరచిపోయి, ఎవరి ధర్మాన్ని వారు ఇతరులకు హాని జరగకుండా బోధించుకోవడం ప్రజాస్వామ్యం అవుతుంది.

ఈ మతాలన్నిటి కంటే శాస్త్రజ్ఞానం పెంపొందే కొలది హేతువాదులు, నాస్తికులు పెరుగుతున్నారు. హేతువాదుల సంఖ్య దేశవ్యాప్తంగా ఈనాడు శాస్త్ర జ్ఞానాన్ని జీవితానికి సమన్వయించుకొని పెరుగుతుంది. ఉపాధి కోసమే శాస్త్రాన్ని అధ్యయనం చేయడం కంటే, భౌతిక ప్రపంచాన్ని దాని నియమాల నుండి అధ్యయనం చేయడం ద్వారా మనిషి కులమత భేదాలు లేకుండా అందరిని సమానంగా ప్రేమించ గలుగుతారనే అవగాహన పెరుగుతోంది. వీటన్నింటికి తోడు అసంఖ్యాకులైన భారతీయ శ్రామికులు కారల్‌మార్క్స్ భావజాలంతో సంఘటిత స్వరం వినిపిస్తున్నారు. కేవలం మేధావులేకాదు. లేక తమ మేధస్సును రాజకీయ పెట్టుబడిదారీ వర్గాలు అమ్ముకొని బతికే వారి సూత్రాలు కాదు. ఇప్పుడు కావలసింది. అన్ని మతాలకు అతీతంగా మాట ఆలకించండి అని అన్ని కులాల్లో ఉన్న శ్రామికులు తమపై జరుగుతున్న ఆర్థిక అణచివేతను ఎదిరిస్తూ శాస్త్రీయంగా వాస్తవంగా స్వేచ్ఛగా మాట్లాడుతున్నారు.

భారతదేశంలో విశ్వవిద్యాలయాల్లో హిందూ మతోన్మాద భావాలున్న వారు ఒక పక్షం ఉంటే తాత్విక భావజాలం ఉన్నవారు మరో పక్క ఉన్నారు. వారందరి మీద మహా తత్వవేత్తలైన సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్, అగస్టయిన్, ఆక్వినాస్, డెకార్టె, స్పినోజ, లాక్, బర్క్‌లీ, కాంట్, రాయిస్, జేమ్స్ లాంటి వాళ్లందరూ వృద్ధి చేసిన శాఖలు, వివిధ సిద్ధాంతాలు కూడా తత్వశాస్త్రమే అవుతాయి. ఈ మహానీయులూ, వాళ్ల ఆలోచనాధారలు లేనట్లయితే తత్వశాస్త్రం ఇవాళ ఉన్నంత సంపద్వంతంగా ఉండేది కాదు. మనకి ఈ విషయం ఎరుకలో లేకపోయినా సమాజపు సంప్రదాయంలో మనకి వారసత్వంగా అంది వచ్చిన భావాలు ఎన్నో నిరంతరం మనల్ని ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. మతాన్ని రెచ్చగొట్టడం ద్వారా వచ్చే రాజకీయాలు గాలికి కొట్టుకుపోక తప్పదు. అవి అబద్దాల పునాదుల మీద కట్టబడతాయి. ఇంత మంది మతవాదులు జాతీయ వాదులుండగా అంబేద్కరే ఎందుకు రాజ్యాంగ రచన చేయగలిగాడు. హిందువులు అంబేద్కర్‌ను ద్వేషించినంత మరే మేధావిని ద్వేషించలేదు. కాని ఈనాడు ఆయన చూపుడువేలు మార్గంలోనే భారతదేశం నడుస్తుంది. అన్సారీ గారు మేధావుల గురించి పొందిన ఆవేదనను భారత రాజ్యాంగ స్ఫూర్తి గలిగిన ప్రజలు తప్పక అధిగమిస్తారు. ఇందుకు రాజ్యాంగమే మనకు ఆదర్శం. 1948 నవంబర్ 4వ తేదీన రాజ్యాంగ సభలో అంబేద్కర్ చేసిన ప్రసంగంలో అన్నమాటలే మనకు ఆత్మస్థైర్యాన్నిస్తాయి. మన రాజ్యాంగం ఆచరణ సాధ్యమైంది. మన రాజ్యాంగం చాలా సున్నితమైనదిగా కనిపించినా అవసరాన్నిబట్టి అది దుర్భేద్యంగా గూడ తయారు కాగలదు. యుద్ధకాలంలోను శాంతికాలంలోను మన రాజ్యాంగం మొక్కవోనిదై నిలిచి పాలిస్తుంది. ఈ నూతన రాజ్యాంగచట్టం అమల్లోకొచ్చిన తరువాత ఏదైన విషమ పరిణామాలు వాటిల్లినట్లైతే దానికి మానవ లోపమే గాని రాజ్యాంగం లోపం కారణంగాజాలదని గట్టిగా జెప్పగలను. నిజానికి భారత పౌరులెవ్వరూ అభద్రతలో నుండవలసిన అవసరం లేదు. అనేక సందర్భాల్లో రాజ్యాంగాన్ని కుదిపే అంశాలు భారతదేశంలో వస్తాయి. అయితే భారతదేశంలోని లౌకిక ప్రజాస్వామ్య వాదులు అప్రమత్తంగా ఉండాల్సిన అవసరం వస్తుంది. తమ పెదవులతో మాట్లాడడమే కాకుండా తమ మేధస్సుతో అనేక వైరుధ్యాలని సమన్వయం చేసుకోవాల్సి ఉంది. చిన్న చిన్న వైరుధ్యాలతో చిన్నాభిన్నమై పోతున్న వారంతా మనకు ఎదురొస్తున్న పెను ముప్పును ఆత్మస్థైర్యంతో ఎదుర్కొనాల్సిన అవసరం ఉంది.

**భారతదేశానికి పెనుముప్పు**

భారతదేశానికి ఇప్పుడు వచ్చిన పెనుముప్పు సామాన్యమైంది కాదు. అది భారతీయుల స్వేచ్ఛమీద, జీవన వ్యవస్థల మీద రాజ్యదండాన్ని అడ్డం పెట్టుకొని ఒక మతం పెత్తనంతో అణచివేయాలని చూడడమే కాక భారత రాజ్యాంగ స్ఫూర్తికి భిన్నమైన చర్యలకు పూనుకోవడం వాటికి అశాస్త్రీయమైన భాష్యాలు తాము కొనుకున్న మేధావుల చేత చెప్పించడం జరుగుతూ ఉంది. బ్రాహ్మణులు అన్ని సందర్భాల్లో అక్షరాలు అవకాశవాదానికి అనుకూలంగా ఉపయోగించడానికి సమకూర్చుకొని ఉంటారు. వారికి 'హిందూ' రాజ్యం ఇష్టం. ఎందుకంటే ఆ రాజ్యాన్ని వారే సృష్టించారు. హిందూ రాజ్యానికి పునాది లేదు. హిందువుల సంఖ్య గణనీయంగా తగ్గిపోతుంది. అందుకేవారు ఆందోళన చెందుతున్నారు. హిందువులకు సౌభ్రాతృత్వం లేదు. కొన్ని కుటుంబాల్లో మనిషి చస్తే ఎత్తుకెళ్లేవాళ్లు లేరు. ప్రపంచవ్యాప్తంగా బౌద్ధం పెరుగుతోంది. బౌద్ధం మళ్లీ భారతదేశంలో పునరుజ్జీవం అవుతుంది. క్రింద జాతుల్లో సంయమనం ఉంది. వారిని కూడా రెచ్చగొట్టి ఉద్రేకపరచాలని చూస్తున్నారు. హిందువుల్లో ఉన్న ఉద్రేకం బౌద్ధుల్లో ఎప్పటికీ రాదు. హింస వల్ల మనం ఏమీ సాధించలేమని అంబేద్కర్ చెప్పాడు. దళితుల్లో విద్య, జ్ఞానం సంయమనం ఉన్నాయి. దళితులు ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మిస్తున్నారు. హిందూ దేవుళ్లంతా హంతకులు అని దళితులకు తెలుసు. అందుకే దళితులు హిందూ మతం నుండి బయటకు వచ్చి అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరిస్తున్నారు.

ఈ సందర్భంగా ప్రతిపక్ష విపక్ష మిత్రపక్షాల్లో ఉన్న రాజకీయవేత్తలే కాక, సామాజిక సాంస్కృతిక వైజ్ఞానిక రంగంలో పనిచేస్తున్న వారిని కూడా కలుపుకొని వెళ్లవలసిన చారిత్రక బాధ్యత అందరి మీద వుంది. మైనారిటీలు ఐక్యమైనప్పుడు మెజార్టీ అవుతారు. మెజార్టీగా ఉన్నవారు ఎప్పుడూ శాస్త్రీయంగా మైనారిటీలే. భారతదేశ రాజ్యాంగ సూత్రమే ఇది. ఎప్పటికైనా హేతువాదానిదే విజయం. మైనారిటీలు కూడా మతం మత్తును వదిలి హేతువాదంలోకి రావాలి. చార్వాక దర్శమే మొదటి భారతీయ దర్శనం. అదే భారతీయులకు విముక్తి దర్శనం. ఈ దిశగా భారతదేశ పునరుజ్జీవనోద్యమానికి నడుం కడదాం...

*(రచయిత సామాజికత తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

# డెబ్బై ఏళ్ల బూటకపు స్వాతంత్ర్యం-2

***భారతదేశంలో బ్రిటిష్ ప్రత్యక్ష పాలన ముగిసిపోయి ఈ ఆగస్ట్ 15కు డెబ్బై ఏళ్లు అయిన సందర్భంగా ఏడు దశాబ్దాల వలసానంతర భారతదేశాన్ని ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తున్నారు ఎడ్ల పోచయ్య***

*(గత సంచిక తరువాయి)*

**సమానత్వం**

బ్రిటిష్ ఇండియా లోనూ, స్వదేశీ సంస్థానాల లోనూ దాదాపు పద్దెనిమిదో శతాబ్ది తొలిరోజుల నుంచే ఎన్నో ప్రజా ఉద్యమాలు చెలరేగాయి. అవి స్థానికంగా భూస్వాములకు, పెత్తందార్లకు, షావుకార్లకు, అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వ అటవీ, రెవెన్యూ, పోలీసు ఉద్యోగులకు వ్యతిరేకంగా సాగినవి. అటు ప్రత్యక్షంగా వలసవాద దోపిడీని వ్యతిరేకించినవైనా, లేదా ఇటు స్థానిక పెత్తందార్లు వలసవాద ప్రభుత్వపు మద్దతుతో గాని, సొంతంగా గాని సాగించిన పీడనను వ్యతిరేకించినవైనా ఆ ప్రజా ఉద్యమాలన్నీ సారాంశంలో అసమానతకు వ్యతిరేకంగా సాగినవేననవచ్చు. అంటే కనీసం నమోదైన చరిత్రకు తెలిసి, మూడు వందల సంవత్సరాలుగా భారత ప్రజానీకంలో అసమానతకు వ్యతిరేకమైన ఉద్యమాలు, ఆలోచనలు ఉన్నాయి. మిగిలిన సమాజాలకన్న ప్రత్యేకంగా భారత సమాజంలో దారుణమైన అసమానతలు కుల వ్యవస్థ రూపంలో కేంద్రీకృతమై ఉండడం, విపరీతమైన అస్పృశ్యత, వివక్ష కొనసాగు తుండడం వల్ల అంతకు ముందు కొన్ని శతాబ్దాల నుంచే కుల వివక్షా వ్యతిరేక ఆలోచనలు, ఆచరణలు కూడ వెలువడ్డాయి.

పెట్టుబడిదారీ విధానం ఒక సమాజంలో ప్రవేశించినప్పుడు సహజంగా ఆ సమాజంలోని సాంఘిక అసమానతలను రద్దు చేయడమో, తగ్గించడమో చేసి, ఆర్థిక అసమానతకు, దోపిడీకి మార్గం సుగమం చేసుకుంటుంది. కాని భారత సమాజంలో పెట్టుబడిదారీ విధానం ప్రవేశించడమే వలసవాద, సామ్రాజ్యవాద దశలో, తన భూస్వామ్య వ్యతిరేకతను వదులుకుని, అభివృద్ధి నిరోధక భూస్వామ్యంతో మిలాఖత్తు పెట్టుకున్నందువల్ల గనుక అది ఇక్కడి పాత అసమానతలను కొనసాగనిచ్చింది, పెంచి పోషించింది, వాటిని కూడ తన పాలనా ప్రయోజనాలకు వాడుకుంది.

అందువల్ల బ్రిటిష్ వలసవాద వ్యతిరేక ఉద్యమం సహజంగానే సమానత్వ ఆకాంక్షలను కూడ ప్రకటించవలసి వచ్చింది. దేశంలోని ప్రజలలో ఏ అసమానతలనూ లెక్కించని ఐక్యతను, స్వాతంత్ర్యోద్యమంలో సమాన భాగస్వామ్యాన్ని అది కోరుకుంది. అందువల్లనే రాజ్యాంగ నిర్ణయ సభ కూడ రాజ్యాంగ ప్రవేశిక లోనే "హోదాలోనూ, అవకాశాలలోనూ సమానత్వం" సాధించడం తన లక్ష్యంగా రాసింది. అస్పృశ్యతను రద్దు చేస్తానని రాసింది. అసమానతకు తావు లేని విధంగా ఆర్థిక అవకాశాల కల్పన జరుగుతుందని ఆదేశిక సూత్రాలలో రాసింది. కాని అధికారమార్పిడి జరిగి డెబ్బై ఏళ్లు గడిచినా, రాజ్యాంగం అమలులోకి వచ్చి అరవై ఏడు ఏళ్లు గడిచినా భారత సమాజ లక్ష్యమైన సమానత్వం దిశగా కనీసమైన అడుగులు కూడ పడలేదు. కుల అసమానత, స్త్రీపురుష అసమానత, మతాల మధ్య అసమానత, భాషల మధ్య అసమానత, ప్రాంతాల మధ్య అసమానత, ఆర్థిక అసమానతలు 1947లో ఉన్న స్థితి కన్న ఇంకా ఎక్కువ దారుణమైన స్థితికి దిగజారాయి. అవి హింసాత్మక ఘర్షణలుగా కూడ మారుతూ ఉన్నాయి. ఈ డెబ్బై ఏళ్లలో అసమానతలను తొలగించడానికి, తగ్గించడానికి పాలకవర్గాలు చిన్నమెత్తు ప్రయత్నం కూడ చేయలేదు సరిగదా, అనుసరించిన రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక విధానాలన్నీ కూడ అసమానతలను పెంచి పోషించడానికే ఉపయోగపడ్డాయి. అందువల్ల సమానత్వం అనే ఒకే ఒక్క ప్రాతిపదికపై చూసినా 1947 ఆగస్ట్ 15 భారత సమాజంలో ఏ మార్పూ తేలేదని రుజువవుతుంది.

**ప్రజాస్వామ్యం**

సమానత్వ ఆకాంక్ష అనివార్యంగా ప్రజాస్వామ్య ఆకాంక్షగా మారుతుంది. ప్రతి మనిషీ సమానమే, ఒకరు ఎక్కువా కాదు, ఒకరు తక్కువా కాదు, సామాజిక చలనంలోని ప్రతి నిర్ణయంలో సమాజంలోని ప్రతి ఒక్కరికీ సమాన భాగస్వామ్యం ఉండాలి, ఏ ఒక్కరూ మరొకరి పట్ల ఆధికృతను గాని, న్యూనతను గాని ప్రదర్శించగూడదు వంటి సూత్రాలు ప్రజాస్వామ్య స్వభావానికి భూమికలు. అటువంటి సమాజంలో పాలనా అవసరాల కోసం అశేష ప్రజానీకం కొద్ది మందిని ప్రతినిధులుగా ఎంచుకొని, వారికి బాధ్యతలు అప్పగించడం ప్రజాస్వామ్యం అమలు కావడానికి ఒక రూపం. దాన్ని సాధారణ పరిభాషలో ప్రాతినిధ్య పాలన, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటారు. సమాజంలో ప్రజాస్వామిక సంస్కృతి నెలకొనకుండా, ప్రతి మనిషీ వ్యక్తిగా ఎదగకుండా కేవలం పాలనా విధానంలో ప్రాతినిధ్య పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టడం నిజంగా సారాంశంలో ప్రజాస్వామ్యం కాజాలదు. సమానత్వం రాకుండా అందరు మనుషులూ సమానమేనని, ప్రతి మనిషీ తన వంతు పాలనా భాగస్వామ్యంగా తన ప్రతినిధిని ఎన్నుకోవచ్చునని, ఒకరి వోటు ఎక్కువా కాదు, మరొకరి వోటు తక్కువా కాదు అనే విలువలు నెలకొనాలంటే ముందుగా మనుషులు సమానమేననే అవగాహన రావాలి.

భారత దేశంలో అసమానతలు పోకుండానే, తగ్గకుండానే, కులాల, మతాల, ప్రాంతాల, భాషల సమూహాలలో ఒకరుగా ఉండిన మనిషి సర్వ స్వతంత్రమైన వ్యక్తిగా ఎదగకుండానే ఇక్కడ పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అంటుకట్టడం జరిగింది. ఐదు సంవత్సరాలకు ఒకసారి క్రమం తప్పకుండా ఎన్నికలు జరగడమే, మిగిలిన ప్రత్యర్థుల కన్న ఒక్క వోటైనా ఎక్కువ తెచ్చుకోవడమే ప్రతినిధిగా ఎన్నిక కావడానికి చిహ్నంగా మారింది. అలా వోట్లు తెచ్చుకోవడానికి కులం, మతం,

ప్రాంతం, డబ్బు, మద్యం, బెదిరింపు వంటి అన్ని మార్గాలనూ వాడడం మొదలయింది. ప్రజాస్వామిక ఎన్నికలను నిర్దేశించే చట్టాలు కూడ నిత్యం ఉల్లంఘనకు గురవుతున్నా, పార్లమెంటరీ విధానం మెద ప్రజల్లో భ్రమలు, ఆశలు నింపి, అవే ఈ సమాజ పురోగమనానికి సూచికలన్నట్టుగా ప్రచారం చేస్తూ పాలకవర్గాలు ఏడు దశాబ్దాలు గడిపాయి.

ప్రజాస్వామ్యానికి ఇంతగా కుదించిన, నీరుగార్చిన నిర్వచనం ఇవ్వగూడదని గాని, ప్రజాస్వామ్యం అంటే ఇది మాత్రమే కాదని గాని ప్రశ్నలు కూడ లేవనెత్తడానికి వీలు లేని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనబడే నియంతృత్వ పాలన ఏడు దశాబ్దాలుగా సాగుతున్నది. తీవ్రంగా విభేదించుకున్నట్టు, విమర్శించుకుంటున్నట్టు పైకి కనబడే పార్లమెంటరీ పార్టీలన్నిటికి కూడ ఈ సంకుచిత నిర్వచనంతో ఏకీభావమే ఉంది. ఈ చట్రం లోపలనే ఏదో ఒక రకంగా ఎన్నికల్లో గెలిచి అధికారం చలాయించి, తమ ఆర్థిక రాజకీయ ప్రయోజనాలు చేకూర్చుకోవడమే, ఆశ్రితుల ప్రయోజనాలు నెరవేర్చడమే ప్రజాస్వామ్యమని అన్ని పార్టీలూ భావిస్తున్నాయి. బహిరంగంగా ప్రాథమిక హక్కులను, ప్రజాస్వామ్యాన్ని కాలరాచిన ఎమర్జెన్సీ మాత్రమే కాక, ఈ డెబ్బై ఏళ్లలో నిజంగా ప్రజలకు, ప్రజా శక్తులకు, ప్రత్యామ్నాయ శక్తులకు ప్రజాస్వామ్యం ఎన్నడూ అమలు కాలేదు. రాజ్యాంగ ప్రవేశికలో భారత గణతంత్ర రాజ్యానికి విశేషణంగా చెప్పిన "ప్రజాస్వామ్యం" డెబ్బై ఏళ్లలో ఘోరాతిఘోరంగా విఫలమయింది, అపహాస్యమయింది. భారత ప్రజానీకపు ఆకాంక్షలను తీర్చే శక్తి ఈ సంకుచిత నిర్వచనపు ప్రజాస్వామ్యానికి, ప్రజాస్వామ్యం పేరు మీద ఊరేగుతున్న పాలకవర్గ నియంతృత్వానికి లేదని తేటతెల్లమయింది.

**లౌకికత్వం**

రాజ్యాంగ నిర్మాతలు భారతదేశాన్ని "సర్వసత్తాక, ప్రజాస్వామిక గణతంత్రం"గా అభివర్ణించారు. రాజ్యాంగానికి 42వ సవరణ ద్వారా 1976లో ఈ మాటను విస్తరించి "సర్వసత్తాక, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామిక గణతంత్రం"గా మార్చారు. నిజానికి సామ్యవాదం, లౌకికత్వం అనే మాటలు ఆలస్యంగా రాజ్యాంగంలోకి ప్రవేశించాయేమో గాని, స్వాతంత్ర్యోద్యమం పొడవునా ఆ మాటల సారాంశం ప్రతిఫలిస్తూనే ఉండింది. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో కనబడిన హిందూ, ముస్లిం ఐక్యతను చూసిన బ్రిటిష్ పాలకులు ఉద్దేశపూర్వకంగా, కుట్రపూరితంగా హిందూ, ముస్లిం సమూహాల మధ్య విభేదాలు రగిలించారు.

దేశంలోని అప్పటికే ఈ రెండు పెద్ద మత సమూహాల మధ్య కొనసాగుతున్న ఐక్యతను బ్రిటిష్ వ్యతిరేక స్వాతంత్ర్యోద్యమంలో భాగం చేయడం తప్పదని నాయకత్వంలో కొందరైనా ఆలోచించారు. స్వాతంత్ర్యోద్యమంలో భిన్న ఆలోచనలు, దృక్పథాలు ఉనికిలో ఉన్నాయి గనుక హిందూ, ముస్లిం మతవాదులు కూడ తమ భావాల ప్రాచుర్యం కోసం ప్రయత్నించారు. అయినా అత్యధిక ఉద్యమకారుల అవగాహన రెండు మతాల మధ్య సహజీవనమే, సామరస్యమే. దాన్నే వాళ్లు లౌకికత్వంగా నిర్వచించుకున్నారు. ఈ నిర్వచనంలో కొంత అమాయకత్వం, కొంత తగ్గించి చూసిన ధోరణి ఉంది గాని అది అంత ప్రమాదకరమైనది కాదు.

నిజానికి లౌకికత్వం అనేది యూరప్‌లో రాచరికానికి వ్యతిరేకంగా సాగిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల కాలంలో అప్పుడే లేచినిలుస్తున్న ప్రగతిశీల పెట్టుబడిదారీ విధానం రాచరికంతో అంటకాగుతున్న మతాన్ని కూడ విమర్శించింది. రాచరికం రద్దయిన తర్వాత ఏర్పడబోయే ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో రాజ్య వ్యవహారాలకూ మతానికీ సంబంధం ఎంతమాత్రం ఉండగూడదని, మతం వ్యక్తిగత స్థాయికి మాత్రమే పరిమితం కావాలని భావించింది. రాజ్యపాలన మతరహితంగా, లౌకికంగా మాత్రమే ఉండాలని, లోకాతీతమైన శక్తుల ప్రమేయం ఉండగూడదని భావించింది. అలా వచ్చింది లౌకికత్వం.

విభిన్నమతాలు ఉన్న సమాజాలలో కూడ పాలన లౌకిక భావనను పాటిస్తే పాలకుల మత విశ్వాసాలూ, అధిక సంఖ్యాకుల మత విశ్వాసాలూ అనుచిత ప్రాధాన్యత పొందకుండా ఉంటాయనే ఉద్దేశంతో భారత సమాజంలో కూడ లౌకిక భావనను ప్రవేశపెట్టారు. అయితే వలసానంతర తొలితరం పాలకులలోనే ప్రచ్ఛన్నంగా మతతత్వం ఉంది గనుక లౌకిక భావనకు యూరపియన్ నిర్వచనాన్ని పక్కన పెట్టి, సర్వభావ సమభావ, అన్ని మతాలకూ సమాన దూరం వంటి అర్థం లేని, ప్రమాదకరమైన నిర్వచనాలు ఇచ్చారు. అందువల్ల చెప్పకుండానే రాజ్యం అధికసంఖ్యాకుల మత విశ్వాసాలను పాటించేదిగా మారిపోయింది. ఎక్కడన్నా వీలయితే, తప్పదనుకుంటే, ఒత్తిడి ఉంటే, ప్రదర్శన కోసం అల్పసంఖ్యాకుల మత విశ్వాసాలను నామమాత్రంగా పాటించడం కూడ మొదలయింది. ఆ నామమాత్రపు ఆచరణను కూడ బుజ్జగించడం, ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం అని అధిక సంఖ్యాక మతవాదులు విమర్శించడం మొదలయింది. అందువల్ల స్వాతంత్ర్యోద్యమంలోనే పుట్టినా, నలభై సంవత్సరాల కింద రాజ్యాంగంలో చేరినా భారత సమాజంలో లౌకికత్వానికి కనీస పునాది కూడ ఏర్పడలేదు.

బహు మతాల సమ్మేళనమైన భారత సమాజం పాలనలో మత రహిత లౌకికత్వాన్ని పాటించకపోతే ఎంత ప్రమాదకర, విస్ఫోటకర పరిణామాలు సంభవిస్తాయో, అవి ఎంత హింసాత్మకంగా ఊచకోతలకు దారితీస్తాయో డెబ్బై ఏళ్ల భారత చరిత్ర అడుగడుగునా చూపుతున్నది. సరిగ్గా బ్రిటిష్ పాలనలో హిందూ ముస్లిం వైరాన్ని రెచ్చగొట్టి, విభజించి పాలించాలని వలసవాద పాలకవర్గాలు భావించాయో, ఈ ఏడు దశాబ్దాలలో కూడ అదే చరిత్ర మరింత విషాదకరంగా పునరావృత మవుతున్నది.

**జాతుల సమస్య**

భారతదేశం నిజంగా స్వాతంత్ర్యం సాధించలేదనడానికి మరొక ప్రధానమైన సూచిక దేశంలో కొనసాగుతున్న, వేరువేరు రూపాలలో వ్యక్తమవుతున్న జాతుల సమస్య. భారత ఉపఖండం ఒక దేశం కాదని, చప్పన్నారు విభిన్న జాతుల సమాఖ్య అని 1947 దాకా కూడ తరతమ భేదాలతో అన్ని రాజకీయ పార్టీలు భావించేవి. దాదాపు అన్ని రాజకీయ పార్టీలను, నాయకులను యూరప్‌లో జాతి రాజ్యాలు ఏర్పడిన చరిత్ర ప్రభావితం చేసింది. జార్ పాలనలో జాతుల బందిఖానాగా ఉండిన రష్యాలో బోల్షివిక్కులు విజయం సాధించి, జాతులకు విడిపోయే హక్కుతో సహా స్వయంనిర్ణయాధికార హక్కు ఇచ్చి, స్వచ్ఛందంగా జాతులు ఐక్యమై జాతుల ఉద్యానవనంగా యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ ఏర్పడడం భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్న అన్ని పార్టీలను ప్రభావితం చేసింది.

భారత ఉపఖండంలో కూడ అలా జాతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు హామీ ఇచ్చే ఒక సమాఖ్య ఏర్పడుతుందని, ఏర్పడాలని భావించారు. అన్ని ప్రధాన పార్టీల నాయకులు అందుకు సానుకూలమైన ప్రకటనలే

చేశారు. కాని అధికారమార్పిడి జరిగిననాటి నుంచీ భారతదేశం జారిస్టు రష్యా కన్న భయంకరమైన జాతుల బందిఖానాగా మారిపోయింది. బ్రిటిష్ భారతదేశంలో భాగం కాని ప్రాంతాలు, స్వతంత్ర ప్రతిపత్తికోసం బ్రిటిష్ ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకున్న ప్రాంతాలు అన్నిటినీ భారత పాలకవర్గాలు తమ హక్కుభుక్తంగా భావించాయి. ఆయా ప్రాంతాలను విలీనం చేసుకున్నప్పుడు ఇచ్చిన హామీలను కూడ పాలకవర్గాలు తుంగలో తొక్కాయి. సమాఖ్య పాలన సాగిస్తామనే వాగ్దానాన్ని పక్కనపెట్టి కేంద్రీకృత నిరంకుశ పాలన సాగించడం ప్రారంభించాయి. రాజ్యాంగంలోని రాష్ట్రాల జాబితా ఇచ్చిన అధికారాలను కూడ రాష్ట్ర ప్రభుత్వాలు కైవసం చేసుకోలేకపోయాయి. రాష్ట్రపతి పాలన పేరిట కేంద్ర ప్రభుత్వ పాలనకు రాజ్యాంగం ఇచ్చిన అవకాశాన్ని కేంద్ర పాలకులు నిర్లజ్జగా, విచ్చలవిడిగా వాడుకున్నారు. ఈ దాడులను, దురాక్రమణలను, విలీనాలను స్థానిక ప్రజలు, స్థానిక రాజకీయ పక్షాలు నిరసించి పోరాటాలకు దిగాయి. తొలిదశకంలో నాగా, మిజోల పోరాటాల నుంచి, ఇప్పటిదాకా సాగుతున్న కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల పోరాటాల దాకా అక్కడి ప్రజా ఆకాంక్షలలో వ్యక్తమవుతున్నది జాతుల స్వయంనిర్ణయాధికార తపనే. అంత పెద్ద ఎత్తున జాతుల స్వయం నిర్ణయాధికారం దాకా కాకపోయినా, రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర రాష్ట్ర సంబంధాలలోని అసమానత మీద అసంతృప్తి వ్యక్తం చేయడం, కొత్త రాష్ట్రాలు కావాలని కోరడం, రాష్ట్రాల ఆర్థిక వనరులు పెంచాలని కోరడం వంటి ఎన్నో వ్యక్తీకరణలు కూడ ఈ దేశంలో జాతుల సమస్య వ్యక్తీకరణలే. విభిన్న రాష్ట్రాల సమాఖ్య అనే పేరుతో సాగినప్పటికీ ఇది జాతుల సమాఖ్యగా ఉంటుందని ఆయా జాతులు పెట్టుకున్న ఆశ వమ్ము అయిపోవడంతో 1947 ఆగస్ట్ 15 ఆయా జాతులకు ఏ ప్రయోజనమూ చేకూర్చలేదని, అంతకుముందు విశాల అఖిల భారత మార్కెట్ బ్రిటిష్ వలసవాదుల, వారి దళారీల అందుబాటులో ఉన్నట్టుగానే, ఈ డెబ్బై ఏళ్లలో కూడ సామ్రాజ్యవాదులకు, వారి దళారీలకు, విభిన్న జాతులలోని భూస్వామ్య వర్గాలకు అంతే మార్కెట్ ను, బహుశా అంతకన్న ఎక్కువ మార్కెట్ ను కూడ కట్టబెట్టడానికి ప్రయత్నాలు జరుగుతూ వచ్చాయి.

**విదేశీ సంబంధాలు**

మూడు వందల విదేశీ దాస్యం నుంచి దేశం నిజంగా బైటపడి ఉంటే, 1947 ఆగస్ట్ 15 తర్వాత ఏర్పడిన భారత ప్రభుత్వం విదేశీ వ్యవహారాల్లో తీసుకున్న వైఖరి అందులో వ్యక్తమై ఉండేది. పరాయి ప్రభుత్వాలతో, అందునా పాత వలసవాద ప్రభుత్వాలతో, కొత్త వలసవాదాన్ని అమలు చేయడానికి అవకాశం ఉన్న పారిశ్రామిక, వ్యాపార గుత్తాధిపత్యపు దేశాలతో ఎటువంటి జాగ్రత్త పూర్వకమైన సంబంధాలు నిర్వహించాలో భారత ప్రభుత్వం అవగాహనలో ఉండేది. ప్రస్తుత ప్రపంచంలో ఏ దేశమైనా ఇతర దేశాలన్నిటికీ తలుపులు మూసుకుని ఉండడం సాధ్యం కాకపోవచ్చు. కాని నిజానికి భారతదేశంలో ఉన్న సహజ వనరులు మరే దేశం మీద ఆధారపడకుండా మనుగడ సాగించగలిగిన స్థితిలో ఉన్నాయి. అటు పారిశ్రామిక, వ్యాపార, సామ్రాజ్యవాద దేశాలకే సువిశాల భారత మార్కెట్ అవసరం గనుక వాళ్లే భారత ప్రభుత్వం దగ్గరికి కాళ్ల బేరానికి రావలసి ఉంటుంది. కాని 1947 ఆగస్ట్ 15న వచ్చినది స్వాతంత్ర్యం కాదు గనుక, పాత పాలకవర్గాలే కొత్త ముసుగు వేసుకుని గద్దెనెక్కాయి గనుక భారత దేశానికి విదేశాలతో సంబంధాలు యథాతథంగా సాగాయి. ఎవరికి వ్యతిరేకంగా సుదీర్ఘకాలం పాటు భారత ప్రజలు వీరోచితమైన పోరాటాలు, అసమాన త్యాగాలు చేశారో ఆ బ్రిటిష్ కామన్ వెల్త్ లో భారత ప్రభుత్వం తక్షణమే భాగస్తురాలయింది. వలసానంతరం తమ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు నెరవేర్చుకోవడానికి సామ్రాజ్యవాదులు ఏర్పాటు చేసిన ప్రపంచ బ్యాంకు రుణాలు తీసుకోవడం రెండు సంవత్సరాలలోపే మొదలుపెట్టింది. అయితే 1950 దశకంలో అంతర్జాతీయంగా ప్రచ్ఛన్న యుద్ధం సాగుతుండడం, అమెరికా, సోవియట్ యూనియన్ రెండు అగ్రరాజ్యాల మధ్య పోటీ సాగుతుండడం, అప్పటి ప్రధాని నెహ్రూ కు సోషలిస్టు ముసుగు ఉండడం వల్ల తొలిరోజుల్లో సోవియట్ యూనియన్ వైపు మొగ్గు కనబడింది. అది చూసి అమెరికా భారత పాలకులను బుజ్జగించడం మొదలుపెట్టడంతో భారత పాలకులు అమెరికావైపు మొగ్గారు. ఇందిరా గాంధీ వచ్చేటప్పటికి రెండు అగ్రరాజ్యాలకూ సమానదూరం అనే అలీనోద్యమం ప్రారంభమయింది. ఇది రెండు అగ్రరాజ్యాలకూ సమానదూరంలో, దేశ ప్రయోజనాల కోసం బేరసారాలు చేసే వైఖరిగా ఉండినా కొంత ఉపయోగంగా ఉండేది, కాని రెండు అగ్రరాజ్యాలకూ దళారీగా ఉండడానికే పాలకులు సిద్ధపడ్డారు. సోవియట్ యూనియన్ పతనం కావడం, అమెరికన్ సామ్రాజ్యవాదుల, బహుళ జాతి సంస్థల ఆధ్వర్యంలో ప్రపంచీకరణ ప్రారంభం కావడంతో భారత పాలకులు బేషరతుగా ప్రపంచీకరణలో భాగమయ్యారు. అంటే 1947 ఆగస్ట్ 15 కు ముందు ఒక్క బ్రిటిష్ వలసగా ఉండిన భారతదేశం ఆ తర్వాత అన్ని సామ్రాజ్యవాద దేశాలకూ, బహుళజాతిసంస్థలకూ ఇష్టారాజ్యపు క్రీడాస్థలిగా మారిపోయింది.

**అంకెల్లో పెరుగుదల**

ఈ డెబ్బై ఏళ్లలో భారతదేశం ఏమీ సాధించలేదా, కళ్ల ముందర ప్రగతి కనబడడం లేదా అని అడిగేవాళ్లు ఉంటారు. నిజమే, ఈ ఏడు దశాబ్దాలలో భారతదేశానికి సంబంధించిన కొన్ని అంకెల్లో పెరుగుదల కనబడుతున్నది. ఆ పెరుగుదల స్వభావం ఏమిటి, అది ఎవరికి మేలు చేసింది, ఎవరికి కీడు చేసింది, అసలు ఆ పెరుగుదల ఎవరి అవసరాల కోసం వచ్చింది వంటి ప్రశ్నలు వేసుకుంటే గాని ఆ పెరుగుదల మేడిపండు లోపలి పురుగులు బైటపడవు. నిజంగానే భారత ఆర్థిక వ్యవస్థ 1947లో రు. 2.7 లక్షల కోట్లుగా ఉన్నదల్లా తాజా గణాంకాల ప్రకారం రు. 57 లక్షల కోట్లకు పెరిగింది. అంటే దేశ ఆర్థిక వ్యవస్థ, లేదా జాతీయోత్పత్తి 26 రెట్లు పెరిగింది. అలాగే విదేశీ మారక ద్రవ్య నిలువలు 300 కోట్ల డాలర్ల నుంచి మూడు లక్షల కోట్ల డాలర్లకు, వెయ్యి రెట్లు పెరిగాయి. ఆయుధాల కొనుగోలులో భారతదేశం ప్రపంచ దేశాలన్నిటిలోనూ అగ్రభాగాన నిలిచింది. ఎగుమతి దిగుమతులు, ఆహారోత్పత్తి, రహదారుల నిడివి, రైలు మార్గాల నిడివి, పరిశ్రమలు, మౌలిక సౌకర్యాలు, విద్యా సంస్థలు, వైద్యశాలలు, సంక్షేమ కార్యక్రమాలు, పాలనా సౌకర్యాలు వంటి అన్ని స్థాయిలలోను తప్పనిసరిగా కంటికి కనబడే పెరుగుదల ఉంది. కాని ఆ పెరుగుదలను మాత్రమే చూసి సంతృప్తి పడేట్టయితే బ్రిటిష్ పాలనా కాలంలో కూడ ఆయా నిర్ణీత కాలవ్యవధుల్లో ఇంతకన్న ఎక్కువ పెరుగుదల కూడ ఉందని గుర్తించవచ్చు. అయినా భారత సమాజం ఆ పాలన వద్దని తిరగబడిందంటే, కావలసింది కేవలం అంకెల పెరుగుదల మాత్రమే కాక, సామాజిక జీవన ప్రమాణాల పెరుగుదల

అని, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని అర్థమవుతుంది. ఆ అర్థంలో చూసినప్పుడు 1947 ఆగస్ట్ 15 భారత ప్రజానీకపు జీవన స్థితిగతుల్లో తేవలసినంత మార్పు తేలేదని, వచ్చిన మార్పు కూడ కొన్ని వర్గాలకే పరిమితమైందని అర్థమవుతుంది.

**ప్రజానీకపు జీవన స్థితిగతులు**

పరాయి పాలన, వలస పాలన కింద సాగిన జీవనానికీ "స్వతంత్ర" పాలన కింద సాగుతున్న జీవనానికీ తేడా ఏమీ లేకపోతే, లేదా ప్రస్తుత స్థితే ఇంకా దిగజారి ఉన్నదని ప్రజలు అనుకుంటున్నారంటే దీన్ని స్వాతంత్ర్యం అనవచ్చునా అనేది ప్రశ్న. ఈ డెబ్బై ఏళ్లలో రైతాంగం, కార్మికులు, స్త్రీలు, దళితులు, ఆదివాసులు, మైనారిటీలు, మధ్యతరగతి వంటి విభిన్న, అసంఖ్యాక ప్రజా సమూహాల జీవన స్థితిగతులలో వచ్చిన మార్పుల ద్వారా అంచనా వేస్తే ఈ దేశానికి స్వాతంత్ర్యం రాలేదని, బ్రిటిష్ పాలనా కాలం నాటి జీవన పరిస్థితుల్లో పెద్దగా మార్పు రాలేదని, లేదా కొన్ని వర్గాలకు మాత్రమే స్వాతంత్ర్యం వచ్చి, స్వాతంత్ర్య ఫలాలు దక్కాయని చాల సులభంగా నిర్ధారించవచ్చు. తప్పనిసరిగా ఈ డెబ్బై ఏళ్లలో దేశంలో మధ్యతరగతి జనాభా పెరిగింది. ప్రభుత్వోద్యోగాల సంఖ్యలో పెరుగుదల, పారిశ్రామిక, సేవా రంగాల పెరుగుదల వల్ల పెరిగిన ఉద్యోగాలు దేశంలో గణనీయమైన మధ్యతరగతిని సృష్టించాయి. ఈ మధ్యతరగతి ప్రధానంగా పట్టణాల్లో ఉండేది గనుక, విపరీతమైన వినియోగదారీ మార్కెట్ ను సృష్టించింది గనుక దీనికి ప్రచార, ప్రసార సాధనాలలో చాల ఎక్కువ దృశ్యనీయత ఉంది. అసలు దేశమంటే ఈ మధ్యతరగతేనేమో అన్నంతగా దీని గురించి ప్రచారం జరుగుతోంది, దీనికి ప్రచారసాధనాలలో ప్రాముఖ్యత దొరుకుతోంది. కాని నిజానికి దేశ జనాభా 130 కోట్లలో ఎక్కువలో ఎక్కువ ఈ మధ్య తరగతి 20 కోట్లు కూడ ఉండకపోవచ్చు. మధ్యతరగతిలో కూడ దిగువ మధ్య తరగతి పైకి ఎగబాకలేక, కిందికి జారలేక అన్న స్థితిలో, పైవారిని అనుకరిస్తూ, కిందివారి పట్ల న్యూనతా భావాన్ని కనబరుస్తూ ఉన్నది. ఈ మధ్య తరగతిని మినహాయిస్తే మిగిలిన వంద కోట్లకు పైబడిన ప్రజానీకపు జీవన దుర్భరత్వం గురించి ప్రభుత్వాలూ, ప్రచారసాధనాలూ పట్టించుకోని ఒక నిర్లక్ష్య స్థితి డెబ్బై ఏళ్లుగా రాజ్యమేలుతున్నది. ప్రజలందరి, ప్రజాసమూహాలన్నిటి జీవన పరిస్థితులను మెరుగు పరచని పాలనను స్వాతంత్ర్యంగా చెప్పడం ఆ మాటకే అవమానం.

**ఉన్నవారి రాజ్యం**

ఈ అశేష ప్రజానీకపు దుర్భర స్థితి నాణానికి ఒక ముఖం మాత్రమే. మరొక ముఖం పిడికెడు మంది సంపన్నులు, భూస్వాములు, పారిశ్రామిక వేత్తలు, వ్యాపారవేత్తలు, రాజకీయ నాయకులు, ఉన్నతోద్యోగులు అనుభవిస్తున్న రాజభోగాలు. సరిగ్గా బ్రిటిష్ పాలనలో కొద్దిమంది వలస అధికారులు, స్థానిక సంస్థానాధీశులు, భూస్వాములు ఎటువంటి విలాసవంతమైన జీవితాన్ని గడిపారో బహుశా అంతకన్న ఎక్కువ విలాసాలు అనుభవిస్తున్నారు. వారు అలా విలాసాలు అనుభవించడానికి, దేశసంపదలు తమ సొంత ఆస్తిగా భావించడానికి అవకాశం ఇస్తున్నవీ, ప్రోత్సహిస్తున్నవీ ఈ డెబ్బై సంవత్సరాల పాలక విధానాలే. ఇలా దేశసంపదను అక్రమంగా తమ హక్కు భుక్తం చేసుకుంటున్నవారు దేశ జనాభాలో ఒక కోటి మంది కూడ ఉండకపోవచ్చు. వారి ఆశ్రితులు, సమర్థకులు మరొక కోటి, రెండు కోట్లు ఉండవచ్చు. అంటే 130 కోట్ల మంది ప్రజల అనుభవంలోకి రావలసిన దేశ సంపదను రెండు మూడు కోట్ల మందికి దోచిపెట్టడమే 1947 ఆగస్ట్ 15 చేసిన పని. నిజానికి ఆ తేదీ కన్న ముందు కూడ దేశ పరిస్థితి అదే. అంటే ఆ తేదీ దేశ చరిత్రలో, సామాజిక జీవనంలో గుణాత్మక మార్పునేమీ తేలేదన్న మాట.

**ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు, ఉపరితలాంశాలు**

ఒక దేశం స్వతంత్రమయిందా లేదా అని చూడడానికి మరొక స్థాయిలో, రాజకీయార్థిక శాస్త్ర అవగాహన నుంచి ఆ దేశపు ఉత్పత్తి శక్తుల అభివృద్ధి ఎలా ఉంది, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి ఎలా ఉంది, ఉపరితలాంశాల మార్పు ప్రగతిశీల దిశలో ఎంతగా ముందుకు సాగింది అని చూడాలి. ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని చూడడంలో సాధారణంగా ఒక పొరపాటు జరుగుతున్నది. ఉత్పత్తి శక్తులలో భాగమైన ఉత్పత్తి సాధనాలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని మాత్రమే చూసి, అంతకన్న ముఖ్యమైన మనుషులను, మానవశ్రమను విస్మరించడం జరుగుతున్నది. ఉత్పత్తి సాధనాలకు, సాంకేతిక పరిజ్ఞానానికి కళ్లు మిరుమిట్లు గొలిపేంత దృశ్యనీయత ఉంటుంది. అందువల్ల అవి కొట్టవచ్చినట్టు కనబడతాయి. కాని అదే సమయంలో చుట్టూ కనబడుతున్న మనుషుల్లో అభివృద్ధి ఉన్నదా తేల్చడం అంత సులభం కాదు. ఆ మనుషులు అధునాతన దుస్తులు వేసుకుంటే, ఆధునిక భాషలు మాట్లాడుతుంటే అభివృద్ధి సాధించినట్టేననే పొరపాటు అభిప్రాయం బలంగానే ఉంది. అందుకే ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని ఉత్పత్తి సాధనాలతో మాత్రమే, సాంకేతిక పరిజ్ఞానంతో మాత్రమే చూడగూడదు. మనుషుల అభివృద్ధితో కలిపి చూడాలి. మనుషుల అభివృద్ధిని కూడ వారి రూపాలతో మాత్రమే చూడగూడదు. సారంలోకి వెళ్లి, వాళ్లు ఏ ఉత్పత్తి సంబంధాలలో, ఏ సామాజిక సంబంధాలలో ఉన్నారు, ఏ ఉపరితల ప్రభావంలో ఉన్నారు, వారి నిత్య జీవితాన్ని నిర్ణయిస్తున్న ఉపరితలం అభివృద్ధికరమైనదా, అభివృద్ధి నిరోధకమైనదా, రేపటిదా, నిన్నటిదా అని పరిశీలించాలి. అలా చూసినప్పుడు ఈ డెబ్బై సంవత్సరాలలో, ప్రత్యక్ష వలస పాలన తొలగిపోయినప్పటికీ ఉత్పత్తి సాధనాల అభివృద్ధి జరిగినప్పటికీ, సాంకేతిక పరిజ్ఞానాన్ని బైటి నుంచి ఎంత ఎక్కువగా అరువు తెచ్చుకున్నప్పటికీ, ఇక్కడి సమాజ స్థితి, మనుషుల స్థితి మారలేదు. అంటే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి సంపూర్ణంగా జరగలేదు. అది సంపూర్ణంగా జరగలేదనడానికి పాత ఉత్పత్తి సంబంధాలు, సామాజిక సంబంధాల కొనసాగింపే ప్రధాన నిదర్శనం. అంతకన్న పెద్ద నిదర్శనం డెబ్బై సంవత్సరాల "స్వతంత్ర" పాలన అని చెప్పుకుంటున్న సమాజంలో ఉపరితలాంశాలలో సమూలమైన, గుణాత్మకమైన మార్పులు జరగలేదు. పాత ఉపరితలాంశాలే ఇంకా మనుషుల మనసుల మీద రాజ్యం చేస్తున్నాయి. కులం, మతం, ఆచారాలు, సంస్కృతి, దైవభావన, పరస్పర సంబంధాలు, సాహిత్యం, కళలు, సినిమా, క్రీడలు వంటి ఏ రంగం తీసుకున్నా కాలం చెల్లిన, అభివృద్ధి నిరోధక ఉపరితలాంశాలే ప్రాచుర్యం లోకి వస్తున్న సందర్భంలో మనం ఉన్నాం.

ఇటువంటి వాతావరణం ఉన్న దేశాన్ని ప్రజాస్వామిక దేశమని, సర్వసత్తాక దేశమని, లౌకిక దేశమని అనడం, అనుకోవడం ఆత్మవంచన, పరవంచన. స్వతంత్ర దేశమని అనడం, అనుకోవడం పాలకవర్గాలు కల్పిస్తున్న భ్రమ.

*(అయిపోయింది)*

*(రచయిత పాత్రికేయులు)*

వీ

చర్చ

# తత్వశాస్త్రం కొంతే, సొంత కవిత్వమే అంతా..-2

*రంగనాయకమ్మ రాసిన 'తత్వశాస్త్రం - చిన్న పరిచయం' పుస్తకం తప్పుల తడక అని విమర్శిస్తున్నారు*

**లంకా పాపిరెడ్డి**

(గత సంచిక తరువాయి భాగం...)

**ముం**దు మాట దగ్గరి నుండి మూడవ చాప్టర్ ముగింపు వరకు చెప్పినదంతా ఉపోద్ఘాతమే అన్నారు చివరికి. ముందుమాట నుండి మూడవ చాప్టర్ ముగింపు వరకు, తత్వశాస్త్రం అనేది, అర్థం కాని శాస్త్రం, విసుగు శాస్త్రం, సోది శాస్త్రం, ఇనుప భాషా శాస్త్రం, ఎల్లయ్య పుల్లయ్యల శాస్త్రం, అసలు అవసరమే లేని శాస్త్రం అని ఏకరువు పెట్టి దానికి ఉపోద్ఘాతమని పేరు పెట్టింది. దేనికి ఉపోద్ఘాతం, తత్వశాస్త్రాన్ని పరిచయం చేయడానికా? దాని పైన దుమ్మెత్తి పోయడానికా? దుమ్మెత్తి పోయడానికే ఈ ఉపోద్ఘాతం అని ఎవరికైనా అర్థం అవుతుంది. తత్వశాస్త్రం గురించి తను 'చెప్పేది తప్పు అయితే సరిదిద్దే మేధావులు ఉండకపోరు కదా?' అన్నారు ఈ 'ఉపోద్ఘాతం' చివరిలో. ఇది రంగనాయకమ్మకు పాఠకుల పట్ల ఉన్న చులకన భావనను తెలియ చేస్తుంది. ఏది రాసి పడేసినా చదవక చస్తారా అనే చులకన భావన అది. భాధ్యతారాహిత్యం అది.

**4) సృష్టివాదం, భావవాదం**

ముందటి చాప్టర్‌లలో తత్వశాస్త్రం పైన జరిగిన దాడినే(ఉపోద్ఘాతం), ఈ తరువాతి చాప్టర్‌లలోనూ కొనసాగించారు. కాకపోతే దాడితో పాటు ఇక్కడి నుండి రంగనాయకమ్మ తన స్వంత కవిత్వం కూడా కలపడం మొదలు పెట్టారు. 4 చాప్టర్‌లో భావవాదం, భౌతికవాదాలకు తోడుగా, సృష్టివాదం అనే ఒక కొత్త వాదాన్ని సృష్టించారు. ఈ సృష్టివాదం భావవాదంలోకి వస్తుందా? భౌతికవాదంలోకి వస్తుందా? లేక అదొక ప్రత్యేక వాదమా? వివరణ ఏమి లేదు. ఈ సృష్టి ఎలా జరిగిందని చెప్పే భిన్నమైన సిద్దాంతలే ప్రధానంగా భావవాదం, భౌతికవాదాలు. కాని రంగనాయకమ్మ సృష్టివాదం పేరు మీద ఏమిలేని వాదాన్ని కనిపెట్టారు. సృష్టివాదంలో రంగనాయకమ్మ వివరించింది కూడా భావవాదం, భౌతికవాదాలనే.

భావవాదం అనే సబ్ హెడ్డింగ్ క్రింద ప్రారంభంలోనే, ' సృష్టివాదం ఉంటూ ఉండగానే భావవాదం పుట్టుకు వచ్చింది.'అని రాశారు. కాని భావవాదం, భౌతికవాదాలకు భిన్నమైన సృష్టివాదం ఏమిటో మరి. వివరించనూ లేదు. ఓ రెండు పేరాల తరువాత మరోసారి ఇనుప భాష మీద విసుక్కున్నారు, కాసేపు కసురుకున్నారు. ఈ పుస్తకం ముగిసే వరకు ఇనుప భాష రంగనాయకమ్మగారిని ప్రభావితం చేస్తూనే ఉంది. 'మనస్సుకు బయట ఏమీ ఉండదు. అన్ని మనసులోనే ఉంటాయి. వాటి అస్థిత్వం, మనసు గ్రహించడం మీదే ఆధారపడి ఉంటుంది.' భావవాదం ఏమి చెపుతుందని వివరించడానికి, పై వాక్యాలు చెప్పిన తరవాత రంగనాయకమ్మ ఏమి చెప్పారో చూడండి. 'చక్కగా అర్థం అయ్యాయా? ఈ నాలుగు వాక్యాలే కాదు, వెయ్యి పేజీల గ్రంథం పఠించినా, భావవాదం అర్థం కాదు. దాన్ని విమర్శిస్తూ వ్యాసాలు రాసేవాళ్లు కూడా, ఆ భావవాదం ఏం చెపుతోందో పాఠకులకు అర్థం అయ్యేటట్టు చెప్పరు. చెప్పలేరు.' (పేజీ 23) ఇదన్న మాట 'ఉపోద్ఘాతం' తరువాత చెప్పిన అసలు విషయం. ఒకసారి భావవాదాన్ని అసలు ఏమి లేని 'పిచ్చిమాటలు' అంటుంది. మరోసారి దాన్ని అర్థం కాని బ్రహ్మపదార్థం అంటుంది. అసలు భావవాదం పేరుమీద ఇటువంటి 'పిచ్చిమాటలు' చెప్పి ఉంటారా? వారు ఇంకేదో చెప్పి ఉండవచ్చునేమో అంటుంది. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే, రంగనాయకమ్మగారికి భావవాదం అంటే ఏమిటో అర్థం కాకుండానే, అవి పిచ్చి మాటలని ఎలాతెలిసింది? ఇంకా భావవాదం ఎందుకు అర్థం కాదో ఇలా వివరించారు, 'ఒక పుస్తకం చదివినపుడు అర్థం కావడం లేదంటే దానికి కారణాలు ఉంటాయని మొదట్లో చెప్పుకున్నాం కదా? వాటిల్లో మొదటి కారణం, ఈ భావవాదానికి పూర్తిగా సరిపోతుంది. ప్రకృతిలో లేని భగవంతున్ని చెప్పడం ఎలాంటిదో, విశ్వాత్మను చెప్పడం కూడా అలాంటిదే. ఎక్కడా ఉండని దాన్ని గురించి ఎంత ఆర్భాటంగా చెప్పినా అది నిజం అవదు. అందుకే భగవంతుడు అర్థం కానట్టే, విశ్వాత్మ కూడా అర్థం కాదు.' (పేజీ 23) ఇక్కడ రంగనాయకమ్మ గారు అర్థం కాకపోవడం, అంగీకరించకపోవడంల మధ్య ఉన్న తేడాను గుర్తించలేక గందరగోళ పరిచినారు. భావవాదులు చెప్పే విషయాలను భౌతికవాదులు మాత్రమే అంగీకరించరు. భావవాదులు చెప్పే విషయాలు అర్థం కావడం వల్లనే భౌతికవాదులు వాటిని తిరస్కరిస్తారు. కాని రంగనాయకమ్మ, భౌతికవాదులు అంగీకరించలేని విషయాలను అర్థం కాని విషయాలుగా, అర్థం చేయించలేని విషయాలుగా గందరగోళపరుస్తున్నారు. అస్థిత్వంలో లేని విషయాలను చెపతుంది కావున, భావవాదం అర్థం కాదని రంగనాయకమ్మ అంటారు. కాని, అర్థం కాకపోతే, భావవాదం అస్థిత్వంలో లేని విషయాలను చెపుతుందని ఎలా తెలిసింది మరి? అస్థిత్వంలో లేని విషయాలను, భౌతికవాదులు అర్థం అయ్యే తిరస్కరిస్తారు. అదే విధంగా, భావవాదులు చెప్పే విషయాలను, భావవాద దృష్టితో చూసేవాళ్లు అర్థం అయ్యే అంగీకరిస్తారు. భౌతికంగా నిరూపించలేని విషయాలు కూడా ఉంటాయని వాళ్లు నమ్ముతారు. ఎవరు ఏ దృష్టితో చూస్తున్నారు అనే దాన్ని బట్టి అంగీకరించడం, అంగీకరించకపోవడం ఉంటాయి తప్ప అర్థం కాకపోవడం అనేది ఏమి లేదు ఇక్కడ. భావవాద దృష్టితో చూచే వాళ్లు, భౌతికంగా నిరూపించలేని విషయాలను కూడా నమ్ముతారు, అంగీకరిస్తారు. భౌతికవాద దృష్టితో చూచే వాళ్లు, భౌతికంగా నిరూపించ లేని విషయాలను నమ్మరు, అంగీకరించరు. అంతేకాని, భావవాదం అర్థం కాక కాదు. అసలు విషయం ఏమిటంటే, తత్వశాస్త్రం ఏమి

చెపుతుంది? ఎందుకు చెపుతుంది అనే విషయం రంగనాయకమ్మ గారికి అర్థం కాలేదు. వారికి అర్థం కానిది ఎవరికి అర్థం కాదని ప్రచారం చేస్తున్నారు. భావవాదులు ఏమి చెపుతున్నారు? ఎందుకు చెపుతున్నారు? వాటి వెనక ఎవరి ప్రయోజనాలు ఉన్నాయి అనే విషయాలు అర్థం అయినందుననే వాటిని భౌతికవాదులు వ్యతిరేకిస్తారు. భావవాదులు నిరూపించలేని పరలోకం, పరమాత్మ, మోక్షం, మాయావాదాలను ఎందుకు ప్రచారం చేస్తారు? ప్రజలు, ప్రకృతిని, సమాజాన్ని భౌతికవాద దృష్టితో కాకుండా, భావవాద దృష్టితో చూసినపుడే ఆధిపత్య వర్గాల ప్రయోజనాలు నెరవేరుతాయని. ప్రజలు, దోపిడి అణిచివేతలను గుర్తించలేరు. వాటిని సహజమైన విషయాలుగా పరిగణిస్తారు. పరలోకంలోనో, మోక్షంలోనో సమస్యలన్ని పరిష్కారం అవుతాయని అనుకుంటారు. పాలకవర్గాలు కేవలం సైనిక బలంతోనే ప్రజలను నియంత్రించడం లేదు, ప్రజలలో ఉన్న భావవాదం కూడా అందుకు ఉపయోగపడుతున్నది. దాని పాత్ర చిన్నది కాదు. ఇవన్నీ అర్థం అయినందుకే భౌతికవాదం,భావవాదాన్ని వ్యతిరేకిస్తుంది. దానితో పోరాడుతుంది. భౌతికవాదం సరిగ్గా భావవాదానికి వ్యతిరేకమైన భావాలను వ్యక్తం చేస్తుంది. అస్థిత్వంలో ఉన్న విషయాలనే చెపతుంది. ఆచరణలో నిరూపించే విషయాలనే చెపతుంది. అస్థిత్వంలో వున్న అభివృద్ధి నియమాలనే చెపతుంది. పరలోకం,పరమాత్మ, మోక్షం, కర్మ, మాయావాదాల పేరు మీద, దోపిడి అణిచివేతలను సహజ విషయాలుగా చెప్పడాన్నివ్యతిరేకిస్తుంది. అందుకే, భావవాదం దోపిడీ వర్గాల పక్షాన నిలబడుతుంది. భౌతికవాదం శ్రామిక వర్గాల పక్షాన నిలబడుతుంది. అసలైన ఈ విషయం రంగనాయకమ్మగారికి అర్థం కాలేదు. విచిత్రం ఏమిటంటే, స్వయంగా రంగనాయకమ్మగారే, ప్రపంచంలో భావవాదాన్ని నమ్మేవారే ఎక్కువగా ఉన్నారని అంటారు. మొత్తం ప్రపంచంలో లక్షకు ఒక్కరుగా భౌతికవాదులుఉండవచ్చు అనీ చెపతారు. అంటే రంగనాయకమ్మగారి ప్రకారమే, భావవాదమే ప్రపంచంలో బలమైన విషయం. ఇది ఏమి చెపతున్నది? భావవాదానికి వ్యతిరేకంగా తాత్వికరంగాన ఎంతో పోరాటం చేయవలసిని అవసరం వుందని గుర్తు చేయడం లేదా? కాని రంగనాయకమ్మ తత్వశాస్త్రం అవసరం ఏమున్నదని అంటారు. ఇది వారి గందరగోళాన్నే సూచిస్తున్నది. అన్ని పరస్పర విరుద్ధంగా చెపతారు. సైన్స్‌లు, శాస్త్రాలు అభివృద్ధి చెందిన తరువాత, తత్వశాస్త్రం అవసరం లేదంటారు. మళ్లీ తనే చదువుకున్న వాళ్లు కూడా అంటే సైన్స్‌ల గురించి తెలిసినవారు కూడా, నిరూపించలేని సూపర్ పవర్‌ని నమ్ముతున్నారని తిట్టిపోస్తారు. సైన్స్‌లు అభివృద్ధి చెందినంత మాత్రాన, ప్రజలందరు ఆటోమేటిక్‌గా భౌతికవాదులుగా మారిపోరు. ఇది అర్థం అయినరోజున, తత్వశాస్త్రం అవసరం ఏమిటి? అది ఏమి చెపుతుంది? అనే విషయం కూడా తెలుస్తుంది. భౌతికవాదం అనేది భౌతిక శాస్త్రం కాదు. సైన్స్ అభివృద్ధి చెందుతూ వుంటే, కొత్త సైన్స్ ఫలితాలను వక్రీకరించి, ఉపయోగించుకుంటూ భావవాదం అభివృద్ధి చెందడానికి ప్రయత్నిస్తూ ఉంటుందని ఎంగెల్స్ చెప్పారు. ఆచరణలో చూస్తున్నాము కూడా. అందుకే సైన్స్‌లు అభివృద్ధి చెందుతూ వుంటే, వాటి ఆధారంగా భౌతికవాదంకూడా అభివృద్ధి చెందుతూ వుండాలని, ఉంటుందనికూడా ఎంగెల్స్ చెప్పారు. అటువంటి కృషి ఇప్పటి వరకు లెనిన్ మాత్రమే చేశారు. లెనిన్ తరువాత అన్ని శాస్త్రాలు ఎంతో అభివృద్ధి చెందాయి, విస్తృతం అయ్యాయి. మార్క్సిస్టు తత్వశాస్త్రం అభివృద్ధికి కొంత కృషి జరిగినా, అభివృద్ధి చెందాల్సిందే ఎంతో ఉంది. అంతే కాని సైన్స్‌లు అభివృద్ధి చెందితే తత్వశాస్త్రం అంతం కాదు. మొత్తం తత్వశాస్త్రం అభివృద్ధి క్రమాన్ని చూసినా ఇదే అర్థం అవుతుంది. వర్గాలు ఉన్నంత కాలం, దోపిడి వర్గాలు భావవాదాన్ని పెంచి పోషిస్తూనే ఉంటాయి. భౌతికవాదం, దానితో పోరాడుతూనే ఉంటుంది. ఆ క్రమంలో అభివృద్ధి చెందుతూ ఉంటుంది. వర్గాలు రద్దు అయిన తరువాత కూడా తత్వశాస్త్రం అంతం కాదు. పదార్థం, ప్రపంచం అభివృద్ధి చెందుతున్నంత కాలం తత్వశాస్త్రం అంతం కాదు. ప్రకృతి, మానవసమాజం అభివృద్ధి చెందుతున్నంత కాలం, ఆ అభివృద్ధులు మానవ ఆలోచనలో ప్రతిబింబిస్తున్నంత కాలం, తత్వశాస్త్రం అంతం కాదు.

**5) భౌతికవాదం**

భౌతికవాదం అనే 5వ చాప్టర్‌లో, భౌతికవాదం పదార్థాన్ని ప్రాథమికమైనది గానూ, చైతన్యాన్ని ద్వితీయమైనదిగానూ భావించుతుంది అని సరిగ్గానే చెపుతారు. అయితే తను చదివిన తత్వశాస్త్ర పుస్తకాల్లోని వాక్యాలను అక్కడక్కడ పేర్కొన్నప్పటికి, వెంటనే తన అసలు తత్వశాస్త్రాన్ని ప్రకటిస్తూ ఉంటారు, రంగనాయకమ్మ. 'ప్రకృతికి సంబందించిన విజ్ఞానాన్ని ఇవ్వడమే భౌతికవాదం కర్తవ్యం' అంటారు. అంటే భౌతికవాదాన్ని ప్రకృతి విజ్ఞాన శాస్త్రంగా కుదించి వేశారన్నమాట. పదార్థం ప్రాథమికం, చైతన్యం ద్వితీయం అంటూ రాసినవన్ని పడికట్టు పదాలుగానే వాడారు తప్ప భౌతికవాదం అర్థం అయ్యి కాదు. భౌతికవాదం అంటే వివిధ శాస్త్రాలుగా అర్థం చేసుకుంటున్నారు రంగనాయకమ్మ. భౌతికవాదం, వివిధ శాస్త్రాలను భౌతికవాద దృష్టితో చూస్తుంది. వాటిల్లోని అభివృద్ధిని గతితార్కిక పద్ధతిలో పరిశీలిస్తుంది. వివిధ శాస్త్రాలు అభివృద్ధి చెందుతూ ఉంటే, వాటిల్లో నిత్య నూతనంగా వ్యక్తం అయ్యే అభివృద్ధి నియమాలతో, గతితార్కిక భౌతికవాదం తన్ను తాను బలోపేతం చేసుకుంటూ వస్తుంది. ప్రకృతి, మానవసమాజం, మానవ ఆలోచనాక్రమాలలో వ్యక్తం అయ్యే అభివృద్ధి నియమాలనే, గతితార్కిక భౌతికవాదం స్వంతం చేసుకుంటుంది తప్ప, కల్పించిన లేదా ఊహించిన నియమాలను వాటికి ఆపాదించదు. గతితార్కిక భౌతికవాదం, ఎల్లయ్యలు, పుల్లయ్యలు కాలక్షేపం కొరకు పుట్టించిన నియమాలు కావు. భౌతికవాదం గురించి చెపుతూ, 'సరైన వాదం ఒకటి అభివృద్ధి చెందిన తరువాత, సరికాని తప్పువాదాలన్ని అణగారి పోవాలి కదా? కాని అలా జరగడం లేదు. తప్పువాదాలే ఈ నాటికీ ఎక్కువ బలంతో విరాజిల్లుతున్నాయి.' అంటారు. దీనికి జవాబు చెపుతూ,'అజ్ఞానం, జ్ఞానాన్ని ఎందుకు ఇష్టపడడం లేదు. దీనికి జవాబు కావాలంటే ప్రకృతి శాస్త్రాల్లో దొరకదు. సరైన సామాజిక శాస్త్రంలో చూడాలి. లేదా, ఆ సామాజిక జ్ఞానం తెలిసిన తత్వశాస్త్రంలో చూడాలి.' (పేజీ 25) అంటారు. ప్రకృతి శాస్త్రాలు అభివృ చెందితే తత్వశాస్త్రం అవసరమే లేదన్న రంగనాయకమ్మ ఇక్కడ మాత్రం, జవాబు ప్రకృతి శాస్త్రాల లో లేదంటున్నారు. సరైన సామాజిక శాస్త్రంలో లేదా ఆ సామాజిక జ్ఞానం తెలిసిన తత్వశాస్త్రంలో జవాబు చూడాలి అంటున్నారు. ఇక్కడ కూడా రంగనాయకమ్మ తలక్రిందులుగా చెప్పారు. ఏది సరైన సామాజిక శాస్త్రం? భౌతికవాద దృక్పథంతో ఉన్న సామాజిక శాస్త్రమే సరైన సామాజిక శాస్త్రం అవుతుంది. భావవాద దృక్పథంతో ఉన్న సామాజిక శాస్త్రం, దోపిడీని కొనసాగించడానికి అజ్ఞానాన్ని ప్రోత్సహిస్తుంది. భౌతికవాద దృష్టి ఉన్న సామాజిక శాస్త్రం, దోపిడీని, దోపిడిని నిలబెట్టి ఉంచడానికి ఉపయోగపడే అజ్ఞానాన్ని వ్యతిరేకిస్తుంది. అంటే గతితార్కిక భౌతికవాదం అనే తత్వశాస్త్రం ఆధారంగా ఉండే సామాజిక శాస్త్రం దగ్గరే సరిఅయిన జవాబు ఉంటుంది.

**6) భూమి తరువాత మనుషులా, మనుషుల తరువాత భూమా?**

6వ చాప్టర్‌లోనూ రంగనాయకమ్మ అవాకులు చవాకుల తత్వశాస్త్రాన్ని కొనసాగించారు. 'కొన్నివిషయాలు నిజంగా నేర్చుకోవలసినవే. అవసరమైనవే. మిగతావి పుల్లయ్యలు, ఎల్లయ్యలు, రంగమ్మలు, మంగమ్మలు కాలక్షేపం కోసం చేసుకునే వాదాలే.' (పేజీ 25) కొన్ని విషయాలే అవసరమైనవట. అవి కూడా ఎందుకో తెలవదు. కాని మిగతావన్ని కాలక్షేప తత్వశాస్త్రాలే. రంగనాయకమ్మ గారికి కాలక్షేపవాదంగా అనిపించే విషయమే, 'అదో పెద్ద సందేహమా' అనిపించే విషయమే తత్వశాస్త్రంలో అసలు విషయం. పదార్థం ప్రాథమికమా? చైతన్యం ప్రాథమికమా? లేదా పదార్థం ముందా, చైతన్యం ముందా? అనేవిషయమే తత్వశాస్త్రంలో కీలకమైన విషయం, మౌలికమైన ప్రశ్న. వీటి మధ్య ఘర్షణలోనే తత్వశాస్త్రం అభివృద్ధి చెందింది. ఈ ప్రశ్నకు ఇచ్చే జవాబును బట్టే, భావవాదులు ఎవరు, భౌతికవాదులు ఎవరుఅనేది తేలుతుంది. కాని రంగనాయకమ్మ గారి ప్రకారం, ' ఈ విశ్వం మొదటిదా, మనుషుల ఆలోచనలు (చైతన్యం) మొదటివా – అనే ప్రశ్న ఒకటి ప్రారంభమైంది, ఎనాడో. అది పెద్ద సందేహం అయినట్టు, దాని మీదవేల సంవత్సరాలుగా వాదోపవాదాలు సాగుతూనే ఉన్నాయి.' (పేజీ 25) పదార్థం ముందా, చైతన్యం ముందాఅనే తత్వశాస్త్రపు మౌలిక ప్రశ్ననే రంగనాయకమ్మ గారికి ఒక చచ్చుప్రశ్నగా అనిపిస్తున్నదంటే, వారికి తత్వశాస్త్రం ఎంత అర్థం అయ్యిందనేది తెలుస్తూనే ఉంది. ఒక వైపు ఇప్పటికీ ప్రపంచంలో భావవాదాన్ని నమ్మే ప్రజలే అధికంగా ఉన్నారని చెప్తారు. మరో వైపు అదో 'పెద్ద సందేహమా' అంటారు. ఒక విషయం గురించి తెలవకుండానే, భోధించడానికి ప్రయత్నిస్తే ఇలాగే, పరస్పర విరుద్ధంగా ఉంటుంది. ఇంతే కాదు భావవాదం మీద చేయవలసిన పోరాటం, రంగనాయకమ్మ గారి ప్రకారం చాలా సులువు. (అవును మరి అది పెద్ద సందేహమా?)వేల సంవత్సరాలుగా ఎవరూ కనుగొనలేక పోయారు. ఆ పోరాటం, లేదా ఆయుధం ఏమిటంటే 'అరె పాగల్'. భావవాదులతో వాదాలు దండగ, ఇలాగె చెప్పాలంటారు. ' అరె పాగల్, అనే ఒక్క మాటతో సరి పెట్టాలి గానీ, ఆ అడ్డగోలు వాదాలకు ఎదురు వాదాలు చేసే శ్రమ ఎందుకు' మళ్లీ తరువాతి పేరాలోనూ ఇదే ఆయుధాన్ని ఉపయోగించారు.' అదొక గొప్ప తెలివైన సమస్య అయినట్టు, దాని మీదే తరతరాలుగా ఈనాటికీ వాదాలే. అసలు ఏ భావవాదికైనా భౌతికవాది ఇవ్వవలసిన ఏకైక జవాబు, అరేపాగల్ ఇక కట్టిపెట్టు అనేదే'.(పేజీ 27) మన పూర్వీకులకు ఈ విషయం తెలవకపోవడం వలన ఎంతో నష్టం జరిగింది కదా... అనవసరంగా సచ్చు ప్రశ్నలపై వేల సంవత్సరాలుగా వాదాలు జరుగుతున్నాయి. కానీ ఆశ్చర్యంగా, 'కాని' అంటూ యు టర్న్ తిరుగుతారు రంగనాయకమ్మ. ముందేమో 'ఎదురు వాదాలశ్రమ ఎందుకు', 'ఏకైక జవాబు అరె పాగల్' అని చెప్పారు కదా... మళ్లీ ఇపుడు ఏమంటున్నారో చూడండి, 'మన పాగల్ తిట్టుతో ఆ పాగల్‌ను ఓడించడం కుదరదు. అతడి వాదాన్ని ఓడించాలంటే, అసలు చేయవలసింది అతడి పాగల్ తనం ఏమిటో పాఠకులకు వివరించే పని చెయ్యవలసిందే'. (పేజీ 27) అరెపాగల్ బాంబు పేలలేదు అన్నమాట. పోనీ మరి వేల సంవత్సరాల నుండి భౌతికవాదులు ఏమి చేస్తున్నారని, రంగనాయకమ్మ అర్థం అనుకుంటున్నారు? వేల సంవత్సరాల నుండి భౌతికవాదులు, భావవాదాన్ని ఎండగడుతూనే వస్తున్నారు. భావవాదులు, వారి పద్ధతులలో వారు, వారి వాదాలతో వారు... భౌతికవాదులతో పోరాడుతూనే వస్తున్నారు. ఇదే విషయం ఎవరైనా అంటారని, ముందే రంగనాయకమ్మ అర్థం ఇలా సెలవిచ్చారు. 'మన భౌతికవాదులు ఆ పని చేస్తూనే వచ్చారు గానీ, చాలా నాజూకుగా'.... 'తమ నాజూకుల్నీ, గతితర్కాల్ని, ఆ విశ్వాత్మ పాగల్ తలల కెక్కించడానికి ప్రయత్నిస్తారు.' (పేజీ 27) ఓహో, అంటే అరె పాగల్ అని జోడించవలసి వుండే అన్నమాట. ఇంతే అనుకునేరు. రంగనాయకమ్మ ఎపుడు ఎటు తిరుగుతారో చెప్పలేము కదా.. ఉరుము ఉరిమి మంగళం మీద పడ్డట్టు, రంగనాయకమ్మ అటుతిరిగి ఇటుతిరిగి చివరికి భౌతికవాదులనే పాగల్ అన్నది. 'విశ్వాత్మను నమ్ముతూ ఆ మత్తులో కొట్టుకునేఅమాయక పాఠకుల కోసం చెప్పదలిస్తే, చెప్పేది వాళ్ల తలకెక్కే రాతతో చెప్పాలి. ఇంత చిన్న విషయం భౌతికవాద రచయితల తలకెక్కదు.' (పేజీ 27) ముందేమో భౌతికవాదులు, అరె పాగల్ అని తిట్టకుండా, నాజూకుగా చెప్పడం వలనే, వేల సంవత్సరాలు గా చర్చ సాగుతున్నదని అన్నారు. చివరికేమో, భౌతికవాదులనే, చిన్న విషయాలు కూడా తలకెక్కని పాగల్‌గాళ్లని చేసింది. నిజానికి రంగనాయకమ్మ గారి తత్వశాస్త్రాన్ని నమ్మేవాళ్లు మాత్రం తప్పకుండా పాగల్‌లు అవుతారు.

ఇక్కడి నుండి మళ్లీ కొంతసేపు ఇనుప భాష పూనకంలోకి వెళ్లిపోయారు. ప్రజలు ఇనుప భాషను అర్థం చేసుకోలేకనే దేవుళ్లను నమ్ముతున్నారని నిర్ధారించినారు. ప్రపంచంలో లేదా భారతదేశంలో ప్రజలు వందశాతం అక్షరాస్యతను వేల ఏళ్ల క్రిందటనే సాధించారని మా టీచర్ మాకెపుడు చెప్పలేదు ఎందుకో మరి. చదువు రాని వాళ్లు, చదువు రాకపోవడం వల్లనూ, చదువు వచ్చిన వాళ్లు, ఇనుప భాష అర్థంకాక పోవడం వల్లనూ దేవుళ్లను నమ్మారని కూడా చెప్పగలరు రంగనాయకమ్మ. మొత్తానికి చదువు వల్లనే మెజారిటి ప్రజలు భావవాదులు అయ్యారని చెప్పడం కొత్త ఆవిష్కరణే. తత్వశాస్త్ర చరిత్రలో ఒక మైలురాయి కూడా. ఈ నిర్ధారణ ఆధారంగా ఇపుడు గులాబ్‌జామూన్ లేదా రసగుల్లా లాంటి భాషలో రంగనాయకమ్మ భౌతికవాదం గురించి (అందులో అరె పాగల్ ఉంటుందా) పుస్తకాలు రాస్తారు.

దేశంలో నాలుగు మూలలకు నాలుగు పీఠాలు నెలకొల్పి, ఒక్కోదాని లో నాలుగు ప్రెస్‌లు పెట్టి, రంగనాయకమ్మగారి భౌతికవాదం పుస్తకాలు అచ్చేసి, దేశం అంతా లేదా ప్రపంచంఅంతా పంచాలి. అపడు ప్రపంచంలో మెజారిటి ప్రజలు, కాదుకాదు మొత్తం ప్రజలు భౌతికవాదు లుగా మారిపోతారు. ఇంత చిన్న విషయం పిచ్చి భౌతికవాదులకు అర్థం కాలేదు. భారతదేశంలో కాని ప్రపంచంలో కానీ, భౌతికవాదులు ప్రజలకు తెలిసిన భాషలోనే, ప్రజలకు సులువుగా అర్థం అయ్యే ఉదాహరణలతోనే, పుస్తకాల ద్వారానే కాకుండా, మౌఖింగా కూడా భౌతికవాదాన్ని ప్రచారం చేశారు. భారతదేశంలో చార్వాకులు, ప్రజలకు సులువుగా అర్థం అయ్యే వాదనలతో, గొప్పతర్కంతో, ఉదాహరణలతో భావవాదులను సవాల్ చేశారు. అటువంటి వారి సాహిత్యాన్ని ధ్వంసం చేశారు. వారిమీద భౌతిక దాడులు చేశారు. రాజుల చేత శిక్షలు వేయించారు, చంపించారు.

తత్వశాస్త్ర చరిత్రలో, భావవాద భౌతికవాదాల మధ్య పోరాటంలో, భౌతికవాదులు చేసిన త్యాగాలు, చిందించిన రక్తం ఎంతో ఉంది. తత్వశాస్త్ర చరిత్రకు సంబంధించిన కనీస జ్ఞానం, రంగనాయకమ్మ గారికి వుంటే, చరిత్రను అవమానించడానికి పూనుకోరు. మానవసమాజ అభివృద్ధి క్రమంలో చరిత్ర పొడవునా, తమతమ స్థాయిలో భౌతికవాదులు చేసిన కృషి, పోరాటం, త్యాగాలు లేకుండా ఈ నాటి ఈ భౌతికవాదం లేదు.

*(ఇంకా ఉంది)*

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

### పి.ఎం. భార్గవ కన్నుమూత

సెంటర్ ఫర్ సెల్యులార్ అండ్ మాలిక్యులార్ బయాలజీ (సిసిఎంబి) వ్యవస్థాపక డైరెక్టర్, ప్రఖ్యాత శాస్త్రవేత్త పుష్పామిత్ర భార్గవ(89) ఆగస్టు 1న మృతిచెందారు. ఆయన గత కొంతకాలంగా అనారోగ్యంతో బాధపడుతూ హైదరాబాద్‌లోని ఉప్పల్‌లో స్వంత నివాసంలో మరణించారు. పిఎం భార్గవ 1928, ఫిబ్రవరి 22న రాజస్థాన్‌లోని అజ్మేర్‌లో జన్మించారు. ఆయన 1946లో ఎంఎస్‌సి ఆర్గానిక్ కెమిస్ట్రీ పూర్తిచేశారు. లక్నో విశ్వవిద్యాలయంలో 21 ఏళ్లకే సింథటిక్ ఆర్గానిక్ కెమిస్ట్రీలో పిహెచ్‌డి పూర్తిచేశారు. 1958లో హైదరాబాద్‌లోని సెంట్రల్ ల్యాబోరేటరీస్‌లో సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్ (సిఎస్ఆర్ఐ)లో శాస్త్రవేత్తగా చేరారు. 1977, ఏప్రిల్ 1న సిసిఎంబి స్థాపనలో పిఎం భార్గవ క్రియాశీలక పాత్ర పోశించారు. ఆయన 1977 నుండి 1990 వరకు సిసిఎంబికి డైరెక్టర్‌గా ఉన్నారు. రచయితల, శాస్త్రవేత్తలపై ఎన్‌డిఏ ప్రభుత్వం చేస్తున్న దాడికి నిరసనగా 2015లో ఆయన పద్మభూషణ్ పురస్కారాన్ని తిరిగి ఇచ్చేశారు.

### నేరెళ్ల ఇసుక లారీల కింద మరొకరు మృతి

నేరెళ్ల ఘటన మరువకముందే రాజన్న సిరిసిల్ల జిల్లా పోత్గల్‌లో ఇసుకలారీ ఢీకొట్టిన ప్రమాదంలో ఆగస్టు 2న గన్నె శంకరయ్య (56) మరణించారు. నేరెళ్ల ఘటన బాధితులకు షరతులతో కూడిన బెయిల్‌ను ఆగస్టు 2న కోర్టు మంజూరు చేసింది. బాధితులు మీడియాతో తమకు ప్రాణహాని ఉందన్నారు. ఇప్పటికి తాము నడువలేకపోతున్నామని, మూత్రం పోస్తే రక్తం వస్తుందని తెలిపారు. పోలీసులు కరెంట్ షాక్‌లు ఇచ్చి హింసించారన్నారు. ఇప్పటికే మిమ్మల్ని కుటుంబానికి పనికి రాకుండా చేశాం. ఇక మీ భార్యలను మావద్దకు పంపండ్రా.. అంటూ పోలీసులు చెప్పలేని మాటలతో వేధించారన్నారు. ఈ విషయాలు బయట చెపితే మిమ్మల్ని డ్రగ్స్ కేసులో ఇరికిస్తాం. ఈ ఘటనకు బాధ్యునిగా ఎస్.ఐని ప్రభుత్వం సస్పెండ్ చేసింది.

### డ్రగ్ మాఫియాను వ్యతిరేకిస్తూ ర్యాలీ

సమాజంపై డ్రగ్ మాఫియా తీవ్ర ప్రభావంపై టిజెఏసి, తెలంగాణ విద్యావంతుల వేదిక (టివివి) సంయుక్త ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో డిగ్రీ కళాశాల విద్యార్థులతో ఆగస్టు 8న దిల్‌సుఖ్‌నగర్‌లో అవగాహన ర్యాలీ నిర్వహించారు. ఈ ర్యాలీలో విద్యార్థులు ప్లకార్డులు, పోస్టర్లతో ప్రదర్శన నిర్వహించారు. కోదండరాం ప్రమాదకర మాదక ద్రవ్యాలు సమాజంలో అనేక మందిని తీవ్ర అనారోగ్యానికి గురిచేసే ప్రమాదముందన్నారు. ఇది అంతర్జాతీయ నెట్‌వర్క్ నుంచి హైదరాబాద్‌కు లింకై రెండో అమ్మక కేంద్రంగా మారుతోందన్నారు. విచారణలకే పరిమితం కాకుండా బాధ్యులపై చర్యలు తీసుకోవాలని అన్నారు. ఈ ర్యాలీలో టిజెఏసి ఎల్‌బినగర్ చైర్మన్ కె.ఎన్. రంగారెడ్డి, తెలంగాణ విద్యా వంతుల వేదిక హైదరాబాద్ జిల్లా అధ్యక్షుడు డాక్టర్ కొండా నాగేశ్వర్, తదితరులు పాల్గొన్నారు.

### ఆదివాసుల హక్కులను హరిస్తున్న ప్రభుత్వాలు

ఆదివాసి దినోత్సవ సందర్భంగా సిపిఐ (ఎంఎల్) న్యూడెమోక్రసీ రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో ఆగస్టు 8న బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సదస్సు నిర్వహించింది. మానవ హక్కుల వేదిక నాయకులు జీవన్‌కుమార్ ఆదివాసీల హక్కులను కాపాడడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విఫలమయ్యాయన్నారు. 1/70 చట్టాన్ని ఎత్తివేయాలని చూస్తున్నారన్నారు. పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణం వల్ల మూడు లక్షల మంది ఆదివాసి కుటుంబాలు నిర్వాసితులయ్యాయన్నారు. హరితహారం పేరుతో తెలంగాణలో లక్షలాది మంది ఆదివాసీలు ఎన్నో ఏళ్లుగా సాగుచేసుకుంటున్న భూముల నుంచి తరిమికొడుతుందని దీన్ని విరమించుకోవాలన్నారు.

### అమరుల స్ఫూర్తి యాత్ర ఉద్రిక్తం

టిజెఏసి చేపట్టిన అమరుల స్ఫూర్తి యాత్రను కామారెడ్డి జిల్లా కేంద్రంలో ఆగస్టు 11న నిర్వహించతలపెట్టారు. కోదండరాం రాకముందే సభను అడ్డుకునేందుకు రైతుల పేరుతో కొందరు టి.ఆర్.ఎస్ నాయకులు కార్యకర్తలు ప్రయత్నించారు. సభను కామారెడ్డి మునిసిపాలిటీ కార్యాలయం ఎదుట నిర్వహించ తలపెట్టగా అక్కడికి టిఆర్ఎస్ కార్యకర్తలు పెద్ద సంఖ్యలో చేరుకొని ఇరువర్గాలు పోటీ నినాదాలు చేశారు. సభ నిర్వహణ కోసం ఏర్పాటు చేసిన సౌండ్ బాక్సులను, టెంట్‌ను కూల్చివేసి, ఫ్లెక్సీలను చించివేశారు. ఇరువర్గాల మధ్య తోపులాట జరిగి దాడి చేసుకున్నారు. ఈ ఘర్షణలో పలువురు విద్యార్థులకు గాయాలయ్యాయి. చివరికి పోలీసులు విద్యార్థులను, జెఏసి నాయకులను అరెస్టు చేశారు.

### టాటా కార్మికుల ఆందోళన బాట

తెలంగాణ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న ఆదిభట్ల ఐటి జోన్‌లోని టాటా సంస్థల కార్మికులు విధులు బహిష్కరించి ప్రధాన ద్వారం వద్ద నాలుగు రోజులుగా ధర్నా చేస్తున్నారు. నిబంధనలకు విరుద్ధంగా పనిచేయిస్తూ, శ్రమ దోపిడీ చేస్తున్నారని వారు ఆరోపిస్తున్నారు. రంగారెడ్డి జిల్లా ఇబ్రహీంపట్నం మండల పరిధిలో టిసిఎస్, టాటా అడ్వాన్స్ సిస్టం, టాటా ఎరోస్పేస్, టాటా బోయింగ్ సంస్థల్లో వేలాది మంది కార్మికులు పనిచేస్తున్నారు. కార్మికులు కార్మిక సంఘం ఏర్పాటుకు ప్రయత్నించడంతో యాజమాన్యం వారిపై పోలీసులకు ఫిర్యాదు చేసింది. పోలీసులు వారిని అదుపులోకి తీసుకున్నారు.

### తోట మహదేవ్ మృతి

విప్లవ రచయితల సంఘం మాజీసభ్యులు తోట మహదేవ్ (58) ఆగస్టు 27న మృతి చెందారు. ఆయన సొంత ఊరు సిరిసిల్ల జిల్లా ఇల్లంతకుంట మండలంలోని రేపాక గ్రామం ఇప్పుడు చంద్రంపేటలో నివాసం ఏర్పాటు చేసుకున్నారు. జగిత్యాల సిరిసిల్ల పోరాటాలతో ఆయన కవిగా వెలుగులోకి వచ్చారు. పత్రికల్లో విమర్శణాత్మక వ్యాసాలు, సంపాదకీయాలు రాశారు. ఆయన రాసిన 'సంకెళ్లు', 'మంటలు', 'ఉరుములు మెరుపులు', 'తూర్పు', 'కల్లోలం' వంటి రచనలు ఆయనకు అభ్యుదయ కవిగా గుర్తింపును తెచ్చాయి. ఆయన సిరిసిల్ల సహకార విద్యుత్ సరఫరా సంఘం (సెస్)లో క్లర్క్‌గా 1983లో చేరి ఎస్టేట్ ఆఫీసర్‌గా 2017 ఫిబ్రవరి 28న పదవీ విరమణ చేశారు.

### నంద్యాల ఉప ఎన్నికలో టిడిపి గెలుపు

నంద్యాల నియోజక వర్గానికి ఆగస్టు 23న ఉప ఎన్నిక జరిగింది. ఈ ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ అభ్యర్థి భూమా బ్రహ్మానందరెడ్డికి 97,076 ఓట్లు పోలయ్యాయి. వైసిపి తరపు అభ్యర్థి మాజీ మంత్రి శిల్పా మోహన్‌రెడ్డికి 69,610 ఓట్లు పోలయ్యాయి. మొత్తం 15 మంది ఈ ఎన్నికల బరిలో నిలిచారు. తెలుగుదేశం పార్టీ అభ్యర్థి వైసిపి అభ్యర్థిపై 27,466 ఓట్ల మెజారిటీతో గెలుపొందారు. ఈ నియోజక వర్గంలో 2,18,858 మంది ఓటర్లు ఉన్నారు. తొలిసారిగా పోలింగ్ కేంద్రాల వద్ద ఆరు కంపెనీల కేంద్ర పారామిలిటరీ బలగాలు మోహరింపచేశారు.

### మోహన్‌రెడ్డి మృతి

ఢిల్లీ జెఎన్‌యు పూర్వ విద్యార్థి సంఘ నాయకుడు వి. మోహన్ రెడ్డి ఆగస్ట్ 17న సూర్యాపేట జిల్లా ఆత్మకూరులో బ్రెయిన్ స్ట్రోక్‌తో మరణించారు. 1954లో పుట్టిన ఆయన సిపిఐ (ఎంఎల్) విమోచన ప్రభావంలో రాష్ట్రంలో పిడిఎస్‌యులో, ఢిల్లీలో పిఎస్‌ఓలో పనిచేశారు. తర్వాత కాలంలో సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ, సిపిఐ (ఎంఎల్) సిఆర్‌సి అవగాహనలతో ప్రభావితులయ్యారు. వివిధ స్వచ్ఛంద సంస్థలలో పనిచేసారు. వీక్షణం రచయితల సమావేశాలలో పాల్గొన్నారు. వీ

### ఎన్‌కౌంటర్ కేసులో వంజారాకు విముక్తి

గ్యాంగ్‌స్టర్ సొహ్రాబుద్దీన్ షేక్, తులసీరాం ప్రజాపతి బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో అభియోగాలు ఎదుర్కొంటున్న గుజరాత్ మాజీ ఐపిఎస్ అధికారి డిజి వంజరా, మరో ఐపిఎస్ అధికారి ఎంఎన్ దినేష్‌లను సిబిఐ కోర్టు నిర్దోషులుగా ప్రకటించింది. సిబిఐ ప్రత్యేక కోర్టు జడ్జి సునీల్‌కుమార్ శర్మ ఆగస్టు1న తీర్పు వెల్లడించారు. 2005 నవంబర్‌లో గుజరాత్‌లోని గాంధీనగర్ సమీపాన జరిగిన సొహ్రాబుద్దీన్ బూటకపు ఎన్‌కౌంటర్‌లో చనిపోయారు. అతని భార్య కౌసర్ కూడా అనుమానాస్పద పరిస్థితుల్లో హత్య చేయబడ్డారు. ఆయన బూటకపు ఎన్‌కౌంటర్‌కు సాక్షి అయిన సహచరుడు ఆ తర్వాత 2006 డిసెంబర్‌లో బనాస్కంట జిల్లా చప్రి గ్రామంలో ఎన్‌కౌంటర్లో చనిపోయారని ప్రకటించారు. ఇదే కేసులో 2007 ఏప్రిల్ 24న పోలీసులు వంజరాను అరెస్టు చేశారు.

### ధర్నా చౌక్‌ను పునరుద్ధరించాలని ధర్నా

హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్దగల ధర్నా చౌక్‌ని పునరుద్ధరించాలని పతిపక్ష పార్టీలు డిమాండ్ చేస్తూ ఆగస్టు 21న ధర్నాచౌక్ పరిరక్షణ సమితి ఆధ్వర్యంలో ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద నిరసన చేపటింది. ఇందులో తెలంగాణ ప్రభుత్వం నియంతృత్వంగా వ్యవహరిస్తుందంటూ ప్రజాస్వామ్య విలువలు కాపాడేందుకు చర్యలు తీసుకోవలని కోరారు. తిరిగి ధర్నాచౌక్‌కి అనుమతి ఇవ్వాలని కోరుతూ కేంద్ర హోంమంత్రి రాజ్‌నాథ్ సింగ్‌కు వినతిపత్రం సమర్పించారు. ఢీల్లీలో జంతర్ మంతర్‌ను పోరాడి సాధించుకున్నట్లే ధర్నాచౌక్‌ను సాధించుకోవాలన్నారు.

### దేశ వ్యాప్తంగా బ్యాంకు ఉద్యోగుల సమ్మె

బ్యాంకుల ప్రైవేటీకరణ, నష్టాల్లో ఉన్న బ్యాంకుల మూసివేత, ప్రభుత్వ రంగ బ్యాంకుల విలీనాన్ని వ్యతిరేకిస్తూ బ్యాంకింగ్ సంఘాల ఐక్య ఫోరమ్ (యుఎఫ్‌బియు) ఆగస్టు 22న సమ్మెకు పిలుపునిచ్చింది. ఈ సమ్మెతో దేశ వ్యాప్తంగా ప్రభుత్వ రంగ బ్యాంకులు, పాత ప్రైవేట్ బ్యాంకుల్లో సేవలు నిలిచిపోయాయి. దీంతో నగదు బదిలీలు, చెక్కుల క్లియరెన్స్, నగదు జమలు, ఉపసంహరణలు తదితర సేవలకు అంతరాయం ఏర్పడింది. ఈ సమ్మెలో పది లక్షల మంది అధికారులు ఇతర ఉద్యోగులు పాల్గొన్నారు. అఖిల భారత ఉద్యోగుల సంఘం (ఎఐబిఇఏ) జనరల్ సెక్రెటరీ సి.ఎచ్. వెంకటాచలం సమ్మెపై మాట్లాడుతూ... మరింతగా బ్యాంకు సేవల అవసరం ఉన్న ఈ సందర్భంలో బ్యాంకుల స్థిరీకరణ, విలీనాల గురించి ప్రభుత్వం మాట్లాడుతోంది. బ్యాంకుల విలీనాలతో బ్యాంకు శాఖలు మూతపడతాయి. అనుబంధ బ్యాంకులను విలీనం చేసుకున్న ఎస్‌బిఐ విషయంలో ఇప్పుడు అదే జరిగిందని ప్రభుత్వం విలీన నిర్ణయాన్ని విరమించుకోవాలన్నారు.

### త్రిపుల్ తలాక్ చెల్లదు సుప్రీం కోర్టు

ముస్లిం మహిళలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్న త్రిపుల్ తలాక్‌కు వ్యతిరేకంగా దాఖలైన ఏడు పిటిషన్లపై 22న విచారణ జరిపిన భారత సర్వోన్నత న్యాయస్థాం తీర్పు వెల్లడించింది. 'మూడు సార్లు తలాక్' చెప్పేసి భార్యను వదిలించుకోవడం చెల్లనే చెల్లదని తేల్చిచెప్పింది. పునరాలోచనకు ఆస్కారం లేకుండా, క్షణాల్లో ఇచ్చేసే త్రిపుల్ తలాక్ ఖురాన్ సూక్తులకు వ్యతిరేకం.. అంగీకారయోగ్యం కాదు. దీని ద్వారా విడాకులు అత్యంత ఏకపక్షం, అహేతుకం, రాజ్యాంగ ఉల్లంఘన కూడా. అందువల్ల త్రిపుల్ తలాక్‌ను కొట్టివేయాల్సిందేనని జస్టిస్ కురియన్ జోసెఫ్, జస్టిస్ ఆర్.ఎఫ్. నారిమన్, జస్టిస్ యు.యు. లలిత్‌ల ధర్మాసనం తెలిపింది. త్రిపుల్ తలాక్ దీర్ఘకాలంగా వాడుకలో ఉన్నదన్న విషయాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. తలాక్‌పై ఆరు నెలల నిషేధం విధించాలి. ఆలోగా రాజకీయ పార్టీలన్నీ ఈ అంశంలో చట్టం చేయడానికి ఏకతాటిపైకి రావాలని జస్టిస్ ఖేహర్, జస్టిస్ అబ్దుల్ నజీర్ వెల్లడించారు.

### రామ్ రహీమ్ అనుచరుల విధ్వంసకాండ

డేరా సచ్చ సౌదా చీఫ్ గుర్మీత్ రామ్ రహీమ్ సింగ్ 2002లో ఇద్దరు సాధ్వీలపై అత్యాచారం కేసులో ఆగస్టు 25న విచారించిన పంచకుల సిబిఐ కోర్టు న్యాయమూర్తి జగదీప్‌సింగ్ రామ్ రహీమ్‌ను దోషిగా తేల్చారు. రామ్ రహీమ్ అరెస్ట్‌కు ఆదేశాలు జారీచేయగా అయన్ని హెలికాప్టర్‌లో రోహితక్ జైలుకు తరలించారు. దీంతో ఆయన అనుచరులు హర్యానా, పంజాబ్, ఢీల్లీ, రాజస్థాన్‌లలో దాడులకు పాల్పడ్డారు. పంచకులలో తుపాకులతో కాల్పులు జారిపారు. పెట్రోలు బాంబులు విసిరారు. వాహనాలకు నిప్పు పెట్టారు. రెండు రైల్వేస్టేషన్లకు నిప్పుపెట్టారు. ఈ దాడిలో 36 మంది మరణించగ 250కి పైగా గాయపడ్డారు.

### జమ్మూ కశ్మీర్‌లో నిత్యం కొనసాగుతున్న ఎన్‌కౌంటర్‌లు

జమ్మూ కశ్మీర్‌లో లష్కరే తాయిబా చీఫ్ కమాండర్ అబూ దుజనా అతని అనుచరుడు మరణించారు. హక్రిపోరాలోని రెసిడెన్షియల్ కాంప్లెక్స్‌లో మిలిటెంట్లు ఉన్నట్లు గుర్తించిన బలగాలు ఆగస్టు 1న ఆ ఇంటిని చుట్టుముట్టి కాల్పులు జరిపాయి. అయినా మిలిటెంట్లు బయటికి రాకపోవడంతో బలగాలు ఆ ఇంటిని పేల్చివేయడంతో ఇద్దరు మిలిటెంట్లు చనిపోయారు. పుల్వామా జిల్లా కేంద్ర పోలీసు కార్యాలయంపై ఆగస్టు 25 తెల్లవారుజామున మిలిటెంట్లు గ్రైనేడ్‌లు, తుపాకులతో ఆత్మహుతి దాడి చేశారు. ఈ దాడిలో నలుగురు సిఆర్‌పిఎఫ్ జవాన్లతో సహా ఎనిమిది మంది భద్రతా సిబ్బంది మరణించారు. పోలీసు కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు మృతిచెందారు. అంతర్జాతీయ జమ్మూ సరిహద్దు ప్రాంతంలో పాకిస్తాన్ జవాన్లు కాల్పులు జరిపడంలో భారత జవానుకు గాయాలయ్యాయి. దీంతో భరత జవాన్లు పాక్ రేంజర్లపై జరిపిన కాల్పుల్లో ముగ్గురు మృతిచెందారు.

### యుపిలో పట్టాలు తప్పిన ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్

ఒడిశాలోని పూరీ నుంచి ఉత్తరాఖండ్‌లోని హరిద్వార్ వెళ్లే ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్ ముజఫర్‌నగర్‌కు 40 కిలోమీటర్ల దూరంలోని ఖతౌలీలో ఆగస్టు 19న పట్టాలు తప్పింది. ఈ ప్రమాదంలో 23 మంది చనిపోగా 100 మందికి పైగా గాయపడ్డారు. రైలుకు మొత్తం 23 బోగీలు ఉండగా అందులో 14 బోగీలు పట్టాలు తప్పాయి. రైలు పట్టాలు ఊళ్లోనుంచి ఉండడంతో ఒక బోగీ సమీపంలోని ఇంట్లోకి దూసుకుపోయింది.

### బీహార్‌ను ముంచెత్తిన వరదలు

ఉత్తరప్రదేశ్, బీహర్, అసోం, పశ్చిమబెంగాల్‌లలో కురిసిన భారీ వర్షాల కారణంగా వరద నీరు ముంచెత్తింది. ఆగస్టు 27 నాటికి 440 మంది మృతిచెందినట్లుగా అధికారులు ధృవీకరించారు. బీహార్‌లోని 17 జిల్లాల్లో 98 లక్షల మందిపై వరద ప్రభావం చూపింది. బీహార్‌లో లోతట్టు ప్రాంతాల్లో నివసిస్తున్న 1.65 లక్షల మందిని పునరావాస కేంద్రాలకు తరలించారు. యుపిలోని 22 జిల్లాలు వరద బారిన పడ్డాయి. గల్లంతయిన వారి కోసం ప్రత్యేక బృందాలు గాలిస్తున్నాయన్నారు. వరదల కారణంగా పెద్ద మొత్తంలో పశువులు, అడవి జంతువులు మరణించాయి.

### వ్యక్తిగత గోప్యత ప్రాథమిక హక్కే

వ్యక్తిగత గోప్యత ప్రాథమిక హక్కేనంటూ భారత ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఖేహర్ నేతృత్వంలోని 9 మంది న్యాయమూర్తులతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం ఆగస్టు 24న తీర్పునిచ్చింది. ఆధార్ తప్పని సరిచేస్తున్న కేంద్ర ప్రభుత్వం బ్యాంకు ఖాతాలు, పాన్‌కార్డులు, సబ్సిడీలు, రైలు రాయితీలు, రైతు రుణాలు, పిల్లల మధ్యాహ్నం తిండి, వారి ఫీజులు అన్నీ కూడా ఆధార్ ఆధారంగా మార్చి వేసింది. ఆధార్ తప్పనిసరి కాదనే సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పుతో ప్రభుత్వాన్ని ఆత్మరక్షణలో పడేసింది. వీ

### కెన్యా అధ్యక్ష ఎన్నికలు

కెన్యా అధ్యక్ష పదవికి ఆగస్ట్ 8న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో ప్రస్తుత అధ్యక్షుడు ఉహురు కెన్యట్టా విజయం సాధించారు. ఎన్నికల్లో ఆయనకు 54.27 శాతం ఓట్లు వచ్చాయి. ఆయన ప్రత్యర్థి రైలా ఓడింగాకు 44.74 శాతం ఓట్లు వచ్చాయి. ఎన్నికల ఫలితాలు వెలువడిన తర్వాత చెలరేగిన హింసాకాండలో పదహారు మంది మరణించారు. ఆగస్ట్ 22న అధ్యక్షుడిగా కెన్యట్టా ప్రమాణ స్వీకారం చేశారు.

### జర్మనీలో అత్యధిక శరణార్థులు

జర్మనీ శరణార్థులకు ఆశ్రయం కల్పించడంలో అగ్రస్థానంలో ఉన్నది. దేశంలో ఒక కోటీ ఎనభై ఆరు లక్షల మంది శరణార్థులు ఉన్నట్లు ఫెడరల్ స్టాటిస్టిక్స్ కార్యాలయం (ఎఫ్ఎస్ఓ తెలిపింది. జర్మనీ ఛాన్సలర్ ఏంజెలా మెర్కెల్ ప్రవేశపెట్టిన ఓపెన్ డోర్ పాలసీ వల్ల శరణార్థులు జర్మనీలో అత్యధికంగా ఉన్నట్లు సంస్థ తెలిపింది. జర్మనీ జనాభా ఎనిమిది కోట్ల ఇరవై ఆరు లక్షలు.

### అఫ్ఘనిస్తాన్‌లో దాడి

అఫ్ఘనిస్తాన్‌లోని మారుమూల గ్రామమైన మిర్జావలంగ్‌పై తాలిబన్, ఇస్లామిక్ స్టేట్ దళాలు దాడి చేశాయి. ఆగస్ట్ 12న జరిగిన ఈ దాడిలో దాదాపు యాభై మంది అమాయక ప్రజలను చంపేశాయి. మరణించిన వారిలో అత్యధికంగా మహిళలు, పిల్లలు ఉన్నారు. ప్రభుత్వ దళాలపై పట్టు సాధించేందుకు ఈ దాడికి పాల్పడినట్లు అధికారులు తెలిపారు.

### ఆఫ్రికాలో వరదలు

ఆఫ్రికాలోని సియెర్రా లియోన్‌లో భారీ వరదల వల్ల పెద్ద ఎత్తున ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. భారీ వర్షాల వల్ల కొండ చరియలు విరిగి పడడంతో ఆరు వందల మంది వరకు అదృశ్య మయ్యారు. నాలుగు వందల మందికి పైగా మరణించినట్లు దేశాధ్యక్షుడు ఎర్నెస్ట్ బాయ్ కొరోమా తెలిపారు. ప్రమాదంలో చిక్కుకున్నవారిని ఆదుకోవాల్సిందిగా ప్రపంచ దేశాలను కోరారు.

### అమెరికాలో అతివాద శ్వేతజాతీయుల ర్యాలీ

అమెరికాలోని వర్జీనియాలో అతివాద శ్వేతజాతీయ పౌరులు ఆగస్ట్ 13న భారీ ర్యాలీ ప్రదర్శన జరిపారు. 'యురోపియన్ వలసవాదుల నుంచి అమెరికాను చేజిక్కించుకుందాం' అంటూ అతివాదులు నినాదాలు చేస్తూ వర్జీనియాలోని చార్లెంట్‌విల్ వీధుల్లో, పార్కుల్లో ప్రదర్శనలు చేశారు. స్మారక చిహ్నమైన రాబర్ట్ ఇ.లీ. విగ్రహాన్ని యూనివర్సిటీ ఆఫ్ వర్జీనియా నుంచి తొలగించేందుకు స్థానిక కౌన్సిల్ నిర్ణయం తీసుకుంది. దీంతో అతివాద శ్వేతజాతీయులు పెద్ద ఎత్తున నిరసన చేశారు. అది తమ గర్వకారణంగా భావించే స్మారక చిహ్నమని వారు తెలిపారు. ఈ ఘర్షణల్లో ముగ్గురు మరణించారు. ప్రదర్శనకారులపై ఒక కారు దూసుకురాగా ఒక మహిళ మరణించారు. ఈ ర్యాలీకి మద్దతిస్తూ ట్రంప్ శ్వేతజాతీయులకు మద్దతు మాట్లాడడంతో తీవ్ర నిరసనలు వెలువెత్తాయి.

### ఫిలిప్పైన్స్‌లో దిగజారుతున్న మానవ హక్కులు

అధ్యక్షుడు రోడ్రిగో డ్యుటెర్టే బాధ్యతలు చేపట్టిన తర్వాత ఫిలిప్పైన్స్ మానవ హక్కుల ఉల్లంఘనలు తీవ్రమయ్యాయి. ముఖ్యంగా మాదక ద్రవ్యాల నిరోధం పేరిట విచారణ లేకుండానే ఎంతో మందిని పోలీసులు కాల్చి చంపుతున్నారు. తాజాగా బులాకన్ ప్రావిన్స్‌లో ఆగస్ట్ 16న ముప్పై రెండు మందిని మాదక ద్రవ్యాల అక్రమ రవాణా ఆరోపణపై మనీలా పోలీసులు కాల్చి చంపారు. వారిపై ఎటువంటి విచారణ లేకుండానే ఈ చర్య తీసుకున్నారు. ఏడాది కాలంలో మూడు వేలమందికి పైగా ఇలా మాదక ద్రవ్య అక్రమ రవాణా కేసులో విచారణ లేకుండానే ప్రభుత్వం కాల్చి చంపేసిందని అంతర్జాతీయ హక్కుల సంఘం ఆరోపించింది.

### అమెరికాలో ట్రంప్‌పై నిరసన

వర్జీనియాలోని చార్లెంట్‌విల్‌లో శ్వేతజాతీయులు నిర్వహించిన ర్యాలీకి మద్దతు తెలిపిన అమెరికా అధ్యక్షుడు ట్రంప్‌పై అమెరికా ప్రజలు తీవ్ర నిరసన తెలిపారు. ఆగస్ట్ 23న అరిజోనా పట్టణంలో జరిగిన మరో ర్యాలీలో ట్రంప్ ప్రసంగించారు. ఈ ప్రసంగాన్ని అడ్డుకునేందుకు ఆందోళనకారులు ప్రయత్నించారు. ట్రంప్ విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజలు తీవ్ర ఆందోళనలు చేపడుతున్నారు. ఆందోళనలు అణచివేయడానికి పోలీసులు పెద్ద ఎత్తున బలప్రయోగం చేస్తున్నారు.

### సిరియాలో దాడులు

సిరియాలో అమెరికా సంకీర్ణ దళాలు వైమానిక దాడులు కొనసాగు తున్నాయి. రక్కా నగరంపై ఆగస్ట్ 23న సంకీర్ణ దళాలు జరిపిన వైమానిక దాడిలో డెబ్బై ఎనిమిది మంది మరణించారు. క్రీడా మైదానంలో చిన్నారులు ఆడుకుంటుండగా అమెరికా సంకీర్ణ దళాలు దాడులకు పాల్పడ్డాయి. అమెరికా సంకీర్ణ దళాలు మూడు నెలల్లో నిర్వహించిన వైమానిక దాడుల్లో దాదాపు మూడు వందల మంది సాధారణ పౌరులు మరణించారు. మరోవైపు రష్యా సిరియాలోని ఉగ్రవాద స్థావరాలపై వైమానిక దాడులు నిర్వహిస్తోంది. ఈ దాడిలో సుమారు రెండు వందల మంది తిరుగుబాటుదారులు మరణించి ఉంటారని రష్యా సైన్య అధికారి తెలిపారు. రెండు అగ్ర రాజ్యాల వైమానిక దాడుల వల్ల సిరియా అతలాకుతలమైపోతోంది. అధిక సంఖ్యలో సాధారణ పౌరులు మరణిస్తున్నారు.

### యెమెన్ అంతర్యుద్ధం

యెమెన్‌లో అంతర్యుద్ధం తీవ్రరూపం దాలుస్తోంది. ఈ అంతర్యుద్ధంలో అక్కడి బాల్యం ఛిద్రమైపోతోంది. నిత్యం బాంబు దాడులతో ఎప్పుడు ఏం జరుగుతుందో అన్న భయాందోళన నడుమ బతుకులు వెళ్లదీస్తున్నారు. ఇప్పుడు కలుషిత ఆహారం, నీరు కారణంగా కలరా వ్యాపిస్తోంది. ఇప్పటికే వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు. రోజుకు ఐదు వేల కేసులు నమోదవు తున్నాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ తెలిపింది. ఆగస్ట్ 23న సౌదీ అరేబియా సంకీర్ణ దళాలు యెమెన్‌లో ఓ హోటల్‌పై వైమానిక దాడులు జరిపాయి. ఈ దాడిలో అరవై మంది మృతి చెందారు. మరో ఇరవై మందికి పైగా గాయపడ్డారు.

### బర్మాలో దాడులు

బర్మాలోని బంగ్లాదేశ్ సరిహద్దు ప్రాంతమైన రాఖిని రాష్ట్రంలో ఆగస్ట్ 25న భీకర దాడులు జరిగాయి. అర్కాన్ రోహింగ్యా సాల్వేషన్ ఆర్మీకి చెందిన సాయుధులు విచక్షణా రహితంగా కాల్పులు జరపడంతో దాదాపు డెబ్బై మంది సాధారణ పౌరులు మరణించారు. అర్ధరాత్రి సమయంలో రాఖినిలోని పోలీస్ స్టేషన్, ఆర్మీ క్యాంపులపైన దాడి జరిగింది. రెండు వందల మంది దాకా రోహింగ్యాలు ఈ దాడిలో పాల్గొన్నట్లు మయన్మార్ సైనిక అధికారులు తెలిపారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జూలై 1 నుండి జూలై 31, 2017 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (892), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (774) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1666)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 23 | 29 | 6 | 3 | 8 | 2 | 1 | 2 | 1 | 1 | 2 | 24 | 31 | – | – | – | 3 | 2 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 13 | 3 | 4 | 2 | – | 1 | 1 | 4 | 2 | 2 | 18 | 12 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 3 | – | 11 | 13 | 2 | 6 | 2 | 1 | – | 2 | 2 | 3 | 3 | 19 | 11 | – | – | – | – | – |
| ఖమ్మం | – | – | – | 9 | 10 | 1 | 4 | 8 | 2 | 1 | 4 | 2 | 1 | 7 | 26 | 9 | – | – | – | – | 2 |
| మహబూబ్‌నగర్ | – | – | – | 7 | 10 | 2 | 9 | 3 | 1 | 2 | 4 | 1 | 25 | 6 | 46 | 5 | – | – | 1 | – | – |
| మెదక్ | 2 | 14 | 2 | 9 | 10 | 19 | 12 | 1 | 4 | 6 | 9 | 11 | 6 | 19 | 42 | 20 | – | – | – | 9 | 2 |
| నల్గొండ | – | – | – | 7 | 3 | 1 | 3 | – | – | – | 3 | 3 | 1 | 9 | 17 | 8 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | 1 | – | 5 | 7 | – | 4 | – | – | 3 | 2 | 2 | 2 | 3 | 10 | 6 | – | – | – | – | – |
| వరంగల్ | – | 3 | – | 7 | 8 | 3 | 2 | 2 | – | 1 | 1 | 4 | 2 | 4 | 13 | 8 | – | – | – | – | – |
| వికారాబాద్ | – | 1 | – | 2 | 3 | 1 | – | 2 | – | – | 1 | 2 | – | 3 | 11 | 10 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **3** | **25** | **2** | **91** | **106** | **38** | **47** | **28** | **10** | **15** | **29** | **32** | **43** | **58** | **226** | **120** | **-** | **-** | **1** | **12** | **6** |
| అనంతపురం | – | 5 | 2 | 11 | 24 | 5 | 6 | 6 | 1 | – | 1 | 3 | 7 | 7 | 29 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 4 | 7 | 6 | 7 | – | 1 | 2 | 3 | 8 | 4 | 2 | 31 | – | – | – | – | – | – |
| కడప | – | 2 | – | 3 | 3 | – | – | – | – | – | 3 | 2 | – | – | 12 | 2 | – | – | – | – | – |
| గుంటూరు | – | – | – | 7 | 9 | 1 | 1 | 2 | 1 | 2 | 4 | 4 | – | – | 21 | 9 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 5 | 3 | 1 | – | – | – | 1 | – | 3 | 2 | 4 | 14 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | 3 | – | 2 | 6 | – | 4 | 2 | – | 1 | 3 | 3 | 1 | 4 | 16 | 9 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 2 | 2 | 1 | 1 | 3 | 1 | 2 | – | – | – | 1 | 13 | 9 | – | – | – | – | – |
| ప్రకాశం | – | – | – | 4 | 10 | 3 | 1 | – | – | 1 | 5 | 2 | 3 | 4 | 18 | 10 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | – | – | – | 9 | 14 | 5 | 1 | 2 | – | 4 | 1 | 2 | 4 | 5 | 12 | 10 | – | – | 1 | – | 2 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 3 | 3 | 1 | 2 | – | – | 2 | 3 | 2 | – | 1 | 21 | 8 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 1 | 7 | – | 2 | 2 | – | 4 | 2 | 2 | 1 | 4 | 12 | 6 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 7 | 1 | 5 | 2 | – | 1 | – | 4 | 1 | 3 | 19 | 7 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 3 | 13 | 2 | 3 | – | 1 | 4 | 5 | 3 | 3 | 3 | 25 | 21 | – | – | – | 11 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **10** | **2** | **56** | **108** | **26** | **33** | **19** | **5** | **24** | **30** | **38** | **26** | **38** | **243** | **99** | **-** | **-** | **1** | **11** | **5** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| తలకిందుల లోకం | మనీషా సేఠి | 150 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| గుజరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీలాదేవి | 75 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |
| మార్క్సిస్టు నిఘంటువు-1 | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | రు. 350 |
| మార్క్సిస్టు పదకోశం | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 50 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |
| మఖ్దూం మొహియుద్దీన్ | వాహెద్ | 180 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని జనార్దన్ మెమోరియల్ ట్రస్ట్ | 80 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |
| నిశిథ | నల్లూరి రుక్మిణి | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 194 - September 2017 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/08/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

రెండు సంవత్సరాల కింది వరకు వీక్షణం విడిప్రతులు రెండు రాష్ట్రాలలోని దాదాపు మూడువందల పత్రికల దుకాణాలలో అందుబాటులో ఉండేవి. అప్పటివరకూ ఉండిన సోల్ డిస్ట్రిబ్యూటర్ పంపిణీ ఆపివేయడంతో ఈ రెండు సంవత్సరాలుగా రాష్ట్రంలో చాలా ప్రాంతాలలో పత్రికల దుకాణాలలో వీక్షణం దొరకడం లేదు. చందాదారులకు మినహా విడిప్రతి కొనుక్కోదలచిన వారికి పత్రిక అందుబాటులో లేకుండాపోయింది. ఈ పరిస్థితి మార్చడానికి చేస్తున్న ప్రయత్నంలో ఇప్పటికి రెండు రాష్ట్రాలలోను కొన్ని న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం అందుబాటులోకి వచ్చింది. మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు. అలాగే మీ ప్రాంతాలలో ఆసక్తి ఉన్న న్యూస్‌స్టాల్స్ యజమానులతో సంప్రదించి బాధ్యత తీసుకునే వీక్షణం మిత్రులు, అభిమానులు వీక్షణం కార్యాలయాన్ని సంప్రదించవచ్చు.

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ | అబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| టైమ్స్ బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| ఎం.సి. రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్టస్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్టస్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| సాయిగణేష్ బుక్‌స్టాల్ | టుటౌన్ పోలీస్ స్టేషన్ దగ్గర, కరీంనగర్ | 93979 94268 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| గణేష్ పుస్తక ప్రదర్శన | గాంధీ రోడ్, ప్రొద్దుటూరు | |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రి బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | దాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీసత్యసాయి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, రాజమండ్రి | 73860 66226, 94419 07321 |

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao